# మహాభారతోపన్యాసములు

(అరణ్య విరాట పర్వములు)

UDL/ROF

ఆర్షధర్మప్రబోధక - పండిత

నందూరు సుబ్రహ్మణ్యశర్మ

ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

23_22_55 - సత్యనారాయణపురం - విజయవాడ - 520 011

# విజ్ఞప్తి

మహాశయులారా!

భారతీయ సారస్వతమున కమూల్యాలంకారమగు మహాభారతామ్నాయమందలి ఆదిసభాపర్వములు రెండును ఉపన్యాసరూపమున ఆంధ్ర సోదరసోదరీమణుల చేతికందినవి. కాని తరువాతి పర్వముల కెదురుచూచు మీ చూపులకు శీఘ్రకాలముననే అందదగు అరణ్య విరాటములు నా యార్థికలోపముచే ఆలస్యముగ వెలువడినవి.

గీతాశాస్త్రము వచించునట్లు వేలమందిలో ఒక్కడే తన జీవితము నాధ్యాత్మికమువైపుకు త్రిప్పునన్న వాక్యము వ్యర్థ మెట్లగును?

నవలా సాహిత్యమును కోరుచున్న నేటి నవనాగరికతా ప్రపంచము భారతీయ ధర్మసాహిత్యమువైపుకు మరలవలెనన్న నేడు ధార్మికప్రచార మెంత అవసరమో గుర్తెరిగిన కొందరు దాతలు తమ హృదయములను మా అర్ష ధర్మప్రచారమువైపుకు త్రిప్పగా అరణ్య విరాటము లీనాటికి ముద్రితములై మీ హస్తకమలముల కలంకారములై నిలిచినవి.

అందుకు అయిదువందలపదారు లిచ్చిన వ్యక్తులను మాత్రము రాజపోషకులుగా చిత్రపరిచయము గావించుచు వారితోపాటు తమ శక్తి కొలదిని సాయమొనర్చిన యుదారులకు కృతజ్ఞతలు. అట్లే ముద్రాపకుల సుహృద్భావమునుకూడ ఈ సందర్భమున విస్మరింపజాలను.

మహాభారత ధర్మాధిష్ఠానమగు శ్రీకృష్ణబ్రహ్మము నా దాతలకు ధర్మార్థ కామ మోక్షపురుషార్థముల ప్రసాదించి అనుగ్రహించగలదు.

కాని, 'భారతే సార ముద్యోగః' అను నుడిని ఆధారముగాగొన్న ఉద్యోగాది పర్వములుగూడ పై యుదారుల ననుకరించు దాత లెవ్వరా? యని ఎదురుచూచుచున్నవి. అవియు కాబోవు దాతలననుసరించి త్వరలో వెలువడగలవు.

మా కృషిసాఫల్యము మీ అందరి ఆదరణమీదను ఆధారపడియున్నది!

ఆదరించి ప్రోత్సాహించెదరని ఆశించే,

—గ్రంథకర్త

★



శ్రీ గౌరా రామయ్యశెట్టిగారు (ల్యాండులార్డు)
వారి ధర్మపత్ని శ్రీమతి సుబ్బలక్ష్మమగారు
ఆదవాని



శ్రీ నూకల చంద్రమౌళిగారు,

వారి ధర్మపత్ని శ్రీమతి పద్మావతమ్మగారు - వనపర్తి.



శ్రీ దాచ లక్ష్మయ్య రంగస్వామి గుప్తగారు
వారి ధర్మపత్ని శ్రీమతి రామేశ్వరమ్మగారు - వనపర్తి.



శ్రీ మేళ్ళచెర్వు కాశీనాథంగారు

ప్యాడీ అండ్ గ్రైన్ మర్చంటు - కోదాడ.



శ్రీ బండా భాస్కరరావుగారు - విజయవాడ



శ్రీ నండూరు వెంకటేశ్వరరావుగారు (అడ్వకేటు) వారి ధర్మపత్ని.

గుంటూరు

గ్రంథప్రచురణకు విరాళములొసగిన ఈ ఉదారులకు మా కృతజ్ఞతలు ! — ప్రకాశకులు

---

శ్రీమతి H. లక్ష్మీదేవమ్మగారు, ఆదోని. రు. 200/- లు

రు. 116/- లు విరాళములిచ్చిన దాతలు

శ్రీ జె. మాణిక్యశాస్త్రిగారు, తెలుగు పండితులు, హాలహర్వి.

" జొన్నవిత్తుల సీతారామాంజనేయులుగారు, విజయవాడ.

" కవిపురపు రామకృష్ణారావుగారు, విజయవాడ.

" బి. వి. హనుమంతరావుగారు, A.C.T.O., విజయవాడ.

" గుండు సత్యంగారు, విజయవాడ.

" బోడాల రామకోటయ్యగారి భార్య
శ్రీమతి సుబ్బులుగారు, కారంచేడు.

శ్రీమతి లింగాల పార్వతమ్మగారు, భీమగుండం (కడప జిల్లా)

" మూల్పూరు వరలక్ష్మమ్మగారు, గుంటూరు.

శ్రీ జొన్నలగడ్డ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గుంటూరు.

" కొల్లిపర కోటేశ్వరరావుగారు,
శ్రీనివాసా టుబాకో సప్లయర్సు, గుంటూరు.

" మాదల రాజేంద్రప్రసాద్ అండ్ నాదెళ్ళ తిరుపతయ్యగారు,
టుబాకో కంపెనీ, గుంటూరు.

ఖమ్మం బాలికోన్నత పాఠశాలవారు.

*

# అరణ్యపర్వము

## వనప్రవేశము

'నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్.'

మహాశయులారా !

మన మహాభారతము నందీనాటికి రెండు పర్వములు గడచినవి. భారతీయాధ్యాత్మిక సారస్వతమున కాలవాలమైన అరణ్యపర్వ మీనాటి నుండియు ఉపన్యసింపబడును.

పాండవు లరణ్యవాసము గావించిన పండ్రెండు సంవత్సరముల కథాక్రమమే అరణ్యపర్వము.

ఈ పర్వమునందనేక పుణ్యక్షేత్ర పవిత్ర వాహినుల మాహాత్మ్యములును, తపోధనులగు మహర్షుల మహామాన్వితములగు జీవిత చరిత్రలును, వారి చరిత్రల నంటియుండియు రాచబాటల తీర్చిదిద్దిన రాజర్షుల చరిత్రలును, రాజర్షి మహర్షుల చరిత్రాంశములతో తుల దూగుచు భావిభారత నారీమణుల కాదర్శజీవితముల నందించుచు సతీమ తల్లుల పాతివ్రత్య ప్రభావములును, పాతివ్రత్య ప్రభావముల కెనయై, విశిష్ట సంస్కారములతో విరాజిల్లుచు ధర్మసేవా ధురంధరులై, మాతా పితృ సేవాపరాయణత్వమున భూతభవిష్యద్వర్తమానకాలముల గుర్తెరిగిన ధర్మవ్యాధాది సేవాధురంధరుల చరిత్రలును వర్ణించబడి యున్నవి.

అవన్నియు విభిన్న మహిమాన్వితములై కన్పట్టినను అఖండ తేజోవిరాజమానమై వెలుగొందు విరాడ్రూప సచ్చిదానంద బ్రహ్మము యొక్క కళా సహస్రములేనని భారతీయ సిద్ధాంతము.

వ్యష్టి రూపమున భగవానుని అద్భుత లీలావర్ణనా వైభవమే మహాభారతామ్నాయమునందలి ధార్మిక పురుషుల జీవిత చరిత్రలు.

గీతాశాస్త్రమున విభూతియోగ మీ మాటను చెప్పినది.

శ్లో॥ "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా
తత్తదేవాగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవం"

పాండవులు ద్రౌపదీ సమేతులై వనవాసదీక్షకు పయనమైరి. ఉప పాండవులును, భృత్యవర్గమును, సుభద్రాభిమన్యులును, వారి పిరుందిన పయనముకాగా, పౌరులును దుర్యోధనుని సామ్రాజ్యమున జీవించుట కిష్టము లేకయే, వారు పాండవులను వెంటనంటినారు.

పౌరులందరును తమతో ఏగుటకు పాండవు లనుమతించలేదు. భీష్మ, విదురులును, తమ తల్లియగు కుంతియు, హస్తినాపురమందే యుండి క్లేశముల ననుభవించుట మీ యందరి యాదరమునను ఉపశమింపగలదని పౌరుల నోదార్చి, నాగసాహ్వయమునందే యుండుడని మరలించెను. పౌరులు హస్తినాపురమునందే నిలచిరి. కాని ధర్మజుని వియోగము వారికి సహింపరానిదగుటచే, ఆర్తస్వరముల కన్నీటిబిందువుల కార్చుచు, ఎట్టకేలకు పట్టణమునకు మరలినారు. కాని కొందరు బ్రాహ్మణులు మాత్రము తమ శిష్యగణములతో అగ్నిహోత్రములను గూడ తీసికొని, పాండవులను వెంటనంటిరి.

ధర్మజాదుల మొదటి మజిలీ గంగాతీరమునందున్న ప్రమాణ వటమను చెట్టుక్రింద, ఆనాడు గడచినది. రెండవరోజు వచ్చినది. బ్రాహ్మణ

బృందమంతయు, ధర్మజు నాశ్రయించియే యున్నది. కేవలము హస్తినాపురమునందలి బ్రాహ్మణబృందమే కాదు, మహర్షులుకూడ కొందరా ధర్మజు వెంటనంటియే యుండిరి. ధౌమ్యులు పాండవులకు పురోహితులు. వారుగాక శౌనకులు మొదలగువారుండిరి. నాడు వారందరకు నాతిథ్య మిచ్చుటకు ధర్మజున కేమున్నది? అయ్యును ఆ బ్రాహ్మణ బృందము ధర్మజుని వదలలేదు. మా పోషణభారము నీ కక్కరలేదని ధర్మజు నోదార్చిరేగాని, వారు పాండవులను వీడలేదు. వారును పాండవులతోపాటు కందమూలముల భక్షించుటకే పాల్పడినారు. ధర్మజుడు తన సామ్రాజ్యలక్ష్మి వియోగమునకు చింతిల్లలేదు. కాని ఈనాడీ యతిథి సత్కార వైభవమిట్లు తారుమారగుట కాతడు చింతాగ్రస్తు డయ్యెను. చింతాగ్రస్తుడగుట కాదు. దుర్యోధనాదుల ఘాతుక కృత్య మాతని హృదయ మీనాటి సన్నివేశము కదిలించి, కలచివైచినది.

"... ... ... ... ధిక్పాపాన్ ధృతరాష్ట్రిజాన్."

దుర్యోధనాదుల నొక్కమారు నిందించినాడు. ధర్మజుని యానాటి విషాదగ్రస్త చిత్తమును తీర్చిదిద్దువారెవరు? శౌనకులను మహర్షి ధన సంచయమునుగూర్చిన దోషముల నుద్ఘాటించుచు, సంతోషమును దానిని గూర్చిన యుదారవాక్యముల నుపదేశించినారు. కాని ధర్మజుని పరితాపము తన ధనమును కోల్పోవుటను గురించి కాదు.

నేడీ యతిథి పూజలకై నేను నోచుకొననివాడ నైతినన్న ఆవేదనయే ధర్మజుని బాధించుచున్నది.

భారతీయ గార్హస్థ్య వైభవమునందలి ముఖ్యవైభవము అతిథి సత్కారము. అది పంచయజ్ఞములలో నొక యజ్ఞము. దేవయజ్ఞ, పితృయజ్ఞ, భూతయజ్ఞ, మనుష్యయజ్ఞ, బ్రహ్మయజ్ఞము లనునవి అయిదు

యజ్ఞములు. అందొక యజ్ఞమై వెలసిన అతిథిసత్కార మానాటినుండి జరుగుచెట్లు ?

"అతిథిః కిల పూజార్హః ప్రాకృతోపి విజానతా"

ప్రాకృతుడైనను అతిథి పూజార్హుడగుచుండగా మహనీయులగు ఋషిసత్తములును, వేదవేదాంగపారగులై, ఎడతెగని శిష్యసంతతి కధ్యయనముల గావించుచు, సంతతాగ్నిహోత్రులగు బ్రాహ్మణప్రవరుల కాతిథ్యమివ్వ కెట్లూరకుండగలడు ?

పెద్దనామాత్యుని మనుచరిత్రయందలి ప్రవరాఖ్యుని బాధ ఇట్టిదే కావచ్చును.

"యతిథి సంతర్పణంబు లేమయ్యెనొక్కొ
యగ్ని లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యముల బాసి దైవంబ కినుక నిట్లు
పొరిపైచితె మిన్నులు పడ్డచోటు."

అతిథిపూజ, అగ్నిపూజ లనునవి కర్మయోగములోని కీలక స్థానములు. భారతీయుల నిత్యజీవితములోని స్వార్థత్యాగమే అతిథి సత్కారముగాని వేరుకాదు. అన్నమును తన కొరకై వండుకొనుట భారతీయత కాదు. భారతదేశ చరితమున నా డనాగరికులని ఏయే జాతుల నూహించుచుండిరో ఆ యా నిమ్నజాతు లనుకొనువారిలోని విశాలాధ్యాత్మిక సంపద, నేడు నాగరికతా వైభవము మనల నందుకున్నదనుకున్న వారిలో మృగ్యమై వీరు స్వార్థ సంపాదనమున తారాస్థాయి నందుకొనినారు. కథకు రండు.

ధర్మజుని హృదయ పరితాపము ధౌమ్యున కర్థమైనది. వెంటనే ఆ మహనీయులు ధర్మజునకు సూర్యాష్టోత్తరము నుపదేశించి సూర్యునారాధింపజేసినారు.

మన కన్నులకు కన్పట్టు మండలము సూర్యభగవానుని భౌతిక గోళము. గోళాంతర్భాగమున వెలుగొందునది చైతన్యము. అది దివ్య తేజోవిరాజితము. జడప్రపంచమును గాలించదలచినవారా చైతన్య మెట్టి ప్రభావముగలదో గుర్తెరుగలేదు.

సూర్యభగవానులు త్రయీమూర్తి. అనగా వేదముల రూపమున తెలియబడువాడు. సృష్టి స్థితి లయములకు ఆధారము. అతని ఉదయము సృష్టి. మధ్యకాలము స్థితి. అస్తమయము లయము.

యుధిష్ఠిరు డిట్లు స్తుతించినాడు :

'త్వం భానో జగతశ్చక్షు స్త్వమాత్మా సర్వదేహినాం
త్వం యోనిస్సర్వభూతానాం త్వమాచారః క్రియావతాం'

'ఓ సూర్యభగవానుడా ! నీవే జగత్తున కాత్మవు. సమస్త భూతముల యందును ఉన్న అంతరాత్మవు. జగత్సృష్టికి నీవే ఆధారము. సదాచారములు, యాగములుకూడ నీవే అని సర్వాత్మనా భావించినాడు.

ధౌమ్యుని యుపదేశము. ధర్మజుని ఉపాసనము. కాలవిళంబన మెందుకు ? మండల మధ్యభాగమునుండి సూర్యభగవానులు ధర్మజునకు సాక్షాత్కరించెను.

ప్రస్తుతమున ధర్మరాజు అతిథిపరుల భోజన సత్కారములకు తరుగులేకుండ చేయుటకేగదా ఆయన నారాధించినది ?

భగవానులొక రాగిపాత్రను ధర్మనందనున కిచ్చినాడు. ఆ పాత్ర యందుదీకించు స్వల్పమగు పదార్థము అక్షయమై చతుర్విధాహారంబులను, పంచభక్ష్యపరమాన్న సహితముగా వేనకువేలుగా అతిథుల కను దినంబును సమారాధన గావింపగలదు. ద్రౌపది యా పాత్రతో అయిన అన్నాదికమును బ్రాహ్మణులకిడి, తాను భుజించగా ఆ పాత్రయందిక

ఒక్క మెతుకైనను దొరకదు. ఇక ధర్మనందనునకు తాను భరించ దలచిన సేవకులకుగాని, అతిథులకుగాని అర్చించుటకు దారిద్ర్య మెక్కడిది ? తపనా సాధించరానిదేమున్నది ?

ఆ గంగాతీరముననే కొన్ని దినములట్లు గడచినవి. వారి కందుండి రెండవ మజిలీ కామ్యకవనము.

ఒక్కమారు హస్తినాపురమునకు వత్తము.

ధృతరాష్ట్రినకును, విదురునకును పొత్తు కుదరలేదు. విదురుడు పాండవుల రావించి, రాజ్యమిచ్చుట ధర్మమని ధర్మదేవతను గురించి ఉపన్యసించెను :

శ్లో॥ 'త్రివర్గోయం ధర్మమూలో నరేంద్ర
రాజ్యంచేదం ధర్మమూలం వదంతి
ధర్మేరాజన్ వర్తమాన స్వశక్త్యా
పుత్రాన్ సర్వాన్ పాహి పాండోస్సుతాంశ్చ'

మానవు డనుభవించదగు ధర్మార్థకామములు మూడును ధర్మమూలములే. అర్థకామములు ధర్మఫలము లేనివారల కానందము నీయజాలవు. యథాశక్తిగ ధర్మమార్జించుట అవసరము. రాజేంద్రా ! పాండవులను ధర్మబుద్ధితో పాలింపుమని బోధించినాడు. ధృతరాష్ట్రినిలోని లోభిత్వము అతని యందుండదగు ధర్మగుణమును మ్రింగి తనకే స్థానమును కల్పించుకొన్నది. ధృతరాష్ట్రిడు విదురుని సిద్ధాంతము నొప్పలేదు.

విదురుడు పక్షపాతబుద్ధియై యుండెనని ధృతరాష్ట్రిడు తలచినాడు. తలంచుటకాదు. వాక్రుచ్చినాడు.

'హితం తేషా మహితం మామకానా
మేత త్సర్వం మమ నావైతిచేతః'

పాండవులకు హితము కోరునట్లు నా పుత్రులయందు నీకు హితబుద్ధి లేదనియు, నీ యునికి నాకు నచ్చలేదనియు ధృతరాష్ట్రుడు స్పష్టపరచినాడు.

విదురునకు పాండవుల సమీపించి, వారితోడనే కాలము గడుపుట మంచిదని తోచినది. విదురుడు రథమెక్కి పాండవులకడ కేగినాడు.

విదురుడెంతటి యూహాపోహ విచక్షణాదక్షుడో ధృతరాష్ట్రు డెఱుగును. పాండవుల కడకేగిన విదురుని సాయము పాండవులకే తోడ్పడగలదన్న దురూహ ధృతరాష్ట్రునకు కలుగుటలో ఆశ్చర్య మేమున్నది? ధృతరాష్ట్రుని భావమిదిగో:

'విదురస్య ప్రభావంచ సంధివిగ్రహకారిత
వివృద్ధించ పరాం మత్వా పాండవానాం భవిష్యతి'

విదురుని సంధి విగ్రహకారిత్వ శక్తి పాండవులకే చేకూర గలదు. ధృతరాష్ట్రుడు వెంటనే విదురుని పిలించుటకై సంజయుని పంపినాడు.

విదురుని హృదయము ధర్మనందునిపైననే కట్టివేయున్నను ధర్మజుని యనుమతియు, సంజయుని వార్తయు విదురుని బయలుదేర దీయగా విదురుడు మరల హస్తినాపురమున కేతెంచెను.

విదురుడు మరల వచ్చుటతో దుర్యోధనుని హృదయము కలత జారినది. పాండవులను మరల హస్తినాపురమునకు రప్పించుటకై ధృతరాష్ట్రుని హృదయము నాతడు త్రిప్పును. ధృతరాష్ట్రు డొప్పుకొనును. తన రాజ్యమునకు తిలోదకము వచ్చును. ఇదియే దుర్యోధనుని ఆశయము. కర్ణ శకునులతో ఆలోచించినాడు. వారొడార్చినారు. శకుని పాండవు లట్టివారు కారని చెప్పగా కర్ణుడును అట్లేచెప్పి, వారు వచ్చినచో

పునర్ద్యూతమున జయించవచ్చని ఓదార్చినాడు. యదార్ధమునకు పాండవుల విశ్వేషము గావించు సంకల్పము దుర్యోధనునిదైనను వారనుమతించ లేదు. అంతతో ఆ ఘట్టము ముగిసినది.

ధర్మసామ్రాజ్యమునకు భంగము వాటిల్లగా అరణ్యక జీవనమును కొనసాగించు బ్రహ్మర్షులను ప్రజాహితమును కోరుచు రాజుల కుద్బోధ చేయుట భారతదేశమునకు క్రొత్తకాదు.

ధృతరాష్ట్రునికి హితము నుద్బోధింప వ్యాసులు వచ్చినారు. సృష్టి ఖండమున పుత్రమోహము గొప్పదిగదా! ధృతరాష్ట్రు డీమాటనే వ్యాసునకు సమాధానమిచ్చి, దుర్యోధనునకు నచ్చచెప్పమని వ్యాసునికి విన్నవించినాడు. వ్యాసమునీంద్రు లాకార్యమును చేయలేదుగాని, ధృతరాష్ట్రునకు మైత్రేయ మహర్షివారు పాండవులకడ కేగినారనియు, ఆతడు మరల ఇక్కడికి కేతెంచుననియు, ఆ మునీంద్రులు దుర్యోధనునకు హితబోధ చేయుననియు, ఆయన కెదురాడుచో ఆ మహర్షి శాపమునకు నీ పుత్రుడు గురియగుననియు చెప్పి, వ్యాసమునీంద్రులు వెడలినారు.

అది దుర్యోధనుని పాపము పరిపక్వమగు కాలము నందొక భాగము కావచ్చును. మైత్రేయ మహర్షివారు, ధృతరాష్ట్రునొద్దకు వచ్చినారు. ధృతరాష్ట్రు డాసనాది విధుల పూజింపగా మహర్షి తన యాత్రా విశేషమును వర్ణించుచు, కామ్యక వనమున కేగితిననియు, ధర్మజాదుల చూచివచ్చితిననియు చెప్పి, అటువంటి ధర్మమూర్తుల నరణ్యమునకు తరలించుట ధర్మముకాదని ధృతరాష్ట్రునకు హితమును చెప్పినారు.

'నైతదౌపయికం రాజం స్త్వయి భీష్మేచ జీవతి
యదన్యోన్యేన తే పుత్రా విరోధ్యంతే కథంచన.'

ధృతరాష్ట్రా ! నీవును భీష్ముడును జీవించియుండ నీ పుత్రు లన్యోన్య విరోధముల కూడియుండుట యుక్తము కాదు.

'కిమర్థ మనయం ఘోర ముత్పద్యంత ముపేక్షసే'

రాబోవు మహానర్థము నేల యుపేక్షించుచుంటివి ? ఈ మాటలు ధృతరాష్ట్రునితో మాటలాడి, మైత్రేయులు దుర్యోధనుని వైపుకు తిరిగినారు.

పాండవులు వనమున కేగిన తరువాత కిమ్మీరాసురుని భీముడు పరిమార్చుట జరిగినది. మైత్రేయులు పాండవుల ప్రతిభాప్రభావములను వర్ణించి, జరాసంధాదుల వధను జ్ఞాపకముచేసి, క్రొత్తదగు కిమ్మీరవధను చెప్పి, వారి ధర్మాచరణ నుగ్గడించి, దుర్యోధనునకు హితమును బోధించినారు.

పెద్దలయెడ వినయ మనునది దుర్యోధనుని వాఙ్మయమున లేదు. ఆతడొక్కమారు నవ్వి, ఏనుగు తొండమువలె బలసిన తొడను చేత చరచి, నేలను కాలదువ్వి, మరుమాట చెప్పక తలవంచి, తన విపరీత భావమును మహర్షి ముందు ప్రదర్శించినాడు. మైత్రేయుల ముఖమండల మెఱ్ఱబడగా నీవు చేయు దురంతములచే యుద్ధము ప్రసక్తముకాగా భీమసేనుని గదాఘాతమున నీ యూరు భేదనము కాగలదని శపించినారు. అలౌకిక ప్రతిభాశాలురగు నా ముని వచోఘాతమున కూలబడు దుర్యోధ నుని కళేబర మా ధృతరాష్ట్రుని హృదయక్షేత్రమున ప్రత్యక్షముకాగా పెద్దరాజు మునిచంద్రుల పాదముల నాశ్రయించినాడు.

వెన్నముద్దలవలె కరగిపోవు నా మునీశ్వరుల హృదయములలో కాఠిన్య మెక్కడిది ? యుద్ధము ప్రవృత్తముకాదేని నీ పుత్రునకట్టి శాపము లేదని యనుగ్రహించి, యుద్ధము జరుగుచో దుర్యోధనున కా శాపఫలము తప్పదని నిర్ణయించినారు మైత్రేయులు.

అంతతో మైత్రేయుని కర్తవ్యము ముగిసినది. ధృతరాష్ట్రుడు కిమ్మీరాసురుని వధనుగూర్చి మునీశ్వరు నడిగెనుగాని వారు విదురుడు చెప్పగలడని చెప్పి, తన యాశ్రమమున కేగిరి.

కిమ్మీరవధ కథాఘట్టమంతయు విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పినాడు. కిమ్మీరుడు బకాసురుని తమ్ముడు. కామ్యకవనముననే కిమ్మీరాసురుని వధించుట జరిగినది.

కృష్ణపరమాత్మయు, ధృష్టద్యుమ్నాదులును కూడ కామ్యకవనమందున్న ధర్మనందనుని యూరడించుటయు, భావి భాగ్యోదయమును శ్రీకృష్ణులు నిర్ణయించుటయు జరిగినవి.

ఈ కామ్యకవన సంచారమున శ్రీకృష్ణులొక యపూర్వ సందేశమును కూడ నిచ్చినారు. ఎవరికి ? ధర్మజునకు. కాదు కాదు, మనకందరకుకూడ. ఏమది ?

'నైతత్కృచ్ఛ్ర మనుప్రాప్తోభవాన్ స్యాద్వసుధాధిప
యద్యహం ద్వారకాయాస్యాం రాజన్ సన్నిహితఃపురా
ఆగచ్ఛేయ మహం ద్యూత మనాహూతోపి కౌరవైః
ఆంబికేయేన దుర్ధర్ష రాజ్ఞా దుర్యోధనేనచ
వారయేయ మహం ద్యూతం బహూన్ దోషాన్ ప్రదర్శయన్'

ధర్మజా! నీవు ద్యూతమున కాహ్వానితుడవై ద్యూతరంగమునకు రాగా ఆ కష్టకాలమున నేను ద్వారకయందు లేను. నేను ద్వారకయందే యుండి యున్నచో నన్నెవ్వరు పిలువకున్నను స్వయముగానైన వచ్చి ద్యూతమునుండి మరలించువాడను. ధృతరాష్ట్ర దుర్యోధనులకు కూడ ద్యూత దోషములను గురించి నచ్చచెప్పియైనను మరలించువాడనే.

శ్రోతలారా! వింటిరా ? శ్రీకృష్ణుని యాదరవాక్య మెట్లున్నదో ? తాను ద్వారకయందు లేడట. లేకున్న ద్రౌపదికి వలువల నెట్లిచ్చెను ?

ఈ ఘట్టమున శ్రీకృష్ణుని వాక్యమునకు వేరొక యంతరార్థమున్నది. ధర్మజు డాసమయమున శ్రీకృష్ణుని హృదయమున స్మరించలేదు. ద్రౌపది శరణాగతురాలైనది. నన్ను మరచుటయే ద్యూతమున పరాభవమునకు కారణమని చెప్పినారు. ఇక్కడ ద్వారకయన ధర్మజుని హృదయమని భావము. ద్వారకయందు నే లేనని చెప్పుట నీ హృదయమున నన్ను తలచలేదని చెప్పుటగా మనము భావించవలెను. సంసారమను జూదమంటపమునగూడ భగవంతుని స్మరించుచో పరాభవము లేదు. ద్రౌపది నన్ను తలచి శరణాగతయైనటుల నీవు కాలేదని ధర్మజుని సంబోధించుచే మనల సంబోధించుట. దుర్యోధనులనువారే అంతరార్థమున విషయవాసనలు. ఆ విషయవాసన లందించు విషయసౌఖ్యములను జయించవలెనన్న భగవద్భక్తి యవసరము. ధర్మజుడు రాజధర్మము ననుసరించెనుగాని, భక్తిని యనుసరించలేదు. ధర్మపూర్వకమగు కర్మ వ్యసనము కాదని మీరు సభాపర్వమున చెప్పితిరిగదా అందురేమో? కర్మకాండయందును భగవద్భక్తి లేని కేవల ధర్మము జీవుని తరింపచేయదనియే శ్రీకృష్ణుని భావము. తనను మరచినవారికి దుఃఖములు తప్పవని శాసనము.

నాటికి వారి సంభాషణలు ముగిసినవి.

సుభద్రాభిమన్యులను శ్రీకృష్ణులు వెంటనిడుకొని ద్వారక కేగగా ధ్రుష్టద్యుమ్నుడు ఉపపాండవులను తీసుకువెళ్ళెను. అంతటితో వారి కామ్యకవన నివాసము పూర్తియైనది. తరువాతి మజిలీ ద్వైతవనము. ద్వైతవనమునకును బ్రాహ్మణ బృందముతోడనే పయనమై ఆ వనమున ప్రవేశించిరి.

నేడా ద్వైతవనమే పాండునందనుల కొక సభాస్థలియైనది. ఋషిమండల మెప్పుడును వారిని చుట్టియే యుండును. వారికేమి కొదవ? కాని ఒకనాటి సాయంకాలమా పాండునందనులు ద్రౌపదీ

మహాసాధ్వియు ఇష్టాగోష్ఠి ప్రారంభించగా వ్యాసభగవానుని దర్శన మైనది. నాటి వ్యాసునిరాక ఆకస్మికము. ధర్మజు డపేక్షించినది కాదు. వ్యాసులు మాత్ర ముపేక్షింపరాని ఘట్టమొకటి ఆనాటి వారి సంభాషణ యందు రూపుదాల్చినది.

ఏమది ? ద్రౌపదీ భీమసేన యుధిష్ఠిరుల కొక విషయమున వివాదమురాగా అందు ధర్మజుని హృదయము బహిర్గతమైనది. అతని హృదయ దౌర్బల్యమును తీర్చుటయు, రాబోవు యుద్ధరంగమునకు వలసిన సామగ్రిని పాండవులచేత సంపాదింపజేయుటయు వ్యాసుని కర్తవ్యమై యున్నది. కావుననే వ్యాసు లాకస్మికముగ ద్వైతవనము నందున్న పాండవుల వద్దకు వచ్చినారు.

ద్రౌపదీ భీమసేన యుధిష్ఠిరుల వివాద మేమి యనునది ముఖ్యముగ గ్రహించదగినదే. నాటి వారి వివాదమున భారతీయ సిద్ధాంతములు బాటలు తీరినవి. ఏమందురా ? రాజు క్షమాన్వితుడై యుండవలెనా ? తేజోవంతుడై శత్రువుల నిర్జించవలెనా ? అను విషయ మిందు చర్చించబడినది.

ఒకనాటి సాయంకాలమున వారి యిష్టాగోష్ఠిలో ధర్మనందనుని ఓరిమియను గుణమును గురించి ద్రౌపది యాక్షేపించినది. ధర్మ నందనుని ఓరిమి క్షాత్రధర్మములోనిది కాదని ద్రౌపది సిద్ధాంతము. పూర్వకర్మ ఫలము ననుభవింపక తప్పదు కావున ఆ కర్మబంధములకు కట్టుబడి దుఃఖముల ననుభవించుచుండుటే ధర్మమనుట కూడ ద్రౌపదికి నచ్చని మాటయే. కౌరవుల కఠినచర్యల సహించుట క్షత్రియజాతి చూపదగు క్షమకాదని ద్రౌపది నిర్ణయము. ఈ నిర్ణయమును ధర్మజునకు సూటిగ చెప్పినది.

'తత్వయా న క్షమా కార్యా శత్రూన్ ప్రతికథంచన,
తేజసైవహి తే శక్యా నిహన్తుం నాత్ర సంశయః'

ఈ సిద్ధాంతమున కుదాహరణముగ ప్రహ్లాద బలిచక్రవర్తుల సంవాదమును చెప్పినది.

ధర్మజుడు కేవల క్షమావాది. ధర్మజుని దృక్పథమున క్రోధమున కంటె అనర్థకము మరియొకటి లేదనునదే నిర్ణయము. ద్రౌపదితో అతడిట్లు చెప్పినాడు :

'క్రుద్ధః పాపం నరంః కుర్యాత్క్రుద్ధో హన్యా ద్గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసోప్యవమన్యతే'

ద్రౌపదీ! మానవుడు క్రోధపూరితుడగుచో అతడు చేయని పాపములేదు. అతడు గురువులనైనను హతమార్చుటకు వెనుదీయుడు. కోపతాపములచే మాట్లాడు మాటలు శ్రేయస్సును నాశము చేయుటలో సందేహము లేదు.

'హింస్యాత్క్రోధా దవధ్యాంస్తు వధ్యాన్సంపూజయీత వా
ఆత్మానమపిచ క్రుద్ధః ప్రేషయే ద్యమసాదనం'

అవధ్యులను వధించి పాపము సంపాదించునది క్రోధము. వధార్హుల పూజించునదియు క్రోధమే. క్రోధమొకప్పుడు తననే చంపుటకు వెనుదీయదు. అట్టి క్రోధమును ధీరులు వర్జింతురుగదా? అట్టి క్రోధమును నావంటివాడు చేకొనునా!

'ఆత్మానంచ పరాంశ్చైవ త్రాయతే మహతోభయాత్
క్రుధ్యంత మప్రతిక్రుధ్యన్ ద్వయో రేషచికిత్సకః'

తనను ఎదిరివానిని కూడ రక్షించునది ఓరిమి. కోపించిన వానిపై కోపింపకుండుట యను ఔషధము అమృత గుళికయని ధర్మజుని నిర్ణయమైనది.

ఇప్పుడు ద్రౌపదీ ధర్మనందనుల సిద్ధాంతము లెట్లున్నవి? దక్షిణోత్తర ధృవములైనవి.

వీరిద్దరి వివాదమునందు మీరొక ముఖ్యవిషయమును గమనింప వలసియున్నది. వీరిద్దరును నా యభిప్రాయమిది; నా యభిప్రాయమిది యని మాటలాడుకొనలేదు. ద్రౌపదీ ధర్మనందనుల వాదములకు ప్రాచీనాచార్యుల యుపాఖ్యానము లాధారములైనవి.

ద్రౌపది ప్రప్రథమమున క్షమ యనునది క్షత్రియ జాతికి విరుద్ధ మని చెప్పుటకు బలిచక్రవర్తికిని ప్రహ్లాదునకును జరిగిన ఒక సంవాద మును వినిపించినది. బలిచక్రవర్తి ప్రహ్లాదుని ఈ క్రింది విధమున ప్రశ్నించినాడు :

'క్షమాస్విచ్ఛ్రేయసీతాత ఉతాహో తేజ ఇత్యుత
శ్రేయోయదత్ర ధర్మజ్ఞ బ్రూహి మే తదసంశయం'

రాజగువాడు తన పౌరుషమును ప్రధానముగాగొని ముందుకు నడువవలెనా? లేక క్షమాన్వితుడై శత్రుకృతాపరాధముల సహించ వలెనా? క్షమ, తేజము అను నీ రెండు గుణములలో దేని నాశ్ర యించుట ప్రశస్తమని ప్రశ్నించగా, బలిచక్రవర్తి చెప్పిన సమాధాన మును ద్రౌపది వినిపించినది. బలిచక్రవర్తి ప్రహ్లాదుల సంవాద మతి దీర్ఘమై భారతమున నడచినది. కాని అందలి సారమును మాత్రమునే ద్రౌపది మాటగా ఇక్కడ చెప్పుచున్నాను.

'నశ్రేయః సతతం తేజో ననిత్యం శ్రేయసీ క్షమా
యోనిత్యం క్షమతే తాత బహూన్ దోషాన్ సవిందతి'

రాజగువాడు నిరంతమును తేజమునే ప్రదర్శించుచు దండధారి యగుటగాని, లేక నిత్యమును క్షమతో కూడియుండుటగాని రెండును దోషములే.

కాలానుసరణములుగా క్షమా తేజముల వాడుచుండవలెనని బలి చెప్పినట్లు ద్రౌపది చెప్పినది. అనగా ద్రౌపది యభిప్రాయమున క్షమ యనునది లేకపోలేదు. ప్రస్తుతమున దుర్యోధనునియందు ధర్మజుడు చూపునట్టి క్షమ మాత్రము దోషసమన్వితమని తేలినది.

అటులైన అపరాధిని కూడ క్షమించుట భారతీయతలో ఒక భాగమేకదా ? ఈ వాదమున కామె సమాధానమేమి ? ఆ వాదము నామె ఎత్తుకొనలేకపోలేదు.

'పూర్వోపకారీ యస్తే స్యాదపరాధే గరీయసి
ఉపకారేణ తత్తస్యక్షంతవ్య మపరాధినః'

పూర్వమొకప్పు డాత డుపకారియైయుండి, వేరొక సమయమునం దాత దపకారి కాగా, అతని క్షమించుట యుక్తమే. లేక ఒకడు తెలియక అపకారమును చేయవచ్చును. అతనిని కూడ క్షమించుట యుక్తమే. అప్పుడైనను అతనిని సరాసరి క్షమించరాదు. పరీక్షించియే క్షమించవలెను. ఇట్లుండ పుట్టిననాటి నుండియు అపకారములనే తలపెట్టు దుర్యోధనుని క్షమించుట కాధారమేమున్నది ? అడుగడుగునను దుర్మార్గమును చేయు దుర్యోధనాదుల సహించుట రాజనీతి కాదని ఆమె నిర్ణయించినది. ధర్మరాజుగారామె వాదమును ఒప్పలేదు. ద్రౌపది వివాదమంతయు విని చెప్పిన సమాధానమిది.

'క్షమ గలవానికి బృధ్వీ
సమునకు నిత్యంబు విజయసంసిద్ధియగున్
క్షమియైనవాని భుజ వి
క్రమము గడున్ వెలయు సర్వకార్యక్షమమై'

క్షమయే రాజునకు విజయకారణమని క్షమాయజ్ఞదీక్షితుని పలుకైనది. రాజునకుండదగు అమర్ష, దాక్షిణ్య, శౌర్య, శీఘ్రత్వంబు

లను నాలుగు గుణంబులను క్షమయందే అంతర్భాగమనియు, క్షమావంతునియందే ఆ గుణములు వీర్యవత్తరములగుననియు కశ్యప గీతమని ధర్మజుడు ద్రౌపదికి సమాధానమిచ్చి, మౌనమును ధరించినాడు. ధర్మజుని భావమేమి ? క్షత్రియుడిట్టి సమయమున తేజమును చూపరాదని, ఆతని భావము.

ద్రౌపది కేమియు తోచలేదు. తన యుపోద్ఘాతము యుధిష్ఠిరుని కదిలించలేదు. దోషదూషితులై దండార్హులగు దుర్యోధనాదులను క్షమించుటయే యుక్తమని ధర్మరాజువంటి రాజనీతి విశారదునకు తోచుట కామె ఆశ్చర్యచకితురాలై, రెండుచేతులు జోడించి విధాతకొక్క నమస్కారము గావించినది.

> 'ఆర్యులకు విహీనతయు న
> నార్యుల కున్నతియుజేసి యవినీతుడవై
> కార్యము దప్పితి నీకు న
> నార్యులు చుట్టములె యార్యు లరులె విధాతా'

నేడు ధర్మజుని క్షమావాదములోని దోషము ధర్మజునిపై నుంచి తొలగించి, జగచ్చక్రమును నడిపించు విధాతపైన మోపినది.

పుణ్యకర్మకు ఫలము సుఖ స్వరూపముకాగా పాపకర్మకు దుఃఖము కావలెను. పుణ్యపాపములను నిర్ణయించునవి సుఖ దుఃఖ ఫలానుభవములేకాని ప్రత్యక్షములై పుణ్యపాపములు గోచరించవు. సుఖ దుఃఖానుభవములను హేతువులచే పుణ్యపాపముల నూహించవలెనన్న ఆ అనుమాన ప్రమాణమునకును ఇచ్చట భంగము కలిగినది. పుణ్యకర్మాచరణుడగు ధర్మజునకు అరణ్యవాస దుఃఖప్రాప్తియు, దుర్యోధనునకు రాజ్యప్రాప్తి రూప సుఖప్రాప్తియు, కలుగగా హేతువు వ్యభిచరించినది. ఓ విధాతా ! ఇట్లు ధర్మాధర్మములను తారుమారు చేసిన

నీకు నమస్కారమన్నది. అనగా పుణ్యపాపముల నిచ్చు ధర్మాధర్మ ముల యునికికి భంగమురాగా నీవుమాత్ర మెక్కడ నిలుతువు ? అన్న భావమును సూచించు ఆ ద్రౌపది నమస్కారబాణము ధర్మజుని కదిలించినది. మౌనమును వీడినాడు. ద్రౌపది మాట్లాడిన మాటయందొక పెద్ద దోషమున్నది. ధర్మాధర్మముల నిర్ణయించుటకు ప్రత్యక్షానుమానములను మాత్రమే స్వీకరించి, ధర్మాధర్మముల ఫలవ్యత్యాసమును బట్టి వాటి యునికికే ప్రమాణములేదని నిర్ణయించినది. ఇంతకంటెదోషమేమున్నది? ధర్మస్థితిని నిర్ణయించునది శబ్దప్రమాణము. అనగా వేదము. అట్టి వేదమునకు ద్రౌపది స్థానమివ్వలేదు. దేవుడు లేడనుట నాస్తికము కాదు. వేదము లప్రమాణములనుట నాస్తికము.

కావున ద్రౌపది కిప్పుడు సమాధానము చెప్పక తప్పదు.

మొదట ద్రౌపది త్రోసివేసిన ప్రత్యక్ష అనుమాన ప్రమాణముల చేతనే ధర్మమును నిరూపించినాడు.

పుణ్యకర్మకు ఫలమే లేనిచో ద్రౌపదీ ! నీ జన్మకు సమాధాన మేమి చెప్పుదువు ? నీవును, ధృష్టద్యుమ్నుడును కర్మఫలములే గదా ! అగ్నియందాహుతిని ప్రేల్చగా వచ్చితిరని ఆమె జన్మనే హేతువుగా ఉదహరించినాడు.

ఇక ధర్మఫల వ్యత్యాసమును తనయందు చూపి ద్రౌపది మాట్లాడినదిగదా ! దానికేమి సమాధానము ?

ద్రౌపదీ ! నేను ధర్మమునకు ఫలము నుద్దేశించి చేయలేదు. నేను ధర్మాచరణమును వ్యాపారము చేయువాడను కాను. కావున ధర్మఫలమగు సుఖము నన్ననుసరింపక పోవుట యుక్తమే కాని, అయుక్తం మాత్రం కాదు. నీవు చెప్పినట్లు విధాత ధర్మాధర్మములను వ్యత్యాసముగా చేయలేదు. కాని నీవు మాత్రము నాస్తికురాలివైతివని కన్నులెర్రజేసి మాట్లాడినాడు.

నాస్తికునకు పాపఫల నివృత్తి కలిగింపదగు ప్రాయశ్చిత్తము కూడా లేదని వక్కాణించినాడు.

'ప్రాయశ్చిత్తం న తస్యాస్తి యో ధర్మమభి శంకతే ।
ధ్యాయన్ స కృపణః పాపో న లోకాన్ ప్రతిపద్యతే ॥
'ప్రమాణాద్ధి నివృత్తోహి వేదశాస్త్రార్థ నిందకః ।
కామలోభాతిగో మూఢో నరకం ప్రతిపద్యతే ॥

ధర్మముపై శంక కలుగుచో వానికి నరకము తప్పదు. వేద శాస్త్రములు ప్రమాణములు కాని వానికి ధర్మము లేదు. ఈ సిద్ధాంతమే మహాభారత సారము.

కాని మీరు నన్నొక ప్రశ్న వేయవచ్చును. ఆనాటి ద్రౌపదికే ధర్మశంక కలిగినదేమని.

ద్రౌపది హృదయపరితాపమున ఆవిధముగా మాట్లాడినదిగాని యదార్ధమున కామె నాస్తికురాలు కాదు. ఆమె ధర్మజుని కిట్లు సమాధానము చెప్పినది.

శ్లో॥ నాన మన్యేన గర్హే చ ధర్మం పార్థ కథంచన
ఆర్తాహం ప్రలపామీదం ఇతిమాం విద్ధి భారత.

ఇంతతో ద్రౌపది యుపన్యాసము ముగిసినది. కాని ఆమెను బలపరచుటకు భీముడుండెను గదా ! భీముని సంభాషణమునుగూడ మీకు క్లుప్తముగ చెప్పెదను.

భీముని దృక్పధమున ధర్మజుడు కేవల ధర్మవాది - కాని ఆ సిద్ధాంతమును రాజు పరిగ్రహించుట ధర్మవాదిత్వమునకు విరుద్ధము నాచరించుచేనని భీముని వాదము. మరి రాజగువా దేమి చేయవలెను ?

ధర్మార్థములను కలపవలెను. ధర్మము అర్థానుబంధి కావలెను. కేవలము ఆరణ్యక వ్రతములతో కాలము గడుపుట క్షత్రియ ధర్మము కాదు. దానినే భీముడు నిరూపించినాడు. మూలానువాదమే ఈ పద్యము.

ఉ॥ శత్రుల నాజి నోర్చుటయు సర్వభయంబుల బొందకుండగా
ధాత్రి పరిగ్రహించి యుచితస్థితి గాంచుటయుం బ్రియంబుతో
బాత్రుల కర్థమీగియును బ్రాహ్మణ పూజ యు జువ్వె యుత్తమ
క్షత్రియ ధర్మముల్ సుగతి కారణముల్ విపులార్థమూలముల్.

కావచ్చును. ఏదియైనను పదమూడు సంవత్సరముల యనంతరము గదా ? భీముని భావము పదమూడు సంవత్సరముల తరువాత కాదు.

పదమూడు సంవత్సరములకు బదులు పదమూడు మాసములు మాత్రమే గడిపి, యుద్ధమున కున్ముఖుడవుకమ్మని ఆతని భావము. అదెట్లు కుదురును ?

సంవత్సరమునకు బదులు మాసమాత్ర వ్రతముకూడా ఒక పక్షమున్నది.

శ్లో॥ అస్తిమాసః ప్రతివిధిః యథా ప్రాహుర్మనీషిణః

ఈ మాటనే ధర్మజునకు ప్రమాణముగా యిచ్చి, యుద్ధ ప్రయత్నమునకు పురిగొలిపినాడు.

శాస్త్రములందెన్నియో విధులను చెప్పుచూ వాటికి ప్రతివిధులను కూడ చూపుచుందురు.

ఉదా ॥ మూడురాత్రు ఉపవాస వ్రతమును విధించు శాస్త్రము మూడు జాములున్నను మూడు రాత్రుల క్రిందనే వచ్చునని కూడా చెప్పును.

బలహీనులు కొందరట్టి పక్షముల నాశ్రయించినను ధర్మజుని వంటి వారట్టి అవకాశములను వాడుకొనరు. అందుచేత ధర్మజుడీ ఘట్టమును బహుముఖములుగా పరిశీలించదగియున్నదని భీమునికి క్రింది మాటను చెప్పినాడు -

అలఘుగుణంబులం దధికుడైన మహాత్ముడు రాగ కోపమా
యలబడి యక్షమావివశుడై యచిరాంశు లతా విలాస చం
చలమగు లక్ష్మి కాసపడి సత్యము ధర్మవు దప్పి, సత్సభా
వలి దగు వారియొద్ద దగువాడయి సద్విధి నుండ నేర్చునే

ఇది చక్కని పద్యము.

బుద్ధిమంతుడగు వాడెప్పుడును దొందరపాటున చంచల లక్ష్మి కాసపడి సత్య ధర్మములను దాటడు. అట్లు దాటిన వానికి సత్పురుషుల సంఘమున స్థానముండదని హితమును బోధించినాడు. మూలములోని శ్లోకములను కూడా వినండి. ఆ శ్లోకములలో ధర్మజుని హృదయమెంత దూరప్రయాణము చేసినదో ద్యోతకము కాగలదు.

శ్లో॥ నత్వద్య శక్యం భరత ప్రవీర
కృత్వా యదుక్తం కురు వీర మధ్యే,
కాలం ప్రతీక్షస్వ సుఖోదయస్య
పక్తిం ఫలానామివ బీజవాపః

భీమసేన! భీష్మ ద్రోణ కృపాచార్యాది వీరుల మధ్య చేసిన ప్రతినను తిరస్కరించి యుద్ధమున కేగుట సాధ్యముకాని పని. వ్యవసాయకుడెట్లు విత్తులను నాటి ఫలకాలము వరకును వేచియుండునో, సుఖమును కోరువాడట్లు కాల నిరీక్షణ గావించుటయే యుక్తము.

శ్లో॥ యదాహి పూర్వం విక్రుతో నికృంతే
ద్వైరం సపుష్పం సఫలం విదిత్వా

నాశ్రయించుచో దైవమనుకూలించునుగాని లేకున్న దైవానుకూల్యము సిద్ధించదని నిర్ణయించినాడు ॥సుకృతే॥ అన్న పదమున. ఇట్లు భీమునితో మాట్లాడగా ఆ ధర్మనందనుని హృదయమును యోగీశ్వరుడైన వ్యాస భగవానునకు ద్యోతకమగును. ఏమని ? భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాశ్వత్థాముల వీర్యముల కాతడు భయపడియుండెనని. దుష్టక్షత్రియ సంఘమును నిర్మూలించదలచిన సంఘములోనివాడే వ్యాసుడు. కావున వెంటనే ద్వైత వనమున కేతెంచి, ధర్మజుని చేత నొక యమోఘప్రభావ సంపన్నమగు విద్య నుంచదలచినాడు।

వ్యాస భగవాను లివ్వదలచినదానికి 'ప్రతిస్మృతి' విద్యయని పేరు. అందుకై వ్యాసులు ద్వైతవనమున నాటి పాండవుల సంభాషణావసరమున ప్రత్యక్షమై నిలచినారు.

తన యెదుట వ్యాసభగవానులు నిలుచుట ధర్మజున కాశ్చర్య మును కలిగించినది. ఆ వచ్చి నిలచినది కేవలము వ్యాసుని విగ్రహము కాదు. అదియొక తపోరాశి. పుణ్యముల ప్రోవు. ఆ మహనీయ మూర్తి దర్శన మప్పుగా ఆపద లుద్భవించవు. ఈ విషయమే భారవి చెప్పినాడు.

శ్లో॥ సహసోప గతస్స విస్మయం తపసాం సూతి రసూతి రాపదాం
దదృశే జగతీ భుజాముని స్సవపుష్మానివ పుణ్యసంచయః

వ్యాసులు నాలుగు ముఖములులేని బ్రహ్మ. రెండు బాహువులు కలిగిన విష్ణువు. ఫాలనేత్రములేని ఈశ్వరుడు. త్రిమూర్త్యాత్మకులే వ్యాసులు. అతడీనాడొసంగిన దర్శనమే పాండవుల కఖండ సామ్రాజ్య లక్ష్మీ ప్రాప్తికి కారణమనుటలో సందేహమేమున్నది ?

ధర్మజు డీవిధముగా పలికెను :

శ్లో॥ శ్రియం వికర్షత్యపహంత్యఘాని
శ్రేయః పరిస్నాతి తనోతి కీర్తిం

సందర్శనం లోకగురో రమోఘం
తపాత్మయోనేరివ కిం నధత్తే ॥

ఓ మునిచంద్రా! నీ దర్శనమొందించని ఫలములేవి? చతుర్ముఖుల సాక్షాత్కరించుచే నీ దర్శనము బ్బుట. లక్ష్మిని చేతికందించగలదు. పాపపుంజమునంతను నాశనము గావించగలదు. కీర్తికాంతను వరింప జేయగలదు. హే లోక గురో! నా భాగ్య మీనాడు పండినదని వ్యాసునకు పాద్యార్ఘ్యము లిచ్చి పూజించగా వ్యాసులు ధర్మజుని మనసున నాటియున్న భయమును చేతితో తీసివైచినట్లు ధైర్యమును పురి గొల్పుచు తన యనుగ్రహ రూపమగు ప్రతిస్మృతి విద్యను ధర్మజున కుపదేశించినారు. ధర్మజుడును ఆ విద్యను మననా ధారణగావించు కొనగా, వ్యాసులు ధర్మజా! దీనిని అర్జునునకొసగుచో అతడీ విద్యా ప్రభావమున పాశుపతాద్యస్త్రములను ఈశ్వరుని వలనను, లోకపాలుర వలనను, సంపాదించగలడనియు, మీరింక యీ ద్వైత వనమునం దుండక మరియొక వనమున కేగుడనియు చెప్పి, వ్యాసులు వెళ్ళినారు. ధర్మజుడా మహా విద్య నభ్యసించుచునే యుండెను. వారాద్వైత వన మునుండి మరల కామ్యకవనమున కేతెంచినారు. ఆ కామ్యక వనమున సరస్వతీ నది ఒడ్డుననే వారి నివాసము.

కొంతకాలమా కామ్యక వనమున గడిచినది. ధర్మజునకీ విద్యను అర్జునున కివ్వదగు సమయము స్మృతికి రాగా పార్థుని ఏకాంత మునకు పిలిచి వ్యాసులు తనకిచ్చిన ప్రతిస్మృతి విద్య అర్జునున కుపదేశించినాడు. ఆ విద్యా ప్రభావమున లోకపాలుర సాక్షాత్కారము, మొదలగు అనేకములైన దివ్యశక్తు లాతని వరించగలవు. ధర్మజుని అనుజ్ఞను వడసి అర్జునుడు పాశుపతాస్త్ర సంపాదనమునకై పయ నించినాడు.

# అస్త్రప్రాప్తి

అది మహేంద్ర పర్వతము. ఆ పర్వత శిఖరాగ్రములయందే అర్జునుని తపస్సు సాగవలెను.

ద్రౌపదీ మహాసాధ్వి వినమ్ర విలాస విజయసూచన కటాక్ష పాతములు తనపైన ప్రసరించగా నిజగాండీపమును, అక్షయ తూణీరమును ధరించి, తానెవ్వరికిని గోచరము కాకుండ ప్రతిస్మృతి యను యోగ విద్యాప్రభావమున హిమశైల గంధమాదన పర్వతము లతి. క్రమించి, ఇంద్రకీలాద్రియందలి యొక రమణీయ సానుప్రదేశమున నిలచెను.

ఆ పర్వత రాజము తపస్సుగావించు మహనీయుల కెవ్వరికైనను ఆతిధ్య మొసంగి, వారికి తాపస సిద్ధిని ప్రసాదించు పుణ్యభూమి, అందున్న కుసుమఫల భరితములగు వృక్షరాజము లెన్నియో తమ వద్దకు వచ్చిన అతిధులకు స్వాగతమిచ్చి అతిధి సత్కారముల గావించును. అర్జును డేగిన ప్రదేశమందొక వృద్ధ తపస్వి ఈతనికంటె పూర్వముననే కూర్చునియుండెను. అతడెవ్వరో అర్జును డెరుగడు. ఆ వృద్ధ భూసురుడే పార్థుని పలకరించినాడు. ఆ బ్రాహ్మణుని దర్శించుటకు పూర్వమే తాను డిగిన ప్రదేశమున పుష్పవృష్టి జడివానవలె తనపై బడగా ఆశ్చర్యమునొందిన పార్థుడీ వృద్ధతాపసుడు దివ్యతేజో విరాజితుడై మానవ సంచార వివర్జితంబగు నిర్జనారణ్యమునం దుండుటకు మరింత ఆశ్చర్యము నొందెను. అతని పాదములకు ప్రణమిల్లెను. ఆ మహనీయుని క్రీగంటి ప్రసారములకు పాత్రుడు కాగా ఆ బ్రాహ్మణు డిట్లనెను :

ఇది శాంతనిలయులు వసించెడు పుణ్యభూమి. ఆయుధోపేతు
లగు వార లిచ్చట వసించుట యుక్తము కాదు. నిన్ను చూడ నీవు
క్షత్రియునివలె తోచుచున్నావు. నీకేమైన కోరికలున్న నీకోరికలు సఫల
మగునట్లు ప్రసాదించెద, నీవీ ప్రదేశము విడిచివెళ్ళుమని గంభీర వచ
నముల పలికెను.

అతడెవ్వడో ?

అతడెవ్వడైన అర్జునునకేమి ! అర్జునుడు చలించలేదు. అర్జునుని
ధైర్యస్థైర్యము లా వృద్ధ తపస్వినే చలింపజేసినవి. అతడు దేవేం
ద్రుడు. తన పుత్రుడీ ప్రదేశమునకు వచ్చుటెరిగి అతని పరీక్షించి
స్వర్గసీమ కొక్కమారు రమ్మని యాహ్వానించుటకై వచ్చినాడు.
కావున అర్జునునకు తన నిజ రూపమును చూపించినాడు. వరముల
కోరుకొమ్మనినాడు. పార్థుడు తన నిజ కార్యక్రమమును కోరో
వునా ! పాశుపతాస్త్రసంపాదనకై వచ్చినానని చెప్పెను. స్వర్గము
నకు వచ్చి సుఖములందుట నా యభిమతము కాదనెను.

దేవేంద్రుడు అనంతరమున దేవత లందరును తత్తదధిష్ఠాన
ములగు అస్త్రముల నొసగగలరని చెప్పి, తరువాత స్వర్గమునకు
వచ్చుటకై అనుజ్ఞనిడి, తాను అంతర్ధానమయ్యెను.

అది అర్జునుడు తపము గావించు రమణీయ ప్రదేశము. ఆ వన
సీమయం దొకచో అర్జునుని కృష్ణాజిన దర్భాసనముల విరాజిల్లు నొక
ఆసన మంటపము. ఆ మంటపముపై యోగాసనాసీనుడైన పార్థుడు
మొదటి మాసమున మూడురోజుల కొక్కమాటు రాలిన ఆకులను
మాత్రమే తినును. అట్లే ఆ మాసము గడచినది. రెండవ మాసమున
ఆరురోజుల కొక్కమారు ఆహారమును గ్రహించగా మూడవ మాసమున
పక్షమున కొక్కదినముననే అత డాహారము స్వీకరించును. నాల్గవ

మాసమున కన్నుల తెరవడు. బాహ్య ప్రపంచమునందలి ఆహార మాతని కక్కరలేదు. అంతర్యామియై చరించు వాయువాతని యాహారము కాగా పాదములు భూమిపై నానక అతని దేహము నిరాలంబమై యున్నది. బాహావు లూర్ధ్వభాగమున నిడి ఘోర సమాధియందా యఘోర రుద్ర మూర్తి నారాధించుచుండెను. శిరోజములందలి కాంతి విద్యున్నిభమై యుండ ఆ యమోఘ తపోనిష్ఠాగరిష్ఠుని దేహేంద్రియ సంఘాత మంతయు తేజోమయమమై, వెలుగుచుండ, అతని ఉగ్ర తపమున కా ప్రాంతవాసులగు ఋషిగణమంతయు భీతిల్లి మహాదేవుని యాస్థానమునకు పయనమైరి.

వెండికొండయం దర్ధాంగితో కూడ విలాసక్రీడల యానందించు అర్ధనారీశ్వరుడుమాత్ర మింతవరకు చలింపలేదు. ఋషిమండలమంతయు నా యాదిదేవున కర్జునుని వర్తమాన మందించినది. అర్జునున కీయదగిన పాశుపతాస్త్ర మా దేవదేవు డందించుటకు సిద్ధమయ్యెను. ఋషుల కభయ దాన మిచ్చి పంపించెను.

యదార్థమునకు విశుద్ధ చైతన్యమున కాకారములేదు. దానిని నిరాకారమని వేందాంతములు వర్ణించును. ఒకవేళ యా బ్రహ్మ చైతన్యము లీలామానుష విగ్రహమై చరించుచో ఏవర్ణ మాతనికి యుత్కృష్టమని చెప్పవలెను ? ఏవర్ణ మానికి నికృష్టమై, హేయమై యుండును ? అన్ని వర్ణములను, అన్ని జాతులను హేయోపాదేయము లయ్యే ఆ మహానీయునకు మంగళ తనువులై భావించును.

నేడు శుద్ధ స్ఫటికవర్ణమున భాసించు కైలాసవాసి కిరాత తనువును ధరించినాడు. అతనితోటి విభక్తమై లేక సగము శరీరమును పంచుకొన్న సర్వమంగళ కిరాత వనిత కాకతప్పునా ? ఆమెయు కిరాత రాజమాత యైనది. చేతనొక విల్లంబు, భుజమున అమ్ములపొద, శిరమున నెమలి

పింఛము లలంకృతములు కాగా ప్రమధగణమంతయు కిరాతగణమైనది. ఈ వేషమునకు చెంచు వేషమని కూడా పేరు.

అత డాదికిరాతుడు. నేటి గిరిజనుడు కావచ్చును. కాని ఈ జాతిని గురించి చరిత్రాంశమెవ్వరు వర్ణియించగలరు ? ఈ కిరాతజాతి ఆవిర్భావము భారత కాలమునకు ముందే యుండనిచో నీ వేషమును ఈశ్వరుడెట్లు గ్రహించెను ? కిరాతుని కిరాతకృత్యముల యవసరము సృష్టిఖండమున లేకపోలేదు. శ్రీ జగద్గురువుల కా కిరాతవేషము యొక్క ప్రభావమెంతయున్నదో అర్థమైనది. వారొకచోట యిట్లు వర్ణించినారు.

శ్లో॥ మాగచ్ఛ స్త్వమిత స్తతో గిరిశభో మయ్యేవ వాసంకురు
స్వామిన్నాది కిరాత మామకమనః కాంతార సీమాంతరే.
వర్తంతే బహుశోమృగా మదజుషో మాత్సర్య మోహాదయ
స్తాన్హత్వా మృగయా వినోద రుచితా లాభంచ సంప్రాప్స్యసి.

కైలాసవాసా ! ఆది కిరాతా ! స్వామీ ! నీవటునిటు తిరుగు టెందుకు ? ఇదిగో నా విశాలహృదయ సీమారణ్యము. ఈ యరణ్య మధ్యభాగమున మదమాత్సర్య మోహమయ క్రూరమృగము లెన్నియో యున్నవి. మృగయా వినోదము నా హృదయమునందేయుండి నా మోహాది క్రూరమృగముల దండించుచో నీకును, నాకును లాభముగదా ! యని ఆది కిరాతుని ప్రార్థించినారు. కిరాతజాతికి అతడే ఆది. సృష్టికే అతడు ఆదిగదా !

కథకు పోవుదము.

అట్లు మహర్షి గణముచే విన్నపముల నందుకొన్న పరమేశ్వరుడు పార్వతికూడ తనవెంటరాగా ప్రమధగణ సమేతుడై ఎరుక వేషమును తాను వేయుటగాక ప్రమధగణమంతయు ఎరుకమూకలై

తనను వెంటనంట సతీసమేతముగ నా యెరుకదొర అర్జునుని వనమున ప్రవేశించినాడు.

దేవతల యమోఘ వరముల నందుకొనవలెనన్న ఎన్నియో విరుద్ధ సంఘటనల నెదుర్కొనవలెను.

అర్జునునకు పాశుపతాస్త్ర సంపాదనము పరప్రదాన మందుకొనుట వంటిదికాదు. అదియు ఒక రణరంగమే. ఈనాటి యర్జునుని రణరంగము దేవదానవ కిన్నర కింపురుషాది వీరులతోగాదు. ప్రళయకాల రుద్రుని యమోఘశక్తి కెదురై నిలువవలెను. అర్జునునితోడి యుద్ధమున కియ్యకొనుటకై సంకల్పమైనది. ఇక కలహాకారణము కావలెను.

ఆ యాది కిరాతుడు కదలిన కాలముననే అర్జునునకొక రాక్షసుని తోటి పోరాటము కలిగినది. తపస్సు గావించుకొను అర్జునునకా పోరాట మెట్లు వచ్చినది ? అదియే ఈశ్వరుని మాయా కల్పనము.

అర్జునునితో ఈనాడు పోరాడవచ్చిన రాక్షసుడు మూకుడనువాడు. ఆ రాక్షసుని పార్థుని పైకి పంపిన వాడీ కిరాతుడే. ఆ రక్కసు నిక్కడకు పొమ్మని ఈశ్వరుడు చెప్పలేదు అంతర్యామియై రాక్షసుని ప్రేరేపించి నాడు. ఆ మూకుడీ యెరుకమూక అర్జునుని సమీపింపకమునుపే అర్జునుని పైకి దుముకుటకై వరాహరూపమును ధరించి, అర్జునుని యనుష్ఠానమునకు భగంగము కావించగా ఆ రాక్షసుని భీభత్స కార్యమును నివారించుట కీ భీభత్సుడు గాండీవము నెక్కుపెట్టినాడు. అర్జునుని ధనుష్టంకారము ప్రమోతలు వనసీమను వ్యాపించగా కిరాతవేషమున వన్య మృగముల వెంటనంటు పరమేశ్వరుని ప్రమథగణమును, ఆ వనసీమ యందలి మృగములను నాశనము గావించుచున్నది. అర్జునుడు తన యంబులపొదినుండి తీసిన బాణమును గాండీవమునకు తొడిగి మూక రక్కసునిపైకి నెక్కుపెట్టినాడు. ఇక వదలవలెను. అంతియే. ఒక్క

క్షణకాలమైన యీ శరమును వదలుటకు సమయమున్నదేమో ; అంతలో నొక ఎరుకరాజు అది నా మృగము. కొట్టకుము, కొట్టకుము – అని నివారించెను. అర్జును డాతని పలుకులను ఖాతరు సేయలేదు. బాణమును వదలనే వదలినాడు. అప్పుడే ఆ యెరుకరాజును వదలినాడు. అశని పాతమువలె వచ్చు నా ఎరుకరాజు బాణమునకును, అదే లక్ష్యముకాగా నా రెండు నారాచము లొక్కసారే ఆ వరాహమునకు మర్మభేదము గావింపగా వరాహము నేలపైకూలినది. అర్జునునకా వరాహముతో తగవు తీరినది. రాక్షసుని మరణమునకు వారిరువురి బాణములును కారణములైనవి.

హరు శరమును నరుశరమును,
సరి నిరు పక్కియలు దాకి జన మఱి శర సం
భరమున దిరిగె వరాహము
శరనిధి మధనమున దిరుగు శైలము వోలెన్.

మూక దైత్యుడు సూకర రూపమును విడిచి నిజరూపమును ధరించగా వారిద్దరును ఆ రాక్షసునిపై బాణవర్షమును కురిపించిరి. రాక్షసుడు మరణము నొందినాడు. కాని ఇప్పు డెవ్వరి బాణపాతమీ రక్కసుని కూల్చినది ? అదియే తేలవలెను.

వెడదరొమ్మును, కుఱుచ చేతులును, మిడిగ్రుడ్లను కలిగిన యీ యెరుకరాజు దేహధారియగు పర్వతరాజువలె నుండి దేదీప్యమానములగు కాంతుల వెదజల్లుచు, వైశ్వానరుడేమైన యీ రూపము దాల్చెనా ? యనునట్లు అర్జునుని కంటబడినాడు. ఈశ్వరుడై వరము నిచ్చుటకు రాలేదు. ఎరుకరాజై వివాదమున కొచ్చినాడు. అతనితో నొక వనిత యున్నది. ఆ జాతివారును ఎందరో అతని గుమిగూడి యుండిరి.

సువర్ణవర్ణమున విరాజిల్లు నీ యెరుకరాజు రాక అర్జునున కాశ్చర్యమును గొలిపినది. కాని అర్జునుని దృక్పథమునం దీతడు శత్రువు. తన బాణపాతమున యాతని కూల్పదగు దోషి. తాను వెక్కు-పెట్టిన శరమునకు గురియైనదాని నీతడు కొట్టుట సహింపరాని తప్పు. కావుననే కిరీటి యా యెరుకరాజును తానే ముందుగ తూలనాడినాడు. తూలనాడుట మాటమాత్రమున కాదు. నా బాణపాతమున నిన్ను కూల్తునని ఆ కిరాతుని యుద్ధోన్ముఖుని గావించినాడు.

ఆతడు వేషమున కిరాతుడయ్యును మధురహృదయముకల పరమాత్మగదా ! అర్జునుని వాక్యసరణి యా మధురమూర్తి హృదయమును కదిలించినది. అర్జునుని సంభాషణ కాతడు హృదయమున కోపపూరితుడు కాలేదు. దేవతలు పరోక్షప్రియులు. అతడిప్పుడు అర్జునుని రణరంగమున దింపవలెనుగదా ? అర్జునుని హృదయము రోషపూరితమును గావించుటకై తానును నిన్ను తప్పక యమపురికి పంపుదునని తన మందహాసమున శత్రువునందుచూపు నిర్లక్ష్యమును సూచింపుచుండ వీరాలాపముల అర్జునుని వీరరస ముప్పొంగునట్లు మాట్లాడినాడు.-

నీవు నేను గురిచేసికొన్న పందిని కొట్టియు, నా దోషము నుద్ఘాటించుచుంటివా ? రే మూర్ఖ ! ఇదిగో నా శరజాలము. నీవు బాణజాలము నేమాత్రము విడుతువో చూతునని కవ్వించగా, అర్జును డుగ్రమూర్తియై ఆ పరమేశ్వరుని లీలామానుష శరీరమున తన బాణసహస్రముల వదలినాడు. ఇదియొక విచిత్రమగు యుద్ధము. అర్జును డక్షయతూణీరమునుండి వచ్చు బాణసహస్రము లీతనిపై బడగా నవన్నియు సుందర సుకుమార కుసుమ సహస్రములై ఆ మధురమూర్తి హృదయమున పూజనీయములగుచున్నవి. అర్జునునకు ప్రతిభటుడై నిలిచిన రుద్రమూర్తిలోని రౌద్రరసము మాటమాత్ర మగుచున్నది. వారిద్దరి యుద్ధమును పెచ్చుపెరిగినది. ఒకరినొకరు నిర్దాక్షిణ్యముగనే కొట్టు

కొనుచుండిరని చూచువార లనుకొన్నను అందొకడు దాక్షిణ్యమూర్తి యయ్యె యుద్ధమును గావించుచున్నాడు. వారిద్దరి బాణయుద్ధమును ఒక్కరెండు ఘడియలకాలము సాగినది. కిరాతుని దేహమిసుమంతయు కందక కుందక పర్వతరాజమువలె స్థిరమైయున్నది. కిరాతుని సుకుమార గాత్రము తన కరుకు ములుకుల కిసుమంతయు వాడుసూపకునికి అర్జునుని విస్మయావిష్టుని చేయుచున్నది.

అర్జునుని మనమునం దీత డిప్పుడు కేవలము కిరాతుడై లేడు. దేవతలలో నొక్కడై యుండవచ్చునని యూహించుట జరిగినది. కాని బాణపాతము నాపలేదు. అంతకింత కుత్సాహము రేకెత్తుచుండెను. ఏమైనను కిరాతుని యమపట్టణమునకు పంపవలెననియే కిరీటి నిర్ణయము. కాని ఒక విచిత్రఘట్ట మా పాండవున కెదురైనది.

అక్షయతూణీరమున బాణములు మటుమాయమైనవి. బాణ మొక్కటైనను లేదు. ఇది పార్థుని జీవితము నందొక యపూర్వ ఘట్టము. హృదయము శంకావహమైన దొకవంక. క్రోధపూరితమై శత్రువుపైకి దుముకుచున్న దొకవంక. అర్జున కిప్పు డేమిచేయవలెనో తోచలేదు. గాండీవమునే తీసికొని దాని యగ్రభాగముచే శివుని శిరమున గ్రుచ్చినాడు. గజాంకుశమునువలె అర్జునుడాతని శిరమున గ్రుచ్చినను గజాసురుని మర్దించిన ఆ గజాసుర విమర్దనునికి నొప్పి కలుగలేదు. దైవమున కెదురై నిలుచుట సామాన్యమా? గాండీవమును అంతర్ధానమైనది. అతడప్పుడేమి చేయవలెను? ఖడ్గమును చేతబట్టినాడు. అది యా కిరాతకుని శిరమున దిగలేదు. ఆ పర్వతరాజమందలి వృక్షముల పెరకి యుద్ధమును సాగించినాడు. అవియు విఫలములుకాగా, ముష్టియుద్ధము ప్రారంభమైనది. అదియు ముహూర్తకాలము నడచినది. మధ్యభాగమున అర్జునుని శరీరము నుగ్గుగాగా స్మారకము తప్పినది.

అచేతనునివలె క్రింద పడినాడు. సత్వ విహీనమైనదానివలె నున్న అతని శరీరము భూమిపై నొక్క ముహూర్తమాత్రము నిశ్చేతనమై యున్నను, ఆ కాలము గడవగా చేతనత్వము నొంది అర్జును డెప్పటి యట్ల తానెవ్వడో స్మృతి నొందినాడు. తన శరీరమంతయు రక్తసిక్తమై యున్నది. తా నిల్లైన్నడును పరాజితుడు కాలేదు. ఈనాటి యుద్ధమున తన కేడియో దైవబలము తగ్గినదనిపించింది. అతడిప్పు డేమిచేయ వలెను ? వెంటనే లేచి, ఈ కిరాతుని జయించుటకై శివారాధననే ప్రారంభించినాడు.

మృణ్మయమగు లింగముననే ధ్యానావాహనాది పూజావిధానము ప్రారంభమైనది. ఈ మృణ్మయవికారము నొందినవాడే ఆ కిరాతుడని అర్జునున కేమి తెలుసును ? కాని అర్జునుడు లింగముపై నుంచు గంధ మాల్యములా కిరాతుని శిరమునం దలంకృతములగుచున్నవి. ఆ దృశ్య మును చూచిన పార్థునకా కిరాతుడెవ్వడో అర్థమైనది. అర్జునునికి కలిగిన ఈ క్షణమందలి ఆనందము నెవ్వడైన ఊహించగలడా ? ఆనందము అనిర్వచనీయము. అనుభవైకవేద్యము మాత్రమే. ఒక్క క్షణకాల మా యానందానుభవము కాగా స్వస్థచిత్తుడై కిరాతవేషమున ప్రచ్ఛన్నుడై యున్న పరమేశ్వరుని పాదపద్మములపై వ్రాలినాడు. తన హస్తలాఘవమున మర్దించిన యా పార్థుని శరీరము తన పాదములపై బడగా కఠిన శిలాతలమువలె పైబడి యుద్ధము గావించిన భగవానుని హృదయ మొక్కమారు నవనీతమువలె కరిగినది.

'..............తతః ప్రీతోభవద్భవః'

కరుణారసపూరితములగు తన దృష్టుల నొక్కమా టర్జునునిపై బరపి, మేఘగంభీర ధ్వానమున అర్జునుని పలకరించినాడు.

'భో భో ఫాల్గున తుష్టోస్మి కర్మణాఽప్రతిమేనతే'

హే! అర్జున! నీ యసమాన తపోబలపరాక్రమములకు సంతసించితినని పలికి నీతోటి సమానమగు క్షత్రియ వీరుడీ లోకమున లేడని బిరుదు నిచ్చినాడు. అంతతో భగవానులాగలేదు. దివ్యజ్ఞానమును ప్రసాదించి, అర్జునుని పూర్వవృత్తమునందలి ఋషి జీవితమును స్మృతికి తెచ్చినాడు. ఇక అస్త్రము నందించవలెను. అర్జునా! నీ వొక్కడవే యీ అస్త్రము నందుకొనఁ సమర్థుడవని అస్త్రదానము చేయుటకు వాగ్దానమైనది.

'త్వం హి శక్తో మదీయం తదస్త్రం ధారయితుం క్షణాత్'

కిరాత స్వరూప మదృశ్యమైనది. శూలపాణి సాక్షాత్కరించినాడు. అతని ప్రక్కనున్న చెంచురాణియు మహేశపత్నియై నిలిచినది. అట్లు పార్వతీ పరమేశ్వరుల జూచిన అర్జునుని వాణి ఈశ్వరాభిముఖమై స్తుతింపసాగినది. ఉపనిషత్స్వరమే విగ్రహరూపము నందినదిగాని వేరుకాదు ఈ మధురరూపమునందున్న పార్వతీపరమేశ్వరు లని అర్జునుని స్తోత్రసారము. యదార్థముగా భగవానుని ప్రభావము నెవ్వరు వర్ణింపగలరు? ఒక భక్తు డిట్లు పలినాడు. దేవదేవా నీ చరిత్ర మతి చిత్రమయ్యా!

'సవిషోప్యమృతాయతే భవాన్ శవముండాభరణోపి పావనః
భవ ఏవ భవాంతకస్సతాం సమదృష్టిర్విషమేక్షణోపిసన్'

నీవు విషధరుడవు. కాని నిన్నాశ్రయించినవారి కమృతుడవై మోక్షమిత్తువు. ఇదేమి చిత్రము! నీవు ధరించునవి పుర్రెలు. కాని పరమ పావనుడవై యుందువు. అట్లే నీ కన్నులు విషయ సంఖ్య కలవి. కాని నీ చూపునందు మాత్రము విషమత్వములేదు. సమానదృష్టి కలవాడవై తివే! నీవు భవుడని పేరు (భవమనగ సంసారము) కాని

నీ కృత్యము మాత్రము భవాంతకము (అనగా సంసారమును నాశము చేతువని భావము).

ఆయనకున్న పేర్లకును, అతని గుణమునకును సంబంధము లేకపోవుటయే భగవంతుని వైలక్షణ్యము.

'అపిశూలధరో విరామయో దృఢవైరాగ్యరతోఽపిరాగవాన్
అపిభైక్ష్యచరో మహేశ్వరశ్చరితం చిత్రమిదంహితేప్రభో'

హే భగవాన్! నీవు శూలధరుడవు. కాని నీకు శూలవ్యాధి లేక యుండియే శూలధరుడవైతివేమి?

శూలమనగా త్రిశూలము, శూలయను వ్యాధియు దానినే కవి వ్యాజస్తుతి గావించినాడు.

శంభో! నిన్నుచూడ వైరాగ్యముగా నుందువు. భార్య కర్ధశరీర మిచ్చియు నీవు వైరాగ్యవంతుడవను పేరు నొందితివి. ఇదేమి చిత్రము? నీచేతియందు ముష్టినెత్తుకొను కపాలమా? నీ పేరు మహేశ్వరుడా? ఏమేమి! అని పలికినాడు. భక్తుల భావగాంభీర్యము లిట్టివే.

కథకు రండు. అర్జునుడు భగవానుని స్తుతించగా శంకరుడు తన రెండుచేతుల నిగిడ్చి, అర్జునుని కౌగలించి, అతని శరీరమునందలి గాయముల మాన్పి, రాబోవు యుద్ధరంగమునందలి జయము నుద్ఘాటించి చెప్పి, అక్షయతూణీరములు మాయమగుట తన మాయగా నెరిగించినాడు. మరి పాశుపతాస్త్ర మేది?

అర్జునుని వరము కోరుకొమ్మనినాడు. అర్జును డిప్పుడు కోరగా పాశుపతాస్త్రము నిచ్చినాడు.

'దదామితేస్త్రం దయితమహం పాశుపతం విభో
సమర్థో ధారణే మోక్షే సంహారే చాసి పాండవ'

ఈ అస్త్రమును ధరించుటకును, ప్రయోగించుటకును, మరల ఉపసంహరించుటకు కూడ నీవు సమర్థుడవని వరమిచ్చినాడు.

భారతీయులారా ! భారతక్షేత్ర మెంత ప్రభావసంపన్నమైనది ! నేడర్జునుడు గ్రహించిన పాశుపతాస్త్రము దేవేంద్రాదులకు నయిత మబ్బక భరతవంశసముద్భవుండై యవతరించిన భారతవీరున కబ్బినది. దేవేంద్రాదులవద్ద నీ యస్త్రము లేదని చాటినవా డీశ్వరుడే.

'నైతద్వేద మహేంద్రోపి నయమోవచశరాట్'

కాని దీనికొక నియమమున్నది. ఏమది ? దీనిని అల్పమానవుల యందు ప్రయోగించరాదు. అట్లు ప్రయోగించిన జగజ్జాలమునంతను దాని జ్వాలలు వ్యాపించి జగత్ప్రళయమును కల్పించునని ఈశ్వరు డర్జునునకు తెలిపినాడు. ఇంతవర కస్త్రప్రభావమును తెలుపుట జరిగినది. ఇక అర్జునుని చేతికందించవలెను.

మంత్ర గ్రహణమును చేయుటకు కొన్ని విధులున్నవి. ఆ విధులలోనిదే శుచి యనునది. అర్జునుడు మనసా ఇంద్రియముల నన్నిటిని సంయమము గావించినాడు. మహేశ్వరుని సంబోధించి, 'అధీష్వ' అని ప్రార్థించినాడు. 'అధీష్వ' అనగా ఉపదేశింపుమని అడుగుట. పశుపతి యా మంత్రము నుపదేశించుట జరిగినది. ఆ మంత్రరాజమునకును, ఉపదేశించు పరమేశ్వరునకును తారతమ్యము లేదు. ఆ మంత్రము మూర్తీభవించిన రుద్రునివలె అర్జునుని వరించి, నది. అప్పుడా యర్జును డుమాపతియయ్యే, మంత్రగ్రహణ మాచరించినాడు.

'ఉపతస్థేచ తత్పార్థం యదాత్ర్యక్ష ముమాపతిం'

ఇదియే భారతీయాధ్యాత్మిక రహస్యము. మంత్రమును, మంత్రాధిష్ఠానదేవతయు, ఉపదేష్టయు, గ్రహీతయు ఏకైక తేజోరూపులగుట ఇందలి పరమార్థము.

అర్జునుడా మంత్రరాజమును గ్రహించునప్పటి దృశ్యమేమి ? భూమండలమంతయు కదలబారినది. పర్వతరాజములు చలించినవి. నదీనదము లుప్పొంగినవి. ఇది అతిశయోక్త్యలంకారము కాదు. జగదాధారమగు మూలపీఠ మొక్కమాటు గురుస్థానమునుండి శిష్యముఖములోనికి ప్రవేశించుటకై పయనమైనది. ఆధారము కదలగా ఆధేయములగు వస్తువులు చలింపవా ? అదియే జరిగినది. వియత్తలమున శంఖదుందుభులు మ్రోగినవి. జాజ్వల్యమానమై వెలుగొందు నా యస్త్రతేజము మూర్తీభవించి పాండవుని సమీపించగా, అతని పార్శ్వభాగముననే దేవదానవులందరును నిలచినారు.

'అదాస్త్రం జాజ్వలద్ఘోరం పాండవస్యామితౌజసః
మూర్తి మద్వై స్థితం పార్శ్వే దదృశుర్దేవదానవాః'

త్ర్యంబకుడు అట్లా యస్త్రమునిచ్చి, పార్థుని స్వర్లోకమున కేగుట కనుజ్ఞ నిచ్చినాడు. చివ్వరి ప్రణామముగా అర్జునుడు గురుమూర్తియగు పశుపతి పాదములకు ప్రణమిల్లగా, అర్జునుని గాండీవమును, అక్షయతూణీరమునుగూడ పార్థునకిచ్చి ప్రమధగణ దేవతా బృందములతో అర్జునుని స్థానమును వీడి అంతర్ధానమయ్యెను. అప్పు డా మహనీయుని పయనము గగనమండలమున వెలుగొందు సూర్యుడస్తాద్రికేగగా మనకన్నులకగుపించకపోవుటవలె యైనది. అక్కడకు పాశుపతాస్త్ర మర్జునుని చేతికందినది.

ఇక కావలసినదేమి ? లోకపాలుర యస్త్రజాలములు. ఇంద్ర, యమ, వరుణ, కుబేరులును తమ తమ దివ్యతేజములతో దివ్యస్యందనారూఢులై పాండవ మధ్యమున కభిముఖులైరి. కుబేరుడు కౌబేరాస్త్రము నివ్వగా, వరుణుడు వారుణాస్త్ర మొసగి, ధార్తరాష్ట్రుల నందర రణరంగమున పరిమార్పగలవని యాశీస్సుల నిచ్చెను. అట్లందరును అస్త్ర

సందోహములతోబాటు ఆశీఃపూర్వకములగు సంతోషవాక్యముల బల్కిరి. ఆనాటి కర్తవ్యము కేవలము అర్జునుని స్వార్థముకాదు. అది దేవతల కార్యము. దుష్టదానవులందరును భూమిపై క్షత్రియులు కాగా వారిని వధించుటకై తపోమూర్తియగు నరుడను ఋషియే అర్జును డగుట జరిగినది. ఆ వృత్తాంతమునే వారందరును అర్జునునకు స్మృతికి దెచ్చి అస్త్రరూపములగు వారి వారి దివ్యతేజములను అర్జునునియందు ప్రోగు పెట్టినారు. అర్జునుడును వారి వారి తేజోంశములను గ్రహించి, లోక పాలుర సందర పూజించి, నిఖిలదేవతాతేజములరాశియై తేజోమండల మూర్తియై విరాజిల్లినాడు. ఇప్పుడర్జును డెవ్వరో మీకు తెలిసినదా? అతడు కేవలము నరుడుకాదు. నరుడను ఋషి. దేవతలందరును అంతర్ధానము కాగా ఇక అర్జునుడు స్వర్గసీమ కేగవలెను. అతనికి శరీరముతోడనే స్వర్లోక గమనమునకు అధికారపత్రము చేతి కందినది. ఇక అతడు వయనించవలగు దేవేంద్రుని దివ్యస్యందనము రావలెను. ఆ ఘట్టము రేపు —

# అర్జునుని స్వర్లోకగమనము

మహాశయులారా !

నేటి యుపన్యాసము నం దద్భుత కథాంశ మొకటి ముఖ్యమై రాగలదు. అదియు మహాభారతములోనిదే. కాని అది ప్రధాన కథాంశము లోని అంతర్భాగము. అయ్యును భారతీయ చక్రవర్తుల కెల్లరకును మకుటాయమానమై వెలసిన ఒక మహా చక్రవర్తియొక్క ఉపాఖ్యానము. ఆ మహనీయుని ఉపాఖ్యానమును విన్నవారికి కలిదోష మంటదు. కాని ఆ కథాంశము నందతడొక్కడే పాత్రకాదు. ఆ కథ యందు ప్రవర్తిల్లిన కొందరి నామోచ్చారణము కలిదోష విదారకమని పెద్దల మాట.

ఈ శ్లోకమును మీరు వినియే యుందురు.

'కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం'

నలదమయంతుల చరిత్ర నెరుగని వారెవ్వరు ? సంస్కృతమున శ్రీహర్షుడను కవిచక్రవర్తి ఆ రాజర్షి చరితము నొక మహాకావ్యముగా రచన సాగించినాడు. దానినే ఆంధ్ర భాషాయోషామణి కమూల్యా లంకారముగా వన్నెదిద్దిన కవిరాజు శ్రీనాథుడు. ఈతడీ యాంధ్ర నైషధమునకు శృంగార నైషధమని పేరు పెట్టినాడు.

కాని ఆ కథాంశమీ భారతమునం దంతర్భూతమగుటకు సందర్భ మెక్కడ ?

ప్రధానమగు భారత కథాంశమునకు వత్తము.

నిన్న ఇంద్రకీలాద్రియం దర్జునునకు పాశుపతాస్త్ర మెట్లు లభించినదో, లోకపాలురుకూడ అతనికి దివ్యాస్త్రములనెట్లు నొసంగిరో అర్జును దక్కడనుండి ఎక్కడికి పయనము కావలసియున్నదో వివరించినాను.

ఈశ్వరునివలన పాశుపతాస్త్ర మందుకొన్న అర్జునునకు స్వర్లోకమునకు రమ్మని దేవేంద్రుని ఆహ్వానమందినది. మాతలి రథమును తెచ్చుటయు, అర్జునుని స్వర్గమునకు గొనిపోవుటయు జరుగ వలెను.

ప్రకృతమున అర్జును డారథముకొరకే నిరీక్షించుట జరుగు చున్నది. మాతలి దేవేంద్రుని రథసారధి. వియత్తలమునుం డేదియో యొక దివ్యతేజమున వెలుగొందు రథశ్రేష్ఠ మర్జునుని చూపున కందినది. అది దేవేంద్రుని రథము కావచ్చుననియే అర్జును డూహించినాడు. యదార్థమున కదియే. అర్జునుని తర్కము సహేతుకమై సిద్ధినొందినది. ఆ రథశ్రేష్ఠమును అర్జునున కభిముఖమైనది.

దేవతల రథ మెక్కవలెనన్న శుచియై, రథాధిరోహణము చేయవలెను. మాతలి దేవేంద్రుని యాహ్వానము అర్జునున కెరిగించగా అర్జునుడు వెంటనే పవిత్రవాహినియందు మునిగి, శుచియై, తాను తపమాచరించి సిద్ధినొందిన మంధరాద్రికి తన కృతజ్ఞతను దెలిపి, రథము నధిరోహించినాడు. రథము వియత్తల మార్గమున స్వర్గాభిముఖ మైనది.

మంధరాద్రి జడమైనను భారతీయ ఆధ్యాత్మికశాస్త్రమున జడము, కాదు. జడమునకు అధిష్ఠానదేవత చైతన్యము. వృక్షములతోకూడ మహర్షులు తమ కృతజ్ఞతను వెల్లడించి వెళ్ళుట సహజము. అహింసా సిద్ధాంతమున జడపదార్థ మనునదిలేదు.

దేవేంద్రుని దివ్యభవన మదియే, అనునంతటి సమీపమున కా రథమురాగా, అర్జునుని రాకకు నిరీక్షించు సురసిద్ధ సాధ్యగణము అర్జునున కభిముఖమై, అర్జునుని యమేయ పరాక్రమ గుణగణముల వర్ణించుచుండగా, దేవేంద్రుని సభాస్థలియందే మాతలి రథమును నిలిపినాడు.

మన యర్జునుడు దేవేంద్రునకు భూతలమున జనించిన ముద్దు బిడ్డ. ఆ బిడ్డను చూడగనే ఇంద్రుని శరీర మొక్కమారు పులకరించినది. శతమఖుడు అర్జునుని కౌగలించుకొని, తన తొడపైనుంచుకొని, తన పుత్రుని యర్ధాసనమున కూర్చుండబెట్టికొనినాడు.

మహాశయులారా !

అర్జునుని స్వర్గాభిగమన మొక విలక్షణధర్మము. స్వర్గలోక మనగా అమెరికా ఖండముకాదు. స్వర్గమన ఇదియై యుండవచ్చునను వారలకును, ఇదమిద్ధమని నిర్ణయించి చెప్పు భారతీయ చరిత్రలకును చాల యంతరమున్నది. స్వర్గమునకు పోవుటకు మానవ శరీర మర్హము కాదనునది సిద్ధాంతమే. కాని అర్జునుని గమనమునందొక ప్రత్యేకత యున్నది. ఏమది ?

అర్జునుడు దేవేంద్రుని పుత్రుడు. పశుపతి యనుగ్రహమును సంపాదించిన దిట్ట. దేవేంద్రుని యాహ్వానము నందుకొన్నప్పుడే అతని మానవత్వమున కొక ప్రత్యేకత వచ్చినది. అర్జునుడు దివ్యదేహధారి యగునట్లు పరమేశ్వరుడును, పరమేశ్వరునితోపాటు దేవతాబృందము అనుగ్రహించి తమతమ దివ్యాస్త్రములతో స్వర్లోక గమనమును కూడ వరప్రసాదముగ నందించినారు. అతడిప్పుడు దేవేంద్రునకు గూడ సాధ్యముకాని మహత్కార్యముల సాధించుటకే స్వర్గసీమ కేగినాడు.

అర్జునుడు దేవేంద్రుని కోర్కెపై స్వర్గమునం దైదు సంవత్సరములు వసించినాడు. స్వర్గసౌఖ్యముల ననుభవించుటకు కాదు. తండ్రి యాజ్ఞకు బద్ధుడై. ఆ కాలమాతనికి భోగకాలముకాదు. అర్జునుని యునికి తండ్రి భవనముననే కాని దేవేంద్రు డీతని నిక్కడెందుకుంచినాడు? కొన్ని దివ్యాస్త్రముల ప్రయోగోపసంహారముల నర్జునునికి శిక్ష నిచ్చినాడు. అంతేకాదు భావిభారత యుద్ధమునకును, దేవతలకును కొంత సంబంధమున్నదని మీకు చెప్పుచుంటినిగదా! అర్జునుని భావిజీవితమున కేదియో యొక అవసరమునే దేవేంద్రు డూహించి ఒకనాడు పార్థునితో, పార్థా! నీ విక్కడ చిత్రసేనుడను గంధర్వునివద్ద గీత వాయిద్య నృత్యకళా వైశద్యమును సంపాదింపుమని ప్రోత్సహించినాడు. అది మనుష్యలోకమున లేని యపూర్వ గాంధర్వశాస్త్రము.

నృత్యం గీతంచ కౌంతేయ చిత్రసేనాదవాప్నుహి
వాదిత్రం దేవవిహితం నృలోకేయన్న విద్యతే
తదార్జయస్వ కౌంతేయ శ్రేయోవై తే భవిష్యతి'

అర్జునుని హృదయము ధర్మజాదులపై కేగుచు అలజడి చేయుచున్నను సోదరప్రేమ కాతడు బద్ధుడుగాక, విద్యాభ్యాసమున నిమగ్నుడై చిత్రసేనునివద్ద విద్య గరచుచుండెను. చిత్రసేనుడును క్రొత్తవాడుగాడు. అర్జునునకు పూర్వమిత్రుడే కావుననే విద్యా రహస్యముల నెన్నిటినో అర్జునున కనతికాలముననే యుపదేశించినాడు. కాని పార్థుని హృదయము నందప్పుడు కుంతియు, ధర్మజాదులును స్మృతికి రాకపోలేదు. దుశ్శాసనాదుల దుష్కృత్యములును అర్జునుని యంతఃకరణమున కలకబారగా కుందిన మనసుతోడనే అతడు దేవలోకమున కాలమును వెళ్ళదీయుచుండెను.

అది యొకనాటి రాత్రికాలము. అచ్చరమిన్నలయందెల్ల మిన్నయై వన్నెకెక్కిన దివ్యకాంత ఊర్వశి.

అర్జునుని యపూర్వతనూ విలాస సంపదలా భూలోక కాంతల మనసుల కలతబెట్టుటకాదు, దేవలోకమున కమూల్యాలంకారమై ఎన్నె కెక్కిన ఊర్వశి హృదయమునుకూడ కదిలించినవి.

ఊర్వశి ఆనాటి రాత్రికాలమున అర్జునుని మందిరమున కేతెంచినది. ద్వారపాలకులామె రాకను అర్జునున కెరిగింపగా అర్జునుని హృదయము ఊర్వశి రాకను శంకించినది. అయ్యును ద్వారము తెరచినాడు. అతని సంశయము మరింత దృఢమైనది. కావున వెంటనే ఊర్వశి పాదములపై వ్రాలి అభివాదన గావించినాడు. ఊర్వశి విశ్చేష్ట యైనది.

యదార్థమున కూర్వశికి అర్జునుని యందొకవిధముగ అనురాగమున్నను, ఈ రాత్రి రాకకు కేవల మామె యనురాగమే కారణము కాదు.

ఒకనాడు దేవేంద్రుని సభాస్థలియందు నృత్యప్రదర్శనము గావింపబడుచున్నది. అర్జునుడును అందొక పాత్రయే. ఆ సందర్భమున అర్జునుని దృష్టి యూర్వశిపై విస్తరించగా దేవేంద్రుడు అర్జునుని శంకించినాడు. చిత్రసేనుడు అర్జునునకు గురువుకదా? ఆ చిత్రసేనుని దేవేంద్రుడు రావించి, అర్జునునకు ఊర్వశి యందనురాగ మున్నదని చెప్పి, నీవెట్లయినను ఊర్వశిని అర్జుని యొద్దకేగి అతని కోర్కెను తీర్చునట్లు చేయుమని ఆజ్ఞాపించినాడు. చిత్రసేనుడట్లే యూర్వశి వద్ద కేగి అర్జునుని గుణగణముల వర్ణించి, ఆమె మనసును దృఢపరచినాడు.

అర్జునునియందు సహజానురాగమును దాచుకొనియున్న ఊర్వశి మరింత కామమున కగ్గలయై అర్జునుని వలన భోగముల నపేక్షించినది. కావుననే ఆనాటి రాత్రి దివ్యాలంకారభూషితయై, చంద్రోదయకాల మామెను మరింత ప్రేరణ గావింపగా పూవిల్తు పూవుటమ్ములకు గురియై, మందాకినీతీర మణిమయ వేదికల యర్జునునితో విహారక్రీడల భావించుకొనుచు, ఇల్లు కదలి అర్జునుని మందిరమున కేగినది. కాని, అర్జునుడు కాముకుడుకాడుగదా ! ఊర్వశిని చూచిన వెంటనే ఆమెకు వందన మాచరించినాడు. ఊర్వశి విశ్చేష్టురాలైనది. అర్జునుని యభివాదనమున స్తబ్ధత నొందిన ఊర్వశి గతియేమి ? చల్లకువచ్చి ముంత దాచనేల యని అర్జునునకు తన హృదయము విప్పి చెప్పినది. చిత్రసేనుడు తనదగ్గరకు వచ్చుటకూడా నిర్దుష్టముగా చెప్పినది.

మనస్సు చాలా చెడ్డది. అది సత్యమును గుర్తెరుగదు. భ్రాంతిని పొందుటయందు దానికదియే సాటి. దేవేంద్రుని యెదుట అర్జునుడూర్వశిపై దృష్టులు బరపి వికసితముఖుడై చూచినది యదార్థమే. కాని దేవేంద్రు డూహించిన ఊహాగానమునకు మాత్ర మాతని దృగ్విలాస మాలంబనమైలేదు.

ఊర్వశియందే పురూరవ చక్రవర్తి భరతవంశము నుద్భవింప జేసినాడు. కావున తన వంశ విస్తారమున కామె కారణమని మాతృస్థానమున ఊర్వశియందు చూపు నిలపగా దేవేంద్రు డిట్లు భావించి చిత్రసేనునిద్వారా ఊర్వశిని ప్రేరేపించినాడు. ఈ విషయమంతయు ఊర్వశి యర్జునుల సంభాషణలయందు స్పష్టమైనది.

అర్జునుడు తనకట్లు నమస్కారము గావింపగా, ఊర్వశి తన నిజ వృత్తాంతమును చెప్పి తన్ను కామోపభోగముల తనుపుమని ప్రార్థించినది. అర్జునుడు తన నిజ హృదయము నామెకు విన్నవించి,

నీవు నాకు కుంతీదేవికిని, శచీదేవికిని సమానురాలవని వినయ వినమ్ర భావముల ప్రకటించుచు ఆమె కోరిన కోర్కెకు రెండు చెవులను మూసి కొనినాడు. ఇది యా రాత్రి జరిగిన సన్నివేశము.

'ఆశాబంధః కుసుమసదృశః ప్రాయశో హ్యంగనానాం'

ఆశాబంధము కుసుమ సదృశమట. ఆ బంధ మిట్టె తెగి పోవును. అంగనల యందది తరుచుగా యుండునని కాళిదాసు పలికినాడు.

ఊర్వశి తన భంగపాటున కోర్వలేకపోయినది. అయ్యును స్వర్లోకమునకు మానవ ధర్మములు వర్తించవన్నది. అర్జునుడు తాను మానవ ధర్మము ననువర్తింపవలసినవాడనని సమాధాన మిచ్చెను. కాని లొంగలేదు. ఊర్వశి కర్జునునిపైగల యనురాగమంతయు క్రోధముగా మారినది. ఆ క్రోధము శాపరూపమున పరిణమించినది. ఇట్లు శపించినది.

'తవపిత్రాభ్యనుజ్ఞాతాం స్వయంచ గృహమాగతాం
యస్మాన్మాం నాభినందేదాః కామబాణవశంగతాం
తస్మాత్త్వం నర్తనః పార్థ స్త్రీమధ్యేమాన వర్జితః
అపుమానితి విఖ్యాతః షండవద్విచరిష్యసి'

నీ తండ్రి యనుజ్ఞను వడసి, నాకు నేనై నీ గృహమునకు రాగా, కామబాణ పీడితనగు నన్ను అవమానించితి గావున నీవు పౌరుషమును కోల్పోయినవాడవై స్త్రీ జన మధ్యమున నర్తకుడవై పోవుటయేగాక, నపుంసకుడవను పేరునొంది షండునివలె విహరింతువుగాక. పార్థా! నీ యవివేకమున కిదియే ఫలితమన్నట్లు శపించినది.

అర్జును నిట్లు శపించి, ఇక్షుశరాసనసాయకవ్యధాభిన్నయై కోపవేగమున మందగమనమును వీడి కొలదిసేపటికే తన యిల్లు చేరినది. ఊర్వశి కథాభాగ మట్లయినది.

శాపపీడితుడైన అర్జును దేమయ్యెను ?

తన కథ యిట్లు నడచినదని చిత్రసేనునివద్ద కేగి చెప్పెను. చిత్రసేనుడు దేవేంద్రునకు తెలిపెను. దేవేంద్రుడు తన కొమరుని రావించి, అతని ధైర్యస్థైర్యముల నుగ్గడించినాడు. ఋషులుకూడా చలించునట్టి ఘట్టమున, హిమవంతునివలె ధైర్యము నొందిన అర్జునుడు గదా ! ఇనపకచ్చడాలు కట్టిన మునిముచ్చుల నతిక్రమించిన మేటి వీరు డర్జునుడు.

సరి ! అర్జునుని వీరత్వ మట్లుండగా షండత్వము గతేమి ? ఆ ఘట్టమును దేవేంద్రుడు పరిష్కరించినాడు. ఎట్లు ?

అజ్ఞాతవాస సంవత్సరమున ఈ శాపమును గ్రహించుట కనుగ్రహించినాడు. అచ్చట పుంస్త్వమును కోల్పోయి నృత్యములను చెప్పుటవసరముగదా ! దేవరహస్యముల నెవ్వరెరుగుదురు ? మహాభారత యుద్ధమున కవసరమని ఘటోత్కచుని సృష్టించిన దేవేంద్రు డీ శాప వ్యాజమును పాండవుల అజ్ఞాతవాసము కొరకై నిర్మించుటలో ఆశ్చర్యమేమున్నది ? మూలమిట్లున్నది.

'ఋషయోపిహి ధైర్యేణ జితాస్తే మహాభుజ
యత్తు దత్తవతీ శాపమూర్వశీ తవమానద'
సచాపితేర్థ కృత్యాత సాధకశ్చ భవిష్యతి
అజ్ఞాతవాసో వస్తవ్యో భవద్భిర్భూతలేనఘ
వర్షే త్రయోదశేవీర తం తత్ర క్షపయిష్యసి
తేన నర్తనవేషేణ అపుం స్త్వేన తధైవచ
వర్ష మేకం విహృత్యైవ తతః పుంస్త్వమవాప్స్యసి.

అర్జును నిట్లు శపించి, ఇష్టశరాసనసాయకవ్యథాభిన్నయై కోపవేగమున మందగమనమును వీడి కొలదిసేపటికే తన యిల్లు చేరినది. ఊర్వశి కథాభాగ మట్లయినది.

శాపపీడితుడైన అర్జును డేమయ్యెను ?

తన కథ యిట్లు నడచినదని చిత్రసేనునివద్ద కేగి చెప్పెను. చిత్రసేనుడు దేవేంద్రునకు తెలిపెను. దేవేంద్రుడు తన కొమరుని రావించి, అతని ధైర్యస్థైర్యముల నుగ్గడించినాడు. ఋషులు కూడా చలించునట్టి ఘట్టమున, హిమవంతునివలె ధైర్యము నొందిన అర్జునుడు గదా ! ఇనపకచ్చడాలు కట్టిన మునిముచ్చుల నతిక్రమించిన మేటి వీరు డర్జునుడు.

సరి ! అర్జునుని వీరత్వ మట్లుండగా షండత్వము గతేమి ? ఆ ఘట్టమును దేవేంద్రుడు పరిష్కరించినాడు. ఎట్లు ?

అజ్ఞాతవాస సంవత్సరమున ఈ శాపమును గ్రహించుట కనుగ్రహించినాడు. అచ్చట పుంస్త్వమును కోల్పోయి నృత్యములను చెప్పు టవసరముగదా ! దేవరహస్యముల నెవ్వరెరుగుదురు ? మహాభారత యుద్ధమున కవసరమని ఘటోత్కచుని సృష్టించిన దేవేంద్రు డీ శాప వ్యాజమును పాండవుల అజ్ఞాతవాసము కొరకై నిర్మించుటలో ఆశ్చర్య మేమున్నది ? మూలమిట్లున్నది.

'ఋషయోపిహి ధైర్యేణ జితాస్తే తే మహాభుజ
యత్తు ద త్తవతీ శాపమూర్వశీ తవమానద'
సచాపితేర్థ కృత్తాత సోదకశ్చ భవిష్యతి
అజ్ఞాతవాసో వ స్తవ్యో భవద్భిర్భూతలేనమ
వర్షే త్రయోదశేవీర తం తత్ర క్షపయిష్యసి
తేన న ర్తనవేషేణ అపుం స్త్వేన తథైవచ
వర్ష మేకం విహృత్త్యైవ తతః పుం స్త్వమవాప్స్యసి.

పై శ్లోకములలో 'సచాపితేర్థ కృత్తాత' ఆ శాపముగూడ నీకు ఉపకారమే కాగలదని చెప్పుటచేత దేవేంద్రుని దృష్టియందీ శాపము నుంచుకొనియే ఊర్వశిని పంపినాడని తేలుచున్నది.

ఇక ఒక్కమారు ధర్మజాదులున్న అరణ్యమున కేగుదము. వారు పార్థుడు పాశుపతాస్త్ర సంపాదనమున కేగినది మొద లింతవరకును ఆతని వృత్తాంతము నెరుగరు. వారెంతయో కుందుచుండిరిగాని వారికి స్వర్గలోకములోని వార్తలందించున దెవరు ?

ఆనాడు భూత భవిష్యత్కాలముల గుర్తెరుగుచు, ధర్మ సామ్రాజ్యముల స్థాపించి, లోక కల్యాణమునే ఆత్మ కల్యాణముగ భావించు మహర్షులే స్వర్గ మర్త్య పాతాళాది లోకముల కవ్యాహతము లగు యోగశక్తులచే చరించుచుండెడివారు. వారే ఆనాటి నిజ వార్తా పత్రికలు.

ఒకనాడు లోమశుడను మహర్షి స్వర్గలోకమున కేగగా దేవేంద్రుని అర్థాసనమునం దర్జునుని చూచినారు. ఇదేమి ? మానవు డీలోకమున కెట్లేతెంచి నీ యర్ధాసనము నలంకరించెనని దేవేంద్రుని ప్రశ్నించినారు.

ఈతడు నా యంశమనియు, అసలు నరుడను ఋషియనియు, కృష్ణార్జునుల జంటను వర్ణించి, అర్జునుడీ స్వర్గమునందుండుటను ధర్మ జాదుల కెరిగింపుమని లోమశ మహర్షికి దేవేంద్రుడు విన్నవించగా, ఆ లోమశ మహర్షి భూలోకమున కేతెంచి, కామ్యకవనము నందున్న పాండవులకు అర్జునుని వృత్తాంతమును తెలియజెప్పవలెను. అంతేకాదు, దేవేంద్రుడు లోమశ మహర్షివారిని మరియొక కోరిక కోరినారు. ఏమనగా : పాండవజ్యేష్ఠునకు తీర్థయాత్రల చేయించి, పవిత్ర నదీ నదముల స్నాన దానముల చేయింపుమనికూడ ప్రార్థించినాడు. పార్థుడు

మరల భూలోకమున కెప్పుడు రాగలడను ప్రశ్నకు సమాధానముగా, నివాత కవచులను రాక్షసుల వధించుటయను మహాకార్య మొకటి కలదనియు, అది అర్జునునివలననే కావలెనని చెప్పి, పాండవుల కడకు లోమశ మహర్షిని పంపినాడు.

ఇది స్వర్గలోకమున అర్జునుడున్న సమయమున దేవేంద్రు డందించిన సందేశము.

లోమశ మహర్షివా రింకను భూలోకమునకు రాలేదు. పాండవుల కింకను అర్జునుని గురించిన విషయము తెలియలేదు. ఆ కథ నట్లుండనిండు.

అర్జునుని పాశుపతాస్త్ర ప్రాప్తియు, స్వర్గలోకాభిగమనమును వ్యాసమునీంద్రుని వలన ధృతరాష్ట్రునకు తెలిసినది.

ధృతరాష్ట్రుని దుఃఖము నెవ్వడు వర్ణింపగలడు? అసూయా గ్రస్తమగు నాతని హృదయము పాండవుల యపూర్వ ప్రతిభను తలచి దుఃఖించెనేగాని, దుర్యోధనుని యందలి మోహమును మాత్రము వదలలేదు. సంజయునితో చెప్పుకొని ధృతరాష్ట్రు డేడ్చుచుండును. ఏమని? అసూయాగ్రస్తుని దుఃఖవాఙ్మయమును గురించిన వర్ణన మనకేల? మనము పాండవులకడకు పోదము. ఆ మహనీయులవద్ద కెవ్వరైన బ్రహ్మణ్యులు వచ్చుచుందురు. ధర్మజుడు వారి నాదరించి, తమను నిమిత్తముగా లోకకల్యాణమగు పుణ్యకథా సంప్రశ్నమున పుణ్యకథల వినుచుండుడును.

మీకీనాటి యుపన్యాసమున మహోత్కృష్ట కథావిశేషము నొక దానిని వినిపింతుననియు, అది నలోపాఖ్యానమనియు, ఆ యుపాఖ్యాన మీ ముఖ్యకథాంతర్భాగమనియు చెప్పితినికదా? నలోపాఖ్యాన ప్రాదుర్భావ మెట్లయినదో వినుడు.

# నలోపాఖ్యానము

అర్జునుడు పాశుపతాస్త్రమునకై పయనించినది కామ్యకవనము నుండి యని మీకు తెలియును. నేటికైదు సంవత్సరములు గడచినవి. అర్జునుని వియోగము భరింపరానిది. అర్జునుని పాశుపతాస్త్రమునకై ప్రేరేపించి పంపినది ధర్మజుడు. అతని గంభీర హృదయ మెవ్వరికిని అర్థమగునదికాదు. ధర్మరూపమగు నాతని హృదయ కాఠిన్యమునుకూడ నెవ్వరును భేదింపజాలరు.

ఒకనాటి ఘట్టము —

ద్రౌపదితోకూడి పాండవులు నలుగురును విశ్రాంతి నొసంగు నొక బయలుప్రదేశమున కూరుచుండగా అర్జునుడు స్మృతిపథమునకు వచ్చినాడు. ద్రౌపది శోకించినది. నకుల సహదేవులకును దుఃఖ మాగలేదు. ఈనాడు అర్జునుని వియోగమునకు కారణమెవ్వరు? ధర్మజాడే. అతని ద్యూతమే ఈ వనవాస దుఃఖములకు మూలము. అగుగాక. ఎవ్వరా ధర్మజానితో ఈ పలుకులను పలకగలరు? భీముడు వాయుపుత్రుడు. వీచిన అతడే వీచవలెను. భీముడే ఆనాడు కదలినాడు. ధర్మజుని ద్యూతవిధానమును విమర్శించినాడు. ఏమని? ద్యూత్యమున కాహ్వానించినచో రానని చెప్పుటకు వీరధర్మముకాదని మీ యూహ. ద్యూతపీఠమున గెలుచుట మీకు సాధ్యముకాని పని. దుర్యోధనునకు ద్యూతక్రీడయందు రుచి దొరకినది. శకుని చావలేదు. దుర్యోధనునకు కొరతలేదు. మన వనవాసమున కంతమెక్కడ? పదమూడు సంవత్సరములు గడవగా మరల ద్యూతమునకు దుర్యోధను డాహ్వానింపగా, తాము ద్యూతమున కేగుచుండగా మాగతి అరణ్యములుగాక రాజ్యసీమ లెక్కడివి? అవి.

ఇది భీముని సూటిప్రశ్న - అవును. ఈ ప్రశ్నలో భీముని హృదయమేమి ? కపటమున ద్యూతమునందు దుర్యోధనుడు మనల జయించెను కావున మనమును అతని నట్లే జయించుట కర్తవ్యమని అతని సమాధానము.

'నికృత్యా నికృతిప్రజ్ఞా హంతవ్యా ఇతి నిశ్చయః
నహి నైకృతికం హత్వా నికృత్యా పాపముచ్యతే'

భీముని దృష్టియందున్న కపటమేమి ? పదమూడు సంవత్సరము లను గడపకయే యుద్ధయత్నముచేసి, దుర్యోధనుని హతమార్చవలెనని. యుద్ధయత్నము చేయుటలో యిక్కడ కపటోపాయమేమున్నది ? సంవత్సరమను పదమునకు 'రోజు' అను అర్థమున వేదము వాడినది. ఆ అర్థమునే మనమును చెప్పి, యుద్ధరంగమును నిర్మింతమని చెప్పినాడు.

'అహోరాత్రం మహారాజ తుల్యం సంవత్సరేణహ
తథైవ వేదవచనం శ్రూయతే నిత్యదా విభో'

ఈ విషయమును ధర్మజు డొప్పలేదు. వేదమునందు వాడు పదములకు ప్రకరణాంశముచే అర్థభేదము లుండునని సూచించుచూ——

'యత్వమా భాషసే పార్థప్రాప్తఃకాల ఇతిప్రభో
అనృతం నోత్సహేవక్తుం నహ్యేతస్మిమ విద్యతే'

నే నెన్నడును అబద్ధమాడుట కుత్సహించువాడను కానని భీముని వాదమును ఒప్పలేదు. వారి వివాద హృదయవేదన లిట్లుండగా అదే సమయమున బృహదశ్వ మహర్షివా రరుదెంచినారు.

మనము మహాభారతమున పాండవుల కష్టదప్పుడు కలుగు ధర్మమీమాంసలలోని విషయముల గమనించినచో భారతీయ ధర్మము లెంత సూక్ష్మములై యున్నవో తెలియుచున్నవి. శ్రుతిస్మృతులలోని

విషయములకు సమన్వయముల కుదిర్చినదే పూర్వ మీమాంసాశాస్త్రము. అట్లే మోక్షపురుషార్థమునకూడ. కథకు పోదము.

బృహదశ్వ మహర్షివారి ఆగనము పాండవుల కేదియో ఒక అభ్యుదయము నందించుటకేగాని వేరు కాదు.

బృహదశ్వ మహర్షికి ధర్మజుడు పాద్యార్ఘ్యముల నిచ్చి, ముని వర్యా! మేమీనాడు పడు నిడుములు ద్యూతమూలములు. ఇట్లెవ్వరైన పూర్వ మనుభవించినారా? అని ప్రశ్నించినాడు.

అనాడును మావంటి దురదృష్టవంతు లెవ్వరైన కలరా? అను ప్రశ్నకు సమాధానముగ బృహదశ్వ మహర్షి నలదమయంతుల చరిత్రను చెప్పినాడు. నలోపాఖ్యానమున కిదియే ప్రాతిపదిక.

ఈ కథావస్తువునందు కేవల భారతమందలి విషయములేకాక, శ్రీహర్షుని మహాకావ్యము నుండియు, ఆంధ్రనైషధము నుండియు కూడ కొన్ని విశేషముల వివరింతును.

మీరు వినబోవునట్టి నలచరిత్ర మీనాటిదికాదు. అతడు కృత యుగాలంకారభూతుడు. నాగరికతా పరిణామమునుబట్టి చరిత్రలకు కాలమును నిర్ణయించు నిర్ణాయకు లీచరిత్రలోని నాగరికతను నాటినదని నమ్మలేకపోవచ్చునుకూడ. అది వారి భారతీయతలోని లోపము.

నలుని కథానాయకునిగా గ్రహించిన శ్రీహర్ష పండితుడు నలోపాఖ్యానమును విన్న దేవతలకు క్షీరసాగర మథన సంజనిత యమృతము రుచించలేదని చెప్పినాడు.

'నిపీయయస్య క్షితిరక్షిణః కథాః
స్తథాద్రియంతే నబుధాస్సుధామపి'

మూలమున వ్యాసభగవానులు —

'ఉపపన్నో గుణైరిష్టై రూపవానశ్వకోవిదః'

ఆతనియందున్న ప్రతిగుణమును సామాన్య మానవాతిరిక్తమై యున్నదని 'ఉపపన్నః' అను పదమున తెలిపినారు. 'ఉపపన్నః' 'అతియుక్తః' అని నీలకంఠీయము. మూలమునందలి 'రూపవాన్' అను వర్ణనను శ్రీహర్షుడు తన కావ్యమున చక్కగా వివరించినాడు.

నాటి మహారాజులు పాశ్చాత్యఖండముల కేగకనే విద్వాంసులైరి. నలుని విద్యాతిశయమును గురించిన మాటను పరిశీలింపుడు.

'అధీతిబోధాచరణ ప్రచారణై
ర్దశాశ్చతస్రః ప్రణయన్నుపాధిభిః
చతుర్దశత్వం కృతవాన్ కుతస్స్వయం
నవేద్మి విద్యాసు చతుర్దశస్స్వయం'

ప్రాచీనార్య సంస్కృతినంతను విభాగించుచో పదునాలుగుభాగము లైనవి. అవి :—

నాలుగు వేదములు, ఆరు వేదాంగములు, మీమాంసా న్యాయ శాస్త్రములు, ధర్మశాస్త్రములు, పురాణములు అను పేర్లతో వ్యవహరింపబడినవి. ఈనాటి ప్రపంచ సారస్వతమంతయు ఈ పదునాలుగు భాగములలోనే యిమిడియున్నది. ఏ యే ఖండముల, నే యే కాలములందే యే మాసముల నే యే సమయములందుదయించినను భాస్కరు డొక్కడేగాని వేరొకడు లేడు. మంచుకొండలనానియున్న దేశమునందు సూర్యరశ్మి మందముగా ప్రసరించగా, అదేకాలమున మరియొకచోట విస్తారము కావచ్చును. తారతమ్య మదియే అట్లే నాగరికత, విద్యలు కూడ. అట్టి పదునాలుగు విద్యలకును నలుడు నాలుగు దశలను కల్పించినాడట. ఏమా దశలు ? చదువుట, చదివినదాని నర్థముగా వించుకొనుట, తెలిసినదాని ననుష్ఠించుట, తాను పఠించినదానిని ఒరులకు చెప్పుట. ఇంతకంటె విద్యా

వ్యాప్తిని చేయుటకు మార్గము లేనాడు మాత్ర మేమున్నవి? ఈ విద్య లిట్లుండ అశ్వశాస్త్ర మాతనికి ప్రత్యేకవిద్యయని వ్యాసులు వర్ణించినారు. 'అశ్వకోవిదః'

అతడు చక్రవర్తి. అనగా నలుదిక్కులయందును ఆతని విజయ పతాకము లెగురుచుండును. ఆతని సామ్రాజ్యమున ధర్మము కుంటు పడక నాలుగు పాదములును కలిగియుండెనని వర్ణించబడినది. దీనినే శ్రీహర్ష డొకవిధమగు ఆలంకారిక వచనమున చెప్పినాడు.

'భువం యదేకాంఘ్రి కనిష్ఠయా స్పృశ
న్దధా వధర్మోఽపి కృశ స్తప స్వితాం'

అతని సామ్రాజ్యమున అధర్మముకూడ ఒంటికాలిపై నిలచి, చిటికెనవ్రేలును మాత్రము భూమిపై నిలిపి, తపస్సు చేయుటచే ఆ అధర్మము కృశించి యున్నదట. అనగా అధర్మమే ధర్మాచరణమును గావింప ధర్మమును గురించేమి చెప్పవలెను? నలమహారాజుయొక్క అధర్మముకూడ శాసింపబడుచున్నదని యర్థము.

అట్లే ఆతనికీర్తి ప్రతాపములనుగూడ శ్రీహర్షుడు మహోత్కృష్ట ముగ వర్ణించినాడు.

'తదోజస స్తద్యశస స్థితా విమౌ
వృథేతిచిత్తే కురుతే యదా యదా
తనోతిభానోః పరివేషకైతవా
త్తదావిధిః కుండలినాం విధోరపి'

నలుని కీర్తిప్రతాపముల ముందు సూర్యచంద్రుల కాంతులుకూడ చాలవని చెప్పుటకై బ్రహ్మ తనకు నలుని కీర్తిప్రతాపము లెప్పుడెప్పుడు జ్ఞాపకమునకు వచ్చుచుండెనో అప్పుడప్పుడల్ల సూర్యచంద్రుల కాంతులిక

భూమిపై నక్కరలేదని పరివేషమను మిషచే నా సూర్యచంద్రులను కుండలీకరణమును చేసియుండెనని యుత్ప్రేక్షించినాడు.

(ఒక్కొక్కప్పు డాకాసమున సూర్యునిచుట్టును. చంద్రుని చుట్టును సున్న చుట్టినట్లు కనబడుచుండును. దానిని వరివేషమందురు.)

అట్లే దాతృత్వమును వర్ణించుచు కల్పతరువు నతిక్రమించెనని చెప్పి యాచకుని ముఖమునం దీతడు దరిద్రుడనియున్న బ్రహ్మయొక్క వ్రాతను దీసి, మాటమాత్రమున యాచకుని దారిద్ర్యమును తొలగించుటచే బ్రహ్మయొక్క వ్రాతగూడ తొలగింప సమర్థుడని తెలిపినాడు.

ఇట్లు చెప్పుట కవియొక్క చమత్కారము. దీనినే అతిశయోక్తి యందురు.

పర్యవసాన మాతడు దాతయని చెప్పుటే.

వ్యాసభగవానులును అతని విద్యావిశేషములను, గుణ విశేషములను వర్ణించకపోలేదు.

'అతిష్ఠన్మనుజేంద్రాణాం మూర్ధ్ని దేవపతిర్యథా
ఉపర్యుపరి సర్వేషాం ఆదిత్య ఇవ తేజసా'
'బ్రహ్మణ్యో వేదవిచ్ఛూరో నిషధేషు మహీపతిః'

అతడు బ్రాహ్మణ్యుడును, వేదవిదుడునని వర్ణించుట ఇందు గమనార్హము. భారతీయ చక్రవర్తులందరును ఆధ్యాత్మిక రంగమునం దగ్రగణ్యులు గాక సామ్రాజ్య పీఠముల నధిష్ఠించ లేదు. అది యట్లుండ అట్టి చక్రవర్తులకు పట్టమహిషిగా నుండదగు నారీమణి కొక ప్రత్యేకత లేనిచో రాజసంతతికి భ్రష్టత్వము రాకతప్పదు. కావుననే భారతీయ చక్రవర్తుల కథాంశమునందు పట్టమహిషులు కాదగు నాయికా ప్రభావముగూడ వర్ణితమగుచుండును. అదియే మహాభారతము

నందలి నలదమయంతుల చరిత్రలోని యంశము. లేకున్న వ్యాసులు దమయంతి వంశ చరిత్ర నేల వ్రాయుదురు ?

దమయంతి విదర్భదేశాధిపతియగు భీమరాజుకూతురు. భీమునకు ముగ్గురు పుత్రులును ఒక కన్యకామణియునని చెప్పుచు, వారందరును దమనుడను మహర్షి యనుగ్రహమున కలిగిరని చెప్పినాడు. రాజదంపతులు సంతానమునకై మహర్షిని సేవించగా అతనికి అనుగ్రహము కలిగినది. దమ, దాంత, దమనులనువారు పుత్రులు. కన్యకకు దమయంతి యని పేరు.

ఆమె సౌందర్య మిట్లు వర్ణింపబడినది.

'అతీవ రూపసంపన్నా శ్రీరివాయత లోచనా
నదేవేషు న యక్షేషు తాదృగ్రూపవతీ క్వచిత్
మానుషేష్వ పి చాన్యేషు దృష్టపూర్వా థవా శ్రుతా'

దమయంతివంటి రూపసి దేవతలయందుగాని, యక్షులయందుగాని లేదట. మనుష్యులయందును ఈమె సౌందర్య మపూర్వమేనట ఆమెను మహాలక్ష్మి స్వరూపముగా వ్యాసులు చెప్పినారు.

ఈమె సౌందర్యమును వర్ణించిన శ్రీహర్షుడు దమయంతి ముఖమండలమునందలి యాహ్లాద గుణమును బహు సుందరముగా వర్ణించినాడు.

బ్రహ్మ దమయంతియొక్క ముఖమండలమును నిర్మించుటకై చంద్రమండలమునందే రంధ్రము గావించి, చంద్రమండల సౌందర్యమునే గైకొనినాడట. అదెట్లు నిర్ణయమైనది ? చంద్రుని కళంకము మన కగపడుటకు కారణ మదియేనట. ఆ మండలమునకున్న రంధ్రము నుండి నల్లనైన ఆకాశమే కళంకమై మన కగపడుచున్నదట.

భారతీయ కావ్య వాఙ్మయము భావములను మల్చి, ప్రకృతిలోని గుణములను వర్ణించుటలో ముందంజ వేసినది. ఆంగ్లకవివరుల నాటకములనో కావ్యములనో చదివి మురియుటకాదు. మన భావప్రపంచము వైపుకు ఒక్కమారు మరలచో గీర్వాణవాణి విలాసములలోని తళుకు బెళుకులు ఆత్మానందరసము నందించగలవు సర్వజనాహ్లాదకత్వమను గుణము అఖండాత్మ స్వరూపము. ఆ చిహ్నము సృష్టి ఖండమున చంద్రబింబమున ప్రదర్శింపబడుచున్నది. ఆ ప్రాకృత సౌందర్యమును చెప్పదలచియే శ్రీహర్షుడు దమయంతిని అట్లు వర్ణించినాడు. మహాకావ్యములందలి నాయికా నాయకులు భగవదంశ సంభూతులగుటచే వారి అమానుష సౌందర్యగరిమల ప్రాచీన కవులు వర్ణించుట జరిగినది. నలదమయంతుల చరిత్రయందొక ఉదాత్తత్వమున్నదన్న భావము ననే శ్రీహర్షుడు హంస దౌత్యమునను, హంస సంభాషణమునందును కొన్ని వర్ణనలను చేసినాడు. ఆ యా స్థలములయందు ఆ యా ధ్వనులను వివిపింతును. ప్రస్తుతమున దమయంతి వర్ణనమున శ్రీహర్షుని భావసౌందర్యమునం దొక యంశమును చవిచూపినాను. ఇక్కడ కావ్యమంతయు వర్ణించుట నా హృదయముకాదు. నలుని సౌందర్యమును అట్టిదే.

నలుని ముఖమునందలి చిరునగవు చంద్రుని జయించగా నేత్ర సౌందర్యము పద్మసంపదను జయించినదట ఇక అతని ముఖ సౌందర్య నేత్ర సౌందర్యములను చెప్పుటకు పదార్థములేవి? అందువలన నలుని సౌందర్య ముపమాన రహితమైనదని వర్ణించినాడు.

'సరోరుహం తస్య దృశైవ నిర్జితం
జితాస్మితేనైవ విధోరపి శ్రియః

కుతఃపరం భవ్యమహో మహీయసీ
తదాననస్యో స్సమితౌ దరిద్రతా'

ఇట్లున్న యా నలదమయంతులు ఒకరి గుణ రూప సౌందర్యముల నొకరు తెలిసికొని ఒకరినొకరు తమ తమ యంతఃకరణల వరించుకొనిరట. నలునకా దమయంతి యందలి కోరిక విజృంభించగా విరహమును భరింపజాలక తన అంతఃపుర సమీపమునందలి యుద్యాన వన విహారమున కేగినాడు. ఆ ఉద్యానవనమునందలి లతానికుంజములను, ఫలవృక్షములను దర్శించుచు కాలమునుగడుపుచుండగా ఆ వనమునం దొక తటాకమును, ఆ తటాకమునం దొక హంసయు అతని కంట బడినది. ఆ హంస నలదమయంతులమధ్య రాయబారమును నడపినది.

ఈ కథ భారతమునందు చాల సంగ్రహముగనే యున్నను శ్రీహర్షుడీ ఘట్టమున నతిరమణీయముగా వర్ణించినాడు.

ప్రాచీన కవులు కావ్యములందు చేయు వర్ణనలం దనేక శాస్త్ర మర్యాదల ప్రవేశపెట్టుచు భారతీయ సారస్వత రహస్యముల నెన్నిటినో ప్రదర్శించుచుదురు. శ్రీహర్షు డుద్యానవనమందలి దాడిమీవృక్షములను, వాటి యందు వ్రేలాడు దానిమ్మలను వర్ణించుచూ వృక్షదోహదశాస్త్రమునందు వర్ణించినాడు. నాయికానాయకుల అవయవ సౌందర్యమును వర్ణించుటలో కేవలము శృంగారరసము నొలికించి పాఠకులను కులికించుట వారి ఆశయము కాదు. మహానాయకుని సాముద్రికమును, నాయకి సాముద్రికమును చెప్పుట ఆ వర్ణనల కాశయము.

దానిమ్మ పండ్లను వర్ణించుచూ దమయంతి స్తనమండలములకు పోల్చినాడు. వాల్మీకి మహర్షివారు సీతామహాసాధ్వి యురోజములను తాళఫలములవలె నున్నవని వర్ణించినాడు. అద్వైతాచార్యులగు శంకరులు

సౌందర్యలహరియందు అద్వితీయ బ్రహ్మతత్త్వమైయున్న దేవీ సౌంద ర్యము సల్లే శృంగారముగ వర్ణించినారు.

మీకీ ఘట్టమున శ్రీహర్షుడు దానిమ్మపండ్లను వర్ణించిన వర్ణనను వినిపించు టవరము

'విదర్భ సుభ్రూ స్తన తుంగ తాప్తయే
ఘటానివా పశ్యదలం తపస్యతః
పలాని ధూమస్య దయానధోముఖాన్
స దాడిమే దోహద ధూపనిద్రుమే.

దానిమ్మలు చెట్లనుండి క్రిందకు వ్రేలాడుచున్నవి. వాటికి ముఖములు క్రిందికి యుండుట సహజము. ఎప్పుడైననూ అకాలములందు పుష్పములను గాని ఫలములనుగాని పెంపొందింపవలెనన్న కొన్ని కృత్రిమ యెరువులను వేయవలెను. అట్లు చేయుటకు వృక్షదోహద శాస్త్రములోని విషయము. దానిమ్మలు పెద్దయాకృతి గలవి కావలెనన్న ఆ కాయలకు మేక మాంసమును, మేక పెంట్రుకలను ధూపము వేసిన బాగుగా ఎదుగును. అంతేకాదు. మేక మాంసమును చెట్టు మొదట వేయుటయు అవసరమే.

మేషామిషాంబు సంసేవక స్తత్కేశామిష ధూపనం
శ్రేయానయం ప్రయోగోహి దాడిమీ ఫల వృద్ధయే

ఈవిషయమునే పైశ్లోకమున వర్ణించినాడు. ఆ నలుని యుద్యానవనమందలి దానిమ్మ చెట్లున్నవనగా దమయంతియొక్క స్తన మండలములవంటి ఆకారము మాకు కావలెనని ధూమపానమును చేయుచు అధోముఖములతో తపమాచరించుచున్నట్లున్నవట. ఆమె శరీర సౌందర్యము జడప్రకృతికి సౌందర్యమును సంపాదించి యిచ్చుచున్నది. యదార్థమునకా పరాప్రకృతియొక్క దివ్యసౌందర్యమే ఈ చేతనాచేతన

ప్రపంచమునం దనేక పదార్థములయందు విభక్తమై కన్పట్టుచున్నది. దమయంతిని పరా ప్రకృతి యనుటకెట్టి సందేహమును లేదు. నలుడు బ్రహ్మజ్ఞుడును, వేదవిదుడును కాగా అతని పట్టమహిషి దమయంతి గదా ! కావుననే ఆమె సౌందర్య మట్లు వర్ణితమైనది.

కథకు వృత్తము –

దమయంతి విరహవేదన మాతని బాధింపుచుండ నలు డుద్యానవన విహారమును సలుపుచుండినాడు. దైవఘటనము చాల చిత్రమైనది. భవిష్య దర్థముఃపై ఫలకు చిత్రమును మళ్లించున దాదైవమే. దైవమన ప్రాక్తన కర్మఫలమని అర్థము. నలుడు విహరించు వనమధ్యమునం దొక కేళీసరోవరముండగా, ఆ సరోవరమధ్య నొక పక్షి యాతని కంటబడినది. పక్షు లొకప్పుడు కేళీసరోవరముల నీదులాడుచు, విశ్రాంతి నొందదలచినచో దాని శరీరము నంతను తన ఒంటికాలిపై నిలిపి, ముక్కును, రెక్కలమధ్య నిరికించుకొని, విడల్చిన రెక్కను తలపై కప్పుకొని, కన్నుమూసియుండుట సహజము. అట్లు సహజా లంకారశోభిమయ్యే ఈ పక్షి నలుని కంటబడినది. నలుని చూపు ఆ పక్షిపైనే నిలిచినది. కాని అది యీ సరోవరమునుండి యావిర్భవించిన కాంచనాంబుజమా ? అను వూహా పొడమినది నలునకు. అట్లూహించుట కాతనికి కారణములు లేకపోలేదు. ఆ పక్షిరాజు మేనిఛాయ బంగారమువలెనుండి దాని కాలు నాళమువలె నుండుటచే తన ముఖశోభకు సిగ్గుగొన్నదై అట్లు ముఖము వంచినది కాబోలు అని చూచినాడు. ఆ యూహ మారినది. విద్రుమ దండమండితమైన వరుణదేవుని చామరమా ? అను మరియొక వూహ వచ్చినది. అట్లు వచ్చుటకు అది ఒంటికాలిపై నిలిచినదిగదా ! దాని యొంటిపైని యీకలు చమరీమృగములవలె చూపట్టగా దాని శరీరము నంతను మోపిన యొంటికాలు ఎర్రనై యుండుటచే పగడములచే

సమర్చబడిన చామర దండమువలె నున్నది. అట్లాత డాఖగశ్రేష్ఠమును చూచి చూచి పక్షియను నిశ్చయమున పట్ట నిశ్చయించినాడు. తన దీర్ఘ కాయమ్మును కొంచెము వంచినాడు. అసంపు బలిచక్రవర్తిని బంధించ దలచిన శ్రీమహావిష్ణువువంటి కాపట్యమును కలిగియున్నదేగాని వేరుగాదు. చప్పుడుగాని పదవిన్యాసమున మౌనముద్రమును ధరించి ఆ ఖగశ్రేష్ఠముయొక్క పార్శ్వభాగమున చేరి తన పాణిపల్లవమునం దుంచుకొనెను.

అది సామాన్యమగు పక్షికాదు. రాజహంసము. రాజహంసల సమూహ మా సరోవరమునందున్నను ఏకాంతమునం దీ హంస విశ్రాంతిని తీసుకొనుచున్నది. ఈ వర్ణనము కేవల కథామాత్రమునే గాక మోక్షపురుషార్థమున సాధనభాగమై వెలసిన కుండలినీ జాగరణమునుకూడ స్మృతికి తెచ్చుచున్నది.

స్వభావముచే మన నాసికారంధ్రములనుండి వెలుపలకును లోపలకును వచ్చుచు పోవుచుండు ప్రాణవాయువును యోగశాస్త్రమున హంసయను పదమున వాడుచుందురు. యోగశాస్త్ర సిద్ధాంతమునం దదియే పరబ్రహ్మము. స్థూలదృష్టియందది గాలిగా వ్యవహరింపబడినను సూక్ష్మదృష్టియం దది చిద్రూపమగు పరబ్రహ్మయే. ఈ హంస సూర్యోదయము మొదలు రెండవరోజు సూర్యోదయమువరకును (24 గంటలు) ఇరువదియొక్క వెయ్యి ఆరు నూరులు చరించుచుండును. దీనినే హంసగమన మందురు. దివ్యతేజో విరాజితమగు నీ హంసను పట్టుటకు మరియొక పేరు ప్రాణాయామము. ఆ ప్రాణవాయువును ధారణ చేయవలెనన్న శరీరమును వంచుటయు, మౌనము మొదలగు నియమములును అవసరము. స్థూలదేహ శోధనమునగాని సూక్ష్మదేహము శోధింపబడదు. నేను చక్రవర్తినను భావమును వదలి నలుడు

హంసను పట్టుకొనుట కర్తవ్యమగు శరీరమును ధరించినాడు. అట్లు స్థూలము స్వాధీనముకాగా మనోమయము సత్వమయము కావలెను. విష్ణువు బలి ధ్వంసి. ఆతని యనుకరించినను వర్ణన మిచ్చట గమనార్హము. ఇచ్చట బలియన కర్మవీరత్వము. కామ్యకర్మల ప్రేరేపించునది రజోగుణము. ఆ రజోగుణమును వృద్ధిపొందించునది త్రిగుణాత్మకమగు కర్మకాండము. ఆ కర్మకాండమును ధ్వంసముచేయుట యన, దానినుండి విడివడుట. దానినుండి విడివడు నుపాయమే విష్ణువు. ఆ విష్ణువు ననుకరించియే ఆతడు వామనుడయ్యెను. వామనుడన పొట్టివాడని మాత్రమే అర్థము కాదు. వామనుడన పరమాత్మ.

'రథస్థం వామనం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే'

రథమన దేహము. దేహ మధ్యమందలి పరమాత్మను దర్శించుటచే పునర్జన్మ లేదని శ్లోక భావము.

నలుడు హంసను పట్టుటకు వామనుడయ్యెను.

ఆ హంసకును, తనకును వేరులేమిని తెలుసుకొనుటయే హంసను పట్టుట. దీనినే వేదాంతమున సోఽహంభావమని వాడుదురు. కావుననే ఆ హంసయు సువర్ణమయముగా వర్ణింపబడినది. మూలాధారమునుండి సుషుమ్నా మార్గమున సహస్రారమునకేగు చైతన్యము విద్యున్నిభమై యుండుటే శాస్త్రప్రసిద్ధము. అట్లే హంసయొక్క రెక్కలు రెండును అగ్నిఘోరములని ఉపనిషత్తు వర్ణించినది. కనక హంస దౌత్యమున కూడ హంసయం దీ పరమార్థ రహస్యమును వదలకుండనే శ్రీహర్షుడు నడపినాడు.

తరువాత కథకు పోదము —

హంస నట్లు పట్టుకొనగా అది గిలగిలలాడుచు మనుష్య భాషణముల నలుని కృపా కటాక్షమునకు పాత్రమైనది.

తనను పట్టుకొనుట ధర్మముకాదని నలునితో మొరపెట్టుకొన్నది. విశ్వసించిన శత్రువునైనను బాధించుట పాపముగాగా, నమ్మి నీ స్థలమున నిద్దురవోవు నన్ను పట్టుట నీకేటి ధర్మమన్నది. నా రెక్కలపై నున్న సువర్ణమునకై నీవు లోభించుటయా ? నీకున్న ఐశ్వర్య సంభ్రమున నా రెక్కలపైని బంగారము తుంపురులన్నది. అన్నిటి కంటెను నలుని హృదయము కరిగిపోవు కరుణరసపూరితమగు వాక్య సరణితో నలుని బంధమునుండి బయటపడినది.

ఇట్లెన్నియో రూపముల విలపించు నా హంసను నలుడు వదలి పెట్టినాడు. బంధ విముక్తమగు నా హంస నలున కేదియో యొక ఉపకారమును చేయ తలపెట్టినది. తన కృతజ్ఞతా పూర్వకమగు పారితోషిక మా చక్రవర్తి త్రోసివేయునేమో యని తన పారితోషిక ప్రదానమున కర్హమగు గౌరవ వాక్యములచే నాతని మెప్పించినది. ఆ చెప్పునప్పు డొక చక్కని మాట చెప్పినది.

ఓ రాజా !

'ఉపసన్నమయాచితం హితం పరిహర్తుం నతవాపి సాంప్రతం
కరకల్ప జనాం తరాద్విధే శ్శుచితః ప్రాపి సహి ప్రతిగ్రహః'

తాను యాచించక వచ్చు సంపదను ప్రతిగ్రహించుటకు శంకించ నక్కరలేదు. ఆ తిరస్కారమును నీకు యుక్తముకాదు. అందును యిప్పుడు నీవు ప్రతిగ్రహింపబోవు వస్తువు నే నిచ్చునది గాదు. బ్రహ్మయే దానిని నీ కివ్వదలచగా నేను నిమిత్తమై నీ కందింతును. ఈ పక్షియా నా కిచ్చునది ? యని తలపక శుచిర్భూతుడగు బ్రహ్మనుండియే వచ్చుచున్నదని తలచి తప్పక పరిగ్రహింపుమన్నది. కవి యెంత నేర్పరి ?

చక్కని మనుజ భాషణముల భాషించు నా హంస పలుకు లెవ్వరికి శ్రోతవ్యములుగావు।

నలుడు నిక్కబొడిచిన చెవులతో విన నుత్సహించినాడు. హంస దమయంతిని గూర్చి మధురవాణిని వినిపించినది. మహాభారతమున దమనుడను ఋషి సత్తముని యనుగ్రహముచే సంతతి వడసి దమయంతి యను నామము నామెకు తండ్రి పెట్టినాడని యున్నను శ్రీహర్షుడీ నలునకు హంసముఖముగ దమయంతి నామము నిట్లు నిర్వచించినాడు.

భువన త్రయ సుభ్రువామసౌ దమయంతీ కమనీయ తారుదం
ఉదియాయ యతస్తను శ్రియా దమయంతీతి తతోభిధాందధే

తపోధనుని యనుగ్రహమున ఉదయించిన ఆ దమయంతి సౌందర్యము ముల్లోకములలోని సౌందర్యవతుల సౌందర్య గర్వము నస్తమింపజేసి దమయంతి యను పేరును సార్థకము చేసికొన్నదట. ఆమె సౌందర్య మట్లుండగా ఆమె నేత్ర సౌందర్యమును కలిపి కవి చమత్కరించినాడు. ఆ శ్లోకమును మీకు వినిపించుట చాల అవసరము –

'అపిలోకయుగం దృశావపి శ్రుత దృష్టా రమణీ గుణా అపి
శ్రుతి గామితయా దమస్వసు ర్వ్యతి భాతే సుతరాం ధరాపతే'

దమయంతియొక్క మాతా పితృకులములు రెండును వేద ప్రసిద్ధములై ఒకరి వంశోత్కృష్టత కొకరి వంశము తీసిపోక యుండెనట. అట్లే ఆమె నేత్ర ద్వంద్వముకూడ శ్రుతిగామియై యున్నదట. ఇచ్చట శ్రుతియను పదముచే వేదములకును, చెవులకును కూడ అర్థము చెప్పబడినది. కన్నులు చెవులవరకును వ్యాపించినవనుట నేత్రసౌందర్యమేకాక విశాలదృష్టి కలిగి పద్మాక్షి యగుటను చెప్పినాడు. పట్టమహిషికి వలయు భాగమును వర్ణించి ఎట్టి పద్మాక్షియైనను మాతా

పితృకులముల యౌన్నత్యము లేక జాతికి యుత్కృష్టత లేదను భారతీయ సిద్ధాంతమును కవి ధృవపరచినాడు. స్త్రీలకు పద్మినీ, చిత్రినీ, శంఖినీ, హస్తినీ జాతుల వైశిష్ట్యము కామశాస్త్రము నిర్వచించగా, జన్మ పారిశుద్ధ్యమును ధర్మశాస్త్రము చెప్పినది. ఈ రెంటికలయికయే దేశ సౌభాగ్యమని భారతీయసిద్ధాంతము. పుట్టుకయందొక వైశిష్ట్యము లేకున్న గుణసౌందర్య మెట్లువచ్చును ? సాముద్రికము జన్మసిద్ధము. శరీర సాముద్రికములోనిదే గుణవర్ణనముకూడ. ఆమెను నీవెట్లెరుగుదువు ? అను ప్రశ్నకు హంస సమాధానము నిచ్చుచున్నది.

మ॥ విమలేందీవర షండమండిత లసత్కాసార సేవారతిన్
గమికిర్మ్రృత సైకనీ వృతుడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవ పాణి బద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీన స్తని నస్తినాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్.

మేము తిను ఆహారము తామరతూండ్లగుటచే ఆయాహారమునకై యనేక దేశముల గ్రుమ్మరుచు విదర్భదేశమున దమయంతిని చూచితినని చెప్పినది. ఆమె సౌందర్యఖని యున్నది. ఆ రమణీమణి గబ్బిగుబ్బల యందమునకు ఉండెనా, లేదా ? యను సందేహమున కాస్పదమైన నడుము వన్నెదిద్దినదని వర్ణించినది. ఇట్లెంతయో పర్ణనాప్రాగల్భ్యమును శ్రీహర్షుడు చూపినాడు. శ్రీనాథుడును అతనికి తీసిపోలేదు.

ఓ చక్రవర్తీ ! ప్రస్తుత కర్తవ్యమేమందువా ? నీకా దమయంతిని చేకూర్చుటకు నే నెంతయు ప్రయత్నము చేయగలనన్నది. ఆమెకు భర్తగా యుండదగువా రెందరో యుండియుండవచ్చు నని భావింతువేమో ! లోకమునందున్నవా రందరును తేను చూడగా వారందరును పూర్వపూరుష కూటియందు పడి, నీ వొక్కడవే సిద్ధాంత మైతివని నిర్ణయించినది. కాని బ్రహ్మయే నాకు నిర్ణయించెనుగదా !

అందువేమో ! కాదుకాదు, దేవతలుకూడా ఆమెను వరించుటచే తగు ప్రయత్నము లేక సిద్ధించదు. దేవతలు ప్రలోభింపచేసినను ఆమె మనస్సు నీయందే దృఢమగునట్లు చేయుటకు నేను ప్రయత్నింతునని తన యవసరమును నలునకు కల్పించినది. దౌత్య నిర్వహణ మొక కళ. రాయబారము చేయువారికెంత వాక్ప్రౌఢిమ కావలెనో కవి యీ కావ్యమున చూపినాడు. భారతీయ వాఙ్మయమునం దొక ప్రత్యేకస్థానము నలంకరించి నదే కావ్యఫణితి.

కాని హంస ఒక్కమాట చెప్పినది.

'... ... ... ... ... ... ...

బ్రువతేహి ఫలేన సాధవో నతు కంఠేన నిజోపయోగితాం'

అని.— బుద్ధిమంతులగువారు తాము చేయదలచిన ఉపకారమును కార్య రూపమున చెప్పుదురు. ఆ రాజహంసయొక్క రెక్కలు సువర్ణమయములై యుండుటకే నలు డుత్సహించుచుండగా ఆ హంస శ్రేష్ఠముయొక్క మధురవాక్కులను సువర్ణ వర్ణనములతో కూడియుండుట కాతడు చకితు డయ్యెను. (పలుకులలో సువర్ణము లనగా అక్షరములకూర్పని యర్థము) ఆ భావమునే ఆతడు హంసకు తెలిపినాడు.

ఓ హంసరాజమా ? నీ తనువొక్కటే సువర్ణమయమైలేదు. నీ పలుకులును సువర్ణములతో కూడియే యున్నవని శ్లేషించినాడు. అట్లే హంసయొక్క రెక్కలు ఆకసమునం దెగురుచుండగా అటునిటు కొట్టుటనుగూడ శ్లేషించినాడు. నీ పక్షపాతిత్వము ఆకసమునం దెగురుట యందేగాక నావంటివారి యందును పక్షపాతము కలదని చమత్కరించినాడు.

పరమార్థమున హంసయను పదమును తలక్రిందు చేయగా సోఽహమను పదము వచ్చును. సోఽహమను పదమునకు నీవే ఆత్మ

రూపమున యుంటిపని అర్థము. కావున తేజోమయమగు నాహంస నామ రూపాత్మకమగు జగద్రూపమున భాసించుచుండుటనుగూడ కవి ధ్వనించినాడు. ఇక కథను సమీపింతము.

నలు డట్లు హంసను నిమిరి దమయంతిని గూర్చిన పలుకులను గూడ ఆ హంస చెవియందు వేసినాడు.

హంస ఆకసమున కెగసినది. శుభశకునము లెన్నియో దాని కభిముఖములు కాగా దమయంతి వసించు కుండిన నగరమున కేగినది.

అది దమయంతి తన సఖురాండ్రతో క్రీడించు నుద్యానవనము. శకునములు రాబోవు శుభాశుభముల ముందుగనే తెలియజేయు చిహ్నములు.

సఖురాండ్రతో క్రీడావిశేషముల కాలక్షేపముచేయు దమయంతికి హంసరాజము కంటబడినది. ఇక హంస దమయంతిని పలకరించవలెను. దమయంతిని పలకరించుటెట్లు ? పక్షిరాజము క్రిందకు వాలుటకై తన రెక్కల నాడించినది. ఆ రెక్కల చప్పుడొక విస్మయమును కలిగించు ధ్వని కలిగియుండుటచే దమయంతి చూపు లొక్కమారుగా హంసవైపుకు మరలినవి. చూపులు హంసపై వ్రాలుటకాదు. దమయంతి చిత్తముకూడ విశ్రాంతి నొందినది. అదియే హంస దమయంతిని తన యంతికమునకు ఆహ్వానించిన ఆహ్వానము. దమయంతియేకాక ఆమె సఖురాండ్రును విస్మయము నొందినారు. ఆ ఘట్టమునందా హంసయు, ఆ హంసపై చూపుల నేకాగ్రము గావించి చూచు చూపరులును ఎట్లుండిరో చూచితిరా ?

ఇచ్చట శ్రీహర్షుని యమోఘమగు సాదృశ్యమును మీరు తప్పక తెలిసికొనవలెను.

'నేత్రాణి వైదర్భసుతా సఖీనాం ।
విముక్త తత్త ద్విషయగ్రహాణి

ప్రాపు స్తమేవం నిరుపాఖ్యరూపం
బ్రహ్మేవ చేతాంసి యతవ్రతానాం.

ఈ శ్లోకభావమిది.

యోగుల హృదయములు తత్త్వమసి మహావాక్యమునందలి 'తత్' అను పదముచేత చెప్పబడు నిరుపాధిక పరబ్రహ్మమును ఎట్లు ఆదరమున దర్శించునో అట్లే దమయంతియు, సఖురాండ్రునుకూడ ఏకాంతమున చరించు హంసముపై పుకు మళ్ళినారట. ఈ ఉపమానములోని అంద మేమి ?

ఇక్కడ దమయంతియు, సఖురాండ్రును యోగులుకాగా, వారి ఆటలు విషయసుఖములుగా వర్ణింపబడినవి. హంస ఇక్కడ పరమాత్మయై యుండుట వర్ణితమైనది. వారి దృష్టులు యోగుల దృష్టులుగా ఉపమింప బడినవి. భారతీయ సాహిత్యములోని కావ్యసంపదకు లక్ష్యము ఆధ్యాత్మికమేగాని కేవల భౌతికముకాదు. ఆధ్యాత్మిక సంపదను లక్ష్యముగా గొని వ్యవహార ప్రపంచము వర్ణించబడుచుండును.

తరువాతి కథ—

దమయంతి ఆ రాజహంసను పట్టుటకు వెళ్ళినది. హంస దమయంతికి చిక్కుటలేదు. ముందు రాజహంసయు, దానివెనుక దమయంతియు ఒకరి నొకరు వంచించుకొను క్రీడా చాతుర్యమునకు దమయంతి సఖురాండ్రందరును కరతాళధ్వనుల గావించుచుండ హంస దమయంతిని తనతో గొంపోవగా సఖురాండ్రా హంసను వదలిపెట్టినారు. హంస వెనుక దమయంతియే మిగిలినది. హంస తన వయ్యారపు నడకతో ఒక లతానికుంజమున దూరినది. దమయంతియు హంసను పట్టుటకు ఆ లతానికుంజముననే జొరబడగా, వారి కది ఏకాంతస్థల మైనది. రాజహంస తనచేతి కందినదనే దమయంతి భావించినది. కాని

ఆ హంసరాజము మనుజభాషణమున దమయంతిని పరిహసించినది, 'ఆకాశమున చరించు మమ్ములను భూమిపై చరించువారు పట్టుకొనగలరా?' అని. మధురధ్వనుల నీను నా రాజహంస భాషణములు దమయంతి నాకర్షించకుండునా? కర్ణపేయములగు నా మధురభాషణకు ముగ్ధయై చూచుచుండగనే ఆ హంస తన ఒయ్యారపు పలుకులను ముందుకు సాగించినది.

సీ॥ నలినసంభవు సాహిణాము వారుపంబులు
కులముసాములు మాకు గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు బువ్వుబోణి
సత్యలోకము దాక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరము లైన మామాటలు వినంగ
నమృతాంధసులె యోగ్యు లనుపమాంగి

తే. భారతీదేవి ముంజేతి పలుకు బలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్ల
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు.

చతుర్ముఖ బ్రహ్మకు వాహనములైన రాజహంసల కులములోని దాననని దన జన్మయొక్క ఉత్కృష్టతను తెలిపినది. తాను చరించునట్టి ప్రదేశములను వర్ణించుచు సత్యలోకమునుండి భూలోకము వరకును తన స్వేచ్ఛాసంచారము జరుగుచుండునన్నది. అన్నిటికంటెను విశేషమగు మాట, తమ సంభాషణను వినదగినవారు దేవతలట. అంతేకాదు. వేద శాస్త్రాధ్యయనమంతయు ఘంటాపథముగ తన మస్తిష్కమున ముద్రవేసి

యున్నవట. యదార్థామునకు దౌత్యనిర్వహణమున కుండదగు అర్హత లన్నియు తనకు కలవని చెప్పినది. రాయబారము చేయువా రెట్లుండ వలెనో భారతీయశాస్త్రములు చెప్పినవి. హంస చెప్పిన యర్హత లవ్వియే.

ఆమాటలు దమయంతిని నిలబెట్టినవి. తరువాత నలునకును, తనకును గల పరిచయ మెట్టిదో వివరించినది.

వేసవికాలమున స్వర్లోకగంగయందు తాను జలకమాడి ఆ శీతల గంగాంబువులను తన రెక్కలపై నిడుకొని ఆ రెక్కలతో నలుని యంతఃపురమున కేతెంచి, తన రెక్కలతో ఆతనికి వింజామరల వీచునట. అంతటి మైత్రి కలగుటచేతనే ఆ నలునకు తగిన భార్య ఎవ్వతె యని ఒకానొకరోజున బ్రహ్మను మోయుచు అడిగినదట. అప్పు డాతడు దమయంతి నలునకు భార్య కాగలదని చెప్పినట్లున్నదట. అదియు స్పష్టముగ వినలేదట. కారణమేమి ? ఆయన రథఘోషము అడ్డమురాగా నీవని చెప్పినట్లు వింటినన్నది. చాతుర్యమును గమనించితిరా ? దౌత్యనిర్వహణమున కెంత మాటనేర్పరితనముండవలెనో ? ఇదియే కావ్యనిర్మాత పఠితలకు గావించిన మహోపకారము. అంతటితో దమయంతి హంసకు చాలా దగ్గరైనది. ఆ హంసను తాను పట్టుకొన వచ్చినందుకు క్షమాపణ చెప్పినది. 'బాల్యమునజేసి యేను, యేను జాపలముబూని' నిన్ను నాయాస పెట్టితినన్నది. దమయంతి వినయ సంపద కెంతయో హంస ఆనందించినది. అంతియే, హంస ఇంతవరకు తన అభిప్రాయమేమియు చెప్పలేదు. దమయంతికే హంసతోటి తన హృదయమును చెప్పుకొన విచ్చ కలిగినది. దమయంతికి కలుగుటకాదు. దమయంతికి హంస కలిగించినది. నలునితోటి తనకు అంతఃపుర పరిచయము కలదని చెప్పుట ఇందు గమనార్హమగు విషయము. ఇక దమయంతి తన హృదయమును హంసకు తెలపవలెను. కాని

దమయంతిని లజ్జ కొంత అడ్డగించుచున్నది. ఇది కులకాంతలకు సహజాలంకారము. అయ్యును సాభిప్రాయ సంభాషణలు ముద్దరాండ్రకు పెట్టని సొమ్ములు. లజ్జాధిక్యమున తాను తన హృదయమును చెప్పలేక పోవుటను ప్రకటించుమనే దమయంతి నలునియందుగల తన యభిలాషను హంసకు తెలిపినది.

హంసయు ఉవ్విళులూరుచున్న దమయంతికి ఆ నలునితో నీకు సంబంధమును కుదుర్చుచున్నది. అందుకు తనకున్న అర్హతలను వర్ణించినది. తనకు కామతంత్రములన్నియు తెలుసునన్నది. ఈ ఘట్టమున శ్రీనాథుడు వాత్స్యాయన, కూచిమారి తంత్రములు నాకు తెలుసునని హంసచే చెప్పించుట చాల ముఖ్యమగు విషయము. ఈనాడు కామ పురుషార్థమును గురించిన గ్రంథము లెన్నియుండెనో దాంపత్యానుకూల్యమున కా గ్రంథమండలి ఎంత దోహదమును చేయునో ఎవ్వ రెరుగుదురు? నలదమయంతులమధ్య రాయబారమును నడిపిన హంస తన దౌత్యవిజ్ఞానము నంతను ప్రదర్శించి, తన తల్లిదండ్రులు కాదన్నను దమయంతి నలునే వరింతునని చెప్పిన మాటను మూటగట్టుకొని నలుని యొద్ద కేగినది. నలుని కీ వృత్తాంతమును చెప్పినది. ఇక వారిద్దరి కలయికకు కాలము రావలెను. అంతలోపల వారిద్దరి శృంగారము రస రూపము నొందవలెను. భారతీయ వాఙ్మయమున స్థాయీ భావము నొందిన శృంగారమునకే నిర్ణీతమగు దాంపత్యమని పేరు. అట్టి దాంపత్యమున నిడిపోవుటలేదు. శృంగారరసమును నిర్ణయించిన అలంకారశాస్త్రము భారతీయ వైదికవిజ్ఞానములోనిదేగాని వేరుకాదు. శృంగారమున విరహావర్ణనము చాలా ముఖ్యము. ఆ విరహమునకు చికిత్సాశాస్త్రమును భారతీయ విజ్ఞానములోనిదే.

'నలదమయంతు లిద్దరు మనఃప్రభవాసల బాధ్యమానలై
నలిపిరి దీర్ఘవాసర నిశల్ విలస న్నవనందనంబులన్
నలిన దళంబులన్ మృదు మృణాళములన్ ఘనసార పాంసులం
దలిరుల శయ్యలన్ సలిలధారల చందన చారు చర్చలన్.

విరహవేదనమును చల్లార్చుటకు భౌతికదేహమున కెన్నియో విధములగు చికిత్స లున్నవి. నాయికా నాయకుల విరహజ్వరము చలి జ్వరమువంటిది కాదు. ఇది కేవలము మనోమయము. మనోమయ శరీరమునుండి భౌతికశరీరమునకు వ్యాపించు నీ తాపమునకు పుష్ప శయ్యలును, చందన గంధములును, పచ్చకర్పూరపు కలపములును ఈ విరహ తాపము నుపశమింపజేయును. ఈ వర్ణనలు నాటి కవుల అలవాటులుగావు. నేటి కవుల కా విజ్ఞానములేదు. అట్టి ప్రేమానురాగముల గల నాయికా నాయకు లుందురనిగూడ ఎఱుగని పాశ్చాత్య కామమునే దృష్టియం దుంచుకొన్నవారి కివి నాటి అలవాటు లనిపించును. అంతియే.

అది స్వర్గసీమ. నాడు నారదులు దేవేంద్రుని దర్శింపవచ్చిన సమయము. దేవమును లెందుకు ఏయే ప్రదేశముల కేగుదురో ఎవ్వ రెరుగుదురు ? నారదుని రాక దేవతలకుగూడ శుభోదయము నిచ్చును. లోకాంతరములోని వార్తాకదంబము దేవతలకు దెలియపలెనన్న నారదుని సాయము వారికి అవసరము. నాడు నారదమునీంద్రుల రాక కేదియో యొక కారణముండియే యుండును. భూలోకమున జరుగు దమయంతీ స్వయంవరమును దెలుప నారదు లేమైన వచ్చిరేమో ? అతడు స్వర్గసీమ కెందుకు వచ్చెనో మనకు తెలియదు.

దేవేంద్రుడు నారదమునీంద్రుల కర్ఘ్యపాద్యముల నందించి, కుశలప్రశ్నల ప్రశ్నించుచు, మునిచంద్రా ! మా స్వర్గసీమకు అతిథులుగా రాదగు రాజమండలముయొక్క రాకలు మాకు దూరములైన

వేమని యడిగినాడు. దేవతలు సైతము అతిథుల రాకకు ఎదురు చూచుట ఇందు గమనార్హమగు విషయము. శ్రీహర్షుడు అతిథిపూజయొక్క ప్రత్యేకత నిట్లు వర్ణించినాడు.

'పూర్వపుణ్య విభవ వ్యయ లబ్ధా స్సంపదో విపదయే సవిమృష్టా
పాత్రపాణి కమలార్పణ మాసాం తాసు శాంతి కవిదిర్విధి దృష్టః'

ప్రస్తుతమున మనకు కలుగు సంపదలు పూర్వపుణ్యమును ఖర్చు చేసిగాని రావు. అట్లు పూర్వపుణ్యము వ్యయమగుట విపత్తుగాని సంపత్తుకాదు. ఆ విపత్తునకు శాంతియేమి? పాత్రులగువారి చేతియందు నేటి సంపదను దానమను హోమము చేయగా ఆ విపత్తు తొలగునట. అనగా దానము చేయుటచే సంపదలు వృద్ధియగునేగాని ఆ సంపదలు వృద్ధిపొందవని భావము.

దేవేంద్రుని కుశలప్రశ్నము అంతతో ఆగినది. నారదుని సమాధానమున రాజుల కిప్పుడు యుద్ధములు జరుగుటలేదనియు, దానికి కారణము దమయంతీ స్వయంవరమనియు దేవేంద్రుని చెవినిబడినది. దేవరాజున కాశ్చర్యము కలిగినది. దమయంతి తన్ను వరించుచో బాగుండునని సహస్రాక్షుడు భావించినాడు. ఒకవేళ దమయంతి భూలోకవాసుల నెవ్వరినైన వరించియున్నదేమో? అను అభిప్రాయము కూడ దేవేంద్రునకు కలుగకపోలేదు. దేవేంద్రుడు నారదుని అడిగినాడు. ఆమె తన మనస్సునం దెవనిని వరించినదని. మునివర్యులు చూడరాని రహస్యములుండునా? అని దేవేంద్రుని ఊహ. మనస్సు పరమాణు ప్రమాణమున ఉండును. యోగికి పరమాణువు సాక్షాత్కరించునని తార్కికుల సిద్ధాంతము. కావున నారదులు చూచుటకు సమర్థులని భావించి అడిగినాడు. (పరమాణు ప్రమాణము మనకు కిటికీ తలపుల గుండ చూడబడు సూక్ష్మరజములోని అరవ పాలు.)

నారదుడు దాని కిట్లు సమాధానమిచ్చినాడు. ఈ సమాధానమున భారతీయాధ్యాత్మిక సిద్ధాంత మంతయు ఇమిడియున్నది. ఆంధ్రానువాదము నందించుచున్నాను.

చ. అలయక యోగిబుద్ధి పరమాణువు గాంచిన గాంచుగాక కే
వలము ద దంతరస్థమగు వస్తువు గానగ నెట్లు నేర్చు ? న
న్నలినదళాయతేక్షణ మనఃపరమాణువునందు హ్రీ దరీ
నిలయ హరీకృతుం డతడు నేరగవచ్చునె వాని గానగాన్.

యోగికి పరమాణు సాక్షాత్కారమగుటను నారదుడు ఒప్పినాడు. పరమాణువున కంతర్భూతమై యుండు వస్తువు చూడబడదుగదా ? అనినాడు. అనగా మనస్సునందు వ్యాపించియున్న ఆత్మ చూడబడనిదని సిద్ధాంతమును చేసినాడు. ఇది ఉపనిషత్సిద్ధాంతము. ఇప్పుడు నలుడు దమయంతి మనఃపరమాణువు నందున్న లజ్జయను గుహయందు దాగిన సింగమని వర్ణించినాడు. అతనిని చూచుటెట్లు ? కొందరు ఆత్మను దర్శించితిమందురు ? కాని అది అసంభవమని ఉపనిషత్తు నిర్వచించును. ఆత్మదర్శనమైనదన్నవారి ఉపనిషత్సరస్వతి సామాన్యమున కాదను మాటను చెప్పుటకాదు. గట్టిగ వారికేమియు తెలియలేదని చాటి చెప్పినది.

'యస్యామతం తస్యమతం మతం యస్య నవేదసః' ఆత్మ తెలియబడునది కాదని తెలియుటే తెలియుట యనికూడ నిర్వచించినది. కథకు పోదము.

నారదమునీంద్రులు స్వర్గమునుండి మరలినారు. మన్మథుగ దేవేంద్రునిపై ధ్వజమెత్తగా ఇంద్రునకును దమయంతి తనను వరించునేమోయను ఆశ కలిగినది. ఇంద్రున కొక్కనికేగాదు అగ్నికిని, యమునకును, వరుణునకునుగూడ ఆశ కలిగినది. వారును దమయంతీ స్వయంవరమునకు పయనమైరిగాని, వారి పయనము

ఒరులెరుగునదిగాదు. ఆ దిక్పాలుర విమానములు వ్యోమయానములు (ఆకసమునుండి వచ్చును) ఇంద్రాగ్ని యమవరుణులు తాము బయలు దేరుటకు ముందే తమ తమ దూతికలను దమయంతివద్దకు పంపగా ఆ దూతికలు వారికంటె ముందుగనే దమయంతి అంతఃపురమున కేగినారు. ఇంద్రాగ్ని యమ వరుణులును తమ పయనమును సాగించినారు. దేవతలు మనుజుల కోర్కెలను తీర్చుట జగత్ప్రసిద్ధము. కాని నలచరిత్రయందు దేవతలే భూలోకవాసియగు నలుని యాచించుట జరిగినది.

దమయంతీ స్వయంవరమున కేతెంచు ఇంద్రాగ్ని యమవరుణులు మార్గమధ్యమున నలుని చూచినారు. వారి కొక యభిప్రాయము కలిగినది. నలచక్రవర్తిని దమయంతి దగ్గరకు దూతగా బంపి, తమ కార్యమును నెరవేర్చుకొందమని. స్వయంవరమున కేగు నలునకు దర్శన మిచ్చినారు. నలుని దమయంతి తమను వరించునట్లు రాయబారము గావింపుమని కోరినారు. ఇదియేమి చిత్రము ? తాను వరించబోవు యువతిని ఒరులకు భార్యవు గమ్మని రాయబారిగ ఏ రాజపుత్రుడు పోవును ? ఇదియే భారతీయ చక్రవర్తుల చరిత్రలోని విశేషము. అర్థార్థుల కల్పశాఖలు భారతీయ చక్రవర్తులు. వారు చేయరాని త్యాగములులేవు. చూడుడు. దేవతలు నలుని బిలచి, దమయంతి మమ్ములను వరించునట్లు రాయబారివి కావలసినదని కోరినారు. అతడు వెనుదీయలేదు. అంతఃపుర ప్రవేశ మెట్లని సందేహించగా, దేవత లాతనికి తిరస్కరిణీ విద్య నుపదేశించినారు. నలు డెవ్వరికి కనబడడు. నలుడందరను చూచును. ఇది యొక మహిమాన్వితమగు మంత్రరాజము. నలునకు దేవతల వరప్రసాద మందినది.

అది కుండిననగరాంతర్భాగమందలి దమయంతి అంతిపురము. రాజద్వారములన్నియు సురక్షితములేయైనను నలుని అడ్డగించు వారెవరు? నలు డెవ్వరి దృక్పధమునను బడకయే అంతిపురమున ప్రవేశించినాడు. అందొక్క చిత్రమును అతడు చూచినాడు. ఏమది? దమయంతివద్ద నున్న దేవదూతికలు నలుని కంటబడినారు. దమయంతిని వారు ఇంద్రాదుల వరింపుమని బోధించుచుండగా దమయంతి నేను నలునిదప్ప వరింపనని సమాధానము చెప్పుచున్నది. అంతకంటె నలుడు వినదగిన మాట యేమున్నది? ఆ పలుకును నలునకు వినిపించుటకే దేవతలు నలుని దూతగా పంపిరేమో? ఏమో? కాదు. అదియే దేవతల హృదయము. నలు డామాటను విన్నను దేవకార్యమునే నెరవేర్ప నిశ్చయించినాడు. ఇంత వరకా యంతిపురమందలి కాంత లెవ్వరును నలుని చూడలేదు. నలుని ప్రతిబింబ మలా యంతిపురములోని మణి భిత్తికల ప్రతిబింబించి అతడు యోగియయ్యెను. ఎక్కువకాల మాత డా యంతిపురమునం దుండరాదు. కావుననే దేవత లిచ్చిన తిరస్కరిణీ విద్యను వదలినాడు. అత డీక్షణమునం దా యంతిపురమునం దతిథికాగా, దమయంతి అతనిని అతిథేయునిగా గ్రహించినది. అతిథి ఆసనము నలంకరించినాడు. దమయంతి తన యంతిపురమున కేతెంచిన ఆ సుందరాంగుని రూప సంపదలకు విస్మయమందియు, అతని రాకకు కారణమును తెలియగోరినది. పేరడిగినది. 'ఏదేశమని ప్రశ్నించినది. కులమేది యన్నది. అంతఃపురమున ప్రవేశించిన సాహసమునకు ఆశ్చర్యమును ప్రకటించినది.

తన గోత్రనామముల నాతడు దమయంతి కెరిగించలేదు. తా నెవ్వరో చెప్పుటకు నలున కిక్కడ అవసరమేమున్నది? నేను

దిక్పాలుర దూతనని తనను పరిచయము గావించుకొనినాడు. ఇక తన యభిప్రాయమును దమయంతికి తెలుపవలెనుగదా ! రహస్య మెరిగింప వలెనన్న అటు నిటు చూచి, ఉన్నవారలందరును మనవారలేగదా ? అని ప్రశ్నించినాడు. అంతేకాదు. నేను చెప్పబోవు విషయమును వినుటకు చిత్త మేకాగ్రమైయున్నదా ? వనితామణీ ! అని తేనెనొలికించుచు దమయంతిని పలకరించినాడు.

దమయంతి వరప్రసాదిని. హ్లాదినీశక్తికి రూపాంతరము కావచ్చును. నలుడు ఇంద్రాగ్ని యమవరుణ దేవుల యుత్కృష్ట గుణ వర్ణనమును గావించి, వారిని వరింపుమని ప్రార్థించినాడు. వారు నీ విరహ జ్వాలలకు మగ్గియుండిరనికూడ వర్ణించినాడు. నీవు వారి యం దెవ్వరిని వరించినను ధన్యురాలవవుదువని త్రికరణశుద్ధిగ బోధించినాడు. దమయంతి ఏమని సమాధాన మివ్వవలెను ?

తన మనోభీష్టమును త్రికరణశుద్ధిగ చెప్పినది. దేవతలను నేను వరించనన్నది. దేవేంద్రుని అజ్యధారలచే నలుని ప్రక్కనయుండి ఆరాధింతునన్నది. అగ్నినికూడ అట్లే చేతునన్నది. వరుణాదిదేవతలు మనుష్యుల కారాధ్యదైవతములుగాని భర్తలు కారన్నది. ఇక నీ వెవ్వరవో నిజముచెప్పుమన్నది. నలుడు తన యదార్థఘట్టమును చెప్పక తప్పలేదు. అంతతో ఆమె లజ్జావనతవదనయై అంతర్గృహమున కేగగా నలుడు దేవతలయొద్ద కేతెంచి యదార్థమును విన్నవించినాడు. దేవతలు నలుని పరీక్షించుట పూర్తియైనది. ఇక వరము లివ్వవలెను. దమయంతిని కూడ పరీక్షించుట పూర్తికావలెను.

అది స్వయంవర మంటపము. రాజమండలమంతయు, విదర్భ రాజపుత్రిక క్రీగంటిప్రసారములకై ఎదురుచూచుచుండ, దమయంతి

సఖురాం ద్రండించిన వినూత్న పుష్పమాలాలంకరణ హస్తయై సభా మంటమున కేతెంచినది.

ఆ సభామంటపమునం దలంకరించియున్న నలున కా కంఠమాల నందించవలెను. ఆ సభామంటపమునం దొక్క నలుడే కూర్చొనిలేడు.

దేవేంద్రుడొక నలుడు, యముడొక నలుడు, అగ్నివరుణు లిద్దరును నలురే. అసలు నలుడిం దెవ్వడు ? ఆతని కనుగొనుటెట్లు ?

దేవేంద్రుని దివ్య నందనోద్యాన వనవిహారమును నాకక్కరలే దన్నది. యమునకు భయపడక ఆతని దూతను పంపివైచినది. వరుణుని యమోఘ దివ్యవైభవమున కుత్సహించలేదు. నలుడు కాదన్నచో, అగ్ని మండలమున మృత్యువు నాహ్వానించుటకై ప్రవేశింతునన్నదే కాని ఆతని వరించనన్నది. నలున కొక్కనికే యామె మహారాణి నన్నది. నలునితోగూడి, దేవేంద్రుని హవిర్భాగముల కాహ్వానించుట ఆమె యభిమతము. కాని ఆ దమయంతి నిర్ణయమంతయు తారుమారు చేయుటకై దేవతలు కూర్చొనగా ఇప్పు డామె కర్తవ్యమేమి ?

భారతనారీమణుల పాతివ్రత్య ప్రభావములు దేవతల కిన్కలకు జంకునవి కావు. దేవతల యనుగ్రహములనార్జించుటకును అసమర్థములై లేవు. దేవతల యమోఘ సంకల్పములతో తులతూగుచు కర్మక్షేత్రమున కమూల్యాలంకారములైనవే వారి పాతివ్రత్య ప్రభావములు.

దేవతలకును, మానవులకును గల భేదములు భారతీయ సారస్వత ముఖమున రాకొమరితలు వఠింపకపోలేదు. దమయంతి సర్వశాస్త్ర పారంగతత్వమున సరస్వతికి సఖురాలు.

ఆ క్షణముననే దేవతలను ప్రార్థించినది తన పాతివ్రత్యమునే పణముగాబెట్టి, ఓ దేవతలారా ! నా భర్త యిందెవ్వడో చూపమన్నది.

దేవత లానతీమ తల్లిని పరాభవించుటకై రాలేదు. పరీక్షించి ఆ నారీరత్నముయొక్క వెలుగును సాటి సుందరీమణులకు ప్రదర్శించుటకై మాత్రమే వారు వచ్చిరి.

దేవతల శరీరములు చమటను గ్రమ్మియుండదు. వారి కంఠసీమ లందలి పుష్పమాలలు వాడుచూపవు. దేవతల పాదములు భూమిపై నానవు. దీనికి వ్యతిరేకమే మానవత్వము. ఆ విషయమునే దమయంతికి స్మృతి రూపమున దేవతలందించి దివ్యదృష్టిని వారనుగ్రహించగా దమయంతి నిజమగు నలుని కనుగొన్నది.

ఇదంతయు కొన్ని క్షణములలో జరిగిన విధయేగాని వేరుగగాదు. దమయంతి నలుని కంఠసీమయందు పుష్పహారమునుంచి నలుని భర్తగా గైకొన్నది. మేళతాళములతో వైదిక మంత్రరాజములతో బ్రాహ్మ ణాశీర్వాదములతో ముత్తైదువుల దీప నివాళులలో దమయంతి యుద్వాహ పీఠము సమలంకృతముగాగా నలదమయంతులు దంపతులైరి.

మానవ జీవితమున సంయోగము లెట్టివో వియోగములును అట్టివే. నలదమయంతుల యన్యోన్య దాంపత్యమునకు కొంతకాలము వియోగమును కల్పించుటకు కూడ ఆనాడే కొన్ని బీజములు పడినవి. జీవులకు పుణ్యకర్మలెట్లు, తామిప్పదలచిన ఫలముల కడ్డుపడిన ప్రతిబంధకముల ఛేదించి, ఫలములను చేతికందించునో; దుష్కర్మలు కూడ నట్లే మనమూహింపజాలని ఘట్టముల సృష్టించగలవు.

దమయంతి స్వయంవరము ముగియగా, దేవతలు తమతమ నివాసముల కేగుచుండిరి. కలి ద్వాపరు లిద్దరును దమయంతి తమను వరించునేమోయని తమ భేషజరూపములతో వికారరూపమున దేవతల కెదురైరి.

దేవతల యాగడమునే సాగనివ్వని దమయంతి కలిద్వాపరుల వరించునా ? కలిద్వాపరులకు మధ్యమార్గముననే దేవతలు దమయంతి నలుని వరించినదని చెప్పినారు. కలిద్వాపరు లంతతో విడువలేదు. కలి పురుషుడు నలదమయంతుల దాంపత్య లతను త్రెంచి ఆనందింప నిశ్చయించుకొనినాడు. అది సామాన్యమగు భావముకాదు. కలిచక్రవర్తి నలదమయంతుల నెడబాపుటను శపథము గావించినాడు.

నలచక్రవర్తి దమయంతితోకూడా నగరమున ప్రవేశించి తన ధర్మసామ్రాజ్యమునం దర్ధాంగితోగూడ గార్హస్థ్య ధర్మమున కామ పురుషార్థము ననుభవించుచు పితృదేవతల ఋణమును దీర్చ సంతాన వంతుడుకూడనై యుండెను. అట్లు పండ్రెండు సంవత్సరములు గడచినవి. మరి శపథము గావించిన కలిపురుషు డేమయ్యెను ? ఆ ఘట్టము రేపు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# కలిప్రభావము

మహాశయులారా!

మన మిప్పుడు మహాభారతామ్నాయమున అరణ్యపర్వమున కామ్యకవనము నందుంటిమి. బృహదశ్వమహర్షి ధర్మజునకు ప్రవచనము గావించు నలోపాఖ్యానము నిన్నటి కథాఘట్టము కాగా నే డా కథా ఘట్టములోని యంతర్భాగమగు కలిప్రభావమును కలిపురుషునిపై దండెత్తిన నలుని దిగ్విజయాత్రయు, నేటి యుపన్యాసమున కథా ఘట్టములు.

నలుని యఖండసామ్రాజ్యము వైదికధర్మదుర్గమున సురక్షితమై యుండుటచే కలిపురుషు డా రాజ్యమున కాలు మోపుట కింతవరకును కాలము కలసివచ్చినదికాదు. కాని కలి యీకాలముకొరకే నిషధేశ్వరుని రాజ్యమున గూఢచారియై నిలచి అంతరమున కెదురు చూచుచుండెను.

'స నిత్యమంతర ప్రేప్సు ర్నిషధేష్వవ సచ్చిరం'

పన్రెండు సంవత్సరములు గడచినవి. పండువంటి కాపురముల కూల్చివైచుచే కలిపురుషుని నిత్యకర్మవిధానము.

భారతీయుల నిత్యజీవితమున ఆచారమునునది పరమధర్మము. భారతీయుల ఆచారములు మూఢనమ్మకములని పాశ్చాత్యుల ప్రచారము. పాశ్చాత్యుల ప్రచారమట్లుండ నేటి భౌతిక వాదుల వాదపటిమయు పాశ్చాత్యులనే యనుసరించినది. కలియుగమున నదియే.

కలిపురుషుడు నిషధేశ్వరుని సామ్రాజ్యమునం దెట్లు కాలిడెనో తెలియునా? ప్రమాదవశమున నలచక్రవర్తికి ఆచారపథమునుండి

ఒక్క అడుగు తడబడినది. అంతియే. అంతతో కాలు జారినది. అతడు క్రిందపడక తప్పినదికాదు.

ధర్మశాస్త్రము మలమూత్రముల విసర్జించుటకు కొన్ని ప్రదేశములను నియమించినది. మలమూత్రములను విడుచునప్పుడుండ దగు విధానమును నిర్ణయించినది. దేవాలయములును, పంటచేలును, దిగుడుబావులును, చెరువుకట్టలపైనను జీవనదులయందును మలవిసర్జన చేయరాదు. అట్లే రాచబాటలయందుకూడ మూత్రపురీషములను వదల రాదని నిషేధించినది భారతీయ ధర్మము. నేడు ఆరోగ్యశాఖ చేయున దిదియేగదా! మూత్రమును సూర్యున కెదురై విడువరాదు. మల మూత్రముల విడిచి పరిశుద్ధుడు కానిదే దేవ పితృకార్యములను ఆచరించ కూడదు. ఇట్లనేక నియమముల నేర్పరచినది. నేటి ఆరోగ్యశాఖవారి కంటె వేయి మడంగులు ప్రజలకు క్రమశిక్షణను, పరిశుభ్రతను నేర్పినది భారతీయసరణి. సంఘమును సరిదిద్దుటలో భారతీయ ధర్మశాస్త్ర సరణికి చాలిన దీనాడులేదు. ప్రస్తుత విషయమునకు వత్తము.

కలిపురుషుడు నలునిపై తన ప్రభావమును ప్రసరింపజేయుటకు ఎదురుచూచుచు నిషధదేశమున వసించియుండెనని చెప్పితినిగదా!

ఒకరోజున నలచక్రవర్తి మూత్రవిసర్జన గావించి ప్రమాదముచే కాళ్ళు కడుగుకొనకయే సంధ్యవార్చగా ఆదేసమయమని కలిపురుషుడు నలుని వరించినాడు.

శ్లో॥ 'కృత్వా మూత్ర ముపస్పృశ్య సంధ్యామన్వాస్త నైషధః
అకృత్వా పాదయో శ్శౌచం తత్రైనం కలి రావిశత్'

కలి యావరించుట యనగా వ్యసనమునందు బుద్ధి ప్రవర్తించుట. ఎంతటి హితులచే బోధింపబడియు అందుండి మరలకుండునట్లు చేయుటయే కలియొక్క కార్యము.

పుష్కరుడు నలుని జ్ఞాతి. కలిపురుషుడు పుష్కరునిద్వారా నలచక్రవర్తిచే జూదమాడించి అతని రాజ్యభ్రష్టుని చేయుటకు పూనుకొని ద్వాపరుని జూదమునకు పనికివచ్చు ఒకపాశముగా ఉండుమని అతని బ్రతిమాలి పాచికలను వేయు పాశము నొకదానిని చేతనిడికొని, పుష్కరునియొద్దకేగి, నలుని జూదమున కాహ్వానింపుమని ప్రేరేపించినాడు.

పుష్కరునకును నలునకును ద్యూతసంబంధమగు స్నేహము కుదిరినది. నలుడు ద్యూతమున కొడంబడి ఆ వ్యసనమున మునిగినాడు. రాజకార్యములు వెనుకపట్టినవి. రాజ్యలక్ష్మియు నలునిపై పునుండి తన చూపును పుష్కరునిపై పుకు మరల్చినది. ప్రజానీకమునందు నలుని జీవితము కలుషమునొందినదను వార్త వ్యాపించినది. మంత్రులును, ప్రజానీకమునందలి కొందరు పెద్దలును నలుని ద్యూతమంటమునుండి మరలింప ప్రయత్నించిరిగాని వారి ప్రయత్నములు సఫలత నొందలేదు. ప్రజలును, మంత్రులును దమయంతియొద్దకేగి విన్నవించగా ఆమె మహా ప్రయత్నమును చేసినది. దమయంతి బోధలు నలుని చెవి కెక్కలేదు. కొన్నిరోజులు గడచినవి. నలుని సామ్రాజ్యము పుష్కరుని కైవశమైనది.

నాటి భారతనారీమణులు అమాయిక జీవితములనే గడపిరని నేటి వనితాలోక మూహించవచ్చును. సృష్టిఖండమున సమాజమున కుండదగు ప్రజ్ఞావైభవములు కాలక్రమమునం దభివృద్ధి నొందినవని నేటి విజ్ఞానవంతుల వాదము. ఆ వాదము ననుసరించియే వారట్లు నుడువుదురు. అది భారతీయ సిద్ధాంతముకాదు. భారతీయ గార్హస్థ్య జీవనవిధానమున ఇల్లాలి కొక ప్రత్యేకస్థానమున్నది. గృహ సామ్రాజ్యమునం దామె మంత్రి. భారతీయులు స్త్రీలకు దాస్యమునే యంటకట్టిరనువారు భారతీయతను

గుర్తెరుగని పండితమ్మన్యులు. బృహత్సేన యను నామె దమయంతికి సేవకురాలు. వార్ష్ణేయుడు నలునకు రథసారథి. నాటికి నలునకు ఇంద్రసేనుడను కొమరుడును, ఇంద్రసేన యను కూతురును కలరు. దమయంతి బృహత్సేన యను సేవకురాలిని పంపి నలుని యాజ్ఞగా వార్ష్ణేయుని పిలిపించినది. నాటి నలచక్రవర్తి యునికి సంతను సూతునకు పూసగ్రుచ్చినట్లు చెప్పినది. నలుని వాహనములగు గుఱ్ఱముల కొక ప్రత్యేకత యున్నది. ఆ గుఱ్ఱములను నలుని రథమునకుకట్టి తన బిడ్డల నెక్కించి ఆ రథము నధిరోహింపజేసి, కుండిననగరమునకు చేర్చుమన్నది. కుండిన నగరము దమయంతికి పుట్టినిల్లు. ఆ రథమును, అశ్వములనుగూడ అచ్చటనే యుంచమని వార్ష్ణేయు నాశ్రయించినది.

నలున కీవృత్తాంతము తెలియదు. మంత్రులతో సంప్రదించి, వార్ష్ణేయుడు దమయంతి చెప్పిన విధముగ చేసినాడు. మరల వార్ష్ణేయుడు తిరిగి రాలేదు. రథము విదర్భయందున్నది. వార్ష్ణేయుడు ఋతుపర్ణుని రాజ్యమగు అయోధ్యయందు తన తలదాచుకొనినాడు. నలుడు తన ధనమును కోల్పోవగా పుష్కరుడు దమయంతిని చూపినాడు. కాని నలుని కోపోద్దీపితములగు చూపులకు జంకినాడు. అంతతో ఆ ఘట్టము ముగిసినది.

పుష్కరుడు నలుని కట్టుబట్టతో పట్టణమునుండి తరిమివేసినాడు. దమయంతియు నలుని యనుసరించినది. ఆ పట్టణము నంటియున్న బాహ్యప్రదేశమే నేడు నలదమయంతులకు నివాసభూమి యైనది. వారికక్కడనే మూడురాత్రులు గడచినవి. వారి కాహారమిచ్చువా రెవ్వరు? తమ తమ సెలవులు దప్పిన తమ మిత్రులు శత్రులగుట తథ్యమని సుమతీశతకకారుడు చెప్పినాడు.

పుష్కరుడు నలుడు ఓడిపోవుటను పట్టణమంతటను చాటించినాడు. ప్రజ లెవ్వరును నలుని సత్కరించలేదు. మూడురాత్రుల నుండి యుపవాసమున దస్సియున్న ఆ రాజదంపతుల కాహారముగా ఆకసమున కొన్ని పక్షులు కనబడినవి. నలు డా పక్షులకై ప్రయత్నించి నాడు. అవి చేతికెట్లు దొరకును ? తాను కట్టుకున్న వస్త్రమునూడదీసి, వాటిపై విసిరినాడు. యదార్థమున కవి పక్షులుగావు. అవి జూదపీఠమున నలుని ఓడించిన పాచికలు. నలుని బికారి గావించుటతో ఆ పాచికలకు తృప్తికలుగలేదు. నలుడు తమును పట్టుకొనుటకై విసిరిన వస్త్రమునుకూడ తీసికొనిపోవుచు అవి తమ యదార్థ స్వరూపమును చెప్పినవి. కట్టుబట్టల విడిపించి దిగంబరిని చేసినవి. కలిపురుషుని కర్తవ్యమంతతో పూర్తి కాలేదు. నలదమయంతులను వేరుపరచవలెను. నలదమయంతుల యనుకూల దాంపత్యమున కెడబాటును కల్పించిగాని అతడు తృప్తి నొందడు.

నలుడు దమయంతినిచూచి, తన దైన్యమును వెళ్ళబోయుచు దమయంతిని ఆమె పుట్టినింటి కేగుమని చెప్పినాడు. చెప్పుటకాదు. ఇదిగో దారి యని దారిని చూపినాడు. దమయంతి వెళ్ళునా ! కలి పురుషుడు దమయంతియొద్దకు రాలేదు. ఆమె నలుని వదలదలచలేదు. ఆపత్కాలమున పురుషుని ఆదరించగలిగినది భార్యయేయని ఆమెకు తెలుసును. ఆమె భారతీయ దాంపత్యమున భార్య యనుదాని స్వరూప మేమియో సువర్ణాక్షరముల వర్ణించినది.

శ్లో॥ నచ భార్యా సమం కించిత్ విద్యతే భిషజాంతరం
ఔషధం సర్వదుఃఖేషు సత్యమే తద్బ్రవీమితే'

'అధిక దుఃఖరోగార్తున కౌషదంబు
సురుచిరంబుగ భార్యయె చూపె యెందు

నొసర భార్యాసమేతుడై యున్న వాని
కెంతలయ్యును నాపద లెరుకపడవు.'

నలు డామె చెప్పిన మాటలను వినియు దమయంతిని విదర్భ కేగుమనియే చెప్పినాడు. తన భర్తకూడ వచ్చుచో ఆమె విదర్భకు వెళ్ళుట కియ్యకొనినది. నలు డీఘట్టమున అత్తవారింట కాలిడుటయా? నలు డొప్పలేదు. దమయంతి విదర్భకు వెళ్ళలేదు. వారిద్ద రొక మహారణ్యమున ప్రవేశించినారు.

అది రాత్రికాలము. దమయంతికి నిద్రపట్టినది. నలుడు మేలుకునియే యుండెను. నలుని హృదయము శాంతియుతమైలేదు. అతడు దమయంతిని వదలివెళ్ళదలచినాడు. సాధ్వియగు నిల్లాలిని ఈ మహారణ్యమధ్యమున క్రూరమృగములకు బలిబాన మెట్లియ్యను? అను బాధ నలుని కదలనిచ్చుటలేదు. ఒక్కక్షణకాలము తన అడుగులను ముందుకు వేయును. మరల వెనుకకు వచ్చును. నలుని హృదయము ఒక్క ముహూర్తకాల మియ్యెల యూగినది. చివరకు తెగినది. కలి చక్రవర్తి తన నిశితఖడ్గధారలచే జిగిబిగియై యల్లుకొనియున్న నలుని ప్రేమలతాబంధము నొక్కవ్రేటున త్రెంచినాడు. నలుడు తనదారిని తాను పోవుటకు నిశ్చయించుకొనినాడు. ఆయర్ధరాత్రి సమయముననే దమయంతి చీరె చెరగునుండి కొంతభాగము చించుకొని, మొలకు చుట్టుకొనినాడు. నలుని పయనముసాగినది. అతని చూపులు కొంతదూర మేగువరకును దమయంతిపై ప్రసరించినను, ఆ చూపులకు దమయంతిని వదలకతప్పినదికాదు. నలుని చూపులు దమయంతిని వదలినవి. నలుని హృదయము మాత్రము దమయంతిని వీడలేదు. దమయంతియొక్క భావిజీవితమును స్మరించుచు బాధనొందుచున్నది. అయ్యును నలుడు దమయంతికి మాత్రము సన్నిహితుడుకాకుండ వెళ్ళినాడు. అతడెక్కడి

కేగెనో ! తరువాత చూతము. దమయంతివైపుకు మరలుదము.

దమయంతి నిద్ర మేల్కాంచినది. నాధుడేడీ ? ఆమె హృదయ మొక్కమారు బ్రద్దలైనది. అంతలో తనకట్టుపుట్టము చీలికయై యుండుటను చూచుకొన్నది. ఆ చీరెచెరగు నలుని ప్రయాణమును దమయంతికి తెలియజేసినది. ఈ చీరెముక్కను మొలకుచుట్టుకొని ఆతడు వెళ్ళిపోయియుండునని దమయంతి ఊహించినది. దమయంతి హృదయ మొక శోకసాగరమైనది. నలు డెటుపోయెనో ? ఆమె ఎవ్వరి నడుగును ? వెక్కివెక్కి ఏడ్చుచు అటవీమధ్యమంతయు కలయ దిరిగినది. నలుని గుణగణముల వర్ణించుచు సంబోధించినది. ఎలుగెత్తి ముక్తకంఠమున నలుని పిలిచినది. ఆతడు పలుకలేదు. ఆత డెక్కడుండెను ? దమయంతి పూర్వకర్మఫలానుభవ మొక్కటే ఆమెను వెంటనంటియున్నదిగాని నలుడులేడు. కర్మఫలము లొక్కమారు పుంజీభూతములై పక్వముకాగా సుఖదుఃఖములు రెండును అనుభవ కాలమున పోగువేసినట్లు కర్తననుసరించును. ఒక దుఃఖము వెంట మరి యొక దుఃఖము. దానివెంట ఇంకొకటి. అది యొక వరుస. సుఖములును ఇంతియే. సుఖము లన్నియు ఒక్కమారు పూలమాలయై కంఠసీమ నలంకరించగా దుఃఖము లొక్కమారుగా చెట్టుకొమ్మవలె తలపై విరిగిపడును. శ్రోతలారా : దమయంతిని తిలకింపుడు.

దమయంతి తన నాథునికొరకై ఆ మహారణ్యమధ్యమున గ్రుమ్మరుచున్నది. ఒక కొండచిలువ దమయంతిని చూచినది. దానికి దమయంతి ఆహారమగునని అళపొందమినది. తనకు దగ్గరైవచ్చు ఆహారమే కొండచిలువకు దక్కుచుండును. ఆ యజగరము దమయంతిని మ్రింగినది. దమయంతి కష్టములు తీరినవా ? లేదు. దమయంతిని చూచి మృత్యువు భయపడినదేమో ! మృత్యువునకు సంపూర్ణస్వాతంత్ర్యము

లేదు. కర్తయొక్క కర్మననుసరించియే తాను కర్తదగ్గరకు రావలెను. ఆ సర్పరాజు దమయంతిని మ్రింగునంతలో ఆ సర్పమునకే కాలము సమీపించగా కిరాతుడొక డా ఘట్టమును చూచి, తనచేతనున్న గొడ్డలితో ఆ పామును నరికి దమయంతిని బ్రతికించినాడు. దమయంతి బ్రతికినది. కాని ఆ కిరాతు డీమెనెందుకు బ్రతికించెను ? ఆమె సౌందర్యగరిమకు భ్రమిసి, ఆమె ననుభవింపగోరెను. ఇప్పు డా కిరాతునిబారినుండి రక్షించువారెవరు ? భారతనారీమణులకు శీల మభేద్యకవచము. దమయంతి తన శీలమునే పణముగాబెట్టి కిరాతుని దగ్ధము గావించినది. ఆమె పాతివ్రత్యాగ్నిచే కిరాతుడు తన ప్రాణములను విడిచినాడు. అంతతో ఆమె పాదవిన్యాసముచేత ఆ మహారణ్యము పవిత్రమైనది. దమయంతి ఆ ప్రదేశమునుండి బయలుదేరినది. మరియొక అరణ్యమున ప్రవేశించినది. ఆ ట్లాప్రదేశములలో తిరుగాడినది. నలుడు కానరాలేదు. చెట్టు చెట్టునకును పుట్టపుట్టకును తన జన్మ వృత్తాంతమును చెప్పుకొనుచు తనభర్త నేవృక్షమైన చూచినదేమోనని దీనాతిదీనయై అర్థించినది. ఏవృక్ష రాజమును దమయంతితో మాటాడలేదు. క్రూరజంతువులనికూడ చూడక జంతువులన్నిటిని తన భర్తను చూచితిరా ? అని అడిగినది. నలుని గుణసముదాయమునంతను వర్ణించివర్ణించి, ఆ యరణ్యమధ్యభాగమున ప్రతిధ్వనింపజేసినది. నలుని వృత్తాంతము తెలియలేదు. ఆ మహారణ్య మధ్యములందే దమయంతికి మూడురాత్రులు గడచినవి. నాల్గవరోజున ఆ మహాసాధ్వి కొక తాపసాశ్రమము గోచరించినది. ఆయాశ్రమము ఆ యరణ్యమధ్యమందే యుండి యుండెనా ? కాదు కాదు.

దమయంతికి దారిచూపుటకై కొందరు మహర్షులు సాక్షాత్కరించ దలచినారు. ఆ ఆశ్రమము వారిచే కల్పితమైనదే.

సతీమతల్లులకు అట్లు వచ్చిన కష్టపరంపరల దీర్చి వారి ననుగ్రహించుట మహర్షులకు క్రొత్తకాదు.

దమయంతి వారి ఆశ్రమమున ప్రవేశించి, తన దురదృష్ట జీవితము నంతను విన్నవించుకొనగా, ఆ మహర్షులు దమయంతికి, రాబోవు శుభపరంపరల తెలిపి, ఆమె పోదగుమార్గమును చెప్పినారు. అంతియే. ఒక్క క్షణకాలముననే ఆశ్రమమంతర్ధానమైనది. వారు చెప్పిన త్రోవనే దమయంతి పయనమును సాగించినది.

కొంతదూరమేగినది. —కొందరు బాటసారులు ఆమెకు మార్గ మధ్యమున కలసినారు. ఆమెయు వారును కలసియే పోవుచుండిరి. గాని, అందు కొందరకుమాత్రము దమయంతి దేవతాస్వరూపిణివలె తోచగా, మరికొందర కామె హాస్యనిలయ మైనది. కొందర కామె పిశాచి యనిపించినది. అంతలో రాత్రిసమయముకాగా, దమయంతియు, బాటసారులును, ఒక చెరువును చూచినారు. ఆ తటాకము ఒడ్డుననే వారి మజిలీయైనది ఆ రాత్రి. దమయంతికి నిద్రలేదు బాటసారులు మాత్రము నిద్రించినారు. అర్ధరాత్రికాలమున ఒక ఏనుగుల గుంపు జలపానమునకై ఆ తటాకమునకు వచ్చి ఘీంకరించగా, బాటసారులందరును భయ చకితులై పరుగిడినారు. అందు కొందరు చావక తప్పినదికాదు. దమయంతిని నిందించినవారే మృత్యువాతబడుట జరిగినది. ఆ రాత్రి గడచినది.

అది ప్రాతఃకాలము. చేదిదేశమునకు పట్టమహిషి సునంద. ఆమె దమయంతికి పినతల్లి. దమయంతికి ఆ చుట్టరికము తెలియదు. కాని దమయంతి చేదిదేశమునకు చేరినది. సునంద గృహమున సైరంధ్రి వృత్తికి చేరినది. సునందకును ఈమె దమయంతియని తెలియదు. సృష్టి చిత్రమిదియే.

మహాశయులారా! దమయంతి చరిత్ర మొక ఘట్టమునకు వచ్చినది. నలు డేమయ్యెను ?

నలుడు భార్య చీరెచెంగులోని సగభాగమును చించుకొని మొలకు చుట్టుకొని అత డెక్కడికో పోయెనుగదా!

అత డొక మహారణ్యమధ్యభాగమున నడచుచుండెను. ఆ యరణ్యమున దావాగ్ని చెలరేగినది. ఆ అగ్నిజ్వాలల మధ్యనుండియే నలున కొక యార్తనాదము వినిపించినది. రక్షింపుము! రక్షింపుము! నలుని అడుగు ముందుకుసాగలేదు. అతడు శరణాగత రక్షకుడు. బ్రహ్మణ్యమూర్తి నలునిదృష్టి దావాగ్నివైపుకు మరలినది. తనను పిలిచినది ఒక సర్పరాజము. శరణువేడిన దెవ్వరైన నేమి? ఆ సర్పమును దావాగ్ని మధ్యమునుండి రక్షించినాడు. బయటపడిన సర్పము నలున కేదియో సాయము చేయదలచినది. నలుని ఒకటినుండి పది వరకు సంఖ్యను లెక్కపెట్టమన్నది. నలుడట్లే చేసినాడు. పదియవ సంఖ్యకు సంస్కృతమున 'దశ' అను పదము. 'దశ' అను పదమునకు పది యనియే అర్థముకాదు. కరచుట అనునదికూడా అర్థము. నలుని పదము కాటువేయుము అను అర్థము వచ్చుటచే ఆ నాగరాజు నలుని కాటువేసినాడు. ఆ సర్పరా జెవ్వడు? అతడు కర్కోటకుడు. నలుని శరీరము నావరించియున్న కలిపురుషుని తన విషజ్వాలలచే దహించి, నలున కుపకారము గావింపవచ్చిన నాగవంశములోని దివ్యాంశ సర్పము. నలుని యాకృతి మారినది. మరగుజ్జువాని శరీరమువలె పొట్టిదైనది. నలుని చూచి ఇతడు నలుడని ఎవ్వరును గుర్తుపట్టరు. గుర్తు తెలియకుండుటకే కర్కోటకుడు నలుని కాటువేసినాడు. కర్కోటకుడు తన నిజరూపమును నలునకు చూపి, తన యథార్థ స్వరూపమును చెప్పి, ప్రస్తుతమున నలు డేదేశమునం దేపేరు పెట్టుకొని జీవింపవలెనో గూడ

కర్కోటకుడదే చెప్పినాడు. చెప్పుటేకాదు. కర్కోటకుడు నలునకు రెండు వస్త్రముల నిచ్చినాడు. అవి దివ్యవస్త్రములు. నలుని సహజరూపము రావలెనన్న ఆ రెండు వస్త్రములను నలుడు తనపైన కప్పుకొని తన నిజరూపమును భావించవలెను. అంతతో నలునకు తన నిజరూపము వచ్చును. అవి యట్లుండ కర్కోటకుడు కాటువేసెనుగదా ! ఆ విష జ్వాలలు నలుని బాధింపవా ? కర్కోటకుడు తన విషజ్వాలలు నలుని బాధింపవనియు, నలుని ఆశ్రయించిన కలిపురుషుని బాధించుననియు నలునితో చెప్పినాడు. తరువాత కర్కోటకుడు నలునకు నీవు త్వరలో విదుడవగుదువని వరమిచ్చినాడు.

నలుని పేరు ప్రస్తుతమున బాహుకుడు. ఆ పేరుననే నలుడు అయోధ్యాపురమున ఋతుపర్ణుని రాజ్యమునందు ప్రవేశించినాడు. అశ్వయానమతని ప్రధాన శిల్పము (రథసారథ్యము) పాకశాస్త్రము నందును నలుడు ప్రవీణుడే. వంటల చేయును. గుఱ్ఱములను తోలును. వార్ష్ణేయుడును, జీవలకుడును నలుని సేవకులు. వారిద్దరునుగూడ ఋతుపర్ణునివద్దనే యుండిరి. కాని వారిద్దరును నలుని గుర్తించలేదు. కర్కోటకుడు నలుని ఋతుపర్ణునియొద్ద కేల పంపెను ? పుణ్యపురుషులకు దేవతలు చేయు సాయము లిట్లే యుండును. ఋతుపర్ణుడు రాజర్షి. అతనికి అక్షహృదయమ్మము తెలియును. అతనివలన నలునకు అక్ష హృదయము ప్రాప్తించవలెను. అది ప్రాప్తించినగాని నలునకు కలి పురుషుని బంధము వదలదు. అందుకే కర్కోటకుడు నలుని ఋతుపర్ణుని వద్దకు పంపినాడు. ప్రస్తుతము దమయంతి సైరంధ్రియై యుండ నలుడు రథసారథియై తమ బ్రతుకులను గడపుచుండిరి.

ఒక్కమారు విదర్భకేగుదము భీమరాజునకు నలదమయంతులను గూర్చిన వృత్తాంత మేమియు తెలియలేదు. విదర్భదేశమునుండి భీమ

రాజు పంపగా కొందరు బ్రాహ్మణులు నలదమయంతు లేమైరో తెలుసుకొనుటకు బయలుదేరినారు. భీమరాజు దమయంతిని తెలుసుకొన్న వారికి కొన్నివేల గోవులను బహూకరించును.

విదర్భనుండి బయలుదేరిన బ్రాహ్మణ బృందమునందు సుదేవు డను బ్రాహ్మణుడు అదృష్టవంతుడు. చేది రాజ్యమున సునందవద్ద సైరంధ్రి జీవనము చేయుచున్న దమయంతిని సుదేవుడు గుర్తుపట్టినాడు. బ్రాహ్మణులకు రాజాంతఃపుర ప్రవేశము చాల సులభము. సుదేవు డంతఃపురమునకేగి, సునందకు దమయంతి వృత్తాంతమును చెప్పి, దమయంతిని విదర్భకు చేర్చినాడు. దమయంతి పితృగృహమును చేరుకున్నది. ఇక నలుని సంగతి.

నలుని కనుగొనుట చాలకష్టము. అతని బాహ్యరూపము మారిపోయినది. అతని గుణచిహ్నముల నాధారములుగా నలుని కనుగొనవలెను. అది దమయంతికే సాధ్యము. దమయంతి ఒక ఉపాయ మాలోచించినది. విదర్భదేశమున పర్ణాదుడను బ్రాహ్మణు డొకడు కలడు. సుదేవునకే ఆపేరు. అతడు ఎండుటాకులను భుజించి జీవించును. కావుననే అతడు పర్ణాదుడను పేరు నొందినాడు. అతడు బ్రహ్మణ్యుడు. దమయంతి ఆ మహనీయుని ఆశ్రయించినది. తనను కనుగొన్నది ఆతడే. నలుని గురించిన కొన్ని శ్లోకములను ఆ బ్రాహ్మణునకు చెప్పినది. ఆ శ్లోకముల కేరాజ్యమునం దెవ్వడు సమాధాన మిచ్చునో తెలిసికొని, ఆ సమాధానములను తనకు తెలుపుమని విన్నవించినది. పర్ణాదు డా శ్లోకములను కంఠస్థము గావించుకొని, దేశదేశముల చరించుచు అయోధ్య కేతెంచినాడు. పర్ణాదుడు పఠించిన శ్లోకములకు ఋతుపర్ణుని రాజ్యమున సమాధాన మందినది. ఆ శ్లోకములోని భావమిది.

ఓ వితవో! మహారణ్యమధ్యమున నిద్రించు ఇల్లాలిని ఆ యరణ్యమధ్యమునందే విడిచి, నా చీరెముక్కను చించుకొని ప్రయాణ మైతివి. ఓ, ప్రియుడా? నీవానాడు ఏవిధమున నీ ప్రియురాలను విడిచి వెళ్ళితివో ఆమె నేటివరకును ఆ జీర్ణవస్త్రమునే, ఆ ఖండవస్త్రమునే ధరించి, నీకొరకై నిరీక్షించుచున్నది. నీవనుగ్రహబుద్ధికలవాడవై నా వాక్యములకు సమాధానమిమ్ము. పర్ణాదునకు సమాధాన మిట్లు వచ్చినది.

కులస్త్రీలకు కష్టములు రాగా వారు తమ నెదుర్కొను విపత్తులను సహించి, తమ నాథులను కోపింపక సౌశీల్యమను కవచమున తమ ప్రాణధారణను గావించుకొనుచు స్వర్గరాజ్యమును జయింతురు. కాల ప్రభావమున మూఢుడై విషమ ఘట్టమునం దిరికియున్న ఏ నాథునిచేత ఆతని ధర్మపత్ని వదలిపెట్టబడినదో ఆమె క్రోధమును చెందుట యుక్తముకాదు. అను విషయములు సూటిసమాధానములై పర్ణాదున కందినవి. పర్ణాదుడు దమయంతి కందించినాడు.

ఇక నలుని విదర్భకు రప్పించవలెను. ఉపాయమేమి? దమయంతి కొక ఉపాయము తోచినది. అది ఆమె ద్వితీయ స్వయంవరము. ఉపాయమునకు రెండవపేరు నీతి. నీతిని ధర్మసంరక్షణకును, ప్రాణ సంరక్షణకును వాడవచ్చును. వాడవచ్చునుకాదు. వాడవలెను. ప్రాణ రక్షణకై చివరిసమయమున వాడు విషము ఔషధమగును. దానిపేరు విషముకాదు.

భారతీయ సిద్ధాంతమున రాజపుత్రికలకు ద్వితీయ స్వయంవర మనునది లేదు. అది ఏనాడును లేదు మరి ఆ ఘట్టము లేకున్న ఆ పదమెట్లు వచ్చినది? అనువారుండవచ్చును. పదజాలముచే వాడబడు విషయము లన్నియు ప్రతి కుటుంబములందును ఆచారములై యుండ నవసరములేదు. మారు మనువను పదమునకే ద్వితీయ స్వయంవరమను

పదము సంస్కృతమున వాడబడును. అది కొన్నిదేశములందు కొన్ని జాతులు వాడుకొనుచుండవచ్చును. అంతమాత్రమునం దది సర్వసమాజనిష్ఠమై యుండియుండవచ్చునని భావించుట పిడివాదము. సృష్టియం దెన్నియో విషయములు వర్జితములై యున్నవి. అవన్నియు అన్ని సమాజములయందును, అన్ని దేశములయందును వాడుకయందున్నవని గాని, అవి ఒకానొక కాలమున ధర్మములై వర్ధిల్లినవనిగాని వాదించుట మూర్ఖవాదము. దొంగతనమను పదము కోశమునందున్నది. అది ఒకనాటి దేశాచారముకాదు. ఆ దొంగను పట్టుకొనుటకొరకై గూఢచారి సంస్థలు ఆ దొంగలముఠాలుగా పేర్కొనబడి ఆ వేషములనే ధరించుటయుగలదు. అది ఉపాయమగునుగాని వారు శిక్షాపాత్రులగుదురా? అట్లే కొన్ని నిషేధములనుకూడ ఉపాయముగా వాడుకొనగా దానిని దేశాచారమనియు నాటి కాయాచారములుండి యుండవచ్చుననియు మాట్లాడువారలకు నమోవాకములు. ప్రకృత కథాంశమునకు వత్తము. దమయంతి ద్వితీయస్వయంవరము ఉపాయ కోటియందు చేరినదికాని, అది నాడు రాజకుటుంబము లందున్న ఆచారముకాదు. ఆచారమగుచో దేశమున కంతకును చాటక ఋతుపర్ణునకు మాత్రమే ఏల కబురు పంపును?

దమయంతి సుదేవునితో ఋతుపర్ణునకు తన ద్వితీయ స్వయంవరము జరుగుననియు, అది రేపు సూర్యోదయముననే జరుగుననియు సందేశమంపినది.

బాహుకుడు అశ్వకోవిదుడు. ఋతుపర్ణుడు రెండవరోజు సూర్యోదయముననే విదర్భకు చేరవలెనన్న బాహుకుడు తనను చేర్చగలడని ఋతుపర్ణుడూహించినాడు. బాహుకునకు ఆజ్ఞ యిచ్చినాడు.

దమయంతి ద్వితీయ స్వయంవరమున కేగుటకు గదా ? అతడు రథము నాయత్తము చేయవలెను.

నలు డిట్లూహించినాడు. దమయంతి ద్వితీయ స్వయంవరమునకు తలపడెనా ? అబద్ధము.

శ్లో॥ దమయంతీపదే దేతత్ కుర్యాద్దుఃఖే నమోహితా.
అస్మదర్థే భవేద్వాయం ఉపాయశ్చింతితో మహాన్
నైవంసా కర్హిచి త్కుర్యాత్ సాపత్యం నావిశేషతః.

దమయంతి రెండవవానిని వరించునా ? నన్ను రప్పించుటకైన యుపాయమును పన్నియుండును. అని భావించి, దమయంతి చేసినది ఉపాయమేనని నలుడు నిర్ణయించుకొని రథము నాయత్తపరచినాడు. గుఱ్ఱములను మాత్రము బక్కచిక్కిన వాటిని రథమున కమర్చినాడు. కాని అవి లక్షణసమన్వితములు. ఋతుపర్ణుడు ఇదేమి యని కోపింపగా అశ్వలక్షణములను వర్ణించినాడు.

రథము సాగినది. రథపయనము వియత్తలమున సాగుచున్నదా ? అనునట్లున్నది. ఋతుపర్ణునకు సందేహము కలిగినది. ఇతడు మాతలియా ? నలుడా ? లేక శాలిహోత్రుడా ? నాటికి వారు ముగ్గురును రథచోదనమున సమానస్కంధులు. ఇతడు నలు డనుటకు రూపమట్లులేదు. అత డట్లూహించుచుండగనే రథము చాలా దూరముపోయినది. ఋతుపర్ణుని ఉత్తరీయము మధ్యేమార్గమున జారిపోయినది. ఋతుపర్ణుడు ఉత్తరీయము జారినదని సూతునకు చెప్పునంతలోనే రథము కొన్ని క్రోసులు గడచినది. బాహుకుని ప్రభావమునకు ఋతుపర్ణుడు ముగ్ధుడై తన ప్రభావము నొకదానిని బాహుకునకు చూపదలచినాడు. వారు పోవు త్రోవ యందొక బూరుగచెట్టున్నది. దాని కొమ్మలు, రెమ్మలు, కాయలు, పూవులు, పండ్లు, ఆకులు కలసి ఇన్ని యున్నవని ఋతుపర్ణుడు లెక్క

చెప్పినాడు. నలున కా విద్య తెలియదు. ఋతుపర్ణునకు అశ్వవిద్య తెలియదు. అందరికును అన్ని విద్య లెట్లు తెలియును? బాహుకుడు రథమును నిలిపి, ఒక కొమ్మను పరీక్షించగా నిజమని తేలినది. ఈ విద్యకు సాంఖ్యవిద్య యని పేరు. ఇంద్రియసృష్టికి మూలకారణమగు బ్రహ్మతత్వము నెరింగిన వాని కీవిద్య కరతలామలకము. దీనినే అక్ష హృదయ మందురు. అక్షము లనగా ఇంద్రియములు. నలు డీవిద్యను ఋతుపర్ణుని అర్థించినాడు. అర్థించుటలో తన అశ్వవిద్యను ఋతుపర్ణున కిచ్చి దీనిని పొందగోరినాడు. ఋతుపర్ణుడు నలున కీవిద్య నొసంగి, అశ్వవిద్యను తరువాత గ్రహింతునని చెప్పెను. అక్షహృదయమును నలున కందించినాడు ఋతుపర్ణుడు.

నలుని దురదృష్టదివసములు తొలగినవి. కలిపురుషుడిక నలుని యందుండజాలడు. కర్కోటకుని విషాగ్నిజ్వాలలు నలుని ఆశ్రయించిన కలిపురుషుని దగ్ధము గావించుచున్నది. విషాగ్ని జ్వాలాకీలల కా కలి పురుషు డోర్వజాలనిస్థితియందే అక్షహృదయముకూడ నలునిచేతికి వచ్చినది. అంతతో కలిపురుషుడు నలుని శరీరమునుండి బయటకు వచ్చినాడు. పురుషాకృతితో నిలబడినాడు. కర్కోటకుని విషజ్వాలలు నలుని ముఖమునుండి బయటకురాగా కలిపురుషుడు సాక్షాత్కరించగా నలుడు నలుడయ్యెను. కలిపురుషుని శపించుటకు నలు డుద్యుక్తుడయ్యెను. కాని నలుడు శరణాగతరక్షకుడుగదా! కలిపురుషుడు గజగజ వణకుచు నలుని శరణువేడినాడు. మొట్టమొదట అరణ్యమధ్యమున దమయంతి శాపాగ్నికి దగ్ధమైపడిన కిరాతు డీ కలియే. తన వృత్తాంతమును చెప్పుకొనుచు దమయంతి శాపాగ్నికి దగ్ధమైతిననియు, తరువా తది కర్కోటకుని విషమనియు చెప్పి నన్ను శపింపకుండ వదలుచో నీకు కీర్తి నొసంగుదునని శరణు వేడినాడు. నలుని కీర్తించినవానికి కలి

భయముండదు. అదియే కలి యిచ్చిన వరము. అక్షహృదయ గ్రహణ ప్రభావమున కలి బహిర్గతుడగుటయు నలునకు వరమిచ్చుటయు జరుగగా కలిపురుషుడు ఆ విభీతకవృక్షము నాశ్రయించినాడు. నలుని వికృత రూపము మాత్రము నలుని అవసరముపై అతని స్వాతంత్ర్యమునం దున్నది. రథము విదర్భకేగినది. స్వయంవర చిహ్నములేవియు విదర్భయందు లేవు. ఋతుపర్ణుని రాకకు భీమరాజు స్వాగతము నిచ్చి, రాకకు కారణ మడుగగా అతడేమి చెప్పును ? చూచిపోవుటకు వచ్చితినని చెప్పినాడు. దమయంతి పంపిన సందేశము సంగతి తండ్రికి తెలియదు. తల్లి యనుమతితో సుదేవుని పంపినది.

ఋతుపర్ణు డతిథిగృహమున ప్రవేశించినాడు. ఇక వార్ష్ణేయ బాహుకుల గమనింతము

నలుని గుఱ్ఱములు కుండిన నగరమునందున్నవని మీ రెరుగుదురు. ఆ యశ్వములు నలుని రథఘోషమును గుర్తించినవి. అవి సంతోషమున సకిలింపగా వాటి సకిలింపులు దమయంతికి నలుని రాకను చెప్పినవి. దమయంతికి నలుడు వచ్చెనని స్థిరమైనది. కాని నలుడు దమయంతి దృష్టియందుపడలేదు. వార్ష్ణేయుని మాత్రము దమయంతి గుర్తించినది. ఇక నలుని నిర్ణయించవలెను. కేశిని యనునది దమయంతికి దాసి. పొట్టి చేతులతో మరజ్జువానివలె రథమునందొక డుండెను. అతనిని దమయంతి చూచినది. అతడే నలుడు కావచ్చును. తన దాసిని పిలచినది. పర్ణాదునకు చెప్పిన వాక్యములను దాసికి చెప్పి, ఆ పొట్టివాని దగ్గరకు దాసిని పంపినది. ఆ వాక్యముల వినునప్పుడు పొట్టివాని ముఖకవళికలను గుర్తెరిగి రమ్మన్నది. సమాధానములనుకూడ వినమన్నది. వారిద్దరి సంభాషణను తాను మేడపైనుండి విన్నది. కేశినికిని, బాహుకునకును ఈ క్రింది విధముగ సంభాషణ జరిగినది.

కేశి :- స్వాగతము స్వామి ! తమ నామధేయము ?

బా:- నా పేరు బాహుకుడు

కేశి:- తమ రాకకు కారణమును మా దమయంతీ మహారాణి తెలియ గోరినారు.

బా:- మీ దమయంతీదేవిగారి ద్వితీయస్వయంవరమని బ్రాహ్మణుల వలన విని ఋతుపర్ణుడు రాగా అతని సారథినై నేనును వచ్చితిని. నా పేరు బాహుకుడు. నూరు యోజనముల దూరము నుండి మా పయనము సాగినది.

కేశి:- తమతో కలసియున్న ఆ పురుషు డెవ్వడో ?

బా:- అతడు వార్ష్ణేయుడు. నలుని సారథి. ఆ నలుడు దేశాంతరములపాలు కాగా ఋతుపర్ణునివద్ద సారథి యయ్యెను. నేనును అశ్వ కోవిదుడనే. ఒకనాడు నలుని సారథిని.

కేశి:- అటులైన నలుని వృత్తాంత మా వార్ష్ణేయులకు తెలిసి యుండవచ్చునేమో ?

బా - వార్ష్ణేయునకు తెలియదు. నలుని బిడ్డ లిద్దరును ఇచ్చటనే యుండగా నలు డెచ్చటనో రూపాంతరమునొంది యుండినాడు. ఆ నలుని తెలుసుకొనుట కెవ్వరికిని సాధ్యముకాదు. అతని ఆత్మచిహ్నముల నాతడే ఎరుగును. తన చిహ్నముల నాత డెవ్వరికి చెప్పడు.

కేశి:- పర్ణాదుడను బ్రాహ్మణుడు ఒక స్త్రీ చెప్పిన శ్లోకములను అయోధ్య యందు పాడగా నా డా శ్లోకములకు నీవు సమాధాన మిచ్చితివట. మరల యా శ్లోక ప్రతివచనములను మావైదర్భి విన గోరుచున్నది బాహుకా !

శ్రోతలారా ! కేశిని మరల ఆ శ్లోకములను పఠించి ఆ ప్రశ్నను ప్రశ్నించగా బాహుకుని హృదయ మొక్కమారు కదలబారినది. కన్నుల

నిండ నీరు గిర్రున తిరిగినది. ఎట్టకేల కా చిహ్నములను మరుగువరచి నాటి ప్రతివచన శ్లోకములను కేశినికి వినిపించినాడు. నలునకు దుఃఖ మాగలేదు. వెక్కి వెక్కి ఏడ్చినాడు.

కేశిని దమయంతివద్ద కేగినది. సమాచార మందించినది. నలుని రాక దమయంతికి రూఢమైనది. అయ్యును బాహుకుని వంటయింటికి మరల కేశినిని పంపినది. అతని వంటకమును తెప్పించినది. ఆ దివ్య రసాయనములు నలునివని గ్రహించినది. మరొక్క పరీక్ష మిగిలినది. దానితో తాను నలుని ఎదుటపడగలనని నిర్ణయించుకొన్నది.

తన పుత్రరత్నమును, పుత్రికనుగూడ కేశినితో బాహుకునివద్దకు పంపినది. తన అత్మానురూపులగు నా చిన్నిబిడ్డల చూచి నలుడు దుఃఖము నెట్లు మ్రింగగలడు ? అతని దుఃఖము పొంగిపొరలినది. ఆ బిడ్డల కౌగలించుకొనినాడు. కేశిని కేమని చెప్పును ? ఒకప్పుడు తన బిడ్డ లిట్లుండగా స్మృతికి వచ్చి కంటినీరు కార్చితినని చెప్పినాడు. కేశినిని వెళ్ళుమని తరిమినాడు. అతడు నలుడే. దమయంతికి నిర్ణయమైనది. దమయంతి ఈ వృత్తాంతమంతయు తల్లికి తెలిపినది. ఇక నలునిరూపము యథార్థమై కనబడవలెను. దమయంతి తన మాతా పితరులద్వారా నలుని అంతఃపురమునకు రావించినది. నలుడు రాజాంతఃపురమున బాహుకవేషముతోడనే వెళ్ళినాడు. దమయంతి నాడు నలుడు చించుకొన్న చీరెనే ధరించి, సంస్కారహీనయై నలునకు సాక్షాత్కరించినది. ఒకరినొకరు చూచుకొనగా వారి హృదయము లొక్క క్షణకాలము శోకసాగరములైనవి. ఎవరి నెవరు పలుకరింప వలెను ? దమయంతి నలునిపై పు దిరిగి, ధర్మజ్ఞా అని సంబోధించి, మిమ్ముల నే నొకప్పుడెరుగుదునని అరణ్యమధ్యమందలి తన నిద్రావస్థను చెప్పి, నలుని ప్రయాణమును జ్ఞాపకము జేసినది. జ్ఞాపకము చేయుట

క్రాదు. కన్నీటిధారల కార్చినది. నలు డేమనవలెను ? అతడును కలి పురుషుడు తనను ఆవరించగా వెడలిన ప్రయాణమును చెప్పి, తన దురదృష్టమును వెళ్ళిపోసుకొనుచు ద్వితీయస్వయంవరము నుద్ఘాటించినాడు. దమయంతి హృదయ మెద్దియో నిర్ణయించి, నలునకు సాక్ష్యమిచ్చున దెవరు ? దమయంతి దేవతలనే పణమొడ్డినది. స్వర్గలోకము లోని కల్పవృక్షము. తన సుగంధ ప్రసూనముల జజలరాల్చి, దమయంతికి నలునియందున్న పవిత్రభావమునకు సాక్ష్యమివ్వగా రూపరహితుడై నను వాయువు అకల్పప్రసూనములను భూలోకమునకు గొనివచ్చి తాను సాక్ష్యమిచ్చినారు. ఆకాశవాణిము క్తకంఠమున దమయంతి సాధ్వీత్వమును చాటినది. నలున కింక సందేహ మెక్కడిది.

కర్కోటకుని వస్త్రములను నలుడు కప్పుకొనగా అతని నిజరూపము బహిర్గతమైనది. అంతియే. ఆ మాసినచీరెతోడనే దమయంతి నలుని కౌగలించి, యాక్రోశించినది. నాటికి నాలుగు సంవత్సరములు గడచినవి. నలదమయంతుల వియోగము నేడు మరల సంయోగముకాగా, నలుడు మరల పుష్కరునియొద్దకేగి, ద్యూతమునకు వచ్చుటగాని, యుద్ధమునకు సిద్ధమగుటగాని తప్పదనినాడు. యదార్థమునకు పుష్కరుడు దుర్మార్గుడు కాడు. కలి ప్రేరణము. కావున పుష్కరు డా విషయమునే నలునకు విన్నవించి, నలుని రాజ్యమును నలున కివ్వగా నలదమయంతులు నిషధ దేశమున కేగినారు.

శ్రోతలారా ! మన మెక్కడయుంటిమి ? ధర్మజునివద్ద ఉంటిమి. బృహదశ్వుడను మహర్షి ధర్మరాజున కీ నలోపాఖ్యానమును చెప్పి, ధర్మజునకుకూడ అక్షహృదయము నిచ్చినారు. ధర్మజా ! నీవును నీరాజ్యమునందు నలునియట్లు పట్టాభిషిక్తుడ వయ్యెదవని బృహదశ్వ మహర్షి వారు అనుగ్రహించినారు.

ఆర్య మహాశయులారా!

మానవ జీవితము నుద్ధరింపదగినవే భారతీయ మహర్షుల, రాజర్షుల దివ్యచరిత్రములు. నలుని చరిత్రము భారతీయ చక్రవర్తుల యాదర్శ జీవితము లందలి మాణిక్యము కాగా దమయంతి పాతివ్రత్య ప్రభావము భారతనారీమణులకెల్లర కమూల్యాలంకారమై వెలసినది. ఇట్లెన్నియో కథ లీ యరణ్యపర్వమునం దున్నవి. అవన్నియు మన యుపన్యాస పణితియందు వర్ణించుట దుర్లభము. నలచరిత్రము కలి నిర్హరణ మగుటచే దీనికి స్థాన మిచ్చినాను.

స్వస్తి ప్రజాభ్యః.

ఈనాటికి యుపన్యాసము ముగిసినది.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# తీర్థయాత్రలు

మహాశయులారా !

మన మీనాటికి భారతామ్నాయమందలి అరణ్యపర్వ కథాంతర్భాగమునం దుంటిమి. నిన్నటిదినమున బృహదశ్వమహర్షి వారు ధర్మజునకు నలోపాఖ్యానమును ప్రపంచించి వెళ్ళగా నేడు నారద మునీంద్రులను లోమశ మహర్షియు, మార్కండేయ మహర్షుల యాగమన విశేషములను శ్రీకృష్ణసత్యభామాదుల రాకయు నను విషయము లుపన్యసింపబడును.

ధర్మజాదుల కింతవరకు పాశుపతాస్త్రముకై వెళ్ళిన పార్థుని సంగతి తెలియలేదు. ధర్మజుడును, భీమ, నకుల, సహదేవులును, ద్రౌపదియు అర్జునుని గురించియే బాధనొందుచున్న సమయమున నారద మునీంద్రులు విచ్చేసినారు. మహనీయులరాక దుఃఖశోకాద్యుపశమనము గదా! ధర్మజుడు మునీంద్రులకు పాద్యార్ఘ్యముల నిచ్చి భూప్రదక్షిణమును గావించుటవలన కలుగు ఫలమును చెప్పుమనగా నారదమునీంద్రులు పులస్త్యమహర్షి వారొకప్పుడు భీష్మునకు చెప్పిన తీర్థయాత్రాప్రకరణము నంతను చెప్పినారు. తీర్థయాత్రల ప్రాముఖ్యము పులస్త్య మునీంద్రు లిట్లు నుడివినారట.

'ఋషీణాం పరమం గుహ్య మిదం భరతసత్తమ
తీర్థాభిగమనం పుణ్యం యజ్ఞైరపి విశిష్యతే'

యజ్ఞములకంటెగూడ నుత్కృష్టములగు పుణ్యముల నిచ్చునది తీర్థయాత్రా నిర్వహణమట. పులస్త్య భీష్మ సంవాదమనుపేర అనేక

పుణ్యక్షేత్రములను, ఆ పుణ్యక్షేత్రముల సేవించదగు విధానములను ఏయే పుణ్యక్షేత్రముల జేయే దానముల నొసంగిన నుత్కృష్ట ఫలము వచ్చునో యను విషయములను చెప్పి నారదమునీంద్రులు వెళ్ళగా, ధౌమ్య మహర్షివారును అనేక తీర్థములను గురించి వివరించుట జరిగినది. ఎవరెవరి ప్రబోధము లెంత మధురములై యున్నను ధర్మజాదుల కా శ్రవణ సమయమున సామాన్యమగు తాపము శమించు చుండెనేగాని అర్జునుని వియోగబాధ మాత్రము వారినుండి తొలగుటలేదు. నారదుడు వెళ్ళినప్పుడు లోమశ మహర్షి వారు స్వర్గలోకమునుండి నీకడకు వచ్చునని చెప్పినారు. ఆ లోమశమహర్షివారి రాకకై ధర్మజాదులెదురు చూచుట జరుగుచున్నది. ధౌమ్యులు చెప్పు తీర్థయాత్రా విశేషములు వినిన ధర్మజునకు అర్జునుడు పాశుపతాస్త్రమును తెచ్చులోపల తీర్థాటనము గావింతమని యొక కుతూహలము కలిగినది. మహనీయుల సంకల్పములు వ్యర్థము లగునా ! అట్లా ధర్మజుని సంకల్పము నెరవేర్ప స్వర్గలోకము నుండి లోమశమహర్షివారు రానే వచ్చినారు.

లోమశమహర్షి స్వర్గలోకమున కేగినపుడు దేవేంద్రుడును, అర్జునుడును ధర్మజుని తీర్థయాత్ర చేయించుటకును అర్జునుని వృత్తాంతమును ధర్మజున కెరిగించుటకును లోమశమహర్షిని కోరి యుండిరని మీకు లోగడ చెప్పినాను. లోమశమహర్షివారి యాగమనము ధర్మజుని కత్యంతానందము నొసంగ వారి కర్ఘ్యపాద్యాదులనిచ్చి, మునీంద్రా ! తమ యాగమన మెక్కడనుండి ? యని ప్రశ్నించినాడు. మహర్షి తన రాక స్వర్గసీమనుండియని చెప్పి అర్జునుని యసదృశ పరాక్రమమును వర్ణించుచు, పాశుపతాస్త్రప్రాప్తియు, ఇంద్రుని యర్ధాసనమునం దాయర్జునుని యునికియుగూడ చెప్పి – పిన్నమ తీర్థములకు గొంపోయి సర్వతీర్థాభిగమన పుణ్యఫలము నందించుట కింద్రుడును,

నీ తమ్ము డర్జునుడును నాకు చెప్పి పంపిరని చెప్పినారు. ధర్మజుని యానందమునకు మేరలేదు.

ఉ॥ నన్నుదలంచి తీర్థగమనం బొనరింపగ బంచెనట్టి వి
ద్వన్నుత దేవవల్లభుడు దాన కృతార్థుడ నైతి దానిపై
నిన్ను సహాయుగా బడసి నెమ్మి నశేష విశేష తీర్థముల్
బన్నుగ జూడ గాంచి కడుభవ్యుడనైతి మహామునీశ్వరా!

అని మునిని ప్రశంసించి మునీంద్రా! యేను దొల్లియు నారద ధౌమ్యుల వచనంబులం దీర్థ గమనోన్ముఖుండనయి యున్నవాడనని విన్నవించినాడు.

ధర్మజాదుల తీర్థయాత్ర సాగినది. వారివెంట తరలివెళ్ళిన బ్రాహ్మణ బృందమును, యతివరులునుగూడ ధర్మనందనునితో పయనము కాగా వ్యాసభగవానులును, పర్వత, నారదులును వారికి సాక్షాత్కరించి, తీర్థయాత్రలయందు ముఖ్యములై నడవదగు నియమముల నుపదేశించి వెళ్ళినారు. తీర్థయాత్రలు భారతీయుల దృక్పథమున విలాసయాత్రలు కావు. అవియు యజ్ఞ నిర్వహణములే. తీర్థయాత్రలయం దాహార నియమమునేగాక బ్రహ్మచర్యాది నియమముల బాహ్యాభ్యంతర శౌచముల నిర్వర్తించుచు తీర్థయాత్రల చేయుటయే భారతీయుల సంప్రదాయము.

ధర్మజాదులు తమ వెంటనంటియున్న విప్రవరుల తోడను, బ్రహ్మర్షి సత్తములతోడను, అనేక తీర్థముల సేవించిరి. పెక్కు పుణ్య క్షేత్రముల వసించిరి. భూఖండమున వారికి చొరరాని చోటెక్కడ!

కొన్ని పర్వతప్రాంతముల ద్రౌపది పాదయాత్ర కసమర్థురాలు కాగా ఘటోత్కచుని యాహ్వానించినారు. అతని సాయమున గంధమాదనము, మేరుపర్వతము నందలి ప్రదేశములుకూడ వారికి

ప్రతిబంధకములు కాలేదు అట్లు వారికెంతయోకాలము సుఖరాత్రులు కాగా గంధమాదనమునం దొక్క విశేషము జరిగినది.

వా రా గంధమాదన పర్వతమున చరించురోజులలో ఒక పెద్ద గాలివాన వచ్చుటయు, ఆ గాలివానలో భీమద్రౌపదు లొకచోటను, ధర్మజ ధౌమ్య నకుల సహదేవు లొకచోటను విడిపోగా, మరునాడొక సహస్ర పత్ర కమలము ద్రౌపది కంటబడినది. అదియొక అపూర్వ రమణీయ కుసుమరాజము. దాని వాసన దివ్యమగుటచే, ఆ పుష్పమువంటి పుష్పములను ద్రౌపది కోరినది. ఆ పుష్పరాజములకు ఉత్పత్తిస్థాన మెక్కడ? గదాపాణియై భీము డాపర్వత సానువుల కొంతదూర మేగగా అందొక కదళీవనము కనబడినది. దానిని దాటగా ఒక సరస్సు కాన వచ్చినది. ఆ సరస్సునందే ద్రౌపది కోరిన సౌగంధిక పుష్పము దొరకును. కాని ఆ సరస్సున కేగదలచిన భీమున కొక మర్కటరాజము తన తోకను త్రోవకడ్డముగా పరచి నిద్రించుచు అడ్డము వచ్చినది. నిజమునకది మర్కటము కాదు. అతడు హనుమంతుడు. భీమునకును అతనికి మైత్రియైనది. ఇద్దరును వాయుపుత్రులే. యుగప్రభావముచే భీమునికంటె హనుమంతుడు బలవంతుడు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగము లందు క్రమమార్గమున హ్రస్వదేహులును, క్షీణబల తపోతేజములు గలవారును పుట్టుదురు. ఈ విషయమునే హనుమంతుడు భీమునకు చెప్పినాడు. అయ్యును, తన పూర్వదేహమును సామాన్యమున చూపినాడు. అంతేకాదు. రాబోవు భారతరణరంగమున అర్జునుని రథ కేతనమున నిలుతునని వరమిచ్చి పంపినాడుకూడ. భీముడును సౌగంధిక పుష్పమును తెచ్చుటకై కుబేరుని సరోవరమున కేగగా, అది యక్షుల అధికారములోని దగుటచే భీమునకు వారితోడి యుద్ధము రాకతప్పలేదు. ఆ యుద్ధమున మాణిభద్రుడను యక్షుడు భీముని చేతిలో మడిసినాడు.

అట్లు యక్షుల మదమడచిన భీముడు ద్రౌపదికి దివ్యకుసుమమిచ్చి ధర్మజాదుల మన్ననను పొందుట జరిగినది. ఇది తీర్థయాత్రలలోని విశేషము. అర్జునుడు స్వర్గసీమ కేగి ఐదుసంవత్సరములు గడవగా, అర్జునుడు దివిసీమనుండి భూమిమీదకు రాదగు సమయమాసన్నమైనది. భీముని సౌగంధిక పుష్పాపహరణము కుబేరుని ధిక్కరించుట యని ధర్మజుడు కించపడగా, కుబేరుడే ధర్మజాదులకు దర్శనమిచ్చి, తనకది సమ్మతమని వాక్రుచ్చినాడు. అంతేకాదు, కుబేరుడు వారి నింకను ఆర్ష్టిషేణాశ్రమమునం దుంచి ఇందు మీరు పదునైదు దివసములు గడపుడనియు, మా యనుచరులే మీ సపర్యలకై వత్తురనియు చెప్పి వెళ్ళినాడు. కుబేరుని యనుచరుల సాయమున ఆర్ష్టిషేణాశ్రమమునం దట్లు కొన్నిరోజులు గడవగా అటనుండి, దాని కుత్తరదిశ యందున్న మందర, మేరు నగములనుకూడ ధౌమ్యులు చూపి ఆ ప్రదేశములకు కూడ పాండవులను తరలించగా వా రా పర్వతప్రదేశములందు మాసము రోజులుండుట జరిగినది.

అత్యుత్కృష్టమగు పుణ్యరాశి సద్యః ఫలమీయగలదని ఆర్యోక్తి గదా! వారి తీర్థయాత్రాఫల మీనాడు రాశియైనదికాబోలు! మాతలి రథము నధిరోహించి, దేవేంద్రుడును, అర్జునుడును వారికి సాక్షాత్కరించి నారు. విజయుని విరహవ్యాకులము పాండునందనులను, ద్రౌపదిని వీడగా, దేవేంద్రుడు విజయుని విజయయాత్రలను గురించి, ధర్మజున కెరిగించి, తాను స్వర్గసీమ కేగినాడు అరాత్రి గడచినది. మరునా డర్జునుడు తాను కామ్యకవనమునుండి పయనమైనది మొదలు పాతాళము నందలి కాలకేయాది రాక్షసుల సంహరించిన ఘట్టమువరకును సోదరులకు చెప్పగా, తమ్ముని యనిర్వచనీయ పరాక్రమమునకు చకితుడైన ధర్మజుడు అర్జునుని యస్త్రప్రభావముల నొక్కమాటు చూపమని

కోరినాడు. అర్జునుడును ఆగ్నేయాద్యస్త్రముల ప్రయోగించు సమయమున నారదులు వచ్చి, వాటి ప్రయోగముల నిషేధించినారు. (యుద్ధములలో తప్ప, ఇతర సమయములందు అస్త్రములను ప్రదర్శింపకూడదు.) పాండవుల తీర్థాటనము ముగిసినది. ఘటోత్కచుని అవసరము తీరగా ఆతనిని పంపి పాండవులు కామ్యకవనమునకు వచ్చినారు. ఇక్కడికి పాండవుల తీర్థయాత్రా ప్రకరణము సంగ్రహముగ ముగిసినది.

పాండవు లందరు కామ్యక వనమునందే వసించుచుండిరి. అది యొక మహోత్కృష్టమగు దివసము. పాండవులకే కాదు. రాబోవు భారత సంతతి కంతకునుకూడ యనుట యుక్తము. ద్వారకనుండి కృష్ణ పరమాత్మ సత్యభామా సమేతుడై పాండవుల చూడవచ్చుటను ఒకానొక బ్రాహ్మణుడు ముందుగనే పాండవులకు తెలిపినాడు. నాడే మార్కండేయ మహర్షి వారి యాగమనముకూడ నైనది. ఇదియొక చక్కని సభ. నారద మునీంద్రులును ఈసభ నలంకరించినారు. ఇం దనేక భారతీయ మహర్షుల చరిత్రలను నారదమునీంద్రుల యనుమతితో మార్కండేయ మహర్షి ధర్మజున కెరిగించుట జరిగినది. మార్కండేయ మహర్షి వారి జీవితమే భారతీయ సిద్ధాంతము. ఆత డెన్నియో సృష్టిస్థితి ప్రళయములను చూచిన చిరంజీవి. ఆత డెఱుగని యుగధర్మములు లేవు. ధర్మజుని కాతడు చెప్పు యుగప్రభావములలో నేటి మన కలి వర్ణనముకూడ చేయబడినది. జరిగిపోయిన కలియుగముల నెన్నిటినో మార్కండేయ మహర్షి వా రెరుగుదురు. వాటి విస్తారములనే ధర్మరాజునకు వినిపించినారు. మార్కండేయులకు చావులేదు. కావుననే కలిప్రభావమును చెప్పినారు. ప్రతి కలియుగమందును, మానవ సమాజమున కలి ప్రభావముచే సత్యము తరుగును. సత్య మరుదుకాగా, ఆయురారోగ్యము లోపించును. అల్పాయుష్కులకు విద్యయు స్వల్పమైయుండును. అల్పాల్పమగు విద్య

వలన సంపూర్ణమగు జ్ఞానము అలపడదుసరిగదా! అట్టి యల్పవిద్యలు భ్రాంతిజ్ఞానమునుకూడ నుత్పత్తి చేయును. దానిని వెంటనంటియే లోభిత్వముండును. లోభము కామజనకముకాగా, కామము క్రోధమ్మునకు జన్మస్థానమై, అన్యోన్య వైరములపాలు చేయును. ఒకరిపై నొకరికిగల వైరము, ఈర్ష్యాసూయల కాలవాలమై, వర్ణములన్నియు ఒకొరినొకరు పీడించుకొనుచు, ఒకరు చెప్పినదాని నొకరు వినుట కొప్పక వర్ణవిభాగమే ఈ సమాజ సముద్ధరణమున కడ్డము వచ్చుచున్నదని వర్ణసంకరము చేయుట కలికి ప్రధానాంశము కాగలదు.

వ్యాసభారతికి ఎఱ్ఱప్రెగ్గడ యనువాదమును పరికింపుడు.

సీ॥ సత్యంబు నరులకు సంక్షిప్తమగు సత్య
హాని నాయువుగడు నరిగిపోవు
నాయువు దరిగిన నల్పంబు లగు విద్య
లల్ప విద్యల వి మోహంబు మిగుల
మోహంబు వలనఁ బైమునరు లోభంబులో
భావేశమున గామ మగ్గలించు
గామంబు పెంపున గలుగు గ్రోధంబు క్రో
ధంబున వైరమెంతయును బెరుగు

ఆ॥ వైరమున నశేష వర్ణులు నన్యోన్య
పీడ చేయుచును విభిన్న బుద్ధి
నొక్కడొకని మేర నుండక వర్ణసం
కరము చేయ గలరు కలియుగమున.

మరికొన్ని విషయములుకూడ అచ్చుగ్రుద్దినట్లు చెప్పబడినవి: పంటలు ప్రబలములై యుండకపోగా, పదార్థము లందలి రసమింకిపోయి-పుష్టిని చేకూర్చజాలవట. పశువుల పాడి తరగిపోవునట. పుష్పజాతులు రంగుల నీనుచున్నను గంధవిహీనములై యుండునట.

కం॥ రస గంధ ద్రవ్యంబులు
పసచెడు సస్యంబు లల్పఫలములగు మహిం
బసి వాడి దంగు దరువుల
గుసుమ ఫలంబులును గరము గొంచెంబులగున్.

మరియొక ముఖ్యవిషయ మేమన- పంట నెక్కుడు చేయవలెనను దురాశచే పంటకాల్వల ప్రక్కభాగములనుగూడ పశువుల గ్రాసముల కైనను వదలక పంటల పండించదలచగా పంటలన్నియు తాలు ధాన్యములై పోవునని చెప్పెను. అవియు అల్పఫలములనే యిచ్చునని భావము.

'సరిత్తీరేషు కుద్దాలై ర్వాపయిష్యంతి చౌషధీః
తాశ్చాప్యల్ప ఫలాస్తేషాం భవిష్యంతి యుగక్షయే॥
నకన్యాం యాచతే కశ్చిన్నాపి కిన్యాప్రదీయతే
స్వయం గ్రాహా భవిష్యంతి యుగాంతే సముపస్థితే'

నాకు నీకూతునిచ్చి వివాహము గావింపుమని యడుగుట యుండదు. ఇచ్చువాడును ఉండడు. ఒకరినొకరు మోహించుకొని వివాహముల గావించుకొందురట. అనగా భారతీయత అస్తమించునని భావము. వైవాహిక పద్ధ ధర్మములు భారతజాతి కమూల్యాలంకారములై, పాశ్చాత్యుల నెందరినో ముగ్ధుల గావించుచుండగా వారి ధర్మములు నేడు మనకు నాగరికతలైనవి. ముందు విషయముల వినుడు ధర్మజా!

'నవిశ్వసంతి చాన్యోన్యం యుగాంతే పర్యుపస్థితే.
కలియుగమునందు ఒకరినొకరు నమ్మట కల్లయట.

'నవ్రతాని చరిష్యంతి బ్రాహ్మణా వేద నిందకాః
న యక్ష్యంతి నహోష్యంతి హేతువాద విమోహితాః'

బ్రాహ్మణులగువారు హేతువాదముల గావించుచు వేద నిందకులై పుణ్యకర్మల గావింపరు.

'రాజానశ్చాప్య సంతుష్టాః పరార్థాన్ మూఢచేతసః
సర్వోపాయైర్హరిష్యంతి యుగాంతే సముపస్థితే'

పాలకులగువారు ద్రవ్యలుబ్ధులై, ప్రజల ధనమును ఉపాయాంతరములచే హరించుదురు.

'పంచమేవాథషష్ఠేవా వర్షేకన్యా ప్రసూయతే
క్రయ విక్రయ కాలేచ సర్వ స్సర్వస్య వంచనం

కన్యకలు పిన్నవయసుననే ప్రసవించుట, క్రయ విక్రయములలో ఒకరి నొకరు వంచించుకొనుట కలి ప్రభావమట. ఇట్లెన్నియో విషయములను చెప్పి, కలియుగమునం దాయుః ప్రమాణము పదియారు వర్షములకు దిగిపోగా అదియే పరమాయువగునని మార్కండేయులు నుడివినారు. తోటలను, అరణ్యములను విచ్ఛేదము చేయుదురట.

ఆరామం చైవ వృక్షాంశ్చ నాశయిష్యంతి నిర్వ్యథాః'

నేను మీకు చెప్పిన విషయములు చాల స్వల్పములు. ఇంకను కావలసినవారు మూల మర్థము కాకపోయినను ఆంధ్రభారతమునైనను తిలకించుట అవసరము. అయ్యును మరొక్క పద్యము వినిపించి ఇంతటితో ముగింతును.

మ. వనితా దుర్బల దీన బంధుజన సర్వస్వాపహారుల్ సుహృ
జ్జన మాతాపితృ పుత్రహంతలు యదృచ్ఛాకర్మ శీలుర్, ధరన్
జన సంపూజితులై చరింతురు వినష్ట శ్రీకులై విప్రులా
జనులంజేరి పరిగ్రహించెద రపజ్ఞాపూర్వ దుర్విత్తముల్.

నేడు జరుగుచున్న విషయము లెన్నియో నాడు మహాభారతమున వర్ణించబడినవి.

## —♦ సత్యాద్రౌపదీ సంవాదము ♦—

ఈ ఘట్టముననే సత్యభామా ద్రౌపదీ సంవాద మొక ఘట్టమై నడచినది. శ్రీకృష్ణుడు సత్యభామను వెంటనిడుకొని రాగా, సత్యభామ ద్రౌపది నూరార్చుటకై వచ్చియు, నీవు నీ యైదుగురు భర్తల గుప్పెట యందుంచుకొంటివని పరిహాసపుముఖమున పలికి అందు కేమైన నీదగ్గర మంత్రము లుండెనా ? మందులేమైన వాడితివా ? వ్రతముల సలిపితివా ? అని తనకు శ్రీకృష్ణుని వశముగావించుకొనుటకు సలహానివ్వవలసినదిగా ప్రశ్నించినది.

ఇది యొక చమత్కారమగుప్రశ్న. మందులు మతిని మార్చునా ? మంత్రములు మనుష్యుల బుద్ధి వృత్తులపై ప్రసరించునా ? ఇవన్నియు బూజుపట్టిన సిద్ధాంతము లనువారు కలరు. వారికి నమస్కారములు. వ్యాస భారతిపి మీకు వినిపించుట నా ఆశయము. సత్యభామ యడిగిన మాటకు ద్రౌపది కొంత విధముగ కినుక కలిగినది. అయ్యును మధుర హాసము గావించి క్రింద సమాధాన మిచ్చినది.

చం॥ అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగులజేసి యెంతయున్
వలతురు నాథులంట మగువా కడు బేలతనంబు దానమున్
గలిగిన ప్రేమయుం బొలియుగాని యొకండును సిద్ధిబొందద
ప్పొలతుల తోడిమన్కి యహిపొత్తుగ జూచు విభుండెరింగినన్.

మంత్ర తంత్రముల ప్రయోగించి, భర్తను వశపరచుకొనుట తగనిపని యని చెప్పినది. ఆ విషయము నెరుంగుచో నాథుడు తనతోటి సాంగత్యమును పామును ప్రక్కయందుంచుకొన్నట్లుగ తలచునని చెప్పినది. మరి వారెట్లు చెప్పిన విందురు ? అను ప్రశ్నకు సమాధానము ద్రౌపది తన నిత్యజీవిత దినచర్యను చక్కగా వర్ణించినది.

భార్య భర్తకును, పుత్రుడు తండ్రికిని, విద్యార్థి గురువునకును, సేవకులని భారతీయ సిద్ధాంతము. ఇట్లే భక్తుడు భగవంతుని సేవకుడు. సేవ్య సేవకభావమే పరమార్థ సౌధాధిరోహణమునకు ప్రథమ సోపానము. సేవకుడు తాను సేవించదగువారికి భగవంతునిగ భావించి పూజించుట – గీత చెప్పిన కర్మయోగము. సేవ్యసేవక భావమునే మధుర ప్రేమయని భారతీయశాస్త్రములు చెప్పును. భార్యాభర్తలనుధ్య నున్నదియు, ఉండదగినదియు మధురభావముగాని, మోహాంధకారము కాదు. అహంకారమునకును మోహమునకును దగ్గర చుట్టరికమని ఆధ్యాత్మికశాస్త్ర నిర్ణయము. నిరహంకారము సేవాధర్మమునకు ముఖ్య ప్రాణము. నిరహంకారముననే ఆత్మజ్యోతి వెలుగును. భౌతిక దృక్పథమునే యవలంబించువారికి నిరహంకార మెక్కడిది ? భార్య భర్తదగ్గర యహంకారమును విడిచి సేవించి ఆతని మనోమయమున కుత్సాహమును కల్పించి ఆతనితోడి మధురభావమును అనుభవించుట భగవంతుని సాక్షాత్కరింప జేసుకొనుటయని భారతీయుల దాంపత్య జీవితములోని యంతరార్థము. అట్టిదే గురుశిష్యుల స్వరూపమును, రాజభటుల యానుకూల్యముకూడ. అప్పుడు పురుషులు స్త్రీల నెట్లు చూడదగియుందురు ? అనునది ప్రశ్న కాకపోదు. వారును భగవంతుడు చూపు వాత్సల్యరసమును సేవకులయందు చిలుకుట అవసరమనియే మన శాస్త్రములు నిర్ణయించినవి. మానవు డనుభవించదగు కామ మొక పురుషార్థమగుటచే కామ తంత్రములు పలువిధములుగ నాయికా నాయకుల ప్రణయానురాగము లెట్లు వృద్ధియగునో వివరించినవి. వాత్స్యాయన కామసూత్రములు మొదలగు గ్రంథరాజములు నాగరికతా వృత్తమును, స్త్రీలకుండదగు విద్యావిశేషముల స్త్రీలయందు పురుషులు ప్రవర్తింపదగు ప్రవర్తనలను చక్కగా వివరించినవి. ద్రౌపది

సత్యభామకు చెప్పిన సమాధానమున ప్రాచీన భారతస్త్రీల యనిర్వచనీయ ప్రతిభావిశేషము లెన్నియో వర్ణింపబడినవి. అందు మొదటి సమాధానముగ ద్రౌపది యుపన్యాసములోని సారభూతమగు వాక్యసరణిని గమనింపుడు.

కుత్సిత తంత్రములచే ప్రేమను చూరగొనుట అసంభవమని చెప్పినది.

కం॥ .......... పతులకు నెప్పుడు
గావింపం దగదు కపటకర్మంబులు దా
భవ మెరిగి యనువర్తిని
యై వనిత చరింప నదియయగు నెల్లవియున్

ఒకరి భావముల నొకరు గ్రహించి నడచుకొనుట యవసరమన్నది. అందును సేవకుడు ప్రభుహృదయము ననుసరించుట యవసరమన్నది. భావానుసరణమను క్రియ ఓషధీక్రియల కంటె నత్యంత ప్రభావ సంపన్నములని చెప్పినది. భావానుసరణమున కవసరమగు గుణము నిరహంకార మన్నది. భర్తయం దుదయించిన దోషములను సహించి అందుండి వారిని మరల్చుటకు ప్రయత్నింపదగు నిరహంకారము నా వ్రతమని సమాధాన మిచ్చినది.

మదము ప్రమాదంబు మాని వారికి జిత్త మేకముఖంబుగ నెల్లప్పుడును చేతునని సాధనభాగము నుపదేశించినది. భగవంతుని లోబరచుకొనుటకును యిదియే సాధన సామగ్రికదా!

మరొక్కమాట. నేటి స్త్రీలును, పురుషులును నాటి స్త్రీలకు స్వతంత్రభావముల నివ్వక పంజరబంధమున బంధించిరని ప్రవాదముల పల్కుదురు! అట్లుగాక నేటి నాగరికులు స్వతంత్రభావముల నిచ్చుచుండిరిగదా! మరి దాంపత్యమున నేడు తెగత్రెంపు లెందుకు కలుగుచున్నవి?

వ. ప్రతిదిన విహితంబులైన యాదాయవ్యయంబులు నాయెఱుంగని యవియు లేవు. గోపాల జనంబులు దుదిగాగల సకలభృత్య జనంబుల జీవితంబుల నరసియేన నడపుదు.

నాడు ద్రౌపదికిగల చాకచక్యమును గమనించితిరా ? గృహ రాజ్యమును పాలించుటేకాదు. రాజ్యపాలనము నందును ఆమెకు ఆదాయ వ్యయముల సంగతి తెలుసునని చెప్పినది. నేడు మన గృహస్థ జీవితము నందును స్త్రీలకుండదగు ముఖ్యమగు గమనిక యొకటి ద్రౌపది యుపన్యాసమున కలదు.

చం॥ తగియెడు వేళ యందు నియతంబుగ మజ్జన భోజన క్రియల్
దగ నొడగూర్తు భర్తలకు ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వ నెప్పుడు గృహస్థల భాండవిశోధనంబు వి
మ్మగ నొకనాడు నేమర,......

అన్నది. పొదుపన కుద్యమము లానాడు ప్రత్యేకముగ లేకయే స్వాభావిక ధర్మముగ పరిగణింపబడిన పొదుపు నెట్లు చెప్పినదో చూచితిరా ? అంతియేకాదు పరిశుభ్రత యనునది చెప్పుటకు ప్రత్యేక శాఖల నియోగించకయే చిన్ననాటి మాతాపితరుల యుద్బోధలు భారతీయ స్త్రీ పురుషుల హృదయఫలకముల స్వర్ణాక్షరముతో లిఖింపబడినవి.

గృహమునం దాదాయమును కల్పించు వృత్తులను ఆనాడు స్త్రీలకు లేకపోలేదు. వాత్స్యాయనుడు కామసూత్రములందు స్త్రీలకు విద్య నేర్పులో ఓషధీవిజ్ఞానమును చెప్పుట యవసరమని వ్రాకుచ్చినాడు. ఇట్లు ఎంతయో భారతీయనాగరికత యున్నది. కొద్దిసమయమునం దెంత చెప్పగలను ! ముందుకథకు పోదము—

సత్యభామ ద్రౌపదినట్లు ప్రశ్నించినందుకు క్షమాపణ చెప్పికొన్నది.

'అభిపన్నాస్మి పాంచాలి యాజ్ఞసేని క్షమస్వమే'

అంతతో ఆనాటి సభ ముగిసినది. మార్కండేయులును సత్యభామా శ్రీకృష్ణులును తమతమ నివాసముల కేగినారు. పాండవులు కామ్యకవనమును వదలి ద్వైతవనమున ప్రవేశించినారు.

## —♦ ఘోష యాత్ర ♦—

ఒక్కమారు హస్తినాపురమున కేగుదము.

పాండవుల వృత్తాంతము నెప్పటికప్పుడు ధృతరాష్ట్రు డెరుంగుచునే యుండెను. ఒకనాడు పాండవుల యరణ్యవాస దుఃఖముల తలచి, ఇంత దుఃఖముల పాల్పడిన పాండవులు తన బిడ్డల బ్రతక నిచ్చునా ? యన్న ఖేదము నొందినాడు. దుర్యోధను డాఘట్టమ్మును చూచి తన మిత్రసత్తములగు కర్ణ-దుశ్శాసన-శకునులతో కలసి యాలోచన గావించుట జరిగినది.

మహాభారతమున కర్ణుని జీవిత మొక చిత్రమైనది. ఆతని జీవిత రహస్యమును మీ కుద్యోగపర్వమున చక్కగా ప్రదర్శించెదను. ప్రస్తుతమున దుర్యోధనునకు కర్ణు డిట్లు సలహా ఇచ్చినాడు.

'సమస్థో విషమస్థాన్ హి దుర్హృదో యోభివీక్షతే
జగతీస్థానివాద్రిస్థః కిమతః పరమం సుఖం
నపుత్ర ధనలాభేన న రాజ్యేనాపి విందతి
ప్రీతిం నృపతి శార్దూల యామమిత్రౌఘ ధర్మనాత్.

మానవు డనుభవించదగు నిజానంద మెప్పు డుదయించుననగా తన శత్రువు కష్టములపాలై యుండగా తా నున్నత భాగ్యసంపదల దూగుచు పర్వతశిఖరాగ్రమున తానుండి, క్రింద దీనుడై యున్న శత్రు ముఖమందలి దైన్యమును చూచినప్పుడేనని కర్ణుడు - దుర్యోధనునకు

సలహా నిచ్చినాడు. ప్రస్తుతమున కా ఘట్ట మెక్కడనున్నదందువా? ద్రౌపది నారచీరెలగట్టి అడవుల నిడుములు బడుచుండగా పట్టుపుట్టముల గట్టి నోలలాడు నీభార్యలతో పాండవుల దర్శించుట నీ మహాభాగ్యమని చెప్పినాడు. దుర్యోధనునకు నోరూరినది. తానును తన భార్యలును తన మిత్రులతోగూడి పాండవుల కగపడుటకు ద్వైతవనమున కేగవలెను. ధృతరాష్ట్రుని యనుమతి యవసరము. దుర్యోధనాదు లెక్కడికైన పయనమగుచో పాండవులతోడి కయ్యమున కేదైన కాలు దువ్వుచుండిరేమోనను సంశయము ధృతరాష్ట్రునకు కల్గునని దుర్యోధను డెరుగును. అతని నొప్పించుటకూడ సలహా నివ్వవలసినదిగ కర్ణ శకునులకే దుర్యోధనుడు స్థానమిచ్చినాడు. అనాటి సమాలోచనలు ముగిసినవి. నాటిరాత్రి కర్ణున కొక యుపాయము తోచినది. పాండవులు వసించిన ద్వైతవనముననే దుర్యోధనుని గోసంపద కునికిపట్టు. ఆ గోవులకు క్రూరమృగముల వలని భయము కలుగకుండునట్లు మన యాత్ర సాగించుట యను నెపమున ద్వైతవనమున కేగుటకు ధృతరాష్ట్రుని యనుమతి కోరవచ్చునని కర్ణుడు చెప్పినాడు. దుర్యోధనున కంతకంటె కావలసినదేమున్నది? మిత్రు లిద్దరును కరచాలనములు గావించుకొని సంతసించుచు, శకునినిగూడ కలుపుకొని, ధృతరాష్ట్రు నొద్ద కేగినారు. వారంతకు ముందుగనే కబురుపంపి రప్పించిన గోపాలుడును ధృతరాష్ట్రునొద్దకు రాగా ఆవుల క్షేమము సక్రమముగ లేదని ధృతరాష్ట్రున కెరిగించుట జరిగినది. అట్టైన గో సంరక్షణకై ద్వైతవనమునకు దుర్యోధనుని యాత్ర బాగుండునన్న సలహాను కర్ణుడు ధృతరాష్ట్రున కిచ్చినాడు. ధృతరాష్ట్రుని గుండెలు దడదడలాడినవి. పాండవు లా వనమందుండుటయు దుర్యోధను డా ప్రదేశమున కేగుటయు ఏదియో యొక విపత్తును సృష్టించగలదనియె పెద్దరా జూహించినాడు.

కాని ఆతని మాట చెల్లునా ? ఎట్టకేలకు దుర్యోధనుడు తండ్రి నొప్పించినాడు. ఇప్పుడు దుర్యోధనుని ప్రయాణమునకు ఘోషయాత్ర అని పేరు. ఘోషమన అవులుండు ప్రదేశము. వాటిని క్రూరమృగముల నుండి రక్షింప నేగుటకు ఘోషయాత్రయని పేరు.

ఈ ఘోషయాత్ర తన కొక విజయయాత్ర యని దుర్యోధనుని ఊహ. రాజాంతఃపుర స్త్రీలందరును కదలినారు. ఎనిమిదివేల రథములును, ముప్పదివేల ఏనుగులును, తొంబదివేల గుర్రములును, లక్ష కాల్బలమును, వేటాడు వేటకాండ్రును, విటవిదూషక వైతాళికాది గణమును, ఘోషయాత్రకు కదలగా రెండు క్రోసులదూరము దుర్యోధనుని సైన్యము విస్తరించినది. వినోదయాత్ర నడచినది. వేటాడుట గోగణ నిరీక్షణము మొదలగు క్రియలన్నియు జరిగినవి. ద్వైతవనమున పాండవు లెక్కడుండిరి ? — ఆ వనమధ్యమునం దొక సరస్సు కలదు. దాని సమీపముననే పాండవుల నివాసము. ప్రస్తుతమున ధర్మరాజు యజ్ఞదీక్షితుడు. ఆ యజ్ఞము రాజసూయమువంటిది కాదు ! ఆ యజ్ఞమున పశువిశసన ముండదు. వన్యములగుపదార్థములతోడనె ఆ జ్ఞాన యజ్ఞము నడచును. కావుననే దానిని వ్యాసులు దివ్యమని వాడినారు.

'దివ్యేన విధినా చైవ వన్యేన కురు సత్తమ'

గీతాశాస్త్రమునం దనేక యజ్ఞములు వర్ణించబడినవి. 'శ్లో॥ ద్రవ్య యజ్ఞా......తాః' ప్రకృతమున దుర్యోధను డీ సరస్తీరముననే క్రీడా గారముల నిర్మించి తన వినోదయాత్రల నడవ నిశ్చయించినాడు. దుర్యోధనుని పరివారమంతయు, ఆ ప్రదేశమున డేరాలను వేయుట ప్రారంభించినది. మనుజులు సంకల్పించు సంకల్పముల నెప్పటి కప్పుడుగా దేవతలకు తెలియజేయు వార్తాప్రసార కేంద్రములు దేవ లోకమున లేకపోలేదు. దుర్యోధనుని యాత్రాప్రయోజనమును

దేవేంద్రుడు గుర్తించినాడు. దేవలోకమునకును మనుష్యలోకమునకును నిత్యసంబంధ మొకటున్నది. చిత్రసేనుడను గంధర్వరాజున కర్జునుడు ఆప్తమిత్రుడు. దేవేంద్రునికిని అతడు స్నేహితుడే. దుర్యోధనుని దుష్ట భావమునకు తగు పరాభవమును చేయ నిశ్చయించిన దేవేంద్రుడును, చిత్రసేనుడును కలసి మాట్లాడగా, కొంత గంధర్వసైన్యము ద్వైత వనమందలి సరస్సుకడ దిగినది. దుర్యోధనుని సైన్యము నిర్మించు గుడారములకు గంధర్వగణ మడ్డుపెట్టినది. కౌరవసైన్య మందుకు సహించలేదు. దుర్యోధన మహారాజుగారి యాజ్ఞయని కౌరవసైన్య మనగా, చిత్రసేనుని యాజ్ఞయని గంధర్వులు వారించగా, యిరువురిమధ్య ఘర్షణమట్టము పెద్దదైనది. అయ్యును గంధర్వులు కోపగించకయే కౌరవసేనను నివారించినను రారాజు సైన్యము తమ రాజగు దుర్యోధనుని యుద్ధమునకు పురిగొల్పినది. దుర్యోధనాది వీరు లుత్సుకులై గంధర్వగణమును ధిక్కరింపగా వనమంతయు గంధర్వమయమైనది. అది చిత్రసేనుని యాజ్ఞ. ఒకవైపు గంధర్వగణము నిల్వగా ఎదురై కురురాజును అతని తమ్ములును నిలచినారు. కర్ణుని బాహువీర్యము గంధర్వగణమును చకితుల గావించినది. కురువీరులును గంధర్వ వీరులును గావించు యుద్ధమున గంధర్వుల శరీరములే ఖండితములైనవి గాని కౌరవులు వెనుకాడలేదు. చిత్రసేనుని రాక యుపేక్షింపక చేసిన యుద్ధమున చిత్రసేనుని రాక యవసరమైనది. చిత్రసేనుడు దిగినాడు. చిత్రసేనుడు గావించు యుద్ధము భూమిపై నిలిచిగాదు. వియత్తముల నుండియే అతని శస్త్రాస్త్రములు వ్యాపించును. అట్లే జరిగినది. కౌరవ సైన్యము హతమైనది.

పశుబలము నుగ్గయినది. కాల్బలము చాల భాగ మంతరించినది. కర్ణు డెక్కడ నుండెనో, దుర్యోధను డెరుగడు. దుర్యోధను డెక్కడ

చిక్కెనో కర్ణునకు తెలియదు. ఎవరి ప్రాణముల వారు రక్షించుకొనుటయే యిందు జరిగినది. కర్ణుడు తాను బ్రదుకుటకై వికర్ణుని రథమునెక్కి పారిపోయినాడు. దుశ్శాసనాదులు దుర్యోధనుని రక్షింప జూచిరిగాని సాధ్యము కాలేదు. దుర్యోధనుడు చిత్రసేనుని చేతికి చిక్కినాడు. అతడు దుర్యోధనుని తన రథమునకు బంధించుకొనిపోవుట జరిగినది. రాజొక్కడేగాదు బంధింపబడుట. పరివారమును, దుశ్శాసనాదులనుగూడ బంధింపబడిరి. దుర్యోధనుని వెంట కొందరు పౌరులుకూడ ద్వైత వనమునకు వచ్చుట జరిగినది. వారును కొందరు సైనికులును దుర్యోధనుని దుస్థితికి వగచుట యటుంచి తామైనను బ్రతకవలెనన్న రక్షించు వారెవరు? రాజదార లేరి? దుర్యోధనుని భార్యలు సైతము చిత్రసేనునకే వశమైరి. ఇప్పుడు దుర్యోధనునకు దిక్కెవరు? అతని మంత్రులు కొందరు ధర్మనందనుని శరణువేడినారు.

'ఆర్తాదీనా స్తత స్సర్వే యుధిష్ఠిర ముపాగమన్'

ఈసమయమున భీముడు కిలకిల నవ్వి -

'అధర్మోహి కృత స్తేన యేవేదముప శిక్షితం'

అధర్మమునకు తగిన శిక్షపడినదని పలుకగా, ధర్మజుడు నివారించి, ఇది యీ మాటకు కాలముగాదని చెప్పినాడు. మరి దేనికి సమయము? దుర్యోధను నిప్పుడు రక్షించదగు సమయము.

'భవంతి భేదా జ్ఞాతీనాం కలహాశ్చ వృకోదర
ప్రసక్తాని చ వైరాణి కులధర్మో నసశ్యతి
దుర్యోధనస్య గ్రహణాత్ గంధర్వేణ బలాత్ ప్రభో
స్త్రీణాం బాహ్యాభి మర్శాచ్చ హతం భవతి నః కులమ్'

జ్ఞాతులకును జ్ఞాతులకును వచ్చు భేదములు కులధర్మమును నశింపచేయరాదు. జ్ఞాతులకు వచ్చు భేదము సహజము. కులధర్మము

శాశ్వతము. గంధర్వులు దుర్యోధనుని పట్టుకొనుట కౌరవ వంశమును వశము గావించుకొనుటయే. అది యట్లుండ రాజదారల పట్టుకొనుటచే రాజవంశములు హతమగును. కావున నిప్పుడు దుర్యోధనుని విముక్తుని గావించుట యవసరమని ధర్మజున సిద్ధాంతము. ఇది కాక మరియొక విశేషధర్మము నిందు ధర్మజుడు పొందుపరచినాడు. ఏమది? శరణాగత రక్షణము.

'శరణంచ ప్రపన్నానాం త్రాణార్థంచ కులస్యచ'

శరణాగత రక్షణముకూడ కులసంరక్షణములో ఇమిడియున్నది. భారతీయులకు శరణాగత రక్షణము ముఖ్యధర్మము. భగవంతుని యందలి ప్రత్యేకమగు గుణవిశేష మదియే.

'అపిచేత్సు దురాచారో భజతే మా మనన్య భాక్
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితోఽపి సః'

కావుననే ధర్మజు డిచ్చట సామాన్య ధర్మమును రాజకులైక రక్షణమని చెప్పి, విశేష ధర్మము శరణాగత రక్షణమని చెప్పినాడు.

'ప్రాంజలిం శరణాపన్నం దృష్ట్వా శత్రుమపి ధృవం
వరప్రదానం రాజ్యంచ పుత్ర జన్మచ పాండవాః
శత్రోశ్చ మోక్షణం క్లేశాత్ త్రీణిచైకం చ తత్సమం'

వరదానము, రాజ్యప్రాప్తి, పుత్రజన్మ, శత్రువును కష్టకాలమున రక్షించుట - పై మూడింటియందును శరణాగతశత్రుమోక్షణమే మొగ్గుగ తూగునని శాస్త్రసిద్ధాంతము.

కావున భీమసేనా, దుర్యోధనుని విడిపింపుమని ప్రబోధించినాడు. కాని మరియొక సూక్ష్మమున్నది. గంధర్వులు దేవతలు. వారితోడి విరోధముకూడదు. కావున సామముచేతనే ఈ కార్యము నెవేర్చుట అవసరము. కానిచో మృదువగు యుద్ధ మవసరము. ఇట్టి సూక్ష్మ

ధర్మముల నిర్ణయించి, తీర్చిదిద్దుటే ధర్మనందనుని స్వరూపము. మృదు యుద్ధమున వారు వశము కానిచో దేవతలతోడి కయ్యమును మానవలెనా? కాదు. అప్పుడు క్షాత్రధర్మమును, శరణాగతరక్షణమును లోపించును.

'సర్వోపాయై ర్విమోచ్యా స్తే నిగృహ్యా పరి పంథినః'

ఎట్టి పరిస్థితియందైనను దుర్యోధనుని విడిపించుటే నిశ్చయము.

ధర్మజునితో భీమార్జును లేకీభవించినారు. గంధర్వగణమును మృదుయుద్ధముతోడనే పలకరించి దుర్యోధనుని విడువుమనినారు. గంధర్వులు తమ రాజాజ్ఞను చెప్పగా, రాజదారలను ముట్టుట, మనుజుల తోటి యుద్ధమును మీ రాజునకు తగని పనియని చెప్పినను వారు విడుపలేదు. యుద్ధము సాగించవలసివచ్చినది. సైన్య రక్షణకై చిత్రసేనుడును ఒగినాడు. అర్జునునిపై చిత్రసేనుని మాయాయుద్ధము ప్రకటితమైనది. అర్జునుడు గంధర్వరాజునుకూడా నిగ్రహించగలడు. కాని అతడు తన కెదురై నిలుపలేదు. అందుకై యాతని వధింప దలచలేదు. వారిద్దరికిని యుద్ధము కొంతసేపు నడచినది. చిత్రసేనుడు పార్థునకు దర్శనమిచ్చి అసలు దుర్యోధను డెందుకు వచ్చెనో చెప్పి దేవేంద్రుని యాజ్ఞచేతనే యా యుద్ధమును, దుర్యోధనుని బంధించుటయు జరిగినదని తెలిపినాడు. అయ్యును అర్జునునకు ధర్మనందనుని యాజ్ఞయే ప్రధానమైనది. గంధర్వరాజును మెప్పించి వారందరను ధర్మరాజు నొద్దకు తీసుకొనివెళ్ళుట జరిగినది.

రథమున బందిపబడిన దుర్యోధనుడును, ఆతని బంధించిన గంధర్వరాజును, వారిని వెంటనిడుకొనివచ్చిన భీమార్జునులును, కౌరవ సైన్యమును ధర్మజుని పాదపీఠముదగ్గఱకు రాగా ఆ ధర్మమూర్తి తన చేతితో దుర్యోధనుని బంధము నూడదీసినాడు. ఊడదీయుటయె కాదు; దుర్యోధనునకు హితమునుకూడ బోధించినాడు.

ఉ॥ ఎన్నడు నిట్టి సాహసము లింక నొనర్పకుమయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియలయందు గడంగి నశించుగావునం
గ్రన్నన తమ్ముల దొరల గైకొని యిమ్ముల బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొక విషాదము బొందకుమీ మనంబునన్.

ధర్మజుని వాక్సరణి యెట్లున్నది ? మానవుడు తప్పును చేసియు ఆ తప్పును తెలిసికొని, ఆత్మపరీక్షయందు దుత్తీర్ణుడై ముందుజీవితమును సంరక్షించుకొనుట యవసరము. తనకంటె బలవంతులపై దండెత్తుట తగదని బుద్ధి చెప్పినాడు. దుర్యోధనుని భవిష్యజ్జీవితమునుకూడ సూచించినాడు. ధర్మజుని గడుసరితనము భారతీయధర్మముతో కూడి ఆతనికి అలంకారమైనది. ఇక దుర్యోధనుని కార్యక్రమమును పరిశీలింతము.

దుర్యోధనుని ముఖమండలము చిన్నవైనది. మరణమునకంటెను అధికమగు బాధ ననుభవించినాడు. క్షాత్ర తేజము శత్రువు చేతిలో యస్తమించుట రాజపుత్రున కలంకారము కాగా, ఆతడు శత్రువుచేత నోడబడి రథచక్రమున బంధింపబడుట మరణమునకంటె యతిరిక్తముకదా। అంతియేకాదు. ఎవరిని తా నవమానింతమని దుర్యోధను డూహించి వచ్చినాడో వారే యాతనికి బంధమోక్షము గావించి, బుద్ధి చెప్పుట దుర్యోధనునకు గోరుచుట్టుపై రోకటి పోటైనది. నిప్పుకుంపటియందు పడి ఒళ్ళుగాల ఆ ఎర్రనిపుండుపై కారము పూసినట్లయినదనికూడా యనవచ్చును. దుర్యోధనుడు తన గుడారమునకేగి పర్యంకముపై కూర్చొనినాడు. కర్ణు డాతని చూడవచ్చి, దుర్యోధనుని దిగ్విజయయాత్ర గంధర్వులపై సాగినందులకు తన హర్షమును వెలిబుచ్చినాడు. దుర్యోధనుని ముఖము నాతడు గమనించి యుండలేదు. కర్ణుని పలకరింపు దుర్యోధనునకు భరించరాని యవమానమే

యయ్యును కర్ణునకు తన భంగపాటు తెలియకయే ఇట్లు మాటలాడినా డన్న యదార్థబుద్ధి దుర్యోధనుని కుదయించుటచే వారి మిత్రత్వమునకు భంగము రాలేదు. మిత్రులిద్దరొక్కచో కూర్చుండినారు. దుర్యోధనుని వలన జరిగిన వృత్తాంత మంతయు కర్ణుడు వినినాడు. దుర్యోధనుని విషాదఘట్టము సామాన్యమైనదిగాదు.

శత్రువుచేత చిక్కి బంధింపబడుట, అదియు స్త్రీ సమక్షమున జరుగుట, అందునూ ధర్మజు డా బంధము నూడదీయుట, ఇంతకంటె తన జీవితమున రాదగు నవమాన మేమున్నది? కాని ఈ ఘట్టమున దుర్యోధను డొక సందేశము నందించినాడు.

'దుర్వినీతాః శ్రియం ప్రాప్య విద్యా మైశ్వర్య మేవచ
తిష్ఠంతి నచిరం భద్రే యథాహం మదగర్వితః'

నావంటి దుర్బుద్ధులకు వచ్చు భాగ్యము నిలువనేరదని రాబోవు సంతతికి చెప్పినాడు. విద్యా సంపన్నత్వములు మదగర్వితులగు వారలకు ప్రాప్తించినను ఎక్కువకాలము నిలువనేరవనుట నాతడు ధ్రువ పరచినాడు.

ఇప్పుడు కర్ణుని కర్తవ్య మేమి? దుర్యోధను నోదార్చి ధర్మజాదు లాతనికి చేసినది సహాయము కాదనియు, అది వారి కర్తవ్య మనియు నిర్ణయించి, దుర్యోధనుని చక్రవర్తి పీఠము నిలబెట్టుటయే నా కర్తవ్యమని కర్ణుడు నిశ్చయించుకొనినాడు. ఘోషయాత్రయందలి పర్యవసానము నాత డిట్లు సమన్వయించినాడు.

'సేనాజీవాశ్చ యే రాజ్ఞాం విషయే సంతి మానవాః'

రాజు లెప్పుడును సేనాజీవులు. నీవు చక్రవర్తివి గనుక నీ సేవకు లగు పాండవులు నిన్ను బ్రతికించుట నీకు అగౌరవము కాదని చెప్పి, అది వారి కర్తవ్యమని బోధించినాడు.

చూచితిరా, కర్ణుని సమయానుకూలమగుమాటను నేర్పరితనమును! కాని దుర్యోధనుని మనస్సందు కొప్పుకొనకేదు. తాను రాజపుత్రుడ నన్న అభిమాన మాతని బాధించగా తాను మరణించుటకు ప్రాయోపవేశము శరణ్యమని నిశ్చయించుకొనినాడు. దుశ్శాసనునకు రాజ్య మప్పగించి, ధృతరాష్ట్ర గాంధారీలకు ఓపరి పప్పగింతలు చెప్పుటకై కర్ణుని నియమించి, ప్రాయోపవేశమున దీక్షితుడై కూర్చొనినాడు. దుర్యోధనునకు మద్దతునిచ్చు వర్గము పాతాళమం దున్నది. వారందరును దితి సంతతికి చెందినవారే. ఆ దైత్యవర్గ మంతయు దుర్యోధనుని ముఖమున భూలోకమున తమ బలముంచి తమ రాజ్యమును కొనసాగింపదలచిన వర్గమే.

ప్రాయోపవేశము గావించిన దుర్యోధనుని వారందరును ఆ రాత్రియే పాతాళమునకు తీసుకొని వెళ్ళి - నీకు పరాజయము లేదని చెప్పినారు. రాబోవు యుద్ధమున మేమందరము కర్ణ భీష్మాదులయం దావేశించి నీకు యుద్ధమున సాయమొనరింతుమని చెప్పినారు. కర్ణుడు తప్పక పార్థుని జయించునని కూడ నిర్ణయించుటతో దుర్యోధనునకు ధైర్యము వచ్చినది. దుర్యోధనుడు బ్రదికి హస్తినాపురము చేరినాడు. ఘోషయాత్ర ముగిసినది —

ఇప్పు డేమి తేలినది? భూలోకమున కొందరు రాక్షసులు రాజ పుత్రులైరని పాతాళవాసులవలన తేలినది. వారిని వధించుటకే కృష్ణావతారము వచ్చినది. దేవతల యంశములను భూమిపైకి వచ్చినవని నిర్ణయమైనది.

ముందునకు పోవుదము

దుర్యోధనుని హృదయము కాగిపోవుచున్నది. పాండవులపై తన బలమక్కరకు వచ్చుటలేదు. వారు చేసిన రాజసూయములోని యైశ్వర్య

మంతయు ద్యూతమున చూరగొన్నను తృప్తి కలుగలేదు. పాండవులవలె తానును రాజసూయమును గావింపవలెనని యాతని యూహ. తన మిత్ర రత్నమగు కర్ణునితో యాలోచింపగా అందుకు నీవు తగుదువనియే అతడు తోడు పలికినాడు. దుర్యోధనుడు పురోహితుని బిలిచి రాజసూయాధ్వర మును గురించి ప్రస్తావించగా, కొందరు విద్వజ్జనుల యభిప్రాయము నాతడు సేకరించెను. పాండవుల జయింపక రాజసూయము చేయుటెట్లు ? వారందుకు మెచ్చక వైష్ణవమను యజ్ఞము నొకదానిని చేయించినారు. అందుకై కర్ణుడు దిగ్విజయయాత్ర సాగించి ధనము సంపాదించగా ఆ యజ్ఞము నడచినది. అందొక్క విశేషము. దుర్యోధనుడు తాను చేయు యజ్ఞమునకు పాండవులనుగూడ రమ్మని ద్వైతవనమునకు కబురు పంపినాడు. ధర్మజుడు మా వ్రత దీక్షను విసర్జింపక వచ్చుటకు వీలుగామిచే రాకున్నను నీ కార్యము మాకు సంతోషదాయికమని సదుత్తర మిచ్చెనని ధర్మజుని వార్తను చెప్పుకొనుటలో సందేహ మేమున్నది ? అది సహజము. భీముడు ఏమని చెప్పెనో వినుడు.

'తదాతు నృపతిర్గంతా ధర్మరాజో యుధిష్ఠిరః
అస్త్రశస్త్ర ప్రదీప్తేఽగ్నౌ యదా తం పాతయిష్యతి
వర్షాత్త్రయోదశా దూర్ధ్వం రణ సత్రే నరాధిపః
యదా క్రోధహవిర్మోక్తా ధార్తరాష్ట్రేషు పాండవః'

పదమూడవ సంవత్సరము గడవగా రణయజ్ఞమున శస్త్రాస్త్ర జ్వాలలు జ్వలించుట యను నగ్నిజ్వాలలో దుర్యోధనుని పడవైచి క్రోధ హవిస్సును హోమముచేయుట పూర్తికాగా నాడు నా రాకయని మీ రాజుకు చెప్పుమని దూతకు చెప్పినాడు. అతడట్లే యా వార్తల నందింపగా యజ్ఞము పూర్తియైనది.—ఇక పాండవులకడ కేగుదము.

పాండవుల కింతవరకు సంవత్సరముపైన ఎనిమిది మాసములు ద్వైత వనమున గడచినవి. వా రచ్చటనే యుండుచో ఆ వనమందలి మృగ సమూహ మిక బ్రతుకదు. అందుచే నా మృగగణము ధర్మనందనుని స్వప్నమున వచ్చి వాటి బాధను చెప్పగా, అటనుండి వారు కామ్యక వనమున కేగినారు. ఇప్పటికి పాండవులకు అరణ్యవాసమున పదకొండు సంవత్సరములు గడచినవి.

కామ్యక వనవిశేషము లేమి? వారి కామ్యకవన నివాసమందలి యద్భుత విశేష మొకటి కలదు. అది భారతీయాధ్యాత్మిక రసాయన మనుట యుక్తము. ఆ రసాయనమును మీకు రేపు తప్పక యిత్తును.

ఈనాటికి మన కార్యక్రమము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# భక్తి ప్రభావము

ఆర్య మహాశయులారా!

నిన్నటివఱకును జరిగిన చరిత్రాంశ మేమన: పాండవుల అరణ్యవాసమున పదకొండు సంవత్సరములు గడచినవి. వారీగడచిన కాలమునం దనేక అస్త్రశస్త్రముల సంపాదించుటయు, మహనీయుల యాశీస్సుల నందుటయు తీర్థయాత్రా విశేషములచే పుణ్యసముపార్జనమును జరుగగా; ఘోషయాత్రా నెపమున వచ్చిన దుర్యోధనునికూడ బంధ విముక్తుని గావించి కీర్తిప్రతిష్ఠల నందినారు. నిన్నటి దినమున ద్వైతవనమును విడిచి కామ్యకవనమును ప్రవేశించినారు. ఆ వనమున తృణబిందు మహర్షివారి యాశ్రమము వారికి నివాసస్థానము

భారతీయ సనాతన ధర్మసిద్ధాన్తము మానవుని ధర్మజీవితమునకు ఒరిపిడిరాయి. ఆ సిద్ధాంతసారమే ఈ వనమున ధర్మనందనునకు వ్యాస భగవాను లుపదేశించినారు. ధర్మజు డీవనమునం దొకరోజున తన తమ్ములయొక్క, ద్రౌపదియొక్క బాధలజూచి సహించుట శక్యము గాకయున్న సమయమున మునీంద్రుడు ప్రత్యక్షమై చెప్పిన సూక్తి-

ఉ॥ కాల విపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు నె
క్కాలము నేరికిన్ ధ్రువముగాదు సుఖంబును దుఃఖమున్ మహీ
పాల బుధుండు తద్వివిధ భంగులెరిగి, ప్రమోదఖేద సం
శీలుడు గాడు రెంటను ప్రసిద్ధ పథంబున నప్రమత్తుడై.

కం॥ వినుమీవును నాపదలకు
మనమున నొక్కింత యోర్చి మహనీయముగా
నొనరింపుము తపము తపం
బునకగదా సకల సౌఖ్యములు సిద్ధించున్'

భారతీయుల దృక్పథమున సుఖదుఃఖానుభవ మొక లెక్కకాదు. ఆ రెంటికి నిచ్చు స్థానమున కంటె ప్రసిద్ధమగు స్థానము ధర్మమునకేనని నిర్ణయము. ఇది వ్యాసుని వచనములోని సారము. ధర్మమార్గమునందప్రమత్తతయు ఇహలోకసుఖానుభవమున కగ్రస్థాన మియ్యకుండుటయు భారతీయ సారస్వత లక్ష్యము.

మనము భారతకథలోనికి పోదము.

వ్యాసభగవానులు ధర్మజు నాహ్వానించి రాబోవు కాలము నీ కభ్యుదయ కాలమనిచెప్పి వెళ్ళినారు. తరువాత పాండవుల కొక యగ్నిపరీక్ష వచ్చినది. అది కేవలము పాండవులకుకాదు. ద్రౌపది కనుట యుక్తము. పాండవులును ద్రౌపదియు వేర్వేరై యుండిరా ? కాదు.

ఈ ఘట్టమున ద్రౌపది పాత్రయే ప్రధానస్థానము నలంకరించినది. నేను చెప్పబోవు ఈ ఘట్ట మాంధ్రభారతమున లేదు. పాండవుల యరణ్యవాసముకూడ దుర్యోధనున కసూయ కల్గించినది. వారచ్చటనుకూడ రాజధానియందువలెనే యుండినారని అతని దురూహ. వారందును సుఖానుభవము లేకయుండునట్లు చేయుటకేమైన యుపాయము లుండెనా ? అను దురాలోచనమున నిమగ్నుడై యున్న సమయమది.

దుర్వాస మహర్షివారు హస్తినాపురమున కొకనా డేతెంచినారు. ఆ మహర్షివా రెప్పు డెక్కడికి వచ్చినను పదివేలమంది శిష్యులతో వచ్చి ఆతిథ్యమును కాంక్షింతురు. కాని ఆ మహానీయుని అగ్రహమున కెవ్వరు గురియగుదురో తెలియదు. అతని తాపసతేజ మమోఘము. శాపమిచ్చుటకు వెనుదీయడు. నేటికిని లోకమున కోపిష్ఠులకు దుర్వాసుడని బిరుదు నిత్తురు. ఆ మహనీయు డొకప్పుడు హస్తినాపురమున దుర్యోధనునివద్ద కతిథియై వచ్చెను. దుర్యోధనుడు వినయాన్వితుడై అతని నర్చించుట జరిగినది. దుర్వాసుని యాతిథ్య మొక చిత్రమైనది.

అత డిప్పుడు భోజనమునకు వచ్చుచుంటినని స్నానమున కేగును. కాని యెంతకాలమునకును రాడు. మరియొకప్పుడు నా కాకలియగుచున్నదని అర్ధరాత్రమున లేచి అన్న మడుగును. పరమాన్నాదికములతో వంటలు కాగా నాకక్కరలేదని తిరస్కరించును. అప్పుడు యజమాని కోపించిన గాని లేక మనోవైకల్యము నొందిగాని యున్నచో శపించును. ఆ మహర్షిని యనుగ్రహింపజేయుట దుస్తరము. కాని దుర్యోధను డా యవస్థల నవస్థలని భావించక ఆ మహామునిని యనుగ్రహమును సంపాదించినాడు. ఒకనా డా ఋషివర్యులు నీవేదైన వరము కోరుకొమ్మని దుర్యోధనుని యనుగ్రహించగా నా డాతడు కోరిన కోరిక యిది:

మునివర్యా! నాయం దనుగ్రహము కలదేని నాయింటికి మీ రతిథులై వచ్చినట్లే ద్వైతవనమునందున్న ధర్మనందనుని పాలికి వారి భోజనము లన్నియు కాగా, ద్రౌపదకూడ భుజించి, సుఖాసీనయైయున్న సమయమునం దాతిథ్యమున కేగుడని కోరినాడు. దుర్యోధను డిట్లు కోరుటకు కారణమేమి? ఆ సమయమునం దామహర్షి కాతిథ్య మిచ్చుటకు పాండవు లసమర్థులు కాగా వారిని మహర్షి శపించునని దుర్యోధనుని నిర్ణయము. అత డట్లే అనుగ్రహించినాడు. ఇక దుర్యోధనునకు కావలసిన దేమున్నది? పాండవులు భస్మీపటల మగుటయే మిగిలినదని హర్షించినాడు. కర్ణుడును దుర్యోధనుని ప్రయోగమునకు హర్షమును తెలిపి యుత్సుకితను గూర్చి

'స్వైరేపతే మహాపాపైర్గతాపై దుస్తరం తమః'

ఆ పాపాత్ములు తమ పాపముతోనే దగ్ధమగుదురని శాపము వేసినాడు. కర్ణదుర్యోధన దుశ్శాసను లానాడొక మహోత్సవ దినముగా భావించి వారివారి స్థలముల కేగినారు. వారందరునుకూడి చేసిన యాలోచనే యగుటచే వారందరును సంతసము నొందినారు.

ద్వైతవనమున పాండవు లందరును భోజనముల గావించగా ద్రౌపదియు వారి భుక్తశేషమును భుజించి పాత్ర శుద్ధిచేసినది. వారికి సూర్య భగవాను లిచ్చిన అక్షయపాత్ర ద్రౌపది భుజించిన తరువాత పదార్థముల నుత్పత్తి చేయదు. ఆ సమయమును కనిపెట్టియే దుర్యోధనుని కోరిక ననుసరించి పదివేలమంది శిష్యులతో దుర్వాసమహర్షివారు పాండవుల కడకు వచ్చినారు. ధర్మజుడు వెంటనే లేచి, అర్ఘ్యపాద్యాది విధుల నా మహర్షిని పూజించి, ఆతిథ్యమున కాహ్వానించగా నా మునిచంద్రుడు శిష్యగణముతో స్నానమున కేగినారు. ఇక వారు వచ్చుచో అతిథి సత్కారమునకై వడ్డించదగు బాధ్యత ద్రౌపదిపై నున్నది. దుర్వాసుని శాపాగ్నినుండి రక్షించుకొను టెట్లు? ఆ పతివ్రతా శిరోమణికి తోచలేదు. మహనీయులగు వార లెప్పుడైననూ విపత్సముద్రమున మునగగా వారికి భగవ త్పాదారవిందములు నావయై వారిని తరింప చేయును —

శ్లో॥ త్వయి ప్రసన్నే కిమహో పరైర్న స్త్వయ్య ప్రసన్నే కిమిహో పరైర్నః
రక్తే విరక్తేచ వరేవధూనాం నిరర్థకః కుంకుమ పత్రభంగః'

ఒక భక్తు డిట్లు పలికినాడు.— హే భగవాన్ ! నీవు నాయం దనురక్తుడవగుచో నా కితరులతో పని యేమున్నది? నీ యనుగ్రహము లేకున్నను ఇతరులవలన లాభములేదు నాయకు డనురక్తుడగుచో నాయిక కలంకారముతో పనిలేదు. నాయకుడు విరక్తుడైన నాయిక అలంకారము వ్యర్థమగునుకదా!

ద్రౌపదీ మహాసాధ్వి చిత్త మొక్కమారు నవనీలనీరదశ్యాముని పైకి పెళ్ళినది. అతడు పాపప్రతిబంధముల త్రెంచగలడు. దుష్ట రాక్షసుల ద్రుంచుటకై వచ్చిన అవతారమూర్తి. కంసుని పరిమార్చినాడు గదా! ఆతనికి కంససంహారి యను బిరుదమున్నది. అతని స్మరించుటే

ఈనాటి తరణోపాయము ద్రౌపదికి. అతడు ద్వారకయందే యుండెనా? కాదు. మణులన్నియు ఒక సూత్రము నాధారముగాగొనియే మాలా రూపమున నిలచినట్లు జీవసమూహమంతయు ఆతని నాధారముగాగొనియే నిలచియున్నది. అతడు జగదంతర్యామి. ఎవరెప్పుడు పిలిచిన అప్పుడు పలుకును. ఎవరేమి చెప్పిన అదంతయు నోర్పుతో వినును. వీరు వారను భేదభావ మా ప్రేమమూర్తికి లేదు. అతడు చిన్మయస్వరూపుడు. అతడు భక్తచింతామణి. ద్రౌపది పంపిన యంతఃకరణ మా మహనీయునివద్దకేగి అచంచలభావమున పవిత్రమూర్తియై యా యఖండప్రేమమూర్తి నిట్లు స్తుతించినది—

'కృష్ణ కృష్ణ మహాబాహో దేవకీనందనావ్యయ
వాసుదేవ జగన్నాథ ప్రణతార్తి వినాశన
విశ్వాత్మన్ విశ్వజనక విశ్వహర్తః ప్రభోవ్యయ
ప్రపన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర
ఆకూతీనాంచ చిత్తీనాం ప్రవర్తక నతాస్మితే
వరేణ్య వరదానంత అగతీనాం గతిర్భవ
పురాణ పురుష ప్రాణమనోవృత్త్యా ద్యగోచర
సర్వాధ్యక్ష పరాధ్యక్ష త్వా మహం శరణం గతా
పాహి మాం కృపయాదేవ శరణాగత వత్సల
నీలోత్పల దళశ్యామా పద్మగర్భారుణేక్షణ
పీతాంబర పరీధాన లసత్కౌస్తుభ భూషణ
త్వ మాదిరంతో భూతానాం త్వమేవచ పరాయణం
పరాత్పర తరంజ్యోతి ర్విశ్వాత్మా సర్వతోముఖః
త్వమేవాహుః పరం బీజం నిధానం సర్వ సంపదాం
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం నహి

దుశ్శాసనా దహంపూర్వం సభాయాం మోచితాయథా
తమేవ సంకటా దస్మాన్మా ముద్ధర్తు మిహార్హసి'

భగవంతుడు సర్వవ్యాపకుడై సర్వాత్మభావమున వ్యాపించి యుండుట ఒకవిధము. అప్పు డాతడు నిర్వికార బ్రహ్మముగుటచే నిష్క్రియుడై ప్రకాశించును. అతడే మాయ నాధారముగా గొని, సృష్టి స్థితిలయముల చేయుటకై బ్రహ్మవిష్ణుశివ రూపముల వెలయును. అతడే సృష్టికర్త యగును. సృష్టికి ప్రధానకారణమగుటయు, నిమిత్త కారణమగుటయుకూడ అతనికి చెల్లును. అట్లు జగత్కారణుడగువాడే భక్తులకు దర్శనమిచ్చుటకై మనోజ్ఞమూర్తి యగును. పీతాంబరమును ధరించి, దూర్వాదళశ్యాముడై ముగ్ధమోహన సుందరాకారమున భక్తులకు దర్శనమిచ్చును. భూతముల కాదియు, భూతముల కంతమును, భూతముల కాధారముగూడ నతడే. ద్రౌపదికి కౌరవసభయం దెట్టి విపత్తు వచ్చినదో అట్టి విపత్తే ఇప్పుడును వచ్చినది. ఆనా డెవ్వడు రక్షించి, వలువల నిచ్చెనో అతడే నేడు అన్నమును కూరలను, పంచభక్ష్యపరమాన్నము లను సృష్టించి, దుర్వాసునకును, అతని శిష్యులకును సమారాధన గావింపవలెను. అతనినే ఇప్పుడు 'మా ముద్ధర్తు మిహార్హసి' అని శరణాగతురాలైనది. ఇప్పు డాతడిక్కడికి రావలెను. అతని గమనమునకు సముద్రము లడ్డవు. పర్వతములును అంతే. కాల మాతడే. అతనిని 'అచింత్య గతిః' అని చెప్పుదురు. ద్రౌపది స్తుతించు సమయమున రుక్మిణిప్రక్కన కూర్చొనియున్న ఆ కృష్ణబ్రహ్మము పార్శ్వవర్తినియైన రుక్మిణి సల్లే వదలి శయ్యాగారమునుండి సరాసరి ద్రౌపదిపద్ద కేతెంచినాడు. ఆ సమయమున రుక్మిణీమహారాణి చీరెచెంగు అతని చేతలేదుకాబోలు! అత డొక్కడే వచ్చినాడు. ఇతడు దుర్వాసునకు దుర్వాసుడేమో? వచ్చుటతోడనే ద్రౌపది అతని పాదములపై వ్రాలి,

దుర్వాసుని యాగమనమును విన్నవించినది. ఆ మాటల నాతడు వినుట సంగతి యటుండ ఆకలి యాతని బాధించుచున్నదట. ద్రౌపది ఈక్షణమున భోజన మిడినగాని లేపలేడట. ద్రౌపదీ ! తొందరగా నాకు భోజన మిమ్మని కోరినాడు. ద్రౌపది కిప్పుడు వంటపదార్థ మెక్కడిది ? అక్షయ పాత్రను కడిగిపెట్టినది. అందుకని ద్రౌపది సిగ్గుగొన్నది. లేదని చెప్పవలసి వచ్చినది. అతడు కమలలోచనుడు. అతని కన్నులు పెదవి. ఎక్కడైన చాటునయున్న వెన్నముద్దల వెతకిమ్రింగిన ముగ్ధ మోహనుడు. నీ వంటపాత్రను దెచ్చి, ద్రౌపది ! నాకు చూపమనినాడు. ద్రౌపది యెట్టకేలకు స్థాలిని చూపక తప్పినదికాదు. తెచ్చి శ్రీకృష్ణుని ముందుంచినది. భక్తుల గృహమున కాతడు వచ్చినప్పుడు వా రన్నము లేదన్నను ఆత డూరుకొనడు. ఆ గిన్నెలలో ఎక్కడ మిగిలినను అది యా మహనీయునకు చాలును. మది యక్కరలేదు. మదికట్టదలచిన యా పవిత్రమూర్తి బోయువాని మాంసమును తినునా ? ద్రౌపది తెచ్చి చూపిన యక్షయపాత్ర యంచున యిరికియున్న కూరముక్క ఒకటి అతని కంటబడినది. అది కాయగూర కాదు, ఆకుకూర ! అదియు యొక పత్రమట. దానితో కలసి యొక మెతుకున్నదట.

'స్థాల్యాః కంఠేఽథ సంలగ్నం శాకాన్నం వీక్ష్య కేశవః'

ఆ శాకాన్నమునే తన చేతియందుంచి 'విశ్వాత్మా ప్రీయతాం' అని ద్రౌపదిచేత పలికించి – తాను భుజించి – ఆ వెంటనే దుర్వాసాదుల నాహ్వానింపమని చెప్పినాడు. స్నానము కొరకేగిన దుర్వాసాది మహర్షుల పిలుచుటకై సహదేవుడు వెళ్ళగా ఆ క్షణముననే దుర్వాసునితో వచ్చిన మహర్షులు స్నానము చేయుచు, మునకనుండి లేచి, అన్నరసపూర్ణ తృప్తులై త్రేపులు వచ్చు ముఖములతో ఆనందరస నిమగ్నులై యుండిరి. మే మిప్పుడు భోజనము లెట్లు చేయవలెను ?

వారికి తోచలేదు. దుర్వాసునితో ఆ విషయమును చెప్పగా దుర్వాసుని హృదయము బాధపడినది. పాండవులచే వృధాపాకములను చేయించితినని తలంచెను. నాడు అంబరీషుని చరిత మా మహర్షికి స్మృతికి వచ్చినది. హరిభక్తులన్న ఆ మహర్షికి భయము. నాడు అంబరీషుడను రాజర్షి పాదములపై వ్రాలినగాని సుదర్శనచక్ర మాతని విడువలేదు. కావుననే దుర్వాసులు తనతోటి మహర్షులతో ఇట్లు చెప్పినారు.

బిభేమి సుతరాం విప్రాహరి పాదాశ్రయాజ్జనాత్
పాండవాశ్చ మహాత్మానః సర్వేఽధర్మ పరాయణాః
శూరాశ్చ కృతవిద్యాశ్చ వ్రతిన స్తపసి స్థితాః
సదాచార రతా నిత్యం వాసుదేవ పరాయణాః
క్రుద్ధాస్తే విర్దహే యుర్వై తూలరాశిమివానలః
తత ఏతా నపృష్ట్వైవ శిష్యా శ్శీఘ్రం పలాయత.

ఆ దుర్వాస మునీంద్రులతో వచ్చిన పదివేలమంది మహర్షులును ఆయన శిష్యులెనని మీకు తెలుసునుగదా ! వారితో చెప్పిన మాట లివ్వి. నాకు హరిభక్తులన్న చాల భయము. పాండవులు మహాతపస్వులు. ధర్మమూర్తులు. శ్రీకృష్ణ పాదారవిందములే వారి కాశ్రయములై యున్న భక్తశిఖామణులు. వారు కన్ను లెఱ్ఱజేయుచూ మనలను భస్మపటలము గావింపగలరు. దూదికుప్పపై బడిన నిప్పురవ్వవలె మనము తగులబడుటకు కాలయాపనకూడ యుండదు. కావున నో శిష్యులారా ! మరల పాండవుల వద్ద కేగి వారు మనపై చూపు క్రోధదృష్టికి గురికాక వారికి చెప్పకయే మనము పోవుట మంచిదని సలహాను చెప్పిన వెంటనే వారు అంతర్ధానమైరి. సహదేవుడు వారికొరకై అటునిటు చూచి చూచి ధర్మరాజునకు వారు కనబడలేదని చెప్పినాడు. ధర్మజుడు దుర్వాసు నెరుగనివాడు కాడు. ఆతడు ఏ అర్ధరాత్రమున వచ్చి శపించునోయున్న

భయ మా ధర్మజుని పీడవేదు. ద్రౌపదీ శ్రీకృష్ణుల సమాగమ మాత దెఱుగడు. అంతలో శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై వచ్చి, దుర్వాసుడును, శిష్యులును వెళ్ళిన సంగతిధర్మజున కెరిగించి, అతని భయమును దీర్చి శ్రీకృష్ణుడు వెళ్ళినారు.

మహాశయులారా !

ద్రౌపదీమహాసాధ్వియొక్క ప్రభావమును చాటుటలో, భగవానుని యపార భక్తివాత్సల్యమును ప్రకటించుటలో, భక్తియోగముయొక్క ప్రాముఖ్యతను వెల్లడించుటలో, నీఘట్ట మొక ముఖ్యస్థానము నలంకరించినది. భక్తిరసమున భగవంతున కభిషేకించి, అతని కృపారసమునందుకొనుటకు విద్య, వయస్సు, ధనము, పౌరుషము, సౌందర్యము, అధికారము అనునవి ప్రధానములు కావు. భగవానుని కటాక్షములుపొందునాటికి ధ్రువుని వయస్సెంత? గజేంద్రుని విద్యాధికార మేమి? కుబ్జయొక్క సౌందర్య మెట్టిది? సుదాముని భాగ్యమెంత? భగవానుని కివియేవియు ప్రదానములు కావు. భక్తియన కర్మయోగ జ్ఞానయోగములమధ్య వెలుగుచు, అటు నిటు తన కిరణములను ప్రసరింపజేయును.

కథకుపోదము ___

దుర్యోధనుని ప్రయోగము వృథయైనది. పాండవులు కామ్యక వనమునందే వసించి దాని నాధారముగా గొని, యనేక వనసంచారముల ప్రొద్దుపుచ్చుచుండిరి. భూమిపై నవతరించిన రాక్షసాంశములలో సైంధవుడును ఒక రాక్షసాంశయే.

ఇతనికి జయద్రథుడనికూడా పేరు. ఇతడు ధృతరాష్ట్రుని యల్లుడు. దుశ్శల భర్త. సింధుదేశపు రాజు. రాబోవు మహాభారత రణరంగమునం దీతడును ఒక ముఖ్యపాత్ర కాదగు వీరశిఖామణియే.

ఒకనాడు పాండవు లైదుగురును వేటకు పోవుచు ద్రౌపదిని తృణబిందు మహర్షి వారి యధీనమునందుంచి, ద్రౌపది పరిచారికలనుకూడ నామెకు తోడుపెట్టి వెళ్ళినారు. ధౌమ్యమహర్షియు ద్రౌపదితో నా యాశ్రమమునందే యుండెను. సైంధవు డనువాడు సాల్వదేశపు రాజు కూతురును పెండ్లియాడుటకై చతురంగబలమును తనతో కదలిరాగా, కొందరు రాజపుత్రులనుగూడ వెంటనిడుకొని, కామ్యకవనముగుండుగా పయనమును సాగించినాడు. సైంధవుని రథము కామ్యకవన ముఖ ద్వారము ననుసరించియే పోవుచున్నది. ద్రౌపది యా సమయమున కామ్యకవనము నంతను ప్రకాశింపచేయు దేహకాంతితో వెలుగుచు నొక శాఖాగ్రమున తన పాణిపల్లవముంచి ఆశ్రమ ముఖద్వారమున నిలబడినది.

సృష్టిఖండమున నేత్రేంద్రియము గావించు నుపకారము ఏ యింద్రియమును గావింపదు. ఉపకారము చేయునదికూడ నదియే. చూపు దోషములేని చూపరికి ఆ యింద్రియ ముపకారిము గావింపగా; మోహాంధకారమున తిరుగువాని కా యింద్రియమే అపకారము గావించును.

ప్రకృత కథాంశమున సైంధవుడు మోహాంధకారమున మునిగి ద్రౌపదిపై దృష్టిని ప్రసరింప జేసినాడు. మిగిలిన రాజపుత్రు లామెను దర్శించి ఈమె దేవతాప్రతిమ కావచ్చునని అంజలులు ఘటించినారు. ఇప్పుడు సైంధవున కామె ఎవ్వతెయో తెలియవలెను. తెలియుటేకాదు; అమె తనను వరించవలెను. సరాసరి యామె తన నెట్లు వరించును? మధ్యనొక రాయబారి కావలెను. కోటికాస్యుడను రాజపుత్రుడు తన కాప్తమిత్రుడు. ఆతనిని ద్రౌపదియొద్దకు పంపినాడు. శాఖాగ్రపల్లవమున తన పాణిపల్లవ ముంచి నిలచియున్న ద్రౌపదిని సమీపించి కోటికాస్యు

డామె వృత్తాంతము నరసినాడు. సైంధవుని భావమునుకూడ కోటికాస్యు డామెకు తెలిపినాడు. ద్రౌపద మహాసాధ్వి, తొందరపాటు నొందలేదు. చెట్టుకొమ్మను వదలి కోటికాస్యునకు మృదుభాషణముల సమాధాన మిచ్చినది. ఏమని ?

తే॥ అన్న యుచ్చటనే నొంటి యున్నదాన
నీ విచట కేగుదెంచుట సితి యగునె
కుల పతిని ధర్మపతి సన్న నితర కాంత
గా దలంచి పెక్కులు వల్కఁగాదు నీకు.

ఇట్లాతనికి సమాధాన మిచ్చుచునే ఆమె పర్ణశాలాభ్యంతరమున కేగినది.

కోటికాస్యుడు సైంధవునివద్దకు రాగా, ఆమె వృత్తాంతము సైంధవునకు తెలిసినది. ద్రౌపది యాతనికి గౌరవనీయమగు స్థానము. తన కామె వరుసకు సోదరియగును. పాండునందనుల పట్టమహిషి. ఇన్నింటి నెఱిగిన సైంధవుడు ద్రౌపది దివ్యసౌందర్యము తనకు భోగ్యము కావలెనని యూహించినాడు. అదియే రాక్షసత్వము. ద్రౌపది తన్ను వరించనిచో నామెను అపహరించుట కాతడు నిశ్చయించినాడు. కొందఱు మిత్రు లాతనికి సాయమురాగా ఆశ్రమాభ్యంతరమున ప్రవేశించినాడు. మధురభాషల నామెను కుశల ప్రశ్నల పలకరించినాడు. ద్రౌపదయు రాజబంధువగు సైంధవునకు మర్యాదల జేసినది. సైంధవు డెక్కువ కాలయాపన గావించిన పాండవులు వత్తురు. కావున సైంధవుడు తన యభిప్రాయమును ద్రౌపదికి వాచ్యముగనే చెప్పినాడు. ద్రౌపది మితభాషి. సామ దాన భేద దండోపాయము లామెకు తెలియనివి కావు. సైంధవున కామె సామవచనముల తోడనే బుద్ధి చెప్పినది. సైంధవున కా వచనములు రుచించునా ! వావివరుసలు కామానుభవమున

కక్కురలేదన్న వచనములను నీ వెరుగవుకాబోలునని చెప్పి, వనితా రత్నములెల్ల వారలకు భోగ్యమని పలుచని పలుకుల పలికినాడు. ఇట్టి దురాత్ములయెడ సామము కూడదని పారుష్యమవసరముగా ద్రౌపది పాండునందనుల యపార బలసంపదను వర్ణించినది.

ధర్మాత్ముని మత్తిల్లిన వనగజమని వర్ణించి, ఆ మదపుటేనుగటు కొరడాను సూపి యదరించి నీవు బ్రతుకజాలవని చెప్పినది. భీముని కోపము నీ వెఱుగవుకాబోలు. మదపుటేనుగు కుంభస్థలముపై కురికి తన కొనగోళ్ళ దాని తలను చీల్చి, అందు రక్తసిక్తములై యుండు మంచి ముత్తెముల గోళ్ళ నిరీక్షించుకొను మృగరాజునకు సరియని ఆ భీమసేనుని మహోగ్ర క్రోధమును వర్ణించి నీవు బ్రదుకదలచిన ఇటనుండి పొమ్మన్నది.

బెబ్బులి వలె శత్రుమూకపై బడి చించిచెండాడు అర్జునుని పరాక్రమమునకు నీవు గురికావలదని బోధించినది. మహోగ్ర విషానలముల గ్రక్కుచు నాలుకల చాపి వెంబడించు కోడెత్రాచుల కవజ్ఞచేసి, నీవు బ్రతుకుటెట్లని భయపెట్టినది. సైంధవుని ప్రయాణ సమయమునం దేమైన దోషమున్నదేమో? ప్రయాణమున దోషము గాదు. జన్మకాలము నందలి దోషమే యున్నది. అతనిలో రావణుడు ప్రవేశించినాడు. ద్రౌపదిని బలాత్కారముగ లాగి రథముపై కెక్కించుకొనబోవగా, ఆమె విదిలింపుకు క్రిందపడియు బలమున రథముపై కెక్కించినాడు. ధౌమ్యమహర్షి వారి యుపదేశము లా దుర్మార్గునకు వినిపించునా? రథము పోవుచున్నది. ద్రౌపదివద్దనున్న ధాత్రేయిక పాపమేమి చేయగలదు? కన్నీరుకార్చుచు కూరుచున్నది.

శకునశాస్త్రము వట్టిదికాదు. ఆ శకునములు రాబోవు సుఖదుఃఖము లను చెప్పుననువారు వ్యర్థులుకారు. అదియొక శాస్త్రము. పాండవులు

వేటకై నలుదిక్కుల కేగిరికదా! వారి కేవియో కొన్ని దుష్టశకున
ములు ఆశ్రమాభ్యంతర విపత్తును తెలిపినవి. వారు తమ మనసునందిట్టి
సంఘటనను చింతించకపోయినను ద్రౌపది నొక్కదానిని విడిచివచ్చితి
మను యాతురతో వెనుకకు మరలినారు. ఆశ్రమమునకు రాగా ధాత్రేయిక
తన విన్నదనమును ప్రకటించుచు సైంధవుని వృత్తాంతమును దెలిపినది.

పాండవుల రథములు సైంధవునివైపుకు మరలినవి. రథములపై
నున్న తన భర్తల మూర్తులు ద్రౌపది కంటబడినవి. సైంధవుడును
వారిని చూచినాడు. ఆ వచ్చువారలేనా, నీ భర్తలు? ద్రౌపదిని
సైంధవుడు ప్రశ్నించుచుండ, ద్రౌపది యా పాండునందనుల యపార
బలపరాక్రమముల వర్ణించుచున్నది. ద్రౌపదియొక్క పరాభవకాలము
కావచ్చును. కాని యామె భూమిపైకి వచ్చినది. తన పరాభవముల
నిమిత్తముగాగొని దుష్టభూభుజుల పరాభవించుట కను మాటను మనసు
మరువకూడదు. పాండవులు సైంధవుని సమీపించినారు. సైంధవు
డప్పటికిని ద్రౌపదిని విడువలేదు. ధౌమ్యమహర్షియు ద్రౌపదితోడనే
యుండెను. పాండవులకు సైంధవునితో యుద్ధము తప్పలేదు. త్రిగర్త,
శిబి, సింధు, సౌవీరులు పాండవుల కెదురై నిలువగా యుద్ధరంగము
విస్తరించినది. సింధురాజు సైన్యము పాండవుల చేతిలో చాలభాగము
హతమైనది. ఈ యుద్ధమున ధర్మజు డొక్కడే సౌవీరులను నూర్వురను
చంపినాడు. భీమార్జున నకుల సహదేవు లుగ్రమూర్తులై చరింపగా
మధ్యకాలమున సింధురాజు ద్రౌపదిని ధౌమ్యులను వదలి పారిపోవ
నుంకించినాడు. అంతతో యుద్ధము ముగియవలెనుగదా! ముగియలేదు.
ద్రౌపదీ ధౌమ్యుల నిద్దరను ధర్మజుని రథము నెక్కించి నకుల సహదేవు
లనుగూడ ధర్మజునితో యాశ్రమమునకు బంపినాడు పార్థుడు. భీముడు
తన గదాదండమున కాల్బల పశుబలముల నుగ్గాడుచునేయుండెను. ఆ

ఘట్టమున పార్థుని దృష్టి సైంధవునిపై బడినది. ఆతని పట్టుకొనపలెను. అప్పు డాతడు తన బాణపాతముల సైంధవుని నిలిపి భీమునకు సింధు రాజును పప్పచెప్పగా భీము డతివేగముగ రథస్థుడై పారజూపు సైంధవుని రథముపై దుమికినాడు. సైంధవు డెక్కడికి పోవును ? పాదఘాతములతో ముష్టిప్రహారములతో సైంధవుని యురస్థలమును మర్దించి శిరోభాగమును క్రిందకులాగి భూమిపై బడద్రోసి భీము డాతని వధింప సమకట్టినాడు. సైంధవు డానాటితో సమాప్తమగును కాని యాతనితో రాబోవు రణ రంగమున చాలపని యున్నది. కావుననే కాబోలు ! అర్జునుడు భీముని నివారించినాడు. యదార్థమునకు జయద్రథుని చంపుటకు ధర్మజు డిష్టపడడు. దుశ్శల తమకు సోదరికదా ! పర్యవసాన మాతని రథ చక్రమునకుకట్టి పాండవుల దాసుడు వీడని శిరోముండనమున ఆ దుర్మార్గుని పరాభవించి, ధర్మనందనుని యనుమతితో పదలినారు. ధర్మజుడు మాత్రము ఇట్టి దుర్మార్గము లెన్నడును సేయకుమని బుద్ధి చెప్పి పంపినాడు.

శత్రువును చంపుటయొక్కటే విజయముకాదు. శత్రువుని వికృతుని గావించుటయు, చపేటికలును, జానుభాగముల క్రుమ్ముటయు, పరాజితుని చేయదగు క్రియలు. అట్లేచేసి సైంధవుని వదలినారు. సైంధవు డక్కడున్న ఋషులు మొదలగువారికి వందన మాచరించి లజ్జాన్వితుడై రాజ్యమునకేగక ఈశ్వరుని గురించి తపమాచరించినాడు. ఎందుకు ? పాండవుల నిర్జించుటకు. ఈశ్వరుడు సాక్షాత్కరించగా అర్జునునితప్ప పాండవుల నందరి నొక్కరాత్రి మాత్రము జయించుటకు ఈశ్వరునివలన వరము దొరికినది. సైంధవుని పాత్ర ఈ ఘట్టమునం దింతతో ముగిసినది.

ఇక పాండవుల సంగతి —

ద్రౌపది కీనాడు జరిగిన పరాభవము సహింపరానిదిగదా! పాండవులును, ద్రౌపదియు బాధపడుసమయమున మరల మార్కండేయ మహర్షివారి యాగమనమైనది. మహనీయులగు మహర్షుల యమృత బోధలుగాని వారి మనమును శాంతింపచేయజాలవు. పాండవు లందించిన సపర్యల నందికొని మార్కండేయులు ధర్మనందనుని సందేహముల తీర్ప సంసిద్ధుడుకాగా చక్కని యుపాఖ్యానములు రెండు నడచినవి. ఈ ఘట్టమే మహాభారతమున రామాయణకథకును, సావిత్ర్యుపాఖ్యానమునకు బీజమైనది. ఈనాడు ద్రౌపదపడిన యవమానమువంటి యవమానము నొందిన వధూటియు, నావలె యిడుములబడిన రాజును గలడా? యని ధర్మజుడు ప్రశ్నింప, మార్కండేయ మహర్షి రామాయణకథను సావిత్ర్యుపాఖ్యానము చెప్పినారు. సీతపడినపాట్లు ద్రౌపదికంటె గొప్పవని చెప్పుట కిది యుదాహరణము. సీత భర్తృ వియోగమున రావణుని గృహమందు ఒంటరిగా యుండ మీరందరు నొక్కచో కలిసియుండుట మీకు జరిగినదని చెప్పినారు. కష్టకాలము లెవ్వరికిని తప్పవని రాముని యుదాహరణము ధర్మజున కిచ్చినారు. తరువాత పతివ్రతల మాహాత్మ్యమును చెప్పుమనగా సావిత్రీ సత్యవంతుల కథావస్తువును ప్రతిపాదించినారు. ఇవి యిట్లుండ మీకీ పర్వమున కర్ణుని యపూర్వ త్యాగసంపదను గురించిన విషయ మొకటి యీనాటి ప్రస్తావనయందు ముఖ్యవిషయము.— అవి పాండవుల వనవాసము పూర్తికావచ్చిన చివరిరోజులు. ఇక సంవత్సరకాలము గడవగా సంగ్రామరంగము నిర్మితమగుట నిజము. ఇది దేవతలందరు ముందుగనే ఎరిగిన నిగూఢఘట్టము. దేవేంద్రుని యంశము పార్థుడు కాగా, సూర్యుని తేజము కర్ణుడు. జరుగబోవు భారతరణరంగమునకు

వెనుకభాగమున దేవతలును రాక్షసులును కూడ యుండి నడుపుచుండిరను విషయమును మీకెన్నిమారులో చెప్పియేయుంటిని. ప్రకృతమున కర్ణుని చంపదగు వీరపురుషు డొక్క యర్జునుడే. అయ్యును సహజకవచకుండల ధారి కర్ణుడు. ఆ కవచకుండలము లా కర్ణుని శరీరము నలంకరించి యున్నంతకాలమును, అతడు దివ్యపురుషుడు. అతని కింతవరకును వసుషేణుడని పేరుగాని, కర్ణుడని పేరుగాదు. అతని దివ్యత్వము నంతరింపజేయుట పరాక్రమసాధ్యమగు పనికాదు. మాయోపాయముననే అతని ద్వివ్యత్వమునకు హాని చేయవలెను. అప్పు డా కర్ణుని తేజము భూమిపైనుండి తొలగును. యదార్థమున కాతడు తలపై నొక కిరీటము లేని చక్రవర్తి యనుట కెట్టిసందేహమును లేదు. అతడు మహాత్యాగి. కృతయుగాలంకారభూతులగు మాంధాతాది చక్రవర్తుల యశఃకాయము లలో నీతని జీవితముకూడ నలంకృతము కాదగియున్నదనుట త్రికాల సత్యము. త్యాగమను యజ్ఞమునం దాతడు నిత్యదీక్షితుడు. యశఃకాయ మాయనయొక్క ముఖ్యశరీరము. అతడు తపోమూర్తికూడ. అతడు యుద్ధవీరు డనుటకు కొన్ని శక్తు లాతని జీవితమునం దడ్డియున్నను దానవీరు డనుటకు ఏ శక్తులును అతనిని అడ్డలేదు. నాడు దానవీరు డాత డొక్కడేనని ప్రతి రాజపుత్రుడును తలనూపవలసినదే. త్యాగమను గుణమున కాతని కాతడే సాటి. కర్ణున కొకరోజున సూర్యుడే బ్రాహ్మణ వేషధారియైవచ్చి యొక వర్తమాన మందించినాడు. ఏమది ? పాండవ పక్షపాతియైన దేవేంద్రుడు నీ సహజకవచకుండలముల నపహరించుటకై రాగలడనియు, అతడు బ్రాహ్మణవేషమున వచ్చు ననియు చెప్పి, వాటిని రక్షించుకొమ్మని చెప్పినాడు. అత డామాటను చెప్పునప్పుడు బ్రాహ్మణ దివ్యతేజోవిరాజితుడై వెలుగొందుచు చెప్పినాడు. కావుననే నీ వెవ్వరవో దివ్యతేజమున వెలుగుచు నా కుపదేశించు

చుంటివని కర్ణుడు ప్రశ్నించగా తాను సూర్యుడనని చెప్పినాడు. ఆ సమయమున కర్ణుడు సూర్యునితో పలికిన పలుకు లఖండ భారత క్షేత్రమున సువర్ణాక్షరములతో వ్యాసుడు సంస్కృతభాషయందు లిఖించగా మన యాంధ్రకవులు తెలుగు నేల నాతని కీర్తిపతాకము నెగుర వేసి, యాచంద్రతారకము గావించినారో! అట్టి ఆంధ్రానువాదమును మీకు వినిపించుచున్నాను.

ఉ. భూసురకోటి వేడుటయు బోడిగ బ్రాణములైన నీగి నా
భాస దినేశ లోకమున బ్రస్ఫుట మింతయు నట్లు గావునన్
వాసవుడట్టె నన్నడుగ వచ్చు బ్రియంపడి నాకు నొక్క బ్రా
తే సురలోక వందిత మదిం గవచంబును గుండలంబులున్.

ఆ. కీర్తి విడుపజాల గీర్తితో మెలగంగ
జావు వచ్చెనేని జత్తుగాని
జగములోన నెల్ల సడి కంటి జావు మేల
సగ బరగు మాట యనఘ వినవె.

త్యాగము, వ్రతదీక్ష యను రెండు గుణము లాతని గుణమయ దేహమునకు ముఖ్యప్రాణములు. కర్ణుడు తన జీవితము నెక్కడ గడపినను తన జీవితమునకు కొన్ని లక్ష్యముల నాతడు నిర్ణయించు కొనినాడు. ఆ లక్ష్యము లాతనికి కేవల లక్ష్యమాత్రములై అతని అంతరాత్మయందు దాగలేక లోకవిస్తృతములై వ్రతదీక్షలై వెలసినవి. అందొకటి బ్రాహ్మణు డెవ్వడైన అతని యాచించుచో తన ప్రాణముల నైన యిచ్చును. ఇది అతని వ్రతము. రెండవ లక్ష్యము నశించనికీర్తి శరీరధారణము. భౌతికశరీర మాతనికి, కీర్తిశరీర రక్షకముగాని భోగ మయ జీవితపరమావధి కాదు. కావుననే అతడు కవచకుండలముల

నింద్రున కిచ్చుట యొక లెక్కయా ? అనినాడు. ఇది మొదటి పద్యము లోని భావము

రెండవపద్యమున కీర్తికే స్థానమిచ్చినాడు. చావున కాతడు లెక్క చేయలేదు. ఆ తరువాత యాతడు చెప్పిన దివ్యసందేశ మొకటి యున్నది. ఆ సందేశ మాచంద్రతారకముగ నిత్యమైయుండునది. తాత్కాలికముకాదు.

ఉ॥ కీర్తియ యిచ్చు బుణ్యగతి గీర్తియ తల్లియు బోలె బ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియు గీర్తి విహీనుడచూ శవంబు దు
ష్కీర్తికు నెల్ల చేటులును గిట్టి హరించు ననందె తొల్లి భ
క్తార్తి హరుండు నాబరగు నంబుజ సూత జగద్ధితంబుగన్.

మరికొన్ని లక్ష్యము లాతని కిట్లున్నవి. పైరెండును కాక మూడవది వీరోచితమగు యుద్ధరంగమున తన శరీరమును వదలుట. నాలుగు తన్నెవ్వరైన శరణువేడుచో అభయదాన మిచ్చుట. అయిదవది స్త్రీ వృద్ధబాలు రేఘట్టమందైన బాధల నందుచో వారి నాయాపదలనుండి యుద్ధరించుట. ఆ సమాధానము లెట్లున్నవి ? కర్ణుని దీక్షను ప్రస్ఫుటము గావించుచున్నవి. కర్ణుని భౌతిక శరీరము స్థిరమైయుండుట సూర్యుని హృదయము. యశశ్శరీరము స్థిరమగుట కర్ణుని హృదయము. ఈ ఘట్టమున సూర్యుడు కర్ణునకు తండ్రి. కర్ణుడు సూర్యునకు పుత్రుడు. పుత్రప్రేమను సూర్యుడు చూపగా ఆత్మప్రేమను కర్ణుడు ప్రకటించినాడు. కర్ణుడు సూర్యుని పుత్రుడు. కర్ణుడు సూర్యుని పుత్రు డెట్లయ్యెను ? సూత నందనుడుగదా ! అందురా ? సూతుని గృహమునం దాతడు జన్మించ లేదు. రాజ గృహమునందే రాజపుత్రికయందే సూర్యతేజస్సున జన్మించినాడు. కుంతికి కన్యాత్వముననే యాతడు పుత్రుడయ్యెను. సూతుని గృహమున పెరిగినాడు. మరి కుంతి కన్యాత్వముననే పుత్రుని

గనుట ధర్మము నతిక్రమించుటకాదా ? అను ప్రశ్న సామాన్యధర్మము ననుసరించి యుదయించవచ్చును. కాని విశేషధర్మమును పెద్దలవలన తెలుసుకొనవలెను. నామాస్య స్త్రీ-పురుష సంబంధమువంటి సంబంధమున కర్ణు డుదయించలేదు. వారి సంబంధ మెట్టిదో చూడుడు.

తథేత్యుక్త్వాతు తాం కుంతీ మా వివేశ విహంగమః
స్వర్భానుశత్రు ర్యోగాత్మా నాభ్యాంపస్పర్శ చైవ తామ్.

సూర్యభగవాను లామెయందు ప్రవేశించెనట. ఎట్లు ? యోగులు సంకల్ప మాత్రముననే అనేక శరీరముల సృష్టించుట యోగశాస్త్ర ప్రసిద్ధము. 'సూర్య ఆత్మాజగతః' జగదాత్మభూతుడగు భగవానులు యోగుల చర్య ననుకరించినవాడై ఆమెను స్పృశించినాడు. 'నాభ్యాం పస్పర్శ'

తత స్సావిహ్వలేవాసీ త్కన్యా సూర్యస్యతేజసా
పపాత బాధ నా దేవీ శయనే మూఢ చేతనా.

అప్పుడు కుంతికి సూర్యునితో క్రీడించుచుంటినన్న ఊహకూడ లేక ఆమె సూర్యతేజమునకు మోహితయై ఒడలు తెలియనిస్థితి యిందున్నది.

శ్లోకమునుకూడ పరికింపుడు -

'తిగ్మాంశుస్తాం తేజసా మోహయిత్వా
యోగేనాఽవిశ్యాఽత్మ సంస్థాం చకార
నచైవైనాం దూషయామాస భానుః
సంజ్ఞాం లేభే భూయ ఏవాథ బాలా'

భగవానులు తన తేజమున ముగ్ధను గావించి, యోగ ప్రభావముచే నామెయందు ప్రవేశించెను. సూర్యు డామెను దూషితురాలనుగా

చేయలేదు. అతడు తన యోగశరీరమును ప్రవేశపెట్టిన తరువాతనే యామెకు స్మృతి కలిగినదని ఈ శ్లోకము చెప్పుచున్నది. ఈ శ్లోకమున ప్రయోగింపబడిన పదముల నర్థము జేసికొన్న బుద్ధిమంతు లెవ్వరును ఈ విషయమున సంశయింపరు. కావున నామె కన్యాత్వమునకు దోషము రాలేదు. భారతీయేతిహాసములలోని దివ్యచరిత్రల శంకించుట మాతా పితరుల పవిత్రతను శంకించుటవంటిదని భావించి, ఆ పవిత్రచరిత్రలను మహర్షు లెట్లు నుడివిరో వారి వాఙ్మయమును పరిశీలించుట బుద్ధిమంతుల లక్షణము.

తరువాత కథాంశమేమన, సూర్యు డట్లు చెప్పినను కర్ణుడు తన కవచకుండలముల నిచ్చుటయే ప్రధానముగ చెప్పగా చివరకు సూర్యుడు నీవు దేవేంద్రునకు నీ కుండలముల నిచ్చుచో ఇంద్రునివద్దనున్న యమోఘశక్తిని తీసికొని నీ కవచకుండలముల నిమ్మని చెప్పెను. సూర్యభగవానుడు కర్ణుని విడిచి వెళ్ళగా దేవేంద్రుడు వచ్చుటయు కర్ణుడు తన సహజ కవచకుండలముల నిచ్చి, శక్తి బాణమును ఇంద్రుని వలన తీసుకొనుటయు జరిగినది. కాని ఒక్క చమత్కారమైనది. ఆ యమోఘశక్తి బాణ మొక్కమారు మాత్రమే, ఒక్క వ్యక్తియందు మాత్రమే యుపయోగించును. ఆ విధముగనే దేవేంద్రుడు కర్ణున కాశక్తి నిచ్చినాడు. అంతటితో ఆ కథ ముగిసినది.

ఇక పాండవుల సంగతి___

మరల వారు కామ్యకవనమునుండి ద్వైతవనమున కేగినారు. ఇది చివరి పయనము. ద్వైతవనమున కొన్ని రోజులు గడచినవి. ఒకనాడొక బ్రాహ్మణుని అగ్నిహోత్రమునుంచుకొను అరణిని ఒక మృగము తన కొమ్ములకు తగిలించుకొని పారిపోవుచుండగా, నా బ్రాహ్మణుడు తన

యరణిని తెచ్చి యిమ్మని పాండవులను యాచించినాడు. ఆ యరణి లేకున్న అగ్నిహోత్రములు సాగవు. బ్రాహ్మణుని అరణిని తెచ్చుటకై పాండవు లైదుగురును ఆ మృగమును వెంటనంటగా, ఆ మృగ మా యరణ్యమధ్యమున మాయమైనది. ఎటుబోయెనో తెలియలేదు. కాని పాండవులు దానిని వెంబడించి దప్పిగొనినవారై అలసినారు. వారొక వటవృక్షము నాశ్రయించిరిగాని వారి కా ప్రదేశమం దెక్కడను సరస్సు కనుపించినదికాదు. నకులుడు మఱిచెట్టు నెక్కినాడు. అందొకచో సరస్సు నకులునికి కనుపించినది. అతడు జలపానము గావించి, మిగిలినవారికి పత్రపుటములతో జలమును తేవచ్చును. నకులు డా సరస్సున కేగినాడు. కొంతకాలము గడచినది. నకులుడేడి ? సహదేవు డాతనికొరకేగినాడు. అతడును రాలేదు. అట్లే భీమార్జునులు కూడ వెళ్ళుట జరిగినది. చివరి కేగినవాడు ధర్మజుడు. అత డా సరస్సున కేగగా అక్కడొక విషాద ఘట్ట మాతని కెదురైనది. నలువురు సోదరులును సరస్సుయొద్దున మృతులై పడియుండిరి. వీరి నీఘట్టమునకు తెచ్చిన దెవరు ? ఎవరో, ధర్మజు డేదయో యూహించినాడు. ఈ సరమున దుర్యోధనుడు విషమును కలిపి యుండవచ్చును. మహిమాన్వితుల మహిమ కావచ్చునేమో ? అవి అతని యూహలు.

ఏదిఏమైనను ఇప్పుడు చేయవలసిన కృత్యము తన్ను బాధించు దప్పికను తీర్చుకొనుట. కాలును నీటమోపినాడు. ఆకసమునుండి యొక పెద్దధ్వని వినవచ్చినది. ఏమని ? నే నొక బకమును నా యనుజ్ఞ లేక నీటిని త్రాగరాదు. ఇది నా సరస్సు. దీనియం దెవ్వరైన దాహము తీర్చుకొనవలెనన్న నే నడుగు ప్రశ్నలకు సమాధానమిచ్చి, ఈ నీటిని త్రాగవలెను. లేకున్న వారు మృతులగుదురు. నీ నలువురు తమ్ములును అట్లే మృతులై పడిరని.

ధర్మజుడు చకితుడై జలపానమును విరమించినాడు ఒక పెద్ద శరీరము మాత్ర మాతనికి గోచరమైనది. ఆ భూత మిట్లు చెప్పినది. నే నొక యక్షమును నా యడుగు మాటలకు సమాధాన మివ్వక జలపానము చేయకుము. ధర్మజు డతి వినయమున దాని మాటల కంగీకరించినాడు. వీటినే భారతమున యక్షప్రశ్నలందురు. ఇప్పు డీ యక్షు డడుగు ప్రశ్నలన్నియు ఆరణ్యక భాగములోనివి ఈ ప్రశ్న లన్నియు ఆత్మతత్వ ప్రతిపాదకములే.

## యక్షప్రశ్నలు

ప్ర. 'కిం స్విదాదిత్య మున్నయతి?
కే చ తస్యాభిత శ్చరాః
కశ్చై నమ స్తం నయతి
కస్మింశ్చ ప్రతితిష్ఠతి'

ఆదిత్యుని నడపించున దేది? ఆతనిచుట్టునూ తిరుగు వారెవరు? ఆతనిని అస్తమింపచేయున దెవరు? ఆదిత్యుడు దేని యాధారమున నిలుచును?

స. 'బ్రహ్మాదిత్య మున్నయతి.
దేవా స్తస్యాభిత శ్చరాః
ధర్మశ్చాస్తం నయతి చ
సత్యే చ ప్రతితిష్ఠతి'

ఆదిత్యుని బ్రహ్మ నడిపించుచున్నాడు. ఆతనిచుట్టును తిరుగువారు దేవతలు. ఆ సూర్యుని అస్తమింపచేయునది కాలధర్మము. ఆదిత్యున కాధారము సత్యము.

(అంతరార్థము) ఇచ్చట ఆదిత్యుడన సూర్యుడుకాదు. యక్షుడు ఆదిత్యశబ్దమ్మును జీవుడను అర్థమున వాడినాడు. (ఆదత్తే శబ్దాదీన్ శ్రోత్రాదిభిః ఇత్యాదిత్యః) శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను శ్రవణాది ఇంద్రియములచే గ్రహించువాడు జీవుడు. జీవుడను అర్థమునే దృష్టియం దుంచుకొని ధర్మజుడు సమాధాన మిచ్చినాడు.

దేహమే నేను అని అభిమానించి, దేహధర్మములైన బలియుట, చిక్కుట మొదలగు వాటిని తనయం దారోపించుకొని దేహమునకంటె నేను వేరుకాదను జీవునకు దేహమునకంటె నీవు వేరుగా వుంటివని చెప్పినది వేదము. ఆ వేదమునే దృష్టియం దుంచుకొని జీవుని నడిపించునది వేదమని బ్రహ్మపదముచే సమాధాన మిచ్చినాడు. అట్లే దేవత లను పదమును సత్యధర్మములకు బదులుగా వాడి సత్యధర్మల నవలంబించిన వారినే వేదము ఉద్ధరింవగలవని చెప్పినాడు. శమము, దమము, తితిక్ష, శ్రద్ధ, సమాధానములను విశుద్ధ గుణసంపద కలిగిననే ఆత్మజ్ఞానము యొక్క ఫలము నాత డనుభవించును. ఆ వేదోక్తధర్మమే ఇచ్చట జీవుని హృదయాకాశమును స్వచ్ఛము గావించి, ధ్యానయోగాదికములను కల్పించి ఈ జీవత్వమును అస్తమింపజేయును. చివరి సత్యశబ్దము పరబ్రహ్మపరమై ధర్మజునిచేత వాడబడినది. ఈ దృశ్యప్రపంచమున కంతకును ఆధారము పరబ్రహ్మ యగుటచే జీవజగత్తులు బ్రహ్మము నాధారముగాగొని నిలచినవని చెప్పినాడు. మోక్షమునకు సోపాన క్రమమును ఆధ్యాత్మికశాస్త్రము లిట్లు వర్ణించినవి.

ప్రథమమున శాస్త్రజ్ఞానమును సంపాదింపవలెను. ఆ జ్ఞానముచేత సుగుణసంపదల నలవరచుకొనవలెను. ఆ ఆత్మగుణములచే మనస్సు శుద్ధముకాగా సగుణబ్రహ్మము నుపాసింపవలెను. అట్లీశ్వరానుగ్రహపాత్రుడై సకలబాధారహితమగు కేవలాత్మభావమును నొంది జరామరణ

రహితుడై తరింపవలెను. ఇదియే మొదటి ప్రశ్నోత్తరములలోని హృదయము.

ప్ర. 'కేనస్విచ్ఛ్రోత్రియో భవతి
కేనస్విద్విందతే మహత్
కేనస్విద్ద్వితీయవాన్ భవతి
రాజన్ కేన చ బుద్ధిమాన్.

దేనిచేత శ్రోత్రియు డగును? దేనిచేత మహత్తు సంపాదింపబడును? దేనిచేత రెండవవాడు కాగలడు? దేనిచేత బుద్ధిమంతు డగును?

స. శ్రుతేన శ్రోత్రియో భవతి
తపసా విందతే మహత్
ధృత్యా ద్వితీయవాన్ భవతి
బుద్ధిమాన్ వృద్ధసేవయా'

వేదాధ్యయనముచే శ్రోత్రియు డగును. తపస్సుచేత మహత్వమును తెలిసికొనును. ధైర్యముచేత రెండవరూపము కలవాడగును. పెద్దలసేవచే బుద్ధిమంతుడగును.

(అంతరార్థము) పై ప్రశ్నలలో జీవుడు బ్రహ్మ యగుటకు వేదములు కారణములని చెప్పబడినది. ఆ వేదముల నెట్లుపయోగించవలెను? అను ప్రశ్నకు ఈ శ్లోకమున సమాధాన మివ్వబడుచున్నది. ఇచ్చట శ్రోత్రియు డన బ్రహ్మజ్ఞాని అను అర్థమున, జ్ఞాని ఎట్లగునని ప్రశ్నించగా; వేదార్థమును ధారణచేయుటచే బ్రహ్మజ్ఞాని యగునని సమాధాన మియబడినది. 'మహత్' అను పదము 'పరబ్రహ్మ' అను అర్థమునందు వాడబడినది. పరబ్రహ్మతత్వమును గుర్తెరుగవలెనన్న ఆత్మమననము కావలెనని సమాధాన మివ్వబడినది. తపశ్శబ్దమున కిచ్చట మననమని అర్థము.

మనస్సు చంచలమైనదిగదా! అట్టి మనస్సు బ్రహ్మ మననమున స్థిర పడుటెట్లు? అని ప్రశ్నించగా మనస్సును సత్వమయము చేయగా ఆ మనస్సు బ్రహ్మ మననమున కుపయోగింపబడునని సమాధాన మీయబడుచున్నది. రెండవవాడను పదము పరబ్రహ్మపరముగ వాడబడి ప్రశ్నించగా, ఆ పరబ్రహ్మతత్వము ధైర్యముచేత సంపాదింపబడునని సమాధాన మిచ్చినాడు. ధైర్యమన సత్వగుణము.

జ్ఞానము పరోక్షమనియు, అపరోక్షమనియు రెండు విధములు. చివరిప్రశ్న అపరోక్షజ్ఞాన మెట్లు కలుగును? అని. ఇక్కడ బుద్ధిపదము అపరోక్షజ్ఞానపరము. అపరోక్షజ్ఞానము అనగా అనుభవము. అది గురు ముఖమునగాని స్థిరపడదని సమాధాన మిచ్చినాడు ధర్మజుడు. వృద్ధ శబ్దము గురుపరము.

ప్ర. 'కిం బ్రాహ్మణానాం దేవత్వం?
కశ్చ ధర్మ స్సతామివ?
కశ్చైషా మ్మానుషో భావః?
కి మేషా మసతామివ?'

బ్రాహ్మణులకు దేవత్వము నిచ్చునదేది? ఏ ధర్మము నవలంబించిన అతడు సాధుపురుషు డగును? బ్రాహ్మణునకు మనుష్య భావ మెట్లు వచ్చును? వీనికి దురాచార మేమి?

స. 'స్వాధ్యాయ ఏషాం దేవత్వం
తప ఏషాం సతామివ
మరణం మానుషో భావః
పరివాదోఽసతా మివ'

పై ప్రశ్నలయందు శ్రవణ మనన విధి ధ్యాసము బ్రహ్మజ్ఞాన హేతువులని వర్ణించబడినది. ఈ ప్రశ్న- అట్టి వేదాంత శ్రవణమునకు అధికారి ఎవ్వడు ? అను విషయమును నిర్ణయించుమన్నది.

బ్రాహ్మణునకు దేవత్వము నిచ్చునది వేదము. ఇచ్చట దేవత్వమనగ మరణము లేకపోవుట అని అర్థము. మరణరాహిత్యము నొసంగునది వేదము లేక ఉపనిషత్కాండము అట్టి జ్ఞానసంపాదనము సాధువులవల్లనే జరుగును. ఇంద్రియనిగ్రహము మొదలగు గుణములు కలిగిననే అతడు అర్హుడగును కాని, బ్రాహ్మణుడై జన్మించుటచేతనే జ్ఞానసంపాదనమున కర్హుడుగాడని భావము. మృత్యుభయమే మనుష్యుడనుమాటకు అర్థము. ఇట్టి సాధకుడు దేవబ్రాహ్మణ నిందల చేయుచో అతడా సాధనభాగమున దురాచారుడు కాగలడు. అనగా నేను జ్ఞానినన్న అహంకారముతో దేవతలకంటెను, కర్మయోగులకంటెను నేను గొప్పవాడనని భావించినను అది దురాచారము క్రిందకు వచ్చును.

ప్ర. 'కిం క్షత్రియాణాం దేవత్వం ?
కశ్చ ధర్మస్సతామివ ?
కశ్చైషాం మానుషో భావః
కిమేషా మసతామివ ?

క్షత్రియునకు స్వర్గమిచ్చునదేది ? క్షత్రియునకు ఉత్తమధర్మమెద్ది ? క్షత్రియుడు మనుష్యధర్మముగలవాడెప్పుడగును ? ఇతనికి దురాచారము లెవ్వి ?

స. 'ఇష్వస్త్ర మేషాం దేవత్వం
యజ్ఞ ఏషాం సతామివ
భయం వై మానుషో భావః
పరిత్యాగోఽసతామివ'

క్షత్రియునకు స్వర్గ మిచ్చునది ధనుర్విద్యయే. రాజసూయాది యజ్ఞముల నిర్వహించుట ఉత్తమధర్మము. యుద్ధమున ఓడుదునన్న భయమే మనుష్య ధర్మమగును. శరణార్థియగు వానిని పరిత్యజించుటే క్షత్రియునకు దురాచారము కాగలదు.

(అంతరార్థము) క్షత్రియుడు ఏ కర్మను ప్రధానముగా ఆచరించి జ్ఞానసాధకు డగునని ఈ ప్రశ్నయందలి అంతరార్థము. క్షత్రియుడు తన స్వధర్మమగు యుద్ధమును ధర్మముకొరకై అవలంబించి, శరణాగత రక్షణమును ప్రధాన ధర్మముగ స్వీకరించుచో ఆతడు ఆత్మనిష్ఠను పొందగలడని సమాధానము.

ప్ర. కిమేకం యజ్ఞియం సామ ?
కిమేకం యజ్ఞియం యజుః ?
కా చైషాం వృణుతే యజ్ఞం ?
కాం యజ్ఞో నాతివర్తతే ?

యజ్ఞ నిర్వాకమైన ముఖ్యసామమేది ? ఏ యజుస్సు ముఖ్యమైనది ? బ్రాహ్మణుల క్షత్రియులయొక్క యజ్ఞమును స్వీకరించునదేది ? యజ్ఞము దేనిని అతిక్రమించదు ?

స. ప్రాణో వై యజ్ఞియం సామ
మనో వై యజ్ఞియం యజుః
ఋగేకా వృణుతే యజ్ఞం
తాం యజ్ఞోనాతి వర్తతే.

ప్రాణము యజ్ఞ నిర్వాకమగు సామము. మనస్సు యజ్ఞమందలి యజుస్సు. ఋగ్వేద మొక్కటే యజ్ఞమును స్వీకరించును. వానిని అతిక్రమించి యజ్ఞములేదు.

(అంతరార్థము) యజ్ఞములు రెండువిధములు. బాహ్యములు, ఆంతరములు. బాహ్యయజ్ఞములందు వినియోగపడు యజుర్వేద ఋగ్వేదములు, సామవేదము అంతర్యజ్ఞములం దెట్లు అన్వయము లగును?-అని ప్రశ్న. ఆ ప్రశ్నకు అంతర్యజ్ఞమునందు ప్రాణమే సామ వేదస్థానము నాక్రమించును. మనస్సు యజుర్వేదమును, ఋగ్వేదము ఉపాస్యమగు ఈశ్వరస్థానమునం దుండునని సమాధానము. మూడు వేదములకంటే జ్ఞానసాధనము వేరులేదని నిర్ణయమైనది.

ప్ర. కిం స్విదావపతాం శ్రేష్ఠం ?
కిం స్విన్నివపతాం పరం ?
కిం స్విత్ప్రతిష్ఠమానానాం ?
కిం స్విత్ప్రసవతాం వరం ?

దేవతలను తృప్తి నొందించినవారి కేమి ఫలము ? పితృదేవతల నర్చించువారి కేమి ఫలము ? కీర్తి నెట్లు సంపాదింపవలెను ? సంతానమున శ్రేష్ఠమైన దేది ?

స. వర్షమావపతాం శ్రేష్ఠం
బీజం నివపతాం వరం
గావః ప్రతిష్ఠమానానాం
పుత్రః ప్రసవతాం వరః.

దేవత లిచ్చు ఫలములలో శ్రేష్ఠమగు ఫలము వర్షము. పితృ దేవత లందించునవి ధనధాన్యములు. కీర్తి నిచ్చువాటిలో ఆవులు గొప్పవి. సప్తసంతానములలో పుత్రసంతానము శ్రేష్ఠము.

(భావార్థము) పైన జ్ఞానయజ్ఞమును వర్ణించి, ఆ యజ్ఞములందు చెప్పబడిన ప్రాణోపాసనలు చేయలేనివారికి సామాన్యమగు దేవ తారాధనమును, గోపూజయు, పుత్రసంతతి వడసి పితృఋణమును తీర్చుకొనుటయు మోక్షమార్గములని ఇందు ప్రతిపాదింపబడినది.

ప్ర. 'ఇంద్రియార్థా ననుభవన్ బుద్ధిమాన్ లోకపూజితః
సమ్మత స్సర్వభూతానాం ఉచ్ఛ్వసన్కో నజీవతి.

ప్రాపంచిక విషయముల ననుభవించుచు, తెలివికలిగి, ధనవంతుడై ప్రజల మన్ననల నందుచు బ్రతికియుండియు చచ్చిన వా డెవడు ?

స. దేవతాతిథి భృత్యానాం పితౄణా మాత్మ నశ్చయః
న నిర్వపతి పంచానా ముచ్ఛ్వసన్ న సజీవతి.

ఇక్కడనుండి సర్వమాన్యములై యుండు ధర్మములను బోధించుటకై యక్షుని ప్రశ్నలు నడచుచున్నవి.

గృహస్థు తా నీ సంపాదించిన ద్రవ్యముచేత అతిథిపూజల గావింపక పితృదేవతల నర్చింపక సేవకుల కిడక తాను అనుభవింపక నేను ధనవంతుడనను భావము మాత్రము చేతనే సంతోషించుచో ఆతడు బ్రతికియు చచ్చినవాడగును.

ప్ర. కిం స్విద్గురుతరం భూమేః ?
కిం స్విదుచ్చతరం చ ఖాత్
కిం స్విచ్ఛీఘ్రతరం వాయోః
కిం స్విద్బహుతరం తృణాత్.

భూమికంటె బరువైన దేది ? ఆకాశముకంటె ఎత్తైన దేది ? వాయువుకంటె వేగమైన దేది ? ఎద్ది గడ్డిపరకకంటె తేలిక యగును ?

స. మాతా గురుతరా భూమేః
ఖాత్ పితోచ్చతర స్తథా
మన శ్శీఘ్రతరం వాతాత్
చింతా బహుతరీ తృణాత్.

భూమికంటె గొప్పది తల్లి. ఆకసమునకంటె గొప్పవాడు తండ్రి. వాయువునకంటె వేగమైనది మనస్సు. తృణముకంటె నీచమైనది చింత.

ఈ సమాధానమున మాతా పితృసేవయు మోక్ష మిచ్చునని సామాన్యు లందరకును బోధింపబడినది.

ప్ర. కిం స్విత్సుప్తం న నిమిషతి?
కిం స్విజ్జాతం న చోపతి
కస్య స్విద్ధృదయం నాస్తి
కిం స్విద్వేగేన వర్ధతే.

నిద్రించియు కన్నుమూయని దేది? పుట్టియు చేతనముకాని దేది? రూపముండియు హృదయములేని దేది? వేగముచేత దేనికి వద్ధి కలుగును?

స. మత్స్య స్సుప్తో న నిమిషతి
అండం జాతం న చోపతి
అశ్మనో హృదయం నాస్తి
నదీ వేగేన వర్ధతే.

చేప నిద్రించియు కన్నుమూయదు. గ్రుడ్డుపుట్టియు కదలదు. రాతికి రూపమున్నను హృదయములేదు. ప్రవాహము వేగముచేత వృద్ధిబొందును.

(అంతరార్థము) ఇక్కడ మత్స్యశబ్దమునకు జీవు డర్థము. అండ శబ్దమునకు బ్రహ్మాండ మర్థము. రాయి అనుమాట సమాధికి సంజ్ఞ. జీవుడు చేపవలె జాగ్రత్‌నుండి స్వప్నమునకును లేక ఈ లోకమునుండి స్వర్గలోకమునకును తిరుగుచున్నను తన నిజరూపమును కోల్పోవడు. చేపకు రెప్పలుండవు. అందుచేత అది కన్నుమూయదని చెప్పబడ్డది. కేవలము చేపయొక్క స్వరూపమును చెప్పుటకై ఈ ప్రశ్న పుట్టలేదు.

అందశబ్దంతో అహంకారము మొదలు ప్రాణాది ఇంద్రియ సమూహ మంతా వర్ణితమైనది. జీవుడు చేతనుడు కాగా ఇంద్రియాదులు అచేతనములు. అవి పుట్టియు కదలలేవు. చేతను దండముతో కూడిననే గ్రుడ్డు కదలును. ఇట్లు చేతనుడైన జీవుడు అచేతనమైన ఇంద్రియ వర్గంతో కూడగా అతనికి మోక్ష మెట్లు వచ్చునన్న ప్రశ్నకు, సమాధి నిష్ఠడగుచో మోక్షమని సమాధానము. అనగా జీవున కెప్పుడు హృదయ ముండదు? సమాధియందు మనస్సు లయమగుటవలన ఉండదు. అమనస్కుడగుటయే మోక్షము. ఇందు మనస్సు నదితో పోల్చబడినది. మనస్సుదృశ్యము పైకిపోయిన కొలదిని వృద్ధినొందును. కావున సమాధి భంగమగుచో మనస్సును జాగ్రత్తపరచుకొనవలెను.

ప్ర. 'కిం స్విత్ప్రవసతో మిత్రం
కిం స్విన్మిత్రం గృహే సతః
ఆతురస్య చ కిం మిత్రం
కిం స్విన్మిత్రం మరిష్యతః.'

పుట్టిన వానికి స్నేహితు డెవ్వడు? ఇంటిలో నున్నవానికి మిత్రు డెవ్వడు? రోగార్తునకు బాంధవు డెవడు? మరణించినవానికి బంధు వెవరు?

స. సార్థః ప్రవసతో మిత్రం
భార్యామిత్రం గృహే సతః
ఆతురస్య భిషఙ్మిత్రం
దానం మిత్రం మరిష్యతః.

పుట్టిన జీవునకు ప్రయోజనకారి యగు ధర్మమే మిత్రుడు. గృహ మందున్నవానికి మిత్రుడు భార్య. రోగికి మిత్రుడు వైద్యుడు. చచ్చిన వానికి మిత్రుడు దానము. ఈ సమాధానమున యోగాభ్యాసాది కృత్యములు

లేకున్నను దానముచేత జీవుడు తరించవచ్చునని తెలుపబడినది. జీవు డీ శరీరమును వదలిన తరువాతకూడ వెంటవచ్చునది దానఫలమనికూడా చెప్పబడినది.

ప్ర. కోఽతిథి స్సర్వభూతానాం
కిం స్విద్ధర్మం సనాతనం
అమృతం కిం (స్విద్రాజేన్ద్ర)
కింస్వి త్సర్వమిదం జగత్.

సర్వప్రాణులకు అతిథి ఎవడు ? సనాతన ధర్మ మెద్ది ? అమృత మననేమి ? ఏది జగమంతయు వ్యాపించి యున్నది ?

స. 'అతిథి స్సర్వభూతానాం
అగ్ని స్సోమో గవామృతం
సనాతనోఽమృతో ధర్మః
వాయు స్సర్వ మిదం జగత్.'

సర్వప్రాణులకును అగ్ని అతిథి. గోక్షీరమే సోమము. అగ్ని యందు వేల్చిన ద్రవ్యము సనాతనము. జగత్తంతయు వ్యాపించినది వాయువు.—— ఈ ప్రశ్నయందు, ప్రతివాడును అగ్నిని నిత్యా అతిథిగా భావించవలెననియు, యజ్ఞమునందు ప్రధానమగు హోమద్రవ్యము సోమ లత యనియు, ఆ సోమలతకు గల ప్రాధాన్య మెంతదో గోవునకును అంత ప్రాధాన్య మున్నదనియు తెలుపబడినది. అంతేకాక వాయువును మొదట బ్రహ్మగా ఉపాసించుటకూడ వర్ణితమైనది.

ప్ర. 'కిం స్విదేకో విచరతే
జాతః కో జాయతే పునః
కింస్వి ద్ధిమస్య భైషజ్యం
కిం స్విదావపనం మాహత్'

ఒంటరిగా సంచరించువా డెవడు ? పుట్టి మరలపుట్టువా డెవడు ? మంచును నివారించున దేది ? అనేకవిషయముల కాధార మేది ?

స. సూర్య ఏకో విచరతే
చంద్రమా జాయతే పునః
అగ్ని ర్హిమస్య భైషజ్యం
భూమి రావపనం మహత్.

సూర్యు డొక్కడు చరించును. పుట్టి మరలపుట్టువాడు చంద్రుడు. మంచునకు మందు అగ్ని. గొప్పదగు ఆధారము భూమి.

(అంతరార్థము) ఈ ప్రశ్నయందు సూర్యునకు చిద్రూపుడగు పరబ్రహ్మ యని అర్థము. సమస్తమును లయము కాగా ఆత్మ ఒక్కడే మిగులునని అంరార్థము. ప్రపంచము నొకప్పుడు ప్రకాశింపజేయుట, ఒకప్పుడు ప్రకాశింపచేయకుండుట దేనికార్య మని ప్రశ్నించగా – అది మనస్సుయొక్క కార్యమని, 'చంద్రు'డన్న పదముతో ధర్మజుడు సమాధానమిచ్చినాడు. అట్లే ఇక్కడ మంచు అను మాటకు జీవుని ఆవరించిన అవిద్య అని అర్థం. ఆ అవిద్య దేనితో పోవు ననగా ; అవిద్యను నాశనముచేయునది జ్ఞానమని 'అగ్ని'పదముతో సమాధానము చెప్పబడినది. అగ్ని పదముతో చెప్పుటకు కారణమేమి ? వాక్కు అగ్నియొక్క స్వరూపము. 'తత్త్వమ'స్యాది మహావాక్యోపదేశమున శాస్త్రము అవిద్యను నాశనముచేయునని భావము. సర్వాధారమనగా జ్ఞాన ముదయించుట కాధార మేది?– అని ప్రశ్న. జ్ఞానోదయము కావలెనన్న శరీరము కావలెను. కావున జీవుని ఉపాధిని భూమి అన్న పదముతో వాడినారు.

ప్ర. కిం స్విదేకపదం ధర్మ్యం ?
కిం స్విదేకపదం యశః
కిం స్విదేకపదం స్వర్గ్యం
కిం స్విదేకపదం సుఖం.

ఏది ధర్మమునకు కుదురు ? కీర్తికి ఏది ఆశ్రయము ? స్వర్గమునకు మార్గ మేది ? ఏది సుఖములకు ముఖ్యస్థానము ?

స. దాక్ష్య మేకపదం ధర్మ్యం
దాన మేకపదం యశః
సత్య మేకపదం స్వర్గ్యం
శీల మేకపదం సుఖం.

దాక్షిణ్యము ధర్మములకు మూలము. దానము యశస్సు నిచ్చును. సత్యవ్రతము స్వర్గమునకు మార్గము. శీలము సుఖములకు మూలము.

ప్ర. కిం స్విదాత్మా మనుష్యస్య
కిం స్విద్దైవ కృతస్సఖా
ఉపజీవనం కిం స్విదస్య
కిం స్విదస్య పరాయణం.

మానవున కాత్మ ఏది ? దైవికమైన చుట్ట మెవరు ? మానవునకు జీవనాధార మేది ? మానవుని ప్రధానకర్తవ్య మేమి ?

స. 'పుత్ర ఆత్మామనుష్యస్యా
భార్యా దైవకృత స్సఖా
ఉపజీవనం చ పర్జన్యః
దాన మస్య పరాయణం.'

పుత్రుడు మానవునికి రెండవ ఆత్మ. భార్య దైవికమగు బంధువు. మానవునకు జీవనాధారము మేఘము. మానవుని ప్రధాన

కర్తవ్యము దానము. సంఘమునందు లోభిత్వము పోవలెనన్న వ్యక్తిగత మగు త్యాగగుణము అభివృద్ధి కావలెను. కావున ఈ ప్రశ్న దానమే మానవుని ప్రధానకర్తవ్యమని సూచించినది.

ప్ర. 'ధన్యానా ముత్తమం కిం స్యాత్
ధనానాం స్యాత్కి ముత్తమం
లాభానా ముత్తమం కింస్యాత్
సుఖానాం స్యాత్ కిముత్తమం.

ధన్యమైనవాటిలో ఉత్తమ మేది? ధనములలో ఉత్తమ ధన మేది? లాభములలో శ్రేష్ఠమైన దేది? సుఖములలో ఉత్తమసుఖ మేమి?

స. ధన్యానా ముత్తమం దాక్ష్యం
ధనానా ముత్తమం శ్రుతం
లాభానాం శ్రేయ ఆరోగ్యం
సుఖానాం తుష్టి రుత్తమా.

పరులపైన చూపు దాక్షిణ్యమను గుణము ధన్యతను కల్పించు వాటిలో ముఖ్యమైనది. ధనములలో ప్రధానమగు ధనము విద్య. లాభము లలో ముఖ్యమగు లాభము ఆరోగ్యము. సుఖములలో ఉత్తమమగు సుఖము తృప్తి.

ప్ర. 'కశ్చ ధర్మః పరోలోకే
కశ్చ ధర్మ స్సదా ఫలః
కిం నియమ్య న శోచంతి
కైశ్చ సన్ధి ర్నజీర్యతే.'

ప్రపంచమున ఉత్కృష్టమగు ధర్మ మెద్ది? శాశ్వత ఫలము నిచ్చు ధర్మమేది? దేనిని స్వాధీనపరచుకొన్నచో మానవుడు దుఃఖించడు? ఎవరి సహవాసము క్షీణింపనిది?

స. 'ఆనృశంస్యం పరోధర్మః
త్రయీ ధర్మస్సదా ఫలః
మనో యమ్య న శోచంతి
సంధి స్సద్భి ర్నజీర్యతే.

ప్రపంచమున పరమధర్మము భూతదయ. నాశములేని ఫలము నిచ్చునది వేదము. మనస్సును స్వాధీనము గావించుకొన్న దుఃఖము లేదు. సత్పురుషులతోటి సహవాసము నశించదు.

(అంతరార్థము) ఇచ్చట నాశము లేని ఫలమును చేకూర్చు త్రయీ శబ్దము కేవలము వేదపరమేగాక ఓంకారమును చెప్పినది. ప్రణవమునకు త్రయీ అని పేరు. అకార, ఉకార, మకారములు గలది. ఆ ప్రణవోపాసనము శాశ్వతఫలము నిచ్చునని అర్థము. ఈ ప్రణవమును గూర్చి మాండూక్యోపనిషత్తు చక్కగా వివరించినది. నేను సంవాద రూపమున వ్రాయు మాండూక్యోపనిషత్తు చదివినచో ప్రణవమును గూర్చి మీకు సుఖముగ అర్థముకాగలదు. (మాండూక్యము అచ్చు కావలసి యున్నది.)

ప్ర. 'కిన్ను హిత్వా ప్రియో భవతి
కిన్ను హిత్వా న శోచతి
కిన్ను హిత్వార్థవాన్ భవతి
కిన్ను హిత్వా సుఖీ భవేత్.

దేనిని విడిచి మానవుడు ప్రియుడగును? దేనిని వదలి దుఃఖింపడు? దేనిని వదలి అర్థవంతుడగును? దేనిని వదలి సుఖి యగును?

స. మానం హిత్వా ప్రియో భవతి
క్రోధం హిత్వా న శోచతి
కామం హిత్వార్థవాన్ భవతి
లోభం హిత్వా సుఖీ భవేత్.

దురభిమానమును వదలిన అందరకును ప్రియుడు కాగలడు. క్రోధమును వదలినవానికి దుఃఖములేదు. కామమును విడిచి అర్థవంతుడగును. లోభము వదలిన సుఖియగును. ఆత్మజ్ఞానము కావలెనన్న ఈ గుణముల నలవరచుకొనవలెనని దీని భావము.

ప్ర. 'కిమర్థం బ్రాహ్మణే దానం ?
కిమర్థం నట నర్తకే
కిమర్థం చైవ భృత్యేషు.
కిమర్థం చైవ రాజసు'

బ్రాహ్మణున కిచ్చిన దానమునకు ప్రయోజన మేమి ? నట నర్తకుల కిచ్చిన దానమేమి ఫలము నిచ్చును ? సేవకులకు ఇచ్చు దానము దేనికి ? రాజుల కిచ్చు ద్రవ్యమున కేమి ఫలము ?

స. 'ధర్మార్థం బ్రాహ్మణే దానం
యశోర్థే నటనర్తకే
భృత్యేషు భరణార్థం వై
భయార్థం చైవ రాజసు.

బ్రాహ్మణున కిచ్చిన దానము ధర్మఫలమును సృష్టించగా చిత్తశుద్ధి నిచ్చును. నటనర్తకుల కిచ్చిన ద్రవ్యము కీర్తి నిచ్చును. సేవకుల కిచ్చునది జీవయాత్రను నడపును. రాజులకు వెచ్చించిన ద్రవ్యమువలన భయము తొలగును. ఈ ప్రశ్నలోని అంద మేమి ? దాన

మొక్కటియే; పాత్రభేదముచే ఫలములు భేదమైనవి. కాని ఒక ఫలము ఆముష్మికమునకు హేతువు కాగా రెండవది ఐహికఫలము నందించును.

ప్ర. 'కేన స్విదావృతో లోకః
కేన స్విన్న ప్రకాశతే
కేన త్యజతి మిత్రాణి
కేన స్వర్గం న గచ్ఛతి'

లోకము దేనిచే నావరించబడినది ? దేనివలన ప్రకాశింపదు ? దేనిచే మిత్రులు పరిత్యజింతురు ? దేనిచేత స్వర్గమును కోల్పోవును ?

స. అజ్ఞానే నావృతోలోకః
తమసా న ప్రకాశతే
లోభాత్యజతి మిత్రాణి
సంగాత్స్వర్గం న గచ్ఛతి.

లోకము అజ్ఞానముచేత ఆవరింపబడినది. చీకటిచే ప్రకాశింపదు. లోభగుణము వలన మిత్రులు పరిత్యజింతురు. ఐహికఫలముల నపేక్షించుటచే స్వర్గము చెడును.

(అంతరార్థము) దానధర్మము లెన్ని చేసినను ఆత్మజ్ఞానము లేక కర్మబంధము తెగదు. కావున లోకము దేనిచేత ఆవరింపబడినదని ప్రశ్నించగా ; ఆత్మజ్ఞానము లేకపోవుటచే జీవులు జ్ఞానరహితు లగుచున్నారని - అజ్ఞానముచే ఆవరింపబడ్డది లోకమని - సమాధాన మిచ్చినారు. ఇక్కడ తమస్సను మాటకు అజ్ఞానమని అర్థము. లోక శబ్దమునకు ఆత్మ అని అర్థం. మిగిలిన రెండును సామాన్యార్థములే.

ప్ర. 'మృతః కథంస్యాత్పురుషః
కథం రాష్ట్రం మృతం భవేత్

శ్రాద్ధం మృతం కథం వా స్యాత్
కథం యజ్ఞో మృతో భవేత్॥

మానవుడు మరణించిన వాడెట్లగును? ఎట్టి రాష్ట్రమును మృతమని పలుకుదురు? శ్రాద్ధము దేనివలన చెడును? యజ్ఞము నిర్వీర్యమెట్లగును?

స. మృతో దరిద్రః పురుషః
మృతం రాష్ట్ర మరాజకం
మృత మశ్రోత్రిం యశ్రాద్ధం
మృతో యజ్ఞ స్త్వదక్షిణః.

దరిద్రుడు చచ్చినవానితో సమానము. రాజులేని రాష్ట్రము మృతము. శ్రోత్రియుడు లేని శ్రాద్ధము మృతము. అనగా వ్యర్థము. దక్షిణలేని యజ్ఞము నిర్వీర్యము.

(అంతరార్థము) ఇక్కడ రాష్ట్రపదము శరీరమను అర్థమున వాడబడినది. శరీరమును పాలించువాడు రాజు. అనగా ప్రాణము. ప్రాణములేని శరీరము వ్యర్థము. యజ్ఞము విష్ణువు. దక్షిణ లక్ష్మి. కావున భార్యలేని యజ్ఞము చెడుచున్నది. కావున దక్షిణలేని యజ్ఞము చెడునని చెప్పినాడు.

ప్ర 'కా దిక్కిముదకం ప్రోక్తం?
కి మన్నం కించ వై విషం?
శ్రాద్ధస్యకాల మాఖ్యాహి
తతః పిబహారస్వచ'

జీవునకు దిక్కేది? జలము, అన్నము, దేనినుండి బుట్టును? విషమన ఏది? శ్రాద్ధవిధికి కాలమేది?

స. 'సంతో దిగ్జల మాకాశం
గౌరన్నం ప్రార్థనా విషం
శ్రాద్ధస్య బ్రాహ్మణః కాలః
కథం వా యక్ష మన్యసే.'

జీవునకు సత్పురుషులు దిక్కు. ఆకాశమునుండి జలము, భూమి నుండి అన్నము పుట్టును. విప్రధనము విషము. ఉత్తముడగు బ్రాహ్మణుని రాకయే శ్రాద్ధకాలము.

(అంతరార్థము) ఈ ప్రశ్నయందున్న పదములు సంజ్ఞార్థములు గాని కేవల వాచ్యార్థములు గావు. జీవుని జీవత్వమును తొలగించుట కెవరు దిక్కు?- అని యక్షుని ప్రశ్నకు అంతరార్థము వేదప్రమాణము గలిగిన గురువర్యులే దిక్కు అని సమాధానము. సన్తః = 'వేద ప్రమాణనిష్ఠాః' (నీ.కం.) దిక్=అను పదమునకు దిక్కు అర్థముకాదు. దిక్=ఉపదేష్టారః ఇత్యర్థః' (నీ.కం.) ఆత్మతత్త్వమును ఉపదేశించువారని అర్థము. ఉదకశబ్దమునకు బ్రహ్మాండమని అర్థము. బ్రహ్మాండము కార్యరూపము. బ్రహ్మాండాభిమానుడగు వ్యష్టి సమష్టి జీవు డీపదముచే గ్రహింపబడవలెను. ఆకాశపద, జలపదములు రెండును సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వములు కలిగిన జీవేశ్వరు లందలి సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వములను తొలగించి, జీవేశ్వరుల ఐక్యమును బోధించును. ఆ జీవుని ఆవరించిన అజ్ఞానముయొక్క స్వరూపమును చెప్పుటకు విషయభోగములపై కోరికలే జీవునకు దుఃఖహేతువులనియు, వాటినే నాశము చేయువలె నవియు, ప్రార్థన విషపదములు వాడబడినవి. శ్రాద్ధవిషయమును ప్రశ్నించి బ్రాహ్మణుని ఆగమనమే శ్రాద్ధకాల మనునప్పుడు బ్రాహ్మణ శబ్దము బ్రహ్మవిదుని చెప్పును. శ్రాద్ధమన శ్రద్ధ అను గుణము. బ్రాహ్మణః - బ్రహ్మవిత్. శ్రాద్ధస్య=శ్రద్ధయా ప్రదేయస్య (నీ.కం.)

ప్ర. 'తపః కిం లక్షణం ప్రోక్తం ?
కో దమశ్చ ప్రకీర్తితః
క్షమా చ కాపరా ప్రోక్తా
కా చ హ్రీః పరికీర్తితా.'

తపస్సనగా ఏది ? దమ మనగా నేమి ? క్షమ మనగా నేమి ? లజ్జ యనగా నెద్ది ?

పై ప్రశ్న వ్యాససూత్రములలోని 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను సూత్రార్థమును బోధించుచున్నది. తత్త్వమస్యాది మహావాక్య విచారణకు తగు సమయము, సాధనచతుష్టయము కలిగినతరువాతని గదా ! దానినే పైప్రశ్నలో వర్ణించినారు.

స. తప స్స్వధర్మ వర్తిత్వం
మనసో దమనం దమః
క్షమా ద్వంద్వ సహిష్ణుత్వం
హ్రీ కార్య నివర్తనం.

స్వధర్మమున ప్రవర్తించుటే తపస్సు. మనస్సును స్వాధీనము గావించుకొనుట దమము. సుఖదుఃఖములను సహించుట ఓరిమి. చేయరాని పనులను విడుచుటే లజ్జ.

ప్ర. 'కిం జ్ఞానం ప్రోచ్యతే రాజన్
కశ్శమశ్చ ప్రకీర్తితః
దయా చ కా పరాప్రోక్తా
కిం చార్జవ ముదాహృతం.'

జ్ఞానమన ఎద్ది ? శమమన ఏది ? ఉత్తమమైన దయ ఏట్టిది ? ఋజుత్వమన నేమి ?

స. జ్ఞానం తత్వార్థ సంబోధః
శమశ్చిత్త ప్రశాంతతా
దయా సర్వసుఖైషిత్వం
ఆర్జవం సమచిత్తతా.

తన నిజరూపమును గుర్తించుట జ్ఞానము. చిత్తముయొక్క శాంతియే శమము. అన్ని భూతములకు సుఖమును గోరుట దయ. శత్రు మిత్రులయందు సమభావము ఋజుత్వము.

ప్ర. 'కశ్శత్రు ర్దుర్జయః
కశ్చ వ్యాధి రనంతకః
కీదృశశ్చ స్మృత స్సాధుః
అసాధుః కీదృశ స్మృతః'

జయింపరాని శత్రు వెవరు? అంతులేని వ్యాధి ఎద్ది? సాధు వన ఎట్టివాడు? అసాధు వన ఎవరు?

స. క్రోధ స్సుదుర్జయ శ్శత్రుః
లోభోవ్యాధి రనంతకః
సర్వభూత హిత స్సాధుః
అసాధు ర్నిర్దయ స్మృతః.

క్రోధము జయింపరాని శత్రువు. అంతులేనివ్యాధి ఆశ. భూత హితుడు సాధువు. దయలేనివాడు అసాధువు.

ప్ర. 'కిం స్థైర్యం ఋషిభిః ప్రోక్తం
కించ ధైర్య ముదాహృతం
స్నానం చ కిం పరం ప్రోక్తం
దానం చ కిమి హోచ్యతే'

ఏది స్థైర్యమని ఋషులచే చెప్పబడినది ? ధైర్యమని దేని నందురు ? స్నాన మేది ? దాన స్వరూప మేమి ?

స. స్వధర్మే స్థిరతా స్థైర్యం
ధైర్య మింద్రియ నిగ్రహః
స్నానం మనోమల త్యాగః
దానం వై భూతరక్షణః.

కష్టకాలము నందును తన వర్ణాశ్రమ ధర్మమును వదలకుండుట స్థైర్యము. ఇంద్రియ నిగ్రహము ధైర్య మనబడును మనోబలము పోవుట స్నానము. భూతముల రక్షించుట దానము.

ప్ర. 'కః పండితః పుమాన్ జ్ఞేయః
నాస్తికః కశ్చ ఉచ్యతే
కోమూర్ఖః కశ్చ కామస్యాత్
కోమత్సర ఇతి స్మృతః'

పండితు డెవడు ? నాస్తికు డెవడు ? మూర్ఖు డెవడు ? కామమన ఎద్ది ? మాత్సర్యమన నేమి ?

స. ధర్మజ్ఞః పండితో జ్ఞేయః
నాస్తికో మూర్ఖ ఉచ్యతే
కామ స్సంసారహేతు శ్చ
హృత్తాపో మత్సరస్మృతః.

ధర్మ మెరిగినవాడు పండితుడు. వేదశాస్త్రప్రమాణము లేనివాడు నాస్తికుడు. సంసారహేతువైన కర్మవాసనయే కామము. హృదయ తాపమే మాత్సర్యము.

ప్ర. 'కో మోహః ప్రోచ్యతే రాజన్ ?
కశ్చ మానః ప్రకీర్తితః ?

కి మాలస్యం చ విజ్ఞేయా ?
కశ్చ శోకః ప్రకీర్తితః ?'

మోహ మనగా ఏది ? మాన మనగా ఏది ? ఆలస్య మన నెద్ది ? శోక మనగా నేమి ?

స. మోహోహి ధర్మ మూఢత్వం
మాన స్త్వాత్మాభిమానతా
ధర్మ నిష్క్రియ తాలస్యం
శోక స్త్వజ్ఞాన ముచ్యతే.

ధర్మమును గుర్తింపకుండుట మోహము. ఆత్మాభిమానమే మానము. ధర్మమును ఆచరింపకపోవుట ఆలస్యము. అజ్ఞానమే శోకము.

ప్ర. 'కోహంకార ఇతిప్రోక్తః
కశ్చ దంభః ప్రకీర్తితః
కిం తద్దైవం పరం ప్రోక్తం
కిం తత్పైశున్య ముచ్యతే.'

అహంకార మన నెద్ది ? దంభమన ఏది ? ముఖ్యమైన దైవ మేది? పిశునత్వమన నేమి ?

స. 'మహాజ్ఞాన మహంకారః
దంభో ధర్మధ్వ జోచ్ఛ్రయః
దైవం దాన ఫలం ప్రోక్తం
పైశున్యం పరదూషణం'

అజ్ఞానము దట్టమై యుండుటే అహంకారము. పరులు చూచుటకై చేయు ధర్మము దంభము. దానఫలమే దైవ మగును. పరులను దూషించుట పిశునత్వము.

ప్ర.   'ధర్మ శ్చార్థశ్చ కామశ్చ పరస్పర విరోధినః
ఏషాం నిత్యవిరుద్ధానాం కథ మేకత్ర సంగమః'

ధర్మార్థ కామములకు  పరస్పర విరోధము కదా ! ఒకే వ్యక్తి ఈ మూడింటిని ఎట్లు సమన్వయించగలడు ?

అనగా కేవల ధర్మమును దృష్టియం దుంచుకొన్నవానికి ధనము రాదు. కామసుఖము కావలెనన్న ధర్మము, అర్థము చెడును. అర్థము (డబ్బు) కావలెనన్న ధర్మము, కామము చెడును. ఈమూడును ఒకచోట ఎట్లు కుదురును ? అని ప్రశ్న.

స.   'యదా ధర్మశ్చ భార్యాచ పరస్పరవశానుగౌ
తదా ధర్మార్థ కామానాం త్రయాణామపి సంగమః'

ధర్మము, భార్య ఇద్దరును కలిసినచో అర్థకామములు రెండును కుదురును. అనగా భార్య ధర్మము ననుసరించుచో అర్థకామములు సిద్ధించునని సమాధానము.

ప్ర.   అక్షయ్యో నరకః కేన ప్రాప్యతే భరతర్షభ
అక్షయమగు నరకము దేనివలన వచ్చును ? అని ప్రశ్న.

స.   'బ్రాహ్మణం స్వయమాహూయ యాచమానం అకించనం
పశ్చా న్నాస్తీతి యో బ్రూయాత్ సోఽక్షయం నరకం వ్రజేత్.
వేదేషు ధర్మశాస్త్రేషు ద్వేష్టియో వై ద్విజాతిషు
దేవేషు పితృధర్మేషు సోఽక్షయం నరకం వ్రజేత్
విద్యమానే ధనే లోభా ద్దానభోగ వివర్జితః
పశ్చా న్నాస్తీతి యో బ్రూయాత్ సోఽక్షయం నరకం వ్రజేత్'

యక్షుడు నరక కారణము లేవియన్న ప్రశ్నకు చాల కారణములు చెప్పబడుచున్నవి.

యాచకుడైన బ్రాహ్మణుని తానంతట తాను పిలిచి ఆతడు రాగా లేదని పంపుచో నరకము తప్పక ప్రాప్తించును.

వేదశాస్త్రములను, వేదవిదులైన బ్రాహ్మణులను నిందించుచు, పితృదేవతలమీద విశ్వాసము లేనివానికి శాశ్వతమగు నరకము తప్పదు.

ధనము పుష్కలముగ ఉండియు, తా ననుభవించక, ఇతరుల కివ్వక లోభియగు వానికిని నరకము తప్పదు'

ప్ర 'రాజన్ కులేన వృత్తేన స్వాధ్యాయేన శ్రుతేన వా
బ్రాహ్మణ్యం కేన భవతి ప్రబ్రూహ్యేత త్సునిశ్చితం.'

రాజా ! బ్రాహ్మణునియం దుండదగిన బ్రాహ్మణత్వమను ధర్మము ఆ బ్రాహ్మణుడు చదివిన వేదముచేత సిద్ధించునా ? లేక అతనికి పుట్టుకచేతనే కలుగునా ? లేక ఆతని నడవడిక ననుసరించి వచ్చునా ? దేనిచేత బ్రాహ్మణ్యము సిద్ధించును ?

స. 'శృణు యక్షకులంతాత న స్వాధ్యాయో న చ శ్రుతం
కారణం హి ద్విజత్వేచ వృత్తమేవ న సంశయః'

ఓ యక్ష ! బ్రాహ్మణత్వ ధర్మసిద్ధికి కేవలవిద్యగాని, కులము గాని, కారణములు గావు. శీలమే కారణము. జన్మచేత నామమాత్ర బ్రాహ్మణుడే యగును.

ప్ర. 'కో మోదతే ? కి మాశ్చర్యం ?
కః పంథాః ? కా చ వార్తికా ?

సంతోషించువా డెవడు ? ఆశ్చర్యకరమైన దేది ? ఏది మార్గము ? లోకవార్త యేమి ?

స. 1. (సంతోషము) 'పంచమేహాని షష్ఠే వా శాకం పచతి స్వే గృహే
అనృణీ చా ప్రవాసీ చ సవారిచర మోదతే.

2. (ఆశ్చర్యము) అహన్యహని భూతాని గచ్ఛంతీహ యమాలయం
శేషాస్థావర మిచ్ఛంతి కి మాశ్చర్యమతఃపరమ్.

3. (మార్గము) తర్కో౽ప్రతిష్ఠ శ్రుతయో విభిన్నా
నైకో ఋషి ర్యస్యమతం ప్రమాణం
ధర్మస్య తత్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతస్స పంథాః

4. వార్త అస్మిన్ మహామోహమయే కటాహే
సూర్యాగ్నినా రాత్రి దివేంధనేన
మాసర్తు దర్వీ పరిఘట్టనేన
భూతాని కాలః పచతీతి వార్తా.

1. అయిదురోజుల కొకమారు కూరముక్కలు తిని జీవించినను ఎవ్వడు ఋణగ్రస్తుడు కాడో, పరదేశవాస మెవ్వనికి లేదో వాడు సంతోషించును.

2. ప్రతినిత్యమును యమలోకమున కేగు (చచ్చు) జీవులను చూచుచున్నను నేను నిత్యమని తలచుటే ఆశ్చర్యము.

3. మానవుడు ప్రవర్తించవలసిన ధర్మము కేవలము వేద శాస్త్రములచేతనే నిర్ణయము చేయుటకు వీలుగాదు. వాటి త్రోవలు చాల భిన్నములు. కావున పెద్దల త్రోవను అనుసరించుట అవసరము.

4. అజ్ఞానమయమగు ఈ బ్రహ్మాండమను పాత్రలో కాల పురుషుడు సూర్యుడనే అగ్నిని రగిల్చి; రాత్రి, పగలనే వంటకట్టియలతో మాసములు, ఋతువులు అను గరిటెను తీసుకుని జీవులను వంటచేయుచుండె ననునదే వార్త.

ప్ర. పురుషం త్విదానీం వ్యాఖ్యాహి యశ్చ సర్వధనీనరః.

పురుషశబ్దవాచ్యు డెవడు ? ఏ నరుడు సర్వధనములు కలవాడు ?

స. 'దివం స్పృశతి భూమించ శబ్దః పుణ్యేన కర్మణా
యావత్స శబ్దో భవతి తా వత్పురుష ఉచ్యతే
తుల్యే ప్రియా ప్రియే యస్య సుఖదుఃఖే తథైవ చ
అతీతా నాగతే చోభే సవై సర్వధనీ నరః.'

ఎవని కీర్తి స్వర్గమున కేగబ్రాకునంతటిదో-అనగా ఎవని పుణ్యము గొప్పదో వాడు పురుషుడు.

కష్టసుఖములు రెండును, ఇష్టాఇష్టములు రెండును ; రాబోవునవి జరిగినవిగూడ ఎవనిని బాధించవో వాడు సర్వధని కాగలడు.

యక్షుని ప్రశ్న లింతటితో సమాప్తమైనవి. యక్షునకు అనుగ్రహాము కలిగినది. ధర్మజుని - నీ దమ్ములలో ఒకని బ్రతికించ దలచినాను. ఎవనిని బ్రతికించను ? అని ప్రశ్నించినాడు. ధర్మజుడు నకులుని బ్రతికించమని కోరినాడు. భీమార్జునులను వదలి నకులుని ఏల అడిగితివి ? వారు బలశాలురుగదా ? అని యక్షుడు మరల ప్రశ్నించినాడు.

ధర్మజుని సమాధాన మిది.___

నేను ధర్మమునుండి ఎప్పుడు చలించను. ఆ ధర్మములలో ముఖ్యమగునది ఆనృశంస్యము. అనగా విషమభావము లేకపోవుట. నా తల్లిగన్న సంతానమునందు నేను పెద్దవాడను. మాద్రి సంతానమున నకులుడు పెద్దవాడు. కావున ఇట్లు కోరితినని చెప్పినాడు. అంతతో యక్షుడు నలుగురు తమ్ములను బ్రతికించినాడు. కాని ఈ యక్షు డెవరు ? ధర్మజుని తండ్రి యముడు. ఆతడే తన పుత్రుని పరీక్షించినాడు. పరీక్షయందు త్తీర్ణుడుకాగా ధర్మజునకు 'నీకు జననమరణ

ములవలన కలుగు దుఃఖము కలుగ'దని వరమిచ్చినాడు. అంతేకాదు. బ్రాహ్మణుని అరణిని తెచ్చినది నేనే నని, ఆ అరణినికూడ యిచ్చి - 'అజ్ఞాతవాస వత్సరమున మీరు జ్ఞాతులచే ఎరుకబడ'రని కూడ వరమిచ్చినాడు యముడు.

ఇంతతో అరణ్యపర్వమునం దుపన్యాసము ముగిసినది.

ఇకపాండవులు అజ్ఞాత వత్సరమును గడుపవలెను.

ధర్మస్య జయోస్తు అధర్మస్య నాశోస్తు.

విశ్వస్య కళ్యాణమస్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# విరాటపర్వము

## ప్రస్తావన

శ్లో॥ సదాత్మ రూపం సకలాది భూత
మమాయినం సోఽహ మచింత్య బోధం
అనాది మధ్యాంత విహీనమేకం
తమేకదంతం శరణం ప్రజామః.

మహాశయులారా !

మన మీనాటికి మూడుపర్వములను గడచితిమి. నాల్గవది విరాటము. ఇది యొక యత్యద్భుత కథాప్రపంచము. నానా రసాభ్యుద యోల్లాసము. దీని నొక దాగుడుమూతయాట యనికూడా వర్ణింపవచ్చును.

మహనీయులగు వారల కీజీవితమున వచ్చు సుఖదుఃఖ భాగములు వారికి లీలావిశేషములై నడచుచుండును. అందుకు కారణము వారి జీవితము ధర్మైక శరణ్యమగుటయే. అట్టివారి విగూఢజీవితయాత్రలే భారతీయ సాహిత్యమున ఇతిహాసములై బరగినవి. కవితల్లజుల కవితా శిల్ప నైపుణ్యమును చూపుటకుకూడా అట్లు ధర్మైక శరణ్యులగువారి చరిత్రలే రత్నశిలాతలములై వెలసినవి. ఆర్షధర్మ సాహిత్యమంతయు అట్టివారి జీవిత సంగ్రహములచే విస్తరించినది. వేద వాఙ్మయములోని యుపనిషద్ధర్మ రహస్యముల ప్రకటించుటకుకూడ ఆ మహనీయుల జీవిత సమస్యలే యాధారములని చెప్పుట సత్యదూరము కాదు.

కేవలము భౌతికదృష్టిలోని సాహిత్యము పాండవులవంటి మహనీయుల యగాధ జీవితసంద్రమున మునుగుటకును, అందలి యాధ్యాత్మికరహస్యరత్నముల సంచయమొనర్పుటకును సమర్థముకాదు.

ఆర్ష సాహిత్యము నాంధ్రీకరించుటకై తిక్కనామాత్యులు వైదికధర్మ నిష్ఠులై యజ్వయను పేరును బడసినారు. యజ్వయను పేరు వేదములందు చెప్పబడిన యజ్ఞమును చేసినవాని యధికార నామము. అమాత్యపదముకూడా భారతీయ సాహిత్యములోనిదే. కాని లౌకికము. అనగా వైదికధర్మనిష్ఠ యను తీగను పాకించుటకు లౌకికము నిమిత్త కారణము. భారతీయ సిద్ధాంతమున వైదికలౌకికములు రెండునూ ఒకే ఒక గొడుగుక్రింద వసించి, భగవన్నిర్మితమగు లోకమును పాలించును. భారతీయ కవితావైభవమును అట్టిదే. ఆర్ష కవితావైభవము సంస్కృత వాణితో వైదికజ్ఞానమును విస్తరింపజేయగా దాని యదార్థమును పరిపుత విజ్ఞానముగల దేశభాషాభిమానులగు కవిపుంగవులు అనువాదముల గావించిరి. అట్టి దేశభాషాభిజ్ఞతను వెల్లడించినదే తిక్కనామాత్యుని ఆంధ్ర సారస్వత కవితాశిల్పము. ఆంధ్రభాష యందలి యలతియలతి పదములతో తీర్చిదిద్దిన తిక్కనామాత్యుని కవితామాధుర్యమునుగూడ మీకు రుచి చూపుదును. కాని నా యుపన్యాసముల సంవిధానమంతయు వ్యాసవాణి ననుసరించియే యుండును. అంతేకాదు. కేవలము కథా ప్రపంచములోని బాహ్యసౌందర్యమునేగాక ఆ కథావస్తువునందలి ఆధ్యాత్మిక రహస్యములనుగూడ గ్రహింపజేయుట నా ప్రవచనమున కొక ప్రథాన లక్ష్యము. విరాటపర్వము ఊర్జిత కథోపేతమును, నానా రసాభ్యుదయోల్లాసమని తిక్కనామాత్యుల నిర్వచనము.

యథార్థమున కీ మహాభారతామ్నాయము మన కందించురసము ఏకైక రసమా? నానా రసములా? యనునది ప్రశ్న. నానా

రసాభ్యుదయోల్లాసమగు ఏకరస ప్రధానము మహా భారతామ్నాయమని నా సమాధానము.

రసములు నానా రూపములై కథయందుతప్పతిల్లును. కథాంతర్భాగము ఏకరసము. అది శాంతరసము. నిష్క్రియమైన అనుభవ రూపము. ఆ రసానుభవమునే బ్రహ్మానుభవ మందురు. రసము అఖండమై, ఆత్మరూపము కాగా అది బ్రహ్మానుభవము. రసము విభక్తమై ఆశ్రయాశ్రయీ భావము నొందుట భక్తి. భక్తిరూపమగు శృంగారముకూడా శాంతరసముయొక్క స్వరూపమే. ప్రాకృత శృంగారము మోహముకాగా అప్రాకృత శృంగారము, ప్రేమరూపమై శాంతరసమగును. భాగవతములోని ముఖ్యసూత్ర మిదియే. భక్తిభాగమున ఆత్మయు భగవంతుడు నను వారిద్దరును రూపనామములతో విభక్తమయ్యెదరు. జ్ఞానభాగమున నదులు సముద్రమునందు కలసినట్లు రూపనామముల కోల్పోవుదురు.

ప్రకృత కథాంశమునకు వత్తము.

శ్లో॥ 'దిష్ట్యా పంచసు రక్తోసి దిష్ట్యా తే షట్పదీ జితా
ద్వే పూర్వే మధ్యమే ద్వే చ, ద్వే చాంత్యే సాంపరాయికే'

ఈ శ్లోకము ధర్మనందనునిగూర్చి అరణ్యపర్వమున యమధర్మరాజు పలికిన పలుకు. అరణ్యవాస మంతయు సమాప్తమగు కాలమున యక్షరూపమున నిలిచి, ధర్మజుని పరీక్షించి, ఆ పరీక్షయందు తీర్ణుడైన తన పుత్రునకు యమధర్మరాజు రాబోవు అజ్ఞాతవాస వత్సరమంతయు సఫలమగునని వరమిచ్చినాడు. ఆ వర మిచ్చుటకు ముందుమాటయే పైశ్లోకము. దాని భావమిది.

ధర్మజా ! నీవు దైవానుగ్రహమున జన్మకాలమునందే అయిదింటియందు రక్తుడవైతివి. తరువాత కాలమున ఆరింటిని జయించినావు. ఆ

యారింటిలో ఇంతకుపూర్వము రెండును, మధ్యభాగమున రెండును జయించినావు. మిగిలిన రెండును రాబోవు కాలమున జయింతువని చెప్పి, తరువాత వరముల నిచ్చినాడు.

శ్రోతలారా ! మన కీ శ్లోకమర్థమగుట కేమైన యవకాశ మున్నదా ? భారతామ్నాయమం దెన్నియో ఇట్టి శ్లోకములున్నవి. వ్యాఖ్యానకర్తయగు నీలకంఠు లీ శ్లోకమును విడదీసి చెప్పినారు. అయిదింటియందు రక్తుడవైతి వన్నదానికి, శమము, దమము, తితిక్ష, శ్రద్ధ, సమాధానము లనునవి అయిదు గుణములును నీకు జన్మసిద్ధములని చెప్పినారు.

ఆరు అను సంఖ్యకు ఆకలిదప్పికలును, శోకమోహములును జరామృత్యువులు నను గుణములని వ్యాఖ్యానించినారు. ఆ యారు గుణములలో ఆకలి దప్పికలనునవి ఇప్పుడు జయించబడినవి.

ఎట్లనగా నేను ప్రశ్నించగా నీవు దప్పికను లెక్కచేయక జయించి నాకు సమాధానముల నిచ్చినావు. నీ సోదరులు చచ్చి పడియున్నను, మోహము నొందక నాకు సమాధానముల నిచ్చి శోకమోహములను జయించితివి. రాబోవుకాలమున జరామృత్యువులనుకూడా జయింతువు అని పలికి, వరముల నిచ్చినాడు. ధర్మజు లా వరములను శిరసావహించి, అజ్ఞాతవాసమునకు వచ్చుట జరిగినది.

ఇప్పుడు వీరి యజ్ఞాతవాసముయొక్క అంతరార్థ మేమి ? ఆధ్యాత్మిక జీవితమునే లక్ష్యముగొన్న ధర్మజు డొక జ్ఞానయోగిగా వర్ణించబడుట ఇందు గమనార్హమగు విషయము. జ్ఞానులగువారు తమ సాధన కాలమునగాని, వారి జ్ఞానానుభవకాలమునగాని ఒరులు గుర్తించుటకు వీలుగాని వేషభాషలతో వర్తిల్లుచుందురని ధర్మజుని అజ్ఞాతవాసమున కంతరార్థము. సాధనభాగము పూర్తియైన తరువాత వారు

వ్యక్తము కావచ్చుననికూడా వారి యజ్ఞాతచర్య. తరువాతి కథనుగూర్చి భావము నిచ్చినారు నీలకంఠులు.

('యోఅశనాయాపిపాసే శోకం మోహం మృత్యుమత్యేతి. ఇతి వేదే చ ప్రసిద్ధాం జయతి' ఇత్యుక్తం. తాం జితవతాతు అవ్యక్తలింగేన స్థేయం 'అత్యంతిక్యాం కృతకృత్యతాయాం తు వ్యక్తలింగేనాపి భావ్యం ఇత్యేతత్ పాండవాచరణప్రదర్శనేన దర్శయితుం విరాటపర్వం ఆరభతే') [నీ. కం. వ్యా]

ఇక మనము విరాటపర్వకథా భాగమున కేగుదము. అందు ముఖ్యముగ విరాటపర్వ కథాకథనమునుగూర్చి తిక్కనామాత్యుని హృదయ మేమియో చూతము.

మ. 'హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు
నానా రసాభ్యుదయోల్లాసి విరాటపర్వము ...'

అని కథాసౌందర్యమును చెప్పినారు. యథార్థమున కది పఠితనుగాని, శ్రోతనుగాని యువ్విళ్ళూరించు కథాభాగమనుటలో సందియములేదు. కుంజరయూథంబు దోమకుత్తుకయందు జొరబడుటవంటి కథావస్తు వెవ్వరి హృదయమున కాహ్లాదమును గూర్చదు? కావుననే 'హృదయాహ్లాది'యని తిక్కన సార్థకముగ వాడినారు. అదిగాక ఇది చతుర్థమైనది. చతుర్థము మోక్షపురుషార్థము. పాండవుల బంధమోక్ష మీ పర్వముననే కల్గినది.

అది యట్లుండ కావ్యసాహిత్యమునందు ముఖ్యస్థానము నలంకరించునది రసము. ఆ రసమే ఆలంకారికుల సిద్ధాంతమున పర బ్రహ్మస్థానము నలంకరించును. అనగా భారతీయసాహిత్యము ననుసరించి కావ్యము కేవల లౌకికానంద సంజనకముగాక బ్రహ్మానం దానుభవమును కల్పించుటయే ముఖ్యనిర్ణయము. కావ్యశిల్పమున కేవల

భాషాలంకరణమే కాదు. శాస్త్రాధికారముతో బాటు భక్తిరస విశిష్టముగూడనై సద్యః పర నిర్వృతిని కలిగించవలెను. అనగా త్రికాలసత్యమై విలసిల్లు ఆనందానుభవము నివ్వవలెను. విరాట మట్టిదే. కావుననే తిక్కన 'ఊర్జిత కథోపేత'మని వాడినారు. ఈ కథావస్తువునందలి రసము లన్నియు పూర్ణ రూపములై కథాంతమున ధర్మవిజయము నొసంగి, ఉత్తరాకల్యాణమున శృంగారరసముతో ముగిసినది. అది పరిశుద్ధమగు శృంగారము. పరమ భాగవతోత్తముడగు పరీక్షితుని యావిర్భావమునకు మూలకందము. కావ్యనిర్మాణమును గురించి పోతనామాత్యు లొకమాటను చెప్పినారు.

ఉ. 'హరినామ స్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సుఱుచి భ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్.

తిక్కనయు భక్తిరసప్రధానమగు ధర్మనిష్ఠనే యనుసరించి భారతము ముట్టినారు.

ఉ. 'వైదికమార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి మది నిర్మలవృత్తిగ జేయుచుండ ము
త్పాద నిరంతరస్మరణతత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదము బొంద గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్'

వ్యాసమునీంద్రుని భావాద్వైతమును చక్కగ విస్తరించిన కవివర్యులు తిక్కనామాత్యులు.

తిక్కనార్యుని కవితా శిల్పనైపుణ్యమును గురించి అధునాతన సాహితీమండలముకూడ ఎంతయో కొనియాడును. కాని తిక్కనకు భారత భారతియందుగల పవిత్రభావ మెట్టిదో నేటి కవులు గమనించినట్లు

కనబడుటలేదు. తిక్కన దృక్పథమున వేదము లార్యులచే వ్రాయబడినవి కావు. వేదము లపౌరుషేయములని తిక్కన నిర్ణయించినారు. భారతమును గూర్చి తిక్కన ప్రయోగమును చూడుడు.

'కృష్ణద్వైపాయను డర్థిలోకహిత నిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్'

తా ననుసరించబోవు మహాభారత రచన కాధారభూతమగు వ్యాస భారతము లేఖ్యమైన యామ్నాయమని తెలిపినారు. అనగా ఒక కర్తచేత వ్రాయబడినదని చెప్పినారు. ఆ కర్త ఎవరు? అను ప్రశ్నకు కృష్ణ ద్వైపాయనుడని వ్యాసమునీంద్రుని యవతారమును సూచించినారు. 'కృష్ణ' పదముచేత ఆ మహనీయుని దివ్యత్వమును, 'ద్వైపాయను' డనుటచే సద్యోగర్భమున జనించిన జన్మప్రాభవమును వర్ణించినారు. ఆత డవతరించినది లోకహితముకొరకే. లోకహితమును కల్పించునది వేద వాఙ్మయమే. అట్టి అపౌరుషేయములగు వేదములను విభాగించి, అందలి సారమును లేఖ్యమగు ఆమ్నాయమునుగా భారతమును వర్ణించినారు.

వేదము లపౌరుషేయములను మాటయే హృదయమునకు రాని నేటివారు తిక్కన ప్రతిభా ప్రభావముల గ్రహించినట్లు మాట్లాడుటయం దర్థ మేమున్నది?

పాశ్చాత్య సాహిత్య విమర్శనమువలె, తిక్కన పాత్రలను పరిశీలించి, ఆయన ప్రతిభను చెప్పుట, ఆ పవిత్రమూర్తిని గుర్తెరిగినట్లు కాదు. తిక్కన భౌతికవాద సంఘ సంస్కర్త. ఇక్కడకు తిక్కన హృదయము నిశ్శ్రేయసాభిముఖమయ్యె, భారతరచన కభిముఖమైనదని మన కర్థమైనది.

ఇక ఈ విరాటపర్వమున నానా రసము లెక్కడెక్కడ యుప్పతిల్లినవో కూడ తెలిపి కథాప్రారంభమును గావించెదను.

ఈ పర్వమున సైరంధ్రిపై కీచకున కుదయించిన శృంగారము ఆభాసము. ఉత్తరాభిమన్యుల వివాహఘట్టము విశుద్ధ శృంగారము. ఉత్తరగోగ్రహణమునాటి అర్జునుని వీరత్వ మా వీరరసమున కునికిపట్టు. ఉత్తరుని ప్రలాపములు హాస్యరసమునకు నిలయములు. బీభత్సాద్భుతాది రసము లా యుద్ధరంగములోనివే. ఇట్లు నానా రసాభ్యుదయోల్లాసియగు విరాటములోని కథాప్రారంభము మొదట వ్యాసభారతి ననుసరించి చెప్పి తరువాత తిక్కనామాత్యుని ప్రారంభమును మీకు చెప్పెదను. యథార్థము నకు వ్యాసభారతము నాధారముగా గొనియే కథావస్తువును అక్కడక్కడ పెంచినారు. జనమేజయుని ప్రశ్నతో విరాటపర్వకథా ప్రారంభమును వ్యాసులు చేసినారు. జనమేజయుని ప్రశ్న యిది.

శ్లో॥ కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
అజ్ఞాతవాసముషితాః దుర్యోధన భయార్థితాః
పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ
ద్రౌపదీ చ కథం బ్రహ్మన్ అజ్ఞాతా దుఃఖితాఽవసత్'

మునిచంద్రా ! మా ముత్తాతలగు పాండవులు అజ్ఞాతవాసము నెట్లు నడపిరి ? అని ప్రశ్నించి, ద్రౌపదిని ప్రత్యేకించినాడు జనమేజయుడు. అట్లు ప్రత్యేకించుటయందు ప్రత్యేకత లేకపోలేదు. ఆమె పతివ్రతా శిరోమణియు బ్రహ్మవాదినికూడా యట. జనమేజయున కీ ప్రశ్న వేయునప్పు డా పాండవుల అతులిత బలపరాక్రమములతోపాటు లోక విఖ్యాత విగ్రహులగు నా పాండవు లెట్లు విరాటనగరమున దాగిరి ? ఇదియొక పెద్దసందేహము. సందేహముకాదు ఆశ్చర్యము.

అంతతో పాండవులను గురించిన సంకల్పతరంగ మంతరించగా నాటి కౌరవ సభాస్థలి యొక్కమారు జనమేజయుని స్మృతిపథమున సాక్షాత్కరించినది. నా డామె చూపిన పాతివ్రత్యభక్తి ప్రభావము లా

రాజును విభ్రాంతుని గావించినవి. అంతతో ద్రౌపది జనమేజయుని అంతఃకరణమునుండి తొలగలేదు. ద్వైతవనమున దుర్వాసుని అమోఘ శాపాగ్నియందు దగ్ధము కాకుండ శ్రీకృష్ణ సాక్షాత్కారమున నాటి యాపదను తొలగించుకొనుటగూడ జనమేజయుని మనసున నాటుకొనియే యున్నది. కావుననే ఆమెకు పతివ్రతా, బ్రహ్మవాదినీ పదములను వాడినాడు. ద్రౌపదికి వాడిన బ్రహ్మవాదినీపదము ఆమెకు కృష్ణానుగ్రహ మెంత సాన్నిధ్యమైయున్నదో నిర్ణయించినది. ఈ విషయమును నీలకంఠులు బ్రహ్మవాదినీ పదమునకు 'శ్రీకృష్ణ సంకీర్తనశీలా' అని వ్యాఖ్యానించినారు

ఇట్లు మూలమునందలి ప్రశ్న నాధారముగా గొనియే అనువాద కర్తయగు తిక్కన ప్రశ్నయు నడచినది. ద్రౌపదిని ప్రత్యేకించకున్నను పాండవులకు 'మహిత సముజ్జ్వలాకృతులు మానధనులు' అన్న విశేషణములను వాడి, వారితోటి ద్రౌపదినిగూడ కలిపినారు. పాండవుల ఆకృతులు సామాన్యమానవ విలక్షణములుగదా ! వారెట్లు విరాట నగరమున దాగిరి ?

విరాటుడు వారి నెరుగడా ? అను నాశ్చర్యభావమును స్ఫురింప చేయుటకే 'మహిత సముజ్వలాకృతులు' అను విశేషణమును వాడినారు. ఇంతవరకు కథాప్రపంచ సృష్టికి సంబంధించిన 'ప్రశ్న వచ్చినది. ఇక కథాప్రారంభము కావలెను. ఆంధ్రభారతము ననుసరించిన కథావస్తు విట్లు నడచినది.

అది ద్వైతవనము ; పండ్రెండు సంవత్సరములు గడచినవి. పదమూడవదగు అజ్ఞాతవాస సంవత్సరమును గడపుటకై పాండవు లిక పయనము కావలెను. వారికి ధర్మదేవతవలన వరము సంప్రాప్తించినది. దాని తరువాతది బ్రాహ్మణుల యాశీర్వాదము.

'లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి.'

రాబోవు శుభసంపదలనే సాధుపుంగవులు తమ నోటినుండి పలుకుదురుగాని వేరు వ్యర్థప్రలాపములు వారి ముఖమునుండి వెలువడవు ఋషిపుంగవుల వాక్కులనే రాబోవు శుభసంపద్రూప ప్రయోజన మనుసరించును. ఈ శ్లోకమున ఋషులు సిద్ధపురుషులని భవభూతి చాటి చెప్పినాడు. ధర్మనందనుని ఆశ్రమమున సాధుసత్తములగు విప్రవర్యులును, ఋషిపుంగవులుగూడ గలరు. వారందరును ధర్మజుని చుట్టి కూర్చుండగా ఇప్పుడు వారి యాశీస్సులను ధర్మజు డర్థించవలెను. కావున వారి యాశీః ప్రభావము నర్థించుటతో కథాప్రారంభమైనది.

ధర్మనందనుండు చేతులు జోడించి ముఖమండలమున వినయము విస్తరిల్లగా బ్రాహ్మణ బృందమున కిట్లు విన్నవించుకొనినాడు.

'మహనీయులారా, ఈ నా జీవితము మీ తెఱుగనిది కాదు. సుయోధనుని యాజ్ఞకు బద్ధులమై మే మడవులబడిన యిడుములును మీకు తెలియును. మే మిప్పుడు గడపబోవు యజ్ఞాత వత్సరము నెట్టైన చెరచుట దుష్టచతుష్టయముయొక్క యాశయము. కనుసన్నలకైన యందక జ్ఞాతుల కఠినపరీక్షావిధానమున గట్టెక్కదగు మాకు మీ యాశీస్సుల నందింపుడని బ్రాహ్మణులను కోరుటతో కథను ప్రారంభించినారు, అమాత్యశేఖరులు. ధర్మజుని పలుకులం దెంత వినయ ముట్టిపడుచున్నది? ఆ బ్రాహ్మణులను

ఆ॥ '... ... ... ... ... ... ...
... ... ... మమ్మునింక అతిరహస్య
వృత్తిమై నిరస్త విఘ్నుల రై చరి
యింపుడని యనుగ్రహింపవలయు'

అన్న ధర్మనందనుని పలుకులు బ్రాహ్మణబృందమును, తన సోదరులను కూడ కరగించినవి.

ఎట్టి మహిమాన్వితులకయినను కష్టకాలమున ధైర్యము మరుగుపడుట సహజము. వారి యంతఃకరణమున సహజముగనే యుండు ధైర్యసాహసాదిగుణముల నెవ్వరైన స్మృతికి దెచ్చుచో సన్నగిల్లియున్న నిప్పురవ్వను విసరి, పెద్దదానిని గావించినట్లగును. ఆ ఘట్టమున ధౌమ్యు లట్లుజేసినారు. ధర్మపీఠమవగు నీకా ? యిట్టి యధైర్యము ; విపత్తులయందు నీ చిత్తము చలించక శిలాతలమైయుండుట లోకప్రసిద్ధమని నుడివి ధైర్యమును పురిగొల్పుచు ఎందరో మహనీయులు ధర్మసంస్థాపనకై నీవలె కష్టములపాలైరి యని, శ్రీ మహావిష్ణువు వామనావతారుడగుటయు, నలచక్రవర్తి జీవితవిధానమును మొదలగు వాటిని వర్ణించినారు. కథ నిట్లు ప్రారంభించుటలో పూర్వకథాను స్మరణమును చేయుటయేగాక కథాప్రారంభము విప్రుల యాశీస్సులతో ప్రారంభించినారు. ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశములతో కథను ప్రారంభించుట శాస్త్రసమయము.

తరువాతిది భీముని మాట. అది మాటకాదు. రత్నములమూట. భీము డెప్పుడు మాటాడినను నాటి జూదపీఠము నెత్తుకొనక, ద్రౌపది యసామాన్య పరాభవమును తలపక నాతడు పలుకనే పలుకడు. ఎప్పుడో కాదగిన పనికింత యాలస్యమైనదని భీముని హృదయము. ఆతని యుద్వేగ మెంతయున్నదో తిక్కనామాత్యు లొక్క పద్యమున చూపినారు.

మ. 'భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభద్వేగమై కాక నా
డవలీలన్ మన యర్జున ద్విపము క్రోధావేశ దుర్దాంత ద
ర్పవిలాసోద్భటభంగి నేపడరి కౌరవ్యాంఘ్రి(?)బుజశ్రేణి జ
ఱుక్కవడం జేయదెయొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సందిల్లగన్'

కౌరవ సంతతి భీముని దృక్పథమునం దొక యాటస్థలమైనది. అందును ఒక మదపుటేనుగు విహారమునకేగి విహరింపదగు క్రీడా సరోవరమైనది. ఆ సరోవరమున తన తొండముతో లీలగా ఎత్తి యాడుకొను తామరలై కౌరవ సంతతి దాని కాలిక్రిందపడి నలిగిపోదగిన యల్పబలులగుట ఇందు గమనింపదగు విషయము. ఆత డా సమయమున తననుగాక అర్జునుని ప్రశంసించుటలోని హృదయ మేమి? దుర్యోధనుని మిత్రుడు కర్ణుడుకూడ ఆ తామరతూడులలో కలసినాడు. అంతటి మదపుటేనుగునకు శృంఖలము ధర్మజుని కనుసన్న. ఈనాడును నీ కనుసన్నలలో మే మందరమును మెలగువారమే యని తన యొప్పుదలనుగూడ నందించి దుర్యోధనుడు తనపాలు అవి చెప్పినట్లయినది. అమాత్యశేఖరుల ధ్వన్యలంకార రసము లుట్టిపడిన పద్య మిది. ఇంతవరకు తిక్కన కూర్పు.

## అజ్ఞాతచర్య

మూలమునందలి కథాక్రమము:-

బ్రాహ్మణుని యరణిని బ్రాహ్మణున కందించి ధర్మదేవత తమ కిచ్చిన వరములు సంగతిని వారి కెరిగించి, సోదరులతో తమ భవిష్యత్తు నాలోచించుట జరిగినది. కారణ మేమి? వ్యాసుడు అరణ్యపర్వములోని కథాభాగము నందుకొన్న చాలును. తిక్కనార్యులు పూర్వకథావృత్తము నందుకొన్నగాని, భారత ప్రారంభమును తా నాచరించినట్లు కాదు. కావున బ్రాహ్మణుల యాశీర్వాదములతో ప్రారంభించి, ధర్మజుని ముఖముననే మేము పడినపాట్లను మీ రెరుగుదురుగదా? యని పౌరులగువారల నుద్దేశించి పలికించినారు. ఆది, సభా, అరణ్యపర్వముల కథ కలిసినది. మూలమునందలి కథ యిట్లు నడచినది.

ధర్మజుడు అర్జునునితో మనమీ పదమూడవ సంవత్సరము నే రాష్ట్రమందు గడుపుదమని ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నకు పార్థుడు కొన్ని రాష్ట్రములను పేర్కొనగా ధర్మజుడు మత్స్యదేశమును నిర్ణయించినాడు. అర్జునుడు చెప్పిన రాష్ట్రము లివ్వి—.

పాంచాల, చేది, మత్స్య, శూరసేన, దశార్ణ, మల్ల, సాల్వ, యుగంధర, పటచ్చరలు. ఆ రాజ్యములలో విరాటుని రాజ్యమును ధర్మజులు నిర్ణయించినారు. కారణమేమి ?

శ్లో॥ మత్స్యో విరాటో బలవానభిరక్తోఽథ పాండవాన్
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః.

ధర్మజుడు దీర్ఘదర్శి. రాబోవుకాలమున యుద్ధము ప్రసక్తమగుచో ఆ విరాటుని బలము మన కపసరమని సూచించుచు విరాటుని వర్ణించుటలో 'బలవాన్' అని మొదటిమాటగా చెప్పినాడు. అతని బలము మనకు కలియునా అనుచో 'అభిరక్తోఽథ పాండవాన్' తమను గురించి వానికున్న అనురక్తిని వర్ణించినాడు. అంతతోబోక, అతడు ధర్మశీలుడని చెప్పినాడు. తరువాత విరాటుని ఔదార్యమును, పెద్దతనమును వర్ణించబడినవి. తా ముండుటకు అతని వృద్ధత్వము పనికివచ్చినది. అంతేకాదు. విరాటునకు మనయందుగల ప్రీతి, తాత్కాలికము కాదని నిర్ణయించుచు 'సతతం ప్రియః' అని వాడినాడు. తరువాతి విషయము వారుండదగు యునికి. అందంతయు చక్కగ పరిశీలించుకొనుట జరిగినది. మొదటిది వారి జీవనవిధానము. కావున వా రాసంవత్సర కాలమును చేయదగు వృత్తులు నిర్ణయించబడవలెను.

నేడు వృత్తివిద్యలనేర్పు టెంత యవసరమో సభలలో చాటిచెప్పు విద్యావేత్త లీనా డొక క్రొత్తవిధానమును కనిపెట్టుచుంటిమని చెప్పుట

భారతీయ విద్యావిధానములోని యుత్కృష్టత నెరుగకపోవుటేగాని వేరుకాదు.

రాజకుటుంబములు కూడ ఆనాడు వృత్తివిద్యలయందారితేరిరనుటకు భారతచరిత్రకంటె ఆధారమగు చరిత్రాంశ మెక్కడున్నది ? అరువది నాలుగు కళలును మానవుని జీవితలక్ష్యమును సాధించుట కేర్పడినవే. అలనాటి భారతీయ విద్యావిధానము కేవల మోక్షపురుషార్థమునకు మాత్రమే నిర్ణీతమైయున్నదని నేటి విజ్ఞులు పలుకుచుందురు.

అది వారి పరిశీలనావిధానములోని లోపము. నేటి విద్యావిధానమున విజ్ఞుల మనుకొనువారు జీవనమాత్ర విధానముల నేర్పరచుటకే పాటు పడుచుండగా నాడు మానవజీవితము ధన్యముకాదగు నిశ్శ్రేయసమును మేళవించి, ఆ వృత్తులు కళాత్మకములగుటయేగాక మోక్షపురుషార్థములు కాదగియుండవలెనని భారతీయత చెప్పినది. ఉదాహరణకు త్యాగరాజులు తన సంగీతవిద్యకు మోక్షప్రధానశక్తి కలదని ఋజువుచేసినారు. పోతనామాత్యులు తన కవితాప్రాభవమును పునర్జన్మ రాకుండుటకై వాడినారు.

కథకు వత్తము. పాండవులు తమ వృత్తులను నిర్ణయించుకొన వలెను. ఆ మాటను మొదటమాటగా చెప్పినారు ధర్మజులు. బ్రతుకు తెరువు చాల ముఖ్యమైనదిగదా ! ఇక్కడ నా కొక శ్లోకము జ్ఞాపకమున కొచ్చినది.

> 'శతం విహాయ భోక్తవ్యం సహస్రం స్నానమాచరేత్
> లక్షం విహాయ దాతవ్యం కోటిం త్యక్త్వా హరింభజేత్'

నూరు పనులున్నను వాటిని వదలి భోజనము చేయవలెను. వేయి కార్యములు తన వెంటనంటియున్నను వాటిని వదలి స్నానము చేయుట చాల ముఖ్యము. లక్ష కార్యములను వదలి దానము చేయుటకు ముందంజ

వేయవలెను. చివరిది భగవచ్చింతనము. కోటి పనులున్నను ముందు నెరవేర్చుకొనదగినది హరినామ స్మరణమట.

మన కిప్పుడు చెప్పుకొనదగిన కథాభాగములోని అంశము బ్రతుకు తెరువు.

కుర్వంత స్తస్య కర్మాణి విహరిష్యామ భారత
యాని యాని చ కర్మాణి తస్య పక్ష్యామహే వయం.

పార్థా ! మనమిప్పు డేయే వృత్తుల నవలంబించి జీవింతము ? ఆ నిర్ణయములను గావించికొనియే మనము పయనము చేయవలెననెను.

ధర్మజు డట్లు పలుకగనే అర్జునుని హృదయము ద్రవించినది. ఎందరో సామంతరాజులు తమ తమ అనర్ఘమణి కిరీటములచే నీరాజనముల నందించుచు తన పాదములకు మ్రొక్కగా రాజపీఠము నలంకరించిన ధర్మజుని అనిర్వచనీయఖ్యాతితోబాటు ఆ మహనీయుని మృదుమధుర గుణసంపదంతయు అర్జునుని స్మృతిపథమునకు రాగా ఈ యజాతశత్రు వేవిధమగు వృత్తి నవలంబించి జీవించును ? అను ప్రశ్న అర్జునుని కలచివైచినది. ఆ విషయమునే ధర్మనందను నిట్లు ప్రశ్నించినాడు.

శ్లో॥ నరదేవ కథం తస్య రాష్ట్రే కర్మ కరిష్యసి
విరాటనగరే సాధో రంస్యసే కేన కర్మణా.

తా:- సాధుస్వభావముగల ఓరాజా ! నీవు విరాటనగరమం దేవృత్తితో జీవింతువు ? ఆతని రాష్ట్రమున నీవు అవలంబించగల వృత్తు లేమున్నవి ? అని అర్జునుని ప్రశ్న.

మాత్స్య మొక రాష్ట్రము. ధర్మజుడు సమ్రాట్. అట్టి చక్రవర్తి ఒక రాష్ట్రమును పాలించు రాజుయొక్క రాజధానియందు జీవించవలసి

వచ్చుట ఎట్టి ఘట్టము ? ఆ ఘట్టమునే ఈ శ్లోకమున సూచించి, ఆతని బాధను ప్రకటించినాడు. అంతతో ఆత డాగలేదు. ధర్మనందనుని గుణ సంపదనుకూడ వర్ణించుచు ప్రశ్నించినాడు.

శ్లో॥ మృదుర్వదాన్యో హ్రీమాంశ్చ ధార్మిక స్సత్యవిక్రమః
రాజం స్త్వమాపదాఽఽకృష్టః కిం కరిష్యసి పాండవ.

సుందర సుకుమార గాత్రమును, ఆ శరీరమార్దవముతోపాటు విశాలహృదయము నాక్రమించుకొనియున్న వినమ్రభావమును, అట్టి వినమ్రత కొక వినూత్నాలంకారమైయున్న లజ్జయునను ఆత్మగుణముల నొప్పి, ఆత్మగుణములకు వన్నెదిద్దెడి ధర్మనిష్ఠయు, ఆ ధర్మ పురుషార్థము నాధారముగాగొని పరిపాలించుట కర్హమగు పరాక్రమమును కలిగియున్న నీవా ? ఇట్టి దురవస్థ ననుభవించుట ! అన్న భావమంతయు ఈ రెండవ శ్లోకము ప్రకటించినది. ఇక ఆంధ్రభారతమును కేగుదము.

తిక్కనార్యు లీఘట్టము నొక రంగస్థలము గావించి, అర్జునుని హృదయవేదనను అర్జునుని ముఖమండలమం దభినయింప జేసినారు. పార్థు డిట్లుండెనట.

'అవిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును, సగౌరవంబునుంగా నతని నుపలక్షించుచు విట్లనియె.'

తరువాత అతని గుణమునంతను ఒక సీసపద్యమున వర్ణించినారు. పై శ్లోకము లందలి భావములే వర్ణితములైనవి. వ్యాస భారతములోని సొంపులను బహిర్గతముల గావించి తీర్చిదిద్దినదే తిక్కన నాటకీయ కవితాశిల్పము. కథకు పోదము.

ధర్మజు డాతని ప్రశ్నకు తగు సమాధానము నిచ్చినాడు. అర్జునుని విషాదము నాతడు గమనింపకపోలేదు. నలువురు తమ్ములను

సంబోధించి తనకు వచ్చిన ఈ యాపదను దాటుట యొక లెక్కలోనిది గాదని చెప్పినట్లున్నది ధర్మజుని సమాధానము. ఈ భావమును తిక్కన చూపినారు.

కం॥ అనినం దమ్ముని నెమ్మనమున బుట్టిన
వగపు భావమున నెరింగియు గీ
టున బుచ్చుచు ప్రస్తుత కార్యనిరూపణ దశయ
మెరయ నతడిట్లనియెన్.

ధర్మజుని సమాధాన మిది. 'సభాస్తారో భవిష్యామి తస్య రాజ్ఞో మహాత్మనః' ఆతడు సభాస్తారుడై విరాటుని కొలువుకూటమునం దుండుటకు నిశ్చయించినాడు. అనగా ఆతడు విరాటుని కొలువు కూటమునం దొక ముఖ్యసభ్యుడన్నమాట (సభాస్తారః=సభ్యః=నీ.కం.) ఆ సభయం దాతని కృత్యమేమి? విరాటున కుత్సాహమును కూర్చుచు ఆతని మనస్సును రంజింపజేయుట. ('విరాటరాజం రమయన్') సామాన్యముగ రాజులు వేట, ద్యూతము అను క్రీడలతో కాలమును గడుపుచుండుట గలదు. రాజకార్యముల నెరవేర్పక వాటిని దగులుచో అది వ్యసనముగా వచ్చును. కాని మానసికోత్సాహమునకై వాటిని రాజు వాడవచ్చును. కావున క్రీడావిశేషములతో రాజుల హృదయమును రంజింపజేయునట్టి నేర్పుగల వారా రాజసభలందుందురు. అందు ధర్మజుడు ముఖ్యుడై యుండుట కాతడు నిశ్చయించుకొనెను.

బృహదశ్వమహర్షి వలన ఉపదేశము నొందిన అక్షహృదయము నీనాడు ధర్మరాజు వాడదలచినాడు. ఆనాడు ధర్మజుడు ద్యూతవ్యసనమున కాలము గడుపుటకై బృహదశ్వునివద్ద అక్షహృదయమును గ్రహించలేదు. అజ్ఞాతవాసవత్సరము గడచి హస్తినాపురమున కేగగా మరల దుర్యోధనుడు ద్యూతమున కాహ్వానించుచో తగు రక్షణకై బృహదశ్వ

మునీంద్రునివలన అక్షహృదయమును గ్రహించినాడు. అవిద్య విప్పు డాపత్కాలమున వాడి, జీవనవిధానము నేర్పరచుకొనుటకు నిశ్చయించు కొనినాడు. ఈ విషయము సంతను వ్యాసులు.

'కంకో నామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః'

అను శ్లోకమున 'మతాక్షః' అనుటతో సూచించినారు.

(మతాక్షః=బృహదశ్వాత్ జ్ఞాత అక్షతత్త్వః...... వి. కం. వ్యా)

కావుననే ధర్మజునివద్ద ద్యూతక్రీడకు పనికివచ్చునట్టి పాచికలున, ఆ పాచికలను రక్షించు పైఫలకమునుకూడ నున్నది. కాని ఆ ఫలకమును, పాచికలనుగూడ సామాన్య జూదరులవద్ద యుండునట్టివిగాక విరాటునకు గూడ నాశ్చర్యమును గలిగించు నీలపీతాది వర్ణములతో కన్పట్టుచు మూడ ముచ్చటలై యున్నవి. ఆ పాచికల వర్ణమొక్కటే యయ్యును నాలుగు వర్ణములై కన్పట్టుట వాటిలోని ప్రత్యేకత. వ్యాసు లిట్లు వర్ణించినారు.

'కృష్ణాక్షాన్ లోహితాక్షాంశ్చ నిర్వత్స్యామి మనోరమాన్

వైడూర్యాన్ కాంచనాన్ దాంతాన్ ఫలై ర్జ్యోతీరసైస్సహ.

బంగారపు చాయగలిగి, పాదరసవర్ణమున మిశ్రితమై ఆ పాచికల వర్ణము మనోహరమై యున్నదట.

'వ్యాఖ్య=జ్యోతింషిచ, రసాశ్చ జ్యోతీరసాః' జ్యోతిశబ్దములో పీతవర్ణమును రసశబ్దము తెలుపు వర్ణమును చెప్పగా ఆ రెండురంగులు కలసి నాలుగు వర్ణములుకలవి యనునట్లున్నవి. అట్టి పాచికలతో నాడు జూదముచేత రాజుయొక్క హృదయమును రంజింపజేయుటేకాక ఆ రాజువద్దనుండు అమాత్యవర్గమును రాజబంధువులనుగూడ అత డుత్సహింపజేయుచు, ఎవ్వరికిని అహితుడుగాక యుండుటనుగూడ ధర్మజుడు నిర్ణయించుకొని ఆ విషయములనే సోదరులకు తెలిపినాడు. తన పేరును చెప్పునప్పుడు కంకుడనని చెప్పెదననిగూడ నిర్ణయమును

తెలిపినారు. అంతేగాక నీ విదివరకు ఎవరి యాస్థానమునం దుంటివని విరటుడు ప్రశ్నించుచో నేను ధర్మరాజు ప్రాణస్నేహితుడనై అతని వద్దనే యుంటినని చెప్పునట.

'ఆసం యుధిష్ఠిరస్యాహం పురా ప్రాణసమస్సఖా'

చూచితిరా! భారత కథాప్రపంచ మెంత నిగూఢమై గూఢాభిసంధులతో నొప్పియున్నదో! ధర్మజు డెవ్వి యబద్ధముల నాడెనో చూడుడు. యథార్థమున కతడు బ్రాహ్మణుడు కాడు. బ్రాహ్మణుడనని చెప్పుదుననెను. అతనిపేరు కంకుడు కాదు. ఆపేరుతో వ్యవహరింతుననెను. తానే యుధిష్ఠిరుడై యుండ యుధిష్ఠిరునకు ప్రాణసఖుడనని చెప్పుదుననెను. ఇతడు ధర్మరా జెట్లయ్యెను? అనుసందియము కలుగవచ్చును. అంతేకాదు ధర్మజుడే ఇట్లబద్ధమాడుటకు ఒడిగట్టినాడనుకొనువారును గలరు.

ఎంత వెఱ్ఱి! ధర్మరా జిప్పుడు విరాటునకు చెప్పబోవు మాటలు అబద్ధములు కావు. అవి గుప్తపదములు. సంస్కృతభాష యందలి సౌలభ్య మదియే. వినువారికి ద్యోతకము కాకుండునట్లును, చెప్పు మాటలు సత్యదూరములు కాకుండునట్లును ఉండును. పండిత ప్రకాండులగు పాండవు లట్లు నిశ్చయించుకొనినారు. ధర్మజుడు చెప్పదలచిన మాటల కర్థమును గ్రహింపుడు. కంకుడని ఆయన పేరు. ఆ శబ్దమునకు నానార్థములున్నవి.

'కంకచ్ఛద్మద్విజే ఖ్యాతః లోహపృష్ఠకృతాంతయోః'

కంక శబ్దము కపటవేషధారి యగు బ్రాహ్మణునకును, యమధర్మరాజునకుకూడ నర్థము నిచ్చును. కావున నేను కపటవేషధారియగు బ్రాహ్మణుడనేగాని యథార్థమునకు నేను బ్రాహ్మణుడను గానని ధర్మజుని భావము. అంతేకాదు. యమధర్మరాజునకు నేను పుత్రుడనని

కూడ అర్థము. అదెట్లు? పుత్రుడననగా ఆత్మయే. 'ఆత్మావై పుత్రనామాసి' అని శ్రుతి. కావున నేను యమధర్మరాజు పుత్రుడనను అర్థమంతయు 'కంక' శబ్దమున ఇమిడియున్నది. అట్లే యుధిష్ఠురుని ప్రాణస్నేహితుడ ననుమాటకూడ. తిక్కనయు ధర్మజుని సమాధానమును నిగూఢముగనే వర్ణించినారు.

'ఉన్న రూప పలుకు నెన్నరు లెక్కడ గలరు?' నిజము చెప్ప నలవి కాదని యర్థము. ఆత్మశబ్దము శరీరమునకును, జీవునకును వర్తించును. యుధిష్ఠిరుడను పదముచేత శరీరము చెప్పబడగా ఆ శరీరము నుద్ధరించు ప్రాణమువలెనే ఆయుధిష్ఠిర శబ్దవాచ్యమైన శరీరమునకు జీవాత్మకూడ ప్రాణమువంటిదగుటచేత చిదాత్మ పక్షమును గ్రహించి యుధిష్ఠిరునకు నేను ప్రాణసఖుడనైతినని చెప్పినాడు.

అనగా యుదిష్ఠిరుడను పేరుగల ఈ శరీరమునకు ప్రాణమువంటి వాడనై శరీరమును నడపునట్టి చిదాత్మనని భావము.

(యుధిష్ఠిరాఖ్యస్య శరీరస్య యథా ప్రాణ ఉత్థాపకః తద్వచ్చి దాత్మాఽపి, ఇతిప్రాణసామ్యేన యుధిష్ఠిరాత్మైవ వివక్షిత ఇతి భావః— నీ. కం. వ్యా)

ఆంధ్రభారతమున యతియై జూదమాడుదు ననుట యుక్తమని తోచదు. శ్రౌతస్మార్తవిద్యలు, జ్యోతిషము మొదలగు విషయములయందు తనకు ప్రవేశమున్నట్లుకూడ ధర్మజుని సంభాషణనడచినది. ఇంతవరకు ధర్మజుని కర్తవ్యము నిర్ణయమైనది. తాను విరాటునియొద్ద తలయొగ్గి జీవించు టొక లెక్కకాదను ధైర్యము కలిగియున్నను సోదరులను గూర్చిన బాధ మిక్కిలియై ధర్మజుని మనస్సును కలత నొందించినది.

అతని చూపు మొట్టమొదట భీమునిపై పడినది. ఉగ్రగరణ ప్రచండుడగు భీముని కార్యములన్నియు మనస్సునకు రాగా భీముని

క్షాపోరాటములను గుర్తుకు తీసుకురాకుండగనే నీ వెట్టుండుదు వని భీముని ప్రశ్నించినాడు. భీముని ఉగ్రవీర్యమును ధర్మజునిచే వర్ణింప చేయక వ్యాసులు అంతర్గర్భితమును గావించగా తిక్కనగారు బయలు పరచినారు.

తే॥ ఇతడు పుట్టిన కోలెను నెసగ మెసగు
దర్పమున నవర్తిల్లు నుదగ్రహృదయు
డకటా ! యొరు చిత్తమున కెక్కునట్లుగాగ
మెలగి ఏమి విధంబున గొలుచువాడు.

భీముని వృత్తివిధాన మతిచిత్రమైనది. అతడు పాకశాస్త్రమున నేర్పరి. వంటకములం దెన్ని భేదము లున్నవో వంటవా రెరుగని విధానముల నెరిగిన ప్రౌఢ. నాటి రాచబిడ్డలు వంటల నెందుకు నేర్చిరో ! క్రొత్తక్రొత్త వంటకముల గావించు నేర్పరితనము నాకున్నదని సగర్వముగా పలికినాడు. భీముడు ఇంతకు పూర్వమున్నవారిని పరాభవించగలడట.

సూపానస్య కరిష్యామి కుశలోస్మి మహానసే
కృతపూర్వాణి యాన్యస్య వ్యంజనాని సుశిక్షితైః
తాన్యప్యభి విభష్యామి ప్రీతిం సంజనయన్నహం

ఈ శ్లోకములనే తిక్కనగా రనువదించినారు.

ఉ. అరు రసంబులం జవుల యందలి క్రొత్తలు షట్టనిచ్చలున్
వేరొక భంగిబాకముల విన్నను వొప్పగజేసి చేసిన
న్నిరగ బానసీని నొకనిం బురి గాననియట్లుగాగ మేన్
గారియవెట్టియైన నొడికంబుగ వండుదు నెల్లకూరలున్.

వంటచేయుటేకాదు ;

శ్లో॥ ఆహరిష్యామి దారూణాం నిచయాన్ మహతోపి చ

పెద్ద పెద్ద కట్టెమోపులనుకూడా తానే తెచ్చునట పాపము! విరాటుని వంటవారు వంటకట్టెలకై ఎదురుచూడగా తా నొకరి సాయమున కెదురు చూడకయే పెద్ద పెద్ద చెట్లను మొత్త మొక్కకట్టగా కట్టి తెచ్చునట.

దైవ మెంత చిత్రమైనది! మయనిర్మిత గదాదండముచే రాబోవు సంగ్రామ రంగమున దుర్యోధనుని యూరుభేదనము గావింతుననెడి భీముని ఈనాడు కట్టెలమోపులతెచ్చి వంట చేయుదునని పలికించుచున్నది. 'హతవిధిపరిపాకః కేన వాలంఘనీయః' కథకుమోదము.

భీమసేనుని పేరు బల్లవుడు. పౌరోగవుడనై బల్లవుడను వ్యవహారనామమున వ్యవహరింతునని చెప్పినాడు. పౌరోగవు డన వంట యింటి పెత్తనదారుడు. బల్లవుడన వంటవాడు. ఈ రెండు పేర్లకును వేరొక యంతరార్థ మున్నది. జీవులు మాతృగర్భమున ప్రవేశించుటకు ముందు చరించువాడు వాయువు. కావున వాయువునకు పురోగవుడని పేరు. ఆతని పుత్రుడు కనుక భీముడు పౌరోగవుడయ్యెను. మహానసాధ్యక్షుడ నన్న పేరుతో తన జన్మకథనమును సత్యముగ చెప్పగలిగినాడు. పౌరోగవపదము, బల్లవపదమును తా నిప్పుడు చేయు వృత్తినిబట్టి వచ్చినది. ఈ యర్థమునే నీలకంఠులు తెలిపినారు.

(పురః=పురస్తాత్ గావః రశ్మయః యస్య సః పురోగః=వాయుః; తస్య పుత్రః పౌరోగవః. లోకే తు పౌరోగవో మహానసాధ్యక్షః. బల్లవః=సూపకారః.) వంటచేయుటేగాక మల్లయుద్ధమును ప్రదర్శించుట యను వినోదభాగముకూడ గావించి రాజునకు ప్రీతి గొల్పుదునని చెప్పినాడు. ఇంతటితో భీముని నిర్ణయము ముగిసినది.

ఇక అర్జునుని పట్టమున్నది.

అర్జునుని విగ్రహ మొక యసామాన్య తేజఃపుంజము. కారణ మేమి? దేవేంద్రుని యర్ధాసనము నలంకరించిన దేవతా తేజముకదా! అంతియేనా? కిరాతవేషమున తన కెదురై నిలిచిన ఈశ్వరునిగూడ పిడి గ్రుద్దుల గ్రుద్ది పాశుపతాస్త్రమును సంపాదించిన వ్యక్తి. అతడిప్పు డెట్లు విరాటరాజు చాటున దాగియుండగలడనునది ధర్మజునకు పెద్ద సమస్య యైనది.

పార్థునివంక చూచి 'పార్థా! నీవెట్లు విరాటుని కొలుతువు?' అని నిట్టూర్పుల నిగుడ్చుచు ధర్మజుడు ప్రశ్నించినాడు.

రాబోవు యాపదలకుగాని, సంపదలకుగాని కారణముల సృష్టించకయే భగవంతుడు జీవుల జీవయాత్రలపై ముద్ర వేయునా? జీవులు తమ తమ ఫలానుభవముల కర్తలగు కర్మల నాచరించి, జీవిత సంద్రమున తిరుగాడుచుందురనుట నిశ్చయము.

అర్జునుడు నేడుండదగు వేషము స్వర్గసీమయందే నిర్ణయమై యున్నది. నాటి యూర్వశి శాప మీనాడు పనికివచ్చినది. అనాడే దేవేంద్రుడు వరమిచ్చినాడు. దాని కాలము వచ్చినది. అర్జునుడు షండకుడనై యుందునని ధర్మజునకు చెప్పినాడు. షండకు డన నపుంసకుడు. స్త్రీభావ పుంభావముల మిశ్రమశరీరము. ఇపుడు శరీర మెట్లు మారును? మహాపురుషుని చిహ్నము లాతని శరీరమునందు మరుగుపడు టెట్లు? ఆతని భుజస్కంధము జ్యాఘాతములచే కాయలు గాసి యుండును. అతని కంఠసీమ శంఖమువలె నుండును. అ మెడపై నున్న రేఖలు ఎట్టి గూఢచారుల కండ్లకును కనబడరాదు. అర్జునుని శిరోజములు సామాన్యమానవ విలక్షణములు. కావుననే అతనికి గుడా కేశుడని పేరున్నది. అ కేశముల విప్పు దేమి చేయుట?

జ్యాఘాతములచే కాయలుగాసిన భుజస్కంధములకు శంఖ వలయములను కేయూరములవలె తొడగగా, అవి మరుగుపడును. మెడ చుట్టును దండలను చుట్టగా రేఖలు కనబడవు. వెండ్రుకలను ఒకే జడగట్టి వేణీబంధముగ నలంకరించుకొన్నచో ఆ కొనలలోని వైశిష్ట్యమును పరీక్షకులుగూడ పరీక్షింపజాలరు. అతడు నివసించునది అంతఃపురమున. అక్కడ పూర్వరాజుల చరిత్రలను గానము చేయుచు రాచకన్నియల కుపాధ్యాయుడై యుండుట నాతడు ధర్మజున కెరిగించినాడు. అంతతో గొడ్డలిపెట్టునకూడ సాధ్యముకానిపని గోటత్రుంచినట్లయినది. ధర్మజునకు పార్థుని కర్తవ్యమునుగూర్చిన విచారము పోయినది. అవియు పైవారి పేర్లవంటివే.

షండ పదమునకు గోపతియను నర్థమున్నది. గోపతి యన గోపాలకుడు. గోపాలకుని స్నేహితుడ నని నర్మగర్భమగు అర్థము. షండు డన సామాన్యార్థమున నపుంసకుడను అర్థము వచ్చినను బృహన్నల యను పేరునకు విశేషార్థము కలదు. బృహన్నరుడను పదమునకే చివరి యక్షరమును లకారముగ పలికి తన నామమును చెప్పినాడు. బృహన్నరుడనగా నారాయణఋషికి సహచరుడగు నరుడని భావము. మరి రకారస్థానమున లకారము నెట్లు పలికెను? అట్లు పలుకవచ్చును. రకార లకారముల కభేదము. ఈ యర్థమునే నీలకంఠులు చెప్పినారు. ఇంతవరకు భీమార్జునుల ఘట్టము ముగిసినది.

ధర్మజుడు నకులునిపై దృష్టిని బరపినాడు. ఆ యమనందనుని మనసు నీరైనది. నకులుని సుందరసుకుమార గాత్రము మరుగుపడు టెట్లు? అందుకే తిక్కనగారు నకులుని నాగరికతంపుచందము చెప్పక, చూపక ఈతని విశేషమును తెలుపుచున్నదని చెప్పినారు.

ఈతనికి తన లోకైక సౌందర్యమును దాచుటయొక ఆపద గావచ్చునని ధర్మజుడు తలచినాడు. తలచుటకాదు. ధర్మజుని మనము విచార తరంగముల నూగులాడగా నకులుడు సమాధాన మిచ్చినాడు.

నేను అశ్వశాల కధికారి నగుదును. అశ్వములను శిక్షించు నేర్పరితనమును, వాటికి వచ్చురోగముల నిర్మూలించు వైద్యవిధానము నందుకూడ నాకు పరిపూర్ణజ్ఞాన మున్నది.

నా పేరు గ్రంథికుడు. ఇంతకు పూర్వము నేను పాండవజ్యేష్ఠుడగు యుధిష్ఠిరునిచేత అశ్వశిక్షణోద్యోగమున ముఖ్యుడనై యుంటినని చెప్పెదను. ఇది నకులుని నిర్ణయము. ఇచ్చట గ్రంధికుడ ననుటలో నేను అశ్వినీదేవతల పుత్రుడనను అర్థము వచ్చును. ఎట్లు ?

ఆయుర్వేదమును అధ్వర్యమునుకూడ తెలిసినవానికి గ్రంధికుడని పేరు. అశ్వినీదేవతలు దేవవైద్యులు. దేవవైద్యుల ఆత్మనే నేనని భావము.

( ఆయుర్వేద మాధ్వర్యం చ వేత్తీతి గ్రంధికః అశ్వినోః సుతత్వాత్ — నీ. కం. వ్యా.)

నకులుడు చెప్పిన వ్యాసవాణిని చూడుడు.

శ్లో॥ అశ్వబంధో భవిష్యామి విరాటనృపతేరహం ।
సర్వథా జ్ఞానసంపన్నః కుశలః పరిరక్షణే ॥
గ్రంధికోనామ నామ్నాహం కర్మైతత్ సుప్రియం మమ ।
కుశలోస్మ్యశ్వశిక్షాయాం తథై వాశ్వచికిత్సనే ।
పాండవేన పురాతాత అశ్వేష్వధి కృతః పురా ॥

అశ్వములయందు నేను ముఖ్యుడనై ధర్మజునొద్ద యుంటినన్న మాటయందుకూడ గూఢార్థమున్నది. యుద్ధరంగమున నేను శూరుడనను అర్థము వచ్చునట్లు 'అశ్వేష్వధికృతః' అని ప్రయోగించినాడు.

(నాస్త్యశ్వో యేషాం తే శూరాః సమరే తృణీకృతప్రాణాః తేషు అధికృతః ముఖ్యః ఇతిగూఢాశయః) నీ. కం. వ్యా.

మన మొక్కమారు ఆంధ్రభారతమువైపు తిరుగుదము. అశ్వశిక్షణము నంతను సంగ్రహరూపముగ సీసపద్యమునందు పట్టించుట జరిగినది.

ఏయే జాతి గుఱ్ఱములను ఆడుగుఱ్ఱములతో పొత్తుకుదర్చవలెను? ఆ రహస్యములను తెలిసి ఆడుగుఱ్ఱములకు మగగుఱ్ఱములను కలుపుట, పిల్లగుఱ్ఱములకు కళ్ళెములవేయు కాలముల గుర్తెరిగి ఆ కాలముల తప్పకుండ కళ్ళెముల వేయుట, సామాన్యవిధముగ కళ్ళెములు కుదరనిచో వాటికి క్రొత్తపద్ధతులతో కళ్ళెముల బిగించగలుగుట, పోగరుబోతు గుఱ్ఱములకు వాటి శరీరబలమును తగ్గించకయే వాటి మకురుతనమును మాన్పగల నేర్పరితనము, శాలలనుండి బయటకు పోవు గుఱ్ఱములకు రోగములు మొదలైన దోషములు రాకుండ కాపాడగలుగుట, మొదలగు పనులను చేయుచు నాకంటె ముందున్నవారిపై నే నధికారినై యుందునని నకులుడు చెప్పినాడు మూలము నందలి 'సర్వథా జ్ఞాన సంపన్నః కుశలః పరిరక్షణే' అన్నదానిని తిక్కనగారు విపులీకరించినారు.

సీ. గోడిగజాతిలో కొదమపెంటుల నేర్చి
మావులహత్తించు మార్దవంబు
ద్రాళ్ళబట్టింపంగ దఱియైనకొదముల
సంచంబు లెరిగి శిక్షించునేర్పు
గళ్యాల బదిలంబుగాని గుట్టంబుల
క్రొత్తమట్టున కియ్యకొలుపువెరపు
బెనగుశూకలముల బిరుదుతనంబుల
జలము దింపక తీర్పజాలుటయును

తే. నలవరించిన వాడలాయమునను న్న
యపుడు దొడకించుకయు లేనియట్లుగాక
మాటిమాటికి బరికించి, మందడీల
కెల్ల నూరట యగుచు వర్తిల్లనేర్తు.

తరువాతివారు సహదేవుడును, ద్రౌపదియు. ధర్మజుడు ద్రౌపది లోని ముగ్ధత్వమును, సహదేవునిలోని పసితనమును వర్ణించి, వారెట్లు విరటుని కొలువున వసింతురని విచారమును నొందగా సహదేవుడును ద్రౌపదియుగూడ వారి వారి వృత్తివిధానములను చెప్పినారు. ధర్మజుడు సహదేవుని వర్ణించుటలో మూలమునం దొక్క శ్లోకము మాత్రమే వర్ణించబడినది అంతియే. కారణము, నకులుని తోటివాడేగదా! తిక్కన గారు మాత్రము సహదేవుని చక్కగా వర్ణించినారు.

మూలము:-

శ్లో॥ సహదేవ కథం తస్య సమీపే విహరిష్యసి
కిం వా త్వం కర్మకుర్వాణః ప్రచ్ఛన్నో విహరిష్యసి.

చం॥ అకుటిలార్య సంమతు డహంకృతి దూరుడు నీతినిర్మలా
త్మకు డనవద్యశీలుడు సధర్ముడు దాంతుడు గొంతిముద్దు సే
యు కొడుకు మేను లేత దన యుల్లము మెత్తన యట్టి యాతడె
ట్లొకో యొరు నాశ్రయించు విధియోపదే యెవ్వరి నెట్లు సేయగన్.

సహదేవుడు పశువైద్యమునకు కర్త. సహదేవ పశుశాస్త్ర మీనాటికిని మన దేశమునందు ప్రచారమునం దున్నదే. సహదేవు డిట్లు చెప్పినాడు.

శ్లో॥ గోసంఖ్యాతా భవిష్యామి విరాటస్య మహీపతేః
ప్రతిషేద్ధా చ దోగ్ధా చ సంఖ్యానే కుశలో గవాం.

ధర్మనందనా ! నేను తంతిపాలు డను నామమును ధరింతును. గోసంతతిగల పరిపూర్ణలక్షణము లన్నియు నాకు తెలుసును. వాటిని వృద్ధిపరచుట, వాటి రోగముల నివృత్తి చేయుట అను వైద్యవిధానములు నే నెరుగనివి లేవు. గోవులకే కాదు. ఆబోతులును ఎద్దులునుగూడ. ఏయే లక్షణము లొప్పుచో అవి పూజ్యములగునో, ఆవులతో కలపదగు ఆబోతు లెట్లుండవలెనో, కట్టని యావుల కెదవచ్చునట్టి యాబోతు లెట్లుండునో కూడ నే నెరుగుదును ఈ కర్మచేత జీవింతునని చెప్పినాడు.

'తంతిపాల ఇతి ఖ్యాతః నామ్నాఽహం విదితస్త్వథ
లక్షణం చరితం చాపి గవాం యచ్చాపి మంగళం'
'తత్సర్వం మే సువిదితమన్యచ్చాపి మహీపతే
వృషభానపి జానామి రాజన్ పూజితలక్షణాన్'
'యేషాం మూత్రముపాఘ్రాయ అపి వంధ్యా ప్రసూయతే'

ఎట్టి ఆబోతు మూత్రమును వాసన చూచిన మాత్రమున గొడ్డుమోతు ఆవులుకూడ కట్టి యీనువిధానముల నెరుగునట. ఆంధ్రానువాద మిట్లున్నది.

సీ॥ వంజలనైనను వలనేర్పడగ నొక
భంగి జేపగజేసి పాడి గొనగ
బడుగులనైనను బాటించి పరికించి
గోమునమై గంద క్రొవ్వుదేర
దెవులు గొంటులనైన దేర్చు సంకటమున
కోపి ముందటి యట్లరూపు పేయ
నట్టులనైనను నలువైన వెరవున
ముద్దె యంటగ బట్టికట్టి విడువ

ఆ॥ బిదుక గదుపుపేర్పు బెదరు వాపగ
వీరు మేపుగలుగు నెడకు మెలగవెలవ
మృగము నరయుఁ ముచ్చు రేవగలను
గొట్ట నేర్తు పసికి జాలగూర్తు నేను.

ఇక తంతిపాలు డనుపేరు సార్థక మెట్లయ్యెనో చూతము. తంతి యన వాక్కునకు వేదమునందు ప్రయోగమున్నది. వాక్కును పాలించువాడు తంతిపాలుడు. ధర్మజుని వాక్కును పాలించువాడనను గూఢభావమున వాడబడినది. సామాన్యార్థమున పశులకాపరి.

తరువాతి నిర్ణయము ద్రౌపదినిగూర్చి. ఈమెను గురించి ధర్మజుడు మాట్లాడుటయందు మూలమునందొక చిత్రమున్నది. ధర్మజుడు ద్రౌపదిని గురించి వాడిన పదజాలము సామాన్యజనదృక్పథమున వింద్యమై కనపట్టక మానదు. ద్రౌపదినిగూర్చి వర్ణించినప్పటి మొదటి శ్లోకమిది —

శ్లో॥ ఇయం హి నః ప్రియా భార్యా ప్రాణేభ్యోపి గరీయసీ
మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా

—మన కత్యంత ప్రియురాలును, భార్యామణియునగు నీ ద్రౌపది ప్రాణములకంటె శ్రేష్ఠమై తల్లివలె పరిపాలించదగినదియు జ్యేష్ఠసోదరి వలె పూజ్యురాలునుకూడ— యట.

ఇదేమి చిత్రము ? మాతృపద సోదరీ పదముల నిక్కడ వాడుట యందు వ్యాసుని హృదయ మేమి ? నేటి పండితప్రకాండుల విమర్శలకు గురియగుచే యాతని హృదయమేమో ? కాదు కాదు. ఆ మునివర్యులు వేదవిభాగకర్త. వేదము నందలి వైదికపదజాలమును భారతమునం దనేక స్థలముల వాడినారు. అంతేకాదు. నానార్థముల నిచ్చు పదములు సంస్కృతమునం దనేకము లున్నవి. మాతృశబ్దము గోవుయందును

భూమియందునుకూడ వాడవచ్చును. కావున భూమి నెట్లు పాలించవలెనో అట్లు పరిపాలన గావింపదగినదని అట్లే 'జ్యేష్ఠస్వసా' అనుపదము వేదమున అంబికయందు (పార్వతి) వాడబడినది. పార్వతివలె పూజ్యురాలని చెప్పినాడు. పార్వతివంటిదే ద్రౌపది. అగ్ని కుండమునుండి యావిర్భవించిన దుర్గయని యాదిపర్వమున వర్ణించబడినది. కావున 'పూజ్యాజ్యేష్ఠేవ చ స్వసా' అని వాడినారు. భార్యను దేవతాస్వరూపముగ పలుకవచ్చునా? అని సందేహించవచ్చును. ఇక్కడ నీలకంఠులు చక్కగ సమన్వయించినారు. గార్హపత్యమను అగ్నిని భార్య యనియు అన్వాహార్యపచనమును పుత్రుడనియు శ్రుతిపలికినది.

'జాయా గార్హపత్యః పుత్రోऽన్వాహార్యపచనః'

తరువాతి వర్ణములు సామాన్యములే యయ్యును వాడిన పదములం దొక ప్రత్యేకత లేకపోలేదు.

'కేన స్మ ద్రౌపదీ కృష్ణా కర్మణా విచరిష్యతి
న హి కించిద్విజానాతి కర్మ కర్తుం యథాస్త్రియః
సుకుమారీ చ బాలా చ రాజపుత్రీ యశస్వినీ
పతివ్రతా మహాభాగా కథం ను విచరిష్యతి
మాల్యగంధానలంకారాన్ వస్త్రాణి వివిధానిచ
ఏతాన్యేవాభిజానాతి యతో జాతా హి భామినీ

పై శ్లోకములందు 'కృష్ణా' అనుపదము ఆమె యౌన్నత్యమును బోధించుటకే వాడబడినది. అట్లే 'బాలా' అనుపదము ఆమె నిత్య యౌవనవతి యని చెప్పుటకు వాడబడినది. ఆపదము లన్నియు సార్థకములే. నిజమున కామె పంచపాండవులకు పత్ని. రాజకొమరిత. సుకుమారగాత్రి. పతివ్రతాశిరోమణి. పుట్టిననాటినుండియు గంధ మాల్యాద్యలంకారముల నలంకరించుకొను టొక్కటే ఆమె కెరుకగాని

శరీరకష్టమున జీవయాత్రను గడపుట ఆమె ఎరుగదు. ఆ బాధనంతను హృదయమున దాచుకొనలేక ధర్మజు డామె కర్తవ్యమును, ఆమె రక్షణను గూడ నలువురు తమ్ములముం దుంచినాడు. తిక్కనామాత్యులును ఆమె సుకుమారతకు తగుపదములనే వాడుచు పైశ్లోకములలోవి సుకుమారీ, రాజపుత్రీ అను కొన్ని భావములను మృదుమధురఫణితివి వ్రాకుచ్చినారు.

చం॥ ఇది కడుముద్దురాలు పనులేమియు చేయగనేర దెంతయున్
మృదువొక కీడుపాటునకు మేకొనజాల దుదాత్తచిత్త యొం
టి తిరుగుదాని కోర్వదొకటిం దను దా సవరించు చొప్పెం
గదు తగనొండులం గొలువగా వెర పెమ్మెయి గల్గనక్కటా.

మూలములో 'రాజపుత్రీ' అను పదమునకే 'ఒకటింతను దాసవరించు చొప్పెరుంగదు' అని వాడినారు.

ఈ సమయమున ద్రౌపది యిట్లు సమాధాన మిచ్చినది. సంస్కృత భాషయందు 'సైరంధ్రి' అను పదమొకటి యున్నది. ఆ పదమునకు పట్టమహిషి యనియు, రాజదారలకు పరిచారిక యనియుకూడ అర్థము. అంతేకాక పరగృహముల వసించి ఇతరుల రక్షణలేక స్వీయముగ జీవించు స్త్రీలకును, గంధమాల్యాదుల తయారుచేయుచు, నానావిధ చిత్రణములతో జడలనువేయు స్త్రీలకునుకూడ సైరంధ్రి యనియే పేరు. అది యొకవృత్తి. ఆ వృత్తి నవలంబించి, సుదేష్ణకు పరిచారికనై అంతఃపురమున చరించుచు పరులకు తెలియరాకుండ యుందునని చెప్పినది.

శ్లో॥ సైరంధ్ర్యో రక్షితా లోకే భుజిష్యా స్సంతి భారత
నైవమన్యాః స్త్రియో యాంతి ఇతి లోకస్య నిశ్చయః

సాహం బృహణౌ సైరంధ్రీ కుశలా కేశకర్మణి
యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యా పరిచారికా.

కావున నన్ను గురించి మీరు బాధపడవద్దని నివారించినది. ఎన్ని విధములుగ స్త్రీలు కేశపాశముల ముడిచి ముడి కొక్కు విధముగ పూల మాల లలంకరింతురో ఆ కళావైశిష్ట్యమంతయు ద్రౌపదికి తెలియును. 'కుశలా కేశకర్మణి' ఏ కళలనుగూడ క్రొత్తగా నేర్చుట యను నేటి వాదమునకంటె మూర్ఖవాదము వేరొకటిలేదు. నేడు స్త్రీలు చేసికొను కేశాలంకరణములు క్రొత్తవి కావు.

ఇప్పుడు ద్రౌపది చెప్పిన మాలికాగ్రథనము అరువదినాలుగు కళలలో చేరినదే. కావుననే తిక్కనగారు 'పువ్వులు బహువిధంబులగట్టి, ముడి కొక్కు భంగిగా నెత్తులు వట్టి యిత్తు'నని ద్రౌపది చెప్పుటలో వర్ణించినారు. గంధమాల్యాదుల తయారుచేయుట ఈనాటిది కాదు. వాత్స్యాయనుడు చెప్పిన కామశాస్త్రమునందు స్త్రీల విద్యనుగూర్చి చెప్పుచు, కామశాస్త్రాధ్యయనమునుగూడ స్త్రీల కున్నదని వాడినారు.

'ప్రాగ్యౌవనాత్ స్త్రీ' ౧.౩.౨. యౌవనము రాకపూర్వము వారికి శాస్త్రమును అధ్యయనము చేయించదగునని చెప్పినారు. స్త్రీలకు విద్యాభ్యాసము భారతదేశమున లేదనుట అజ్ఞానము. నాటి విద్యలను నేటి స్త్రీ లెరుగరు.

ఈనాటి కీ యుపన్యాసము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# క్రమ శిక్షణము

మహాశయులారా !

నిన్నటివరకును జరిగిన కథాంశము. — పాండవులు అజ్ఞాతవాస వత్సరమును విరాటనగరమున గడుపుటకు నిర్ణయించుకొని, ఒక్కొక్క రొక్కొక్క వృత్తి నవలంబించి జీవింప నిశ్చయించుకొనినారు.

నేడు వారు విరాటనగరమున ప్రవేశించవలెను. కాని పాండవు లిప్పుడు ప్రభువులుకాదు. సేవకులు. యథార్థమునకు వారు ప్రభు ధర్మముల వర్తిల్లిరేగాని సేవకుల బాధలను వా రెప్పు డనుభవించిరి ?

'సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యం.'

భారతీయ విజ్ఞానమున మానవునకు తన జీవితమునవచ్చు ప్రతి పాత్రధారణమును ఎట్లు నిర్వర్తించిన అది పూర్ణ ఫలము నొందగలదో సిద్ధాంతీకరింపబడినది.

ఆ సిద్ధాంతములనే ధౌమ్యులు పాండవుల కుపదేశించినారు. ధౌమ్యులు పాండవులకు పురోహితులు. అత డిప్పుడు వీరికి సదుపదేశములను చేయవలెను. అంతమాత్రమున పాండవులకీధర్మములు తెలియవని అర్థము కాదు. ధౌమ్యు లా గౌరవమును పాండవులకిచ్చియే ఉపదేశించినారు. ఆ ఋషిపుంగవుని మొదటి యుపదేశ మిది.

'త్వయా రక్షా విధాతవ్యా కృష్ణాయాః ఫాల్గునేన చ
విదితం వో యథా సర్వం లోకవృత్తమిదం తవ
విదితే చాపి వక్తవ్యం సుహృద్భిరనురాగతః'

ధర్మజా ! ప్రథమమున మీకర్తవ్యము పాంచాలి రక్షణము. నీవును, అర్జునుడుకూడ ద్రౌపదీ సంరక్షణము నేమరకుండుడని బోధించినాడు. చరిత్రంతయు ద్రౌపదిపైననే యాధారపడినది. ఇచ్చటనే కాదు భారతీయుల లక్ష్యమంతయు స్త్రీ రక్షణయేనని భారతీయశాస్త్రములు చెప్పును. తరువాత మీ రెఱుగని నీతివిశేషములు లేకున్నను మిత్రులగువా రుపదేశించుట సహజము గనుక మీరుండదగు సేవావిధానమును చెప్పుచుంటినని ప్రారంభించినారు.

నేను రాజునకు చాల విశ్వాసపాత్రుడనై యుంటినని సమ్మి నాకేమని చరించకూడదు. రాజు లెన్నడును ఎవ్వరిని నమ్మియుండరనియే సేవకుడు నిర్ణయించుకొనవలెను. వారు పుత్రులనైనను విశ్వసింప రనునది సిద్ధాంతమని చెప్పినారు. 'రాజస్వేమ నవిశ్వసేత్' ప్రతీహారులను (ద్వారపాలకులను) అడుగకుండ లోనికి వెళ్ళరాదు. రాజు చరించు ప్రదేశముల చరించుటగాని, అత డధిరోహించు వాహనముల ఆసనముల నధిరోహించుటగానికూడదు. రాజు తన కెంత విశ్వాసపాత్రుడైనను అట్లు చేయరాదు.

'ఆరోహేత్ సమ్మతోఽస్మీతి సరాజవసతిం వసేత్'

అంతేకాదు. రాజభవనముకంటె సేవకుని భవనము లత్యంత రమణీయములైకూడ యుండకూడదు.

'రాజగృహంబుకంటె నభిరామముగా నిలుగట్టగూడదు.'

మరొక్కవిశేష మేమన ? యజమాని కెప్పుడును ఎదురైనిలువకూడదట. అందుకని వెనుకకు మళ్ళియు ఉండరాదట. మరి ఎట్లుండవలెను ? రాజుపైననే దృష్టిని నిలిపి అత డేసమయమునం దెవ్వరిపై యనుగ్రహ కటాక్షముల బరపునో, క్రోధదృష్టుల ప్రసరించునో యని చూచుచు

తా నొక ప్రక్కభాగమున నుంచొనవలెను. అనగా చూపును మాత్ర మాతవి ముఖమునం దుంచి తాను ఒదిగియుండుట చాల ముఖ్యమగు ధర్మము.

ఇట్లే మరొక్క ముఖ్యధర్మమునుగూడ చెప్పినారు. ఆంధ్రానువాదములోని రెండు పద్యములను వినిపించి ముందుకథకు పోదును.

కం॥ అంతిపురము చుట్టరికం
బెంతయు గీ డంతకంటె నెగ్గుతదీయో
పాంత కుబ్జవర వామన
కాంతాదులతోడి పొందు కలిమి భటులకున్.

కం॥ మన్నన కుచ్చిక యవమతి
దనొ్ప్పందిన స్రుక్కబడక ధరణీశు కడన్
మున్నున్న యట్లు మెలగిన
యన్నరునకు శుభము లొదవు నాపద లడగున్.

కం॥ ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ
నంబు గుప్తవర్తనములు గాగ
జలుపవలయు నృపతి గొలువున్నయెడల బా
హిరములైన నెలని కెగ్గులగుట.

ఇట్లనేకవిధముల సేవాధర్మముల చెప్పినారు ధౌమ్యులు. ఇందొక ముఖ్యవిషయమును గమనింపుడు. సభయం దెప్పుడును, ఆవులించుట, తుమ్ముట, నవ్వుట, నిష్ఠీవనము (ఉమ్మివేయుట) – ఇవి చేయక అపరాదు. కాని గుప్తముగా చేయవలెనట. అనగా శబ్దము పెద్దగా వినబడకుండు నట్లుండవలెనని భావము. అపానవాయువుకూడ ఇట్టిదే. నేటి ప్రభుత్వము క్రమశిక్షణ కావలెనని చెప్పును. భారతాది గ్రంథము లందలి విషయము

లను విద్యార్థులకుగాని, ప్రభుత్వోద్యోగులకుగాని అందించదు. అవి బూజుపట్టిన సిద్ధాంతములని మన మంత్రులు కొందరు చెప్పుచుందురు. ప్రజలైనను గ్రహించుట అవసరము.

ధౌమ్యులు తన ఉపదేశములను ముగించి అజ్ఞాతసంవత్సరము గడవగా మీరు మీ పట్టణమున కేతెంచి, శుభమును పొందగలరని ఆశీర్వదించెను.

ధర్మజు డా యనుశాసనముల శిరసావహించి, మాతృమూర్తియగు కుంతియు, విదురుడును, తాము తప్ప మా జీవితాభ్యుదయమును గురించి శాసించువా రెవ్వరు? అని ప్రశంసాగౌరవము నందించుచు, హే మహర్షే! మా ప్రయాణము దిగ్విజయమగునట్లు శత్రుజయము నొందునట్లును చేయదగు శాంతిపౌష్టికక్రియల గావించి మా పయనమున కనుజ్ఞ యిమ్మని కోరినాడు. రాజులకు పురోహితు లిందుకొరకే.

ధౌమ్యులు అగ్నిని రగిల్చి, వైదికములగు మంత్రములతో ఆజ్యాహుతుల గావించినారు.

వేదము అభ్యుదయము, నిశ్శ్రేయసము నను రెండు విషయములను మానవ సమాజమున కందించినది. మానవాతీతమగు పరోక్షశక్తిని మానవునకు ముందుంచి, ఆశక్తి మానవు డందుకొనబోవు అభ్యుదయ ప్రతిబంధకములను తొలగించుచుండగా మానవుడు ముందంజ వేయగలడని భారతీయ విజ్ఞానము పలుకుచున్నది. ఆ కార్యక్రమమునే ధౌమ్యులు నెరవేర్చి, అగ్నికిని, బ్రాహ్మణులకును ప్రదక్షిణ నమస్కారములను చేయించి, పాండవుల పయనమున కనుజ్ఞ ఇచ్చినారు. భారతీయుల కిట్టి హోమాదులుకూడ ఆయుధములే. సుందరకాండమున హనుమంతుడు సీతను వెదకునప్పుడు అగ్నికుండములనే ఆయుధములుగా ధరించి కొందరుండిరని వర్ణించబడినది. (అగ్నికుండాయుధాంస్తథా)

# ప్రయాణము

పాండవులు ప్రయాణించినారు. ధౌమ్యులును వారి అగ్నిహోత్రము లను చేతనిడుకొని, పాంచాలమున కేగగా ఉపపాండవులును ధౌమ్యు ననుసరించినారు.

అవి, దశార్ణ పాంచాల శూరసేన దేశములు. ఆ దేశములదాటియే వారు వెళ్ళదగిన మత్స్యదేశము. కాని దేశమధ్యమునుండి కాదు వారి ప్రయాణము. ఆదేశములకు సంబంధించియున్న అటవీ మధ్యభాగముల నుండియే గూఢచారులై వా రాదేశముల గడచినారు.

మత్స్యదేశమునం దనేక జనపదము లున్నవి. జనపదములన గ్రామములకంటె పెద్దవి. వారు ఆ మాత్స్యారణ్యములను దాటి జనపదమున కేతెంచినారు. అరణ్యమధ్యములనుండి వచ్చు వీరిని మీ రెవ్వరని జానపదు లెవ్వరైన యడుగుచో వెలవెలబోవు ముఖమండలములతో మేము విరాటుని వేటుకాండ్రమని సమాధానముల నిచ్చుచు, వారు ప్రయాణమును సాగించుచుండిరి. అయ్యును బాటసారు లెవ్వరును వీరి ననుమానించుటలేదు. యథార్థమునకు వీరి ప్రయాణములుకూడ రాచబాటల నుండి కాక నిమ్నదేశములనుండియే సాగుచున్నవి. కావుననే కొంత దూరము ప్రయాణించిన ద్రౌపది యలసటనొంది కాలు కదల్పలేనని ధర్మజునకు చెప్పి, ఆనాటికి విశ్రాంతిని కోరినది. విరాటుని రాజధాని ఆమె కంటికి బరువుకాగా నిలబడిపోయినది. యథార్థమునకు రాజధానిని సమీపించినను అలసటచే ఆమెకు రాజధాని దూరమైనది. అదుగో, రాజధాని, ఇదిగో రాజధాని అన్న అడియాసలతో నడకను సాగించినది గాని ఆమె సహాస మక్కరకు రాలేదు.

నడక కుంటుబడినది. ఆమె యడుగుదమ్ముల యడుగుభాగము పొక్కెక్కినది. వ్రేళ్ళపై గోటికొనలు నెత్తురు చిమ్మగా గొంతుక పొడియారుచున్నది. ధర్మజునివైపు చూచి, 'ఇప్పటి భంగి నొక్కడుగు నేగెడుదానికి నోర్వనెమ్మెయిన్' అన్నది.

అప్పుడు వారి ప్రయాణ మెట్లు సాగవలెను ? ధర్మజు డర్జునుని వంక తిరిగి ద్రౌపదిని భుజస్కంధముల నిడుకొనమని చెప్పినాడు. పిలుకలిగిన ప్రదేశములందు తిక్కనామాత్యులు సంభాషణల పెంచినారు. ముందు నకులునితో ద్రౌపదిని మోయమని చెప్పి. తరువాత సహదేవునకు చెప్పి, వారును దన్నినట్లు గ్రహించి, అర్జునునకు చెప్పినట్లు ఆంధ్ర భారతము. ఆ ఘట్టమునం దొక పద్యమును వ్రాసినారు. అర్జును డట్లే చేసినాడు. కొలదిదూర మాతడు మోయగా రాజధాని చూపుమేర నుంటనది. అచ్చట ద్రౌపది నొకచో దించినాడు.

శ్లో॥ సంప్రాప్య నగరాభ్యాశమవతారయదర్జునః

తరువాత కర్తవ్యమేమి ? విరాటుని కొలువుకూటమున ప్రవేశించుట. ఆయుధములు చేతియందుండ గూఢచారులై యుండు టెట్లు ? కావుననే ధర్మజుడు 'అర్జునా ! మన ఆయుధముల నొకచోనుంచి మనము విరాటుని కొలువుకూటమున కేగవలయు'నని నిర్ణయించినాడు. ధర్మజాదుల ఆయుధముల నెవ్వరును గుర్తుపట్టకున్నను అర్జునుని గాండీవము నెఱుగని వా రెవ్వరు ? ఈ విషయమునుగూడ అర్జునునకు చెప్పి, ఆయుధముల నొకచో నిక్షిప్తము చేయుటయే నిర్ణయించినాడు ధర్మజుఁడు.

కాని వారి అయుధముల నెవ్వరి గృహమునందు దాచెదరు ? అందుకై అర్జును డొకవిధముగ యాలోచించసాగినాడు. అంతలో ఆ నగరమునకు బాహ్యప్రదేశమునం దొక స్మశానవాటికయు, ఆ స్మశా

నమునం దొక ఎత్తైన ప్రదేశమును, ఆ ప్రదేశమునం దొక పురాతనమగు శమీవృక్షమును (జమ్మిచెట్టు) అర్జునుని కంటబడినది. ఆ ప్రదేశమున కెవ్వరును మనుజులు వెళ్ళరు. ఆ వృక్షమా ? బహువ్యాప్తమై చీకటుల క్రమ్మియున్నది. ఇదియే మన ఆయుధముల నుంచదగు ప్రదేశమని అర్జునుడు నిర్ణయించినాడు.

శ్లో॥ సమాధాయాయుధం శమ్యాం గచ్ఛామో నగరం ప్రతి
ఏపమత్ర యథాయోగం విహరిష్యామ భారత'

ధర్మజునకు నచ్చినది. అందరును ఆ జమ్మిచెట్టువద్ద కేగినారు. వైశంపాయనుని ముఖముననే అర్జునుని గాండీవమును, ధర్మనందనుని ధనుస్సును, భీముని గదయు, నకులసహదేవుల ఆయుధములును వర్ణింపబడినవి. అట్లు వర్ణింపబడిన ఆయుధములయొక్క నారులను ఎవరికి వారు సడలించగా ధర్మజు డా ధనుర్బాణముల నన్నిటిని శమీవృక్షముపై బంధింపుమని నకులుని ఆజ్ఞాపించినాడు. నకులుడే వారి ధనుర్బాణములను జమ్మిచెట్టుపై కట్టినట్లున్నది.

'అథాన్వశాసన్నకులం కుంతీపుత్రో యుధిష్ఠిరః
ఆరుహ్యేమాం శమీం వీర ధనూంష్యేతాని నిక్షిప'
'తాముపారుహ్య నకులో ధనూంషి నిదధే స్వయం'

ఆంధ్రమున ధర్మజుడు బాణములనుకట్టి ఈ బాణములు నాకును, పార్థునకును దప్ప ఎవ్వరికిని కనబడకూడదని శాసించినట్లును భీము డెప్పుడైన వచ్చుచో సర్పములవలె కనబడమని ఆంక్ష విధించినట్లు వున్నది. మూలమున లేదు.

ఆంధ్రభారతమున కథ కొంచెము మారినది. అర్జునుడు తన గాండీవమును చెట్టుపై నుంచవలసివచ్చుట కొతడు విషాదమును

ప్రకటించగా భీముని గదాదండమును, నకులసహదేవుల యాయుధములను గురించికూడ ధర్మజుడు బాధనొంది, తానే ఆయుధములను చెట్టుకు కట్టినట్లు వర్ణింపబడినది.

మూలమున వైశంపాయనుని ముఖమున వర్ణింపబడిన శ్లోకభావములే గాండీవమును గురించియు, మిగిలినవారి ఆయుధముల గురించియు వర్ణింపబడినవి.

ఆంధ్రభారతములోని కథ కొంత నాటకీయతను ప్రవర్శించినది. అర్జునుడు గాండీవము నక్కడునిచి, దానిపై తన దృష్టిని మరల్చి, ఆ గాండీవ వియోగమును భరింపలేకపోవుటను తిక్కనామాత్యులీ క్రింది పద్యమున ప్రదర్శించినారు.

చ. 'అనిమిషదానవాంబరచరాదిక జాతుల నెల్ల బోర నీ
ధనువునగాదె గెల్తు సముదగ్ర విరోధిభయావహంబు దీ,
నిని నొక మ్రానగట్టి చనునిశ్చయముం దగ జేసె దైవమే
మన గల దట్లు కాక యని యాత్మ నలందురి మందచేష్టుడై.

ఎట్టకేలకు గాండీవముయొక్క నారిని సడలించినాడు. తనకు సంభవించిన దుర్విదగ్ధతను తానెట్టైన అనుభవింపవలసినదే నను నిశ్చయమును గావించుకొన్న అర్జునుని చేష్టలు మందగించుట నిందు తిక్కన ప్రదర్శించినారు.

మూలమున వైశంపాయనుని ముఖముగ వర్ణితమగుటకును, ఇచ్చట అర్జునుని ముఖముగ గాండీవముయొక్క ప్రత్యేకత వర్ణింపబడుటకునుగల తారతమ్యమేమి?

ఆంధ్రసాహిత్యకోవిదులీ ఘట్టమున, తిక్కనామాత్యులు వ్యాసుని కంటె మిన్నయై కథా ఘట్టమున నొక రమణీయతను కూర్చెనందురు. నేను వ్యాసమునీంద్రులకు కథాఘట్టమును ప్రదర్శించు నేర్పరితనము

లేదనుటకు సాహసింపను. యథార్థమునకు రామాయణ మహాభారత కథాఘట్టములు కివి కల్పితములు గావనియు, జరిగినదానిని జరిగినట్లే మహర్షులు తమ తపః ప్రభావమున దర్శించి వ్రాసితిమనియు, వారు తమ గ్రంథములయం దుద్ఘాటించి పలుకుచుండగా పాత్రల చిత్రీకరణమును గురించిన విమర్శనమున కెక్కడ తావు ? అది యట్లుండ కథాకథనము యొక్క శిల్పనైపుణ్యము వ్యాసవాల్మీకులకంటె నేటి కవితావైభవమే ముందంజ వేసినదనుట పాశ్చాత్యసాహితీ వైదుష్యములోని ప్రభావ మనక దప్పదు. నేనుగాదు తిక్కనయే నేను వ్యాసునకు వన్నె దిద్దుదునని చెప్పలేదు. మరియొకవిధముగ ఆ వాదము నొప్పినను అర్జునునకు కలిగిన గాండీవ వియోగమను నాపదకు మహర్షి హృదయమే బద్దలైనదనుటలోని స్వారస్యము గాండీవముతోటి తనకుగల సంబంధము ననుసరించి, అర్జునున కట్టి దుఃఖము వచ్చుటయం దెక్కడున్నది ? ఆ ఘట్టమున వైశంపాయమనకే హృదయము ద్రవించుట విశేషము. ఆంధ్రకవిత కవితాశిల్పమును దిద్దుచు, కథను సంగ్రహించి, మూలములోని భావమును బ్రింగక, సంఘసంస్కరణకై తా నీ గ్రంథమును రచించుచుంటినను భావముచే స్వీయభావములను ఆ గ్రంథమునందు జొనపక, భారతీయతను ఆంధ్రులకు చాటిచెప్పిన దనుట యుక్తము. కావుననే అమాత్యశేఖరుల సారస్వతసేవ ఆచంద్రతారకమై ఆంధ్రుల హృదయాకాశమున నేటికిని పతాకమై నిలిచినది. సందేహములేదు. కాక తిక్కనకు దొరికిన తాళపత్రగ్రంథము లందుకూడ కథ యట్లుండి యుండవచ్చును. మూలమునకు మెరుగుల దిద్దితిమను అహంకారము నన్నయ, తిక్కనలకు లేదు.

కథకు బోదము.

నకులుడు పాండవు లందఱి ధనుస్సులను, ఖడ్గములనుగూడ గట్టి పాశములతో బంధించి, చెట్టుపై కట్టినాడు. అట్లు కట్టిన ధనస్సులపైన ఒక శవముయొక్క చర్మమును కప్పినారు. దాని దుర్వాసన కెవ్వరును ఆప్రక్కకు రాకుంటుటకై ఆపనిని చేసినారు. అంతేకాక అట్లా శవమును గురించి ఈమె మా శతవృద్ధయగు మాతయనియు, మా కిది వంశ మర్యాద యనియు అచ్చటివారలకు చెప్పి విరాటనగరమున కత్యంత సమీపమున విడిసినారు. వా రా శవమును మా తల్లియని సెప్పుట ఆయుధ రక్షణమును గావించు శమీవృక్షమును గురించిగాని, ఆ శవము నుద్దేశించిగాదు.

తరువాత వా రైదుగురకును ఎప్పుడైన పిలుచుకొనవలసివచ్చుచో పిలుచుకొనుటకు కొన్ని పేర్లను నిర్ణయించినాడు ధర్మజుడు. జయుడు, జయంతుడు, విజయుడు, జయసేనుడు, జయద్బలుడు — అనునవి ధర్మజాదులకు రహస్య నామములు.

## దేవీ అనుగ్రహము

ఇంతవర కొక కార్యక్రమము నడచినది. తరువాత వీరి కార్యక్రమమేమి ? ఇక నగరమున ప్రవేశించవలెను. కాదుకాదు. ధర్మజుడీ ఘట్టమున దుర్గాస్తోత్రమునుచేసి, ఆ పరమేశ్వరియొక్క అనుగ్రహమును సంపాదించినాడు. ఇప్పుడు పాండవులు స్తుతించిన పరాశక్తి దుర్గాదేవి. ఈమె శ్రీకృష్ణుని యవతారముతోకూడ యశోదకు బిడ్డయై భూమిపై యవతరించినది. దేవకీదేవి గర్భమునుండి, ప్రేపల్లె యందు నిగూఢముగానున్న రోహిణి కడుపున బలరాముని ప్రవేశపెట్టిన దీమెయే. ఎనిమిదిచేతులతో దివ్యమాల్యభూషాంబరంబుల ధరించి, కంసునకు 'నీకు మృత్యువొకచో అవతరించియే యున్న'దని వినిపించిన

దీమెయే. కావుననే దుష్టరాక్షస సంహారముగావింపవచ్చిన ఆ యాదిశక్తినే పాండవజ్యేష్ఠుడు మనసా ధ్యానించినాడని వ్యాసులు వర్ణించినారు.

'యశోదాగర్భసంభూతాం నారాయణవరప్రియాం
నందగోపకులే జాతాం మంగళ్యాం కులవర్ధినీం
కంసవిద్రావణకరీం అసురాణాం క్షయంకరీం
శిలాతటవినిక్షిప్తాం ఆకాశం ప్రతి గామినీం
వాసుదేవస్య భగినీం దివ్యమాల్యవిభూషితాం
దివ్యాంబరధరాం దేవీం ఖడ్గఖేటకదారిణీం
భారావతరణే పుణ్యే యే స్మరంతి సదాశివాం.'

ఆమెను స్తుతించి దర్శనమిచ్చుటకై అర్థించినారు ధర్మజులు. ఆమెకు దుర్గయని ఎందుకు పేరు వచ్చెనో తెలియునా?

'దుర్గాత్తారయసే దుర్గే తత్త్వం దుర్గాస్మృతాజనైః'

కష్టములనుండి తరింపజేయునది గావున ఆమెకు దుర్గయని పేరు. ఏకైకమగు అఖండచైతన్యమునకే అనేకములగు నామములు వర్ణింపబడినవి. ఈ ఘట్టమున శంకరుల వాణిని వినిపింతును.

శ్లో॥ గిరామాహుర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదః
హరేః పత్నీం పద్మాం హరసహచరీమద్రితనయాం
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి.

ఆగమశాస్త్రజ్ఞులు నిన్ను వాగ్దేవతవని స్తుతింతురు. సరస్వతి యను పేర బ్రహ్మకు భార్యవైతివి. నీవే విష్ణుపత్నివై లక్ష్మి యను పేరు నొందితివి. హరుడని పేరువడసినవానికి భార్యవైనదియు, హిమవంతునకు పుత్రికవైనదియు నీవే. నీ మహిమను వర్ణించుటకు పరిధి యెక్కడ? కాని నీవు పరబ్రహ్మకు పట్టమహిషివి. నీ మాయా

ప్రభావమే యీ విశ్వమనియు వర్ణించినారు. ఆ యఖండచైతన్యమునే ధర్మనందునుడు సగుణ స్వరూపిణి ధ్యానించినాడు.

శ్లో॥ ప్రణతశ్చ యథా మూర్ధ్నా తవ దేవి సురేశ్వరి
త్రాహి మాం పద్మపత్రాక్షి సత్యే సత్యా భవస్వ నః
శరణం భవ మే దుర్గే శరణ్యే భక్తవత్సలే.

అంతలో దుర్గ సాక్షాత్కరించినది. రాబోవు రణరంగమునందలి దిగ్విజయము ఆమె చేతిలోనిది. తన అనుగ్రహవీక్షణములచే ధర్మనందనుని కృతార్థుని గావించి, అజ్ఞాతవాస సంవత్సరము గడవగా కౌరవసామ్రాజ్యలక్ష్మి నిన్ను వరించగలదని వరమిచ్చినది. ధర్మజు డానాడు గావించిన దుర్గాస్తవమును కష్టకాలమునం దెవ్వరు స్తుతించినను వారి కష్టములు గట్టెక్కుననికూడ రాబోవువారికి సైతము ఆమె యనుగ్రహప్రసాదమును ధర్మజుని చేతికందించి అంతర్ధానమైనది. ఇక పాండవులు విరాటుని కొలువుకూటమునకు చేరవలయును. ప్రథమమున ధర్మజుడే బయలుదేఱినాడు.

# పురప్రవేశము

ఒకనాడు ధర్మజుడు సామ్రాట్. అనగా చక్రవర్తి. నానా రాజకిరీటి కాంతులాతని పాదపీఠమునకు నీరాజనము లిచ్చినవి. నాడు విరాటు డొక సామంతరాజు. ఈనాడును విరాటు డంతియే. కాని ధర్మజున కితడు ప్రస్తుతమున సమ్రాట్.

ఈనాడు ధర్మజుడు జీవనార్థియగు నొక బ్రాహ్మణవేషధారియై విరాటుని కొలువుకూటమున కేతెంచుచున్నాడు. విధిని తప్పింప నెవ్వరికి శక్యము ?

ఒక మహాకవియొక్క అమృతసూక్తి నాకు జ్ఞాపకము వచ్చినది.

శ్లో॥ 'అయమమృతనిధానం నాయకోఽప్యోషధీనాం
శతభిషగనుయాతః శంభుమూర్ధ్నోఽవతంసః
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాంకం
హత విధిపరిపాకః కేన వా లంఘనీయః'

చంద్రమండలమున కమృతమండలమని పేరు. అతనిని అమృతకరుడనే వాఙ్మయ మొప్పినది. అటిగాక నాతడు ఓషధీనాయకుడు. ఓషధులకు జీవనము నందించున దతడే. అతని నివాసస్థానము శంభుని శిరము కావచ్చును. కాని అతని క్షయవ్యాధి కీనాటికిని అంతికాలము రాలేదు ఆ క్షయవ్యాధి నట్లే అత దనుభవించుచున్నాడు. విధి నెవ్వరు తప్పింపగలరు ?

కథకు వత్తము.

అది మంత్రి, పురోహిత, సామంతరాజులతోకూడి కలకలలాడుచున్న విరాటుని యాస్థానమంటపము. అతని యాస్థాన మంటపమున కీనా డొక క్రొత్తవెలుగు రాగా ఆరాజు చూపు తన యాస్థానమున కేతెంచు యుధిష్ఠిరునిపై బడినది. ఈనా డతడు యుధిష్ఠిరుడు కాడుగదా ? అత డొక బ్రాహ్మణవేషధారి. తన సభను చూచుచు తన సభాస్థలి కేతెంచు నాత డెవ్వడో ఆ మహావీయుని నిజరూపమును గుర్తించుటకు విరాటుడు సమర్థుడు కాలేదు. నివురుగప్పిన నిప్పువలె ప్రచ్ఛన్నవేషమున వెలుగొందు నావ్యక్తి యథార్థమునకు సామాన్యమున బ్రాహ్మణవేషధారియేగాని బ్రాహ్మణుడు మాత్రము కాకపోవచ్చునని విరటుడు సంశయించినాడు. అతని రూపురేఖా విలాసముల పరికింప దేవేంద్రుడా ? అను భావ ముదయించుచున్నది.

మరి యొకవిధముగ నతడు మబ్బు చాటురాగా వెలుగు రవియను భావము తోచుచున్నది. అతని దేహకాంతి పరిపరివిధముల విరటునకు దివ్యత్వమును ప్రకటించగా నాతని వదనమండలమందలి శాంతతేజము మబ్బును మాటుగొన్న చంద్రమండలమును స్ఫురింపఁ జేయుచున్నది. ఇట్లెన్నియో విధముల నావచ్చు బ్రాహ్మణుని జూచి దివ్యభావముల నొందుచున్న విరటుడు ధర్మజుని బ్రాహ్మణమాత్రుడని మాత్రము నమ్మలేదు.

ఈత డెవ్వడో రథ గజ తురగ పదాదుల వదలి పాదచారియై వచ్చు భూపాలుడనియే భావించినాడు. మంత్రుల నాలోచించినాడు. వారి యూహకును నీత డెవ్వడో యథార్థము నిశ్చయము కాలేదు. జన్మచేత గలుగు రాజచిహ్నము లెచ్చటకు బోవును? అంతలో ప్రస్తుత కార్యమునకై వాటిని మరుగుపరచిన ధర్మజుడు పాచికలతోగూడిన ద్యూతఫలకమునకు గుడ్డకట్టి, ఆ మూటను చంకనిడుకొని విరాటునివద్దకు రానే వచ్చినాడు.

జీవనార్థియై వచ్చిన వ్యక్తి తా నెవ్వరో ముందుగ తానే చెప్పుకొన వలెను. ధర్మజు డట్లే చెప్పినాడు.

ఓ! సమ్రాట్! నేను ద్విజుడను. నా ధనమునంతనుఁ గోల్పోవుటచే జీవనార్థము నీవద్దకు వచ్చితిని నేను.

శ్లో॥ సమ్రాద్విజానాత్వహ జీవనార్థినం
వినష్టసర్వస్వముపాగతం ద్విజం.

విరాటుని హృదయ ముప్పొంగినది. ఆ బ్రాహ్మణునకు స్వాగతము నర్పించినాడు. తరువాత వా రిద్దరి క్రింది విధముగా సంభాషణ జరిగినది.

విరాటుడు:- తా మిక్కడి కెవ్వరి యాస్థానమునుండి వచ్చితిరి ?
(కస్యాసి రాజ్ఞో విషయాదహాగతః)

బ్రాహ్మ:- ధర్మజుని సఖుడ నగుటచే ఆతని యాస్థానమునుండే వచ్చితిని.

విరా:- మీ గోత్రము ?

బ్రాహ్మ:- వైయాఘ్ర గోత్రము.

విరా:- తమ కేవిద్యయందు నైపుణ్యము ?

బ్రాహ్మ:- నేనక్షవిద్యయందు నేర్పరిని.

విరా:- తమ నామధేయము ?

బ్రాహ్మ:- కంకుభట్టందురు.

విరా:- తమ కిప్పు డేమి కావలెను ?

బ్రాహ్మ:- బ్రతుకుతెరు వొక్కటే.

విరాటునకు చివరి సమాధానము నచ్చలేదు. ఇట్టి మహనీయునకు జీవన మిచ్చువాడనా ? అని ఆతని కిట్లు సమాధాన మిచ్చినాడు.

బ్రాహ్మణోత్తమా ! మీకు నేను జీవన మొసంగుటకాదు. ఇదుగో ! సింహాసనము. దీని నధిష్ఠించి యీమత్స్యరాజ్యమును తా మేలగా నేను నీవశమునందు యుందుననెను. అందుకు ధర్మజు డొప్పుకొనక జీవనార్థిగనే యుందుననెను. విరటు డందుకే ఒప్పుకొనెను. తరువాత ధర్మజుడు -

ఓరాజా ! నేను నీ రాజ్యమున ద్యూతముచేత సంపాదించుకొన్న ధనమును మాత్రము నీవు జాగ్రత్తపరచి యుంచిన చాలును. నేను కలహమన్న భయపడుదును. అట్టి సమయముల నన్నాదరించి నా ధనమును కాపాడుటకంటె నాకేమియు అక్కరలేదనెను. రాజున కది యొక పెద్దవిషయమా ? నీ కెవ్వరైన యప్రియ మాచరించుచో వారికి

మరణశిక్షయే విధింతునని అభయ మిచ్చినాడు. ఒకవేళ మరణశిక్షకు అర్హులు కానివా రగుచో వారిని నా రాజ్యమునుండి వెడలగొట్టుదునని నిర్ణయమును చెప్పినాడు. అంతతో విరాట కంకుభట్టులు మిత్రులుకాగా తన కొలువుకూటమునందు ఉన్నవారి కందరకును కంకుభట్టునకును తనకును గల మైత్రిని తెలిపి, నేను మీ కెట్లు ప్రభువునో, ఇతడును అట్లే, అని, తనకొరకై ఈ ద్విజవరు డెప్పుడు వచ్చినను నా యనుమతి అక్కరలేదని ద్వారపాలకులకు తెలిపినాడు.

నాటినుండియు కంకుభట్టునకు రాజుగారితో పాటైన ఆసనమును విహారమున కేగునప్పుడుండు వాహనములుగూడ సమానములైనవి.

ఇంతవరకును ధర్మజుని ప్రవేశమైనది.

ఇక ధర్మజుని సమాధానములను గురించిన గూఢార్థమును గ్రహింపుడు.

ధర్మజుడు నేను ద్విజుడనని చెప్పినాడు. దాని భావ మిది.—

ద్విజుడను పేరు మూడువర్ణములవారికిని కలదు. కావున తాను క్షత్రియుడనను భావముననే ఆ సమాధాన మిచ్చినాడు.

వైయాఘ్ర గోత్రమని చెప్పినాడు. వ్యాఘ్రమువలె జీవులను హింసించువాడు యముడు. అతని పుత్రుడ నను భావమున చెప్పినాడు.

యుధిష్ఠిరుని సఖుడ నని చెప్పినాడు. ఆ ఘట్టమున శ్లోక మిట్లున్నది.

'యుధిష్ఠిరస్యా సమహం పురా సఖా' దీని అన్వయ మిది.—

'యుధిష్ఠిరస్య సఖా' అనునది లోకుల పక్షముగా వచ్చినట్లు పలికినారు. గూఢమున 'యుధిష్ఠిరః అహం' నేను యుధిష్ఠిరుడను-అను అన్వయము వచ్చును. 'తవసఖాస్యాసం భూయాస మితి సంబంధః' మీకు స్నేహితుడను అని చెప్పినాడు.

కంక శబ్దమున కిదివరకే చెప్పినాను. [వ్యాఘ్రపాత్-గోత్రేభవః. వ్యాఘ్ర ఇవపతతీతి వ్యాఘ్రపాత్-యమః. తస్యకులే జాతః (సి.కం.)]

తరువాత వంటల వాడొకడు విరాటునివద్దకు వచ్చినాడు.—

నల్లని కట్టుపుట్టము, చేత నొక గరిట. వేరొకచేత కత్తియు ధరించి, మలినవస్త్రము నొకదానిని భుజముపై నుంచుకొని వచ్చినాడు. ఇతడు భీముడు. భీముని జూచి వంటలవాడనుకొను టెట్లు? విరాటుడు నమ్మలేదు. అయ్యును భీముడు ధర్మరాజునివద్ద పనిచేసితిననియు క్రొత్త క్రొత్త వంటల చేతుననియు చెప్పగా నమ్మక తప్పినదికాదు నేను మల్లయుద్ధములనుగూడ చేయిగలనననియు, అబోతులతోను, ఏనుగులతోను యుద్ధక్రీడల సలుపుదుననియు చెప్పి భీముడు విరాటుని యాస్థానముననే చేరినాడు. వంటయింటి రాజ్యము భీమునిదే.

తరువాత ద్రౌపది ప్రవేశించినది.—

ఈమె ప్రవేశమున గమనింపవలసిన విషయములు చాల యున్నవి.

అనాడు వృత్తికిని, వేషభాషలకును ఒక సంబంధ మున్నది. సైరంధ్రీవృత్తిచే జీవించు వారెట్లు చీరెను ధరింతురో, కొప్పు పెట్టుకొందురో అట్టి వేషమును ధరించియే ద్రౌపది బయలుదేరినది. మురికిబట్టి నల్లనై యున్న ఒక్కటే చీరను ధరించియున్నది. మేలిముసుగు లేదన్నమాట. మృదువులును సూక్ష్మములునై వంకరలు తిరిగిన కొనలతో నొప్పెడు ఆమె కేశపాశము సామాన్యస్త్రీ విలక్షణమగుటచే ఆ వైలక్షణ్యమును మరుగుపరుచుటకై కొనలను జడ యల్లుకొని, ఆ జడను కుడివైపునకు మరల్చినది.

'తతః కేశాన్సముత్క్షిప్య వేల్లితాగ్రానినిందితాన్
కృష్ణాన్ సమాన్మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా'

'జగృహే దక్షిణే పార్శ్వే మృదూనసితలోచనా
వాసశ్చపరిధాయైకం కృష్ణా సుమలినం మహత్.'

ఆమె రాజబాటయందు దార్తురాలై గమనమును సాగించుచున్నది. ఆమె యెవ్వతెయో ఎవ్వరెఱుగుదురు ? ఆమె ఆకృతికిని, వేషమునకును యథార్థమగు సంబంధము లేకపోవుటచే పురవాసులగు స్త్రీలును, పురుషులునుగూడ ఆమెను వెంటనంటినారు. వెంటనంటుటకాదు. ఆమె ఎవ్వతెయో తెలుసుకొనుటకు మాటలాడించుచుండ వారికామె నేను నేను సైరంధ్రిననని, నన్నెవ్వరు భరించిన వారియింట పనులగావింతునని సమాదాన మిచ్చుచున్నది. కాని ఆమె దాసీవృత్తికై వచ్చినదని ఎవ్వరును నమ్ముట లేదు.

'నశ్రద్ధధత తాం దాసీం అన్నహేతో రుపస్థితాం'

అట్లు వీధివెంట చరించు ద్రౌపదిని మేడపైనుండి సుధేష్ణ చూచినది. సుధేష్ణ విరాటుని పట్టమహిషి. ఉదారచిత్తయగు నా సుధేష్ణ అనాథయై మాసిన చీరెతో వీధివెంట నడచుచు అడిగినవారికి సమాధాన మిచ్చుచున్న స్త్రీని అంతఃపురమునకు పిలిపించినది. నీ వెవ్వరవన్న సుధేష్ణ ప్రశ్నకు తాను సైరంధ్రీవృత్తి నవలంబించి జీవించవచ్చితి నని సమాధాన మిచ్చినది. సుధేష్ణకు విశ్వాసము కలుగలేదు.

కారణ మేమి ?

దాసీవృత్తినవలంబించి జీవించదగు స్త్రీల అంగసాముద్రికము వేరు. రాణివాసమున నివసించదగు స్త్రీల అంగసాముద్రికము వేరు. మధ్యతరగతి యిల్లాండ్ర సాముద్రికము వేరుగా ఉండును. సాముద్రికము రెండు విధములు: అంగసాముద్రికము, హస్తసాముద్రికము అని. శరీరముయొక్క అవయనిర్మాణము మానవుల కందఱకును ఒక్క

విధముగా నుండకబోవుటనే పూర్వకర్మచే దేహము నిర్మింపబడునని భారతీయసిద్ధాంతము పలుకుచున్నది. అంగసాముద్రిక మంతయు సుధేష్ణకు కరతలామలకము.

నేను సైరంధ్రినని చెప్పు ద్రౌపది యెడల నొక్కమాఱు పరికించినది. నీవు దాసీస్త్రీవి కావని స్పష్టముగా చెప్పినది.

'నైవం రూపా భవంత్యేవ యథా వదసి భామినీ.'

దాసీస్త్రీలకు వారి శీలమండలు ఎత్తైయుండును. ఆ లక్షణము నీయందు లేదు. (నోచ్చగుల్ఫా), అందుచే నీయందు మానవత్వమున కంటె దైవత్వము మిన్నయై యున్నదని నిర్ణయించినది.

కంఠస్వరము గంభీరము. బొడ్డు లోతు. బుద్ధి వైశద్యముగూడ ఎదుటివారికి గోచరమగునట్లులేదు. ఇట్లు కంఠస్వరమును, నాభియు, బుద్ధివైశద్యమును ఒకదాని కొకటి తీసిపోక మూడును గంభీరములై యుండుట సామాన్య మానవస్త్రీలకు లక్షణముకాదు. నీయం దీమూడును గంభీరములై యున్నవి. (త్రిగంభీరా) సుధేష్ణయొక్క పరిశీలన మంతతో ఆగలేదు.

ముఖమండలమున కలంకారములై యున్న కనుదోయము, ముక్కుచెవులును, గోళ్ళపరుసయు, పిరుదులును, స్తనమండలము లను ఆరు స్థానములను సుధేష్ణ పరీక్షించినది. ఆ యారుస్థానములును ఉన్నతములై లక్ష్మీనివాసస్థానములుగా నిర్ణయమైనవి. తరువాత పెదవిని, అరికాళ్ళను, అరిచేతులను, కనుగొలకులను, కాలిగోళ్ళనుగూడ శాస్త్రదృష్టిచే పరికించగా అవియు రాగరంజితములై రక్తవర్ణమున శోభిల్లుచున్నవి. (రక్తాపంచసు రక్తిషు). అది యట్లుండ ఆమె పలుకు లందలి వర్ణసముదాయము హంసధ్వనివలె మధురాయమానములై

గద్గదస్వరమున వచ్చుటగూడ ఆమెకు ఆశ్చర్యమును గలిగించినవి. 'హంసగద్గదభాషిణీ'

ఆ పరీక్ష లట్లా నిర్ణయములు కాగా మరికొన్ని విశేషములను గూడ సుధేష్ణారాణి గమనించినది.

సైరంధ్రి కనుదోయిని పరికించినది. ఆమె నేత్రద్వంద్వము కలువరేకుల కెనయై స్పష్టముగ గోచరించినది. 'శారదోత్పలపత్రాక్ష్యా.' అట్లే సైరంధ్రి మందగమనమునం దొక ప్రత్యేకతగూడ సుధేష్ణ దృష్టికి వచ్చినది.

కటిభారమును, స్తనభారమును, కేశభారము నను భారములచే ఆమె గమనము కాశ్మీరతురంగమును బోలియున్నది

'సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణీ పయోధరా
తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ తురంగమా' (తేన తేన లక్షణేన)

ఇవన్నియు ఇట్లుండ పరిశీలించకయే సైరంధ్రియైయున్న ద్రౌపదిలోని దివ్యత్వ మొకటున్నది. ఏమది? ఆమె దేహమునుండి వచ్చు వాసనలు అవి - పండువెన్నెలలకు విచ్చిన కలువపూలలోని నెత్తావులు. ఆ గంధమునుగూడ సుధేష్ణ గ్రహించి, ఈమె మానవ దేహమును ధరించి వచ్చిన దేవవనిత కాకతప్పదని నిర్ణయించినది. 'శారదోత్పల గంధయా' ఇప్పు డీమెను తన యంతిపురమునందు ఉంచుకొనుటయా? పొమ్మనుటయా? శరల్లక్ష్మికి తోడై యున్న ఈ దేవతాస్త్రీని సైరంధ్రిగా భరించుటెట్లు? సుధేష్ణ చాలా దీర్ఘదర్శిని. ఆమె సందేహము అన్నవస్త్రములనిచ్చి సైరంధ్రిని భరింప జాలుదునా? యనికాదు. సుధేష్ణ యూహ చాలలోతైనది. ఇట్టి సుందరీమణుల కంతిపురమున స్థానమిచ్చుటచే వచ్చు నష్టమేమియో ఆమె యాలోచనకందినది.

సైరంధ్రిని ప్రశ్నించినది —

కళ్యాణీ ! నీవు దాసివికావు. నీ శరీరచిహ్నములట్లు లేవు. నీవు దేవతాస్త్రీలయందొక్కదానివి కావచ్చును. సందేహము లేదు. నిజము చెప్పుము. నీవు వరుణరాజునకు భార్యవు కాదగినదానవే శచీదేవివైనను కావచ్చును. లేక నాగలోకమునందలి నాగకన్యవనికూడా నా తలపునకు వచ్చుచుంటివి. యదార్థమేమి ? మొదట నీవు సామాన్యదాసివిగావని ఇప్పుడు స్పష్టముగ చెప్పినది. 'నాసి దాసీ కథంచన'

సైరంధ్రి సుధేష్ణమాటలకు లొంగలేదు. నేను సైరంధ్రినేకాని, వేఱుజాతికి చెందినదానను కాను.

అంతిపురమునందలి రాచవనితలకు జడల తీర్చిదిద్దుట నా విద్య. మాలలనిర్మించుటలోగూడ ముడికొక్కవిధమగునట్లు నిర్మించుటయందారితేరినదానను. గంధద్రవ్యముల సేకరించి, క్రొత్తక్రొత్త కలపముల సంతరించి, శరీరమున యలదుటయందుకూడ నాకు నేర్పరితనమున్నది. శ్రీకృష్ణుని యంతిపురమున సత్యభామయు, యుధిష్ఠిరుని యాస్థానమున ద్రౌపదీమహారాణియు నన్ను మెచ్చినారు. నాపేరు మల్లిక. ఈ పేరును ద్రౌపదియే స్వయమున నాకు పెట్టినది. అన్నవస్త్రములెక్కడ లభ్యమైన అక్కడక్కడ నా జీవనమును కొనసాగించుకొందునేగాని, నాకొక్క చోటనే నివాసముగాదు. కావున ప్రస్తుతమున నీ మందిరమునకేతెంచినాను.

'సైరంధ్రీతు భుజిష్యాస్మి సత్యమే తత్ బ్రవీమితే'

సుధేష్ణ సైరంధ్రియేయని నమ్మకతప్పనదికాదు. కాని యథార్థముగ సందేహము తీరలేదు. ఇక మిగిలినది నివాసమున కంగీకరించుట. అందుకు గట్టిభావము వచ్చుటలేదు. ఏమి చెప్పవలెను ? ఆలోచించి రాజానుమతిని అడ్డుపెట్టినది. రాజానుమతికాకున్న నీవు వెళ్ళవలెనన్నది.

సైరంధ్రి సౌందర్యము మానవాతీతము. అంతఃపురమున చరించు స్త్రీలుగూడ మోహింతురనుటలో సందేహములేదు. స్త్రీలుకాదు. పురుష ధర్మముగల చెట్లుగూడ సైరంధ్రి లోకోత్తరసౌందర్యము ననుభవింప కోరునని సుధేష్ణ భావించినది.

ఇక పురుషుల సంగతి చెప్పనదేమున్నది ? పురుషులెవ్వరో యటుండ విరాటుడే ఈమెను మోహించుచో తన కాపురమునకు తానే నిప్పు బోసుకొన్నట్లు కాగలదు. ఏదియేమైనను సైరంధ్రి యథార్థచరితము తెలియవలెను. ఈమెకు భర్తలుగలరా ? ఉండెనేని వారెవ్వరై యుందురు? అనునది తేల్చుకొనిగాని స్థానమివ్వరాదనుకొన్నది. సైరంధ్రికి తన సందేహమును యథాతథముగ చెప్పినది. ఈ క్రిందిశ్లోకములను గమనింపుము.

శ్లో॥ స్త్రియో రాజకులేయాశ్చయా శ్చేమా మమ వేశ్మని,
తేపిత్వాం సన్నమంతీవ పుమాంసకం నమోహయేః.

శ్లో॥ రాజావిరాటస్సుశ్రోణి దృష్ట్వావపు రమానుషం
విహాయ మాం వరారోహీ గచ్ఛేత్ సర్వేణచేతసాం'

పై తాత్పర్యమును వివరించు నీ శ్లోకములు మీకు ప్రమాణమును చూపుటకై చదువబడినవి.

ఈనాటి విజ్ఞులు నీ మాటలను నమ్మలేరు. విజ్ఞాన దౌర్బల్యము దానికి కారణము. వృక్షరూపము నొందిన జీవులను, ఆ జీవసంస్కారములను గుర్తెఱుగు విజ్ఞానము భారతేతరజాతికి లేదు. సనాతన భారతీయ సంస్కృతి నెఱుగని పండితమ్మన్యులే నేడు పండితప్రకాండులగుటచే వ్యాససూక్తిని వారు నమ్మలేరు. స్థావరములు జంగమములును మోహించు టేమిటి ? ద్రౌపది సౌందర్య మిట్టిదని చెప్పు అర్థవాదముకావచ్చు నను

వారును కలరు. కొన్ని చెట్లు బాటసారులను సమీపించుటకు తీగవలె పాకివచ్చి మనిషిని చుట్టి ప్రాణము తీయునవి అడవులయందున్నవట. చూచినవారు చెప్పిన యీ మాటలను మేము చూచువరకు నమ్మ మనువారి కొక నమస్కారము. కథకు పోదము.

సుధేష్ణకు సైరంధ్రి ఇట్లు జవాబిచ్చినది.—

'నాస్మిలభ్యా విరాటేన నచాన్యేన కదాచన
గంధర్వాః పతయోమహ్యం యువానం పంచభామినీ
యోమే నదద్యా దుచ్ఛిష్టం నచ పాదౌ ప్రధావయేత్
ప్రేణేరం స్తైనవాసేన గంధర్వాః పతయోమమ'

రాజ్ఞీ! నేను విరాటునకుగాని, వేతొక పురుషులకుగాని లభించు దానను కాను. అయిదుగురు గంధర్వులు నాకు భర్తలు. నేను భర్తృహీననుగాను. ఎంగిలిపదార్థములు బెట్టక, పాదసంవాహనముల నాచే చేయించుకొనక నన్నెవ్వరు పోషింతురో, వారిని గురించి నాభర్తలు సంతోషింతురు. అంతియేగాదు.

'యోపి మాం పురుషో గృధ్యేద్యథాన్యాః ప్రాకృతాస్త్రియః
తామేవ నివసేద్రాత్రిం ప్రవిశ్య చ పరాంతనుం'

ఒక ఘాటైన పలుకు పలికినది. నన్నేపురుషుడైన ప్రాకృత స్త్రీనివలె బలాత్కరించుచో ఆ రాత్రియే వానికి పరలోకయాత్ర కాగలదని కూడ నొక్కి చెప్పినది.

సుధేష్ణకు అనుమానము తీరినది. ఉండుట కనుజ్ఞ యిచ్చినది. ఈ ఘట్టమున మీకేమి తేలినది? సుధేష్ణగాని, ద్రౌపదిగాని నేటి విద్యా విధానము నెరుగని అనాగరిక స్త్రీలని తేలినదా!

భారతనారీమణులు మూఢవనితలు గారు. బట్టకట్టు తెలియని తెల్లవారిమాటలకు కట్టుబడి మాట్లాడు నేటివారు భారతాదిగ్రంథముల నొక్కమారు పరిశీలింపుడు.

సైరంధ్రి యను పదము పట్టమహిషికి వర్తించునని ఇదివరకు చెప్పినాను.

ద్రౌపది తరువాత ప్రవేశించినది సహదేవుడు. అతడు విరాటునకు చెప్పిన మాట యిది.

'వైశ్యోస్మి నామ్నాహ మరిష్టనేమిః
గోసంఖ్య ఆసం కురు పుంగవానాం
వస్తుం త్వయీచ్ఛామి విశాంవరిష్ఠ
తాన్ రాజసింహాన్ నహి వేద్మిపార్థాన్.

నేను వైశ్యుడను. నాపేరు అరిష్టనేమి. పాండవుల గోగణమును పాలించువాడను. వారిప్పుడు రాజ్యమును గోల్పోవగా నీవద్దయుండ వచ్చినానని చెప్పినాడు.

ఈతని మాటలయందలి గూఢార్థమిది.—

ఇక్కడ వైశ్యశబ్దము రూపాంతరమును తెలియజేయు పనిని జేయువాడనని చెప్పును. అనగా నా స్వరూప మొకటైయుండ వేరొకరూప కల్పనము గావించుకొంటినని యర్థము.

అట్లే అరిష్టనేమియను పేరు యుద్ధమునం దప్రతిహతశక్తి కలవాడనను భావమున వాడబడినది. అట్లే 'గోసంఖ్య ఆసం' అనునప్పుడు గోవులను ఇంద్రియములు. ఇంద్రియసంఖ్య ఆన ఐదు. పాండవులయందయిదవ వాడినని యర్థము. సహదేవునిగూడ రాజపురుషుడనియే తలచియు విరాటుడు గోరక్షణమున నియోగించినాడు.

తరువాత ప్రవేశము అర్జునునిది.

ఇదియొక చిత్రమగునాకారము. స్త్రీయును పురుషుడును గాని బృహన్నల రూపమున, పూలమాలలనరంకరించుకొని విశుద్ధవస్త్రమును ధరించి, విరటుని కొలువుకూటమున కేతెంచినాడు. విరాటు డీతనిగురించి ఏమని యూహించవలెను ? చూడ, చూడ ఇతడు దేవేంద్రుని కుమారుడని యూహవచ్చినది. మంత్రుల నాలోచించినాడు. వారికి సాధ్యముకా లేదు. తానే యూహించి ఆ పురుషధౌరేయుడు వేయు అడుగులకు భూమి కదలు చున్నట్లున్నది. ఎట్టి శత్రువులనైననూ పరిమార్చగల వీరశిఖామణియే ప్రచ్ఛన్నవేషమును ధరించెనేమో ! అను ఊహకూడ విరాటునకు కలుగకపోలేదు.

'తం ప్రేక్ష్య రాజోపగతం సభాతలె
వ్యాజీత్ ప్రతిచ్ఛన్న మరి ప్రమాధినం
విరాజమానం పరమేణ వర్చసా
సుతం మహేంద్రస్య గజేంద్రవిక్రమం.

అట్లర్జునుడు షండరూపముననే విరాటునకు అభిముఖుడయ్యెను. విరాటుడాతనికి తన రాజ్యమునంతయు పప్పజెప్పి, ఈ వచ్చిన వ్యక్తిని తన పుత్రులలో నొక్కనిగ గ్రహించుటకు సిద్ధమయ్యెను. వెంటనే బృహన్నలకు తన భావమును స్పష్టపఱచెను. ఆ ఘట్టమంతతో ముగిసినది. ఇక విరటునకొక్క సందేహము తీరవలెను. ఇట్టి పురుషమూర్తికి షండరూపముండుటకు కారణమేమి ? అనునది తాను నిర్ణయించుకొనలేని విర్ణయము. కావున ఆకారణమును బృహన్నలవలననే తెలియగోరి ప్రశ్నించినాడు.

'నైవం విధాః క్లీబరూపా భవంతి
కథం చ నేతి ప్రతిభాతి మే మనః.'

విరటునకు సమాధానము ముఖ్యమైనను అర్జునకిది ప్రస్తుతము కాదు. కావున అర్జునుడు తన ముఖ్యమగు విషయమునే ముందు ప్రతిపాదించినాడు. తా నిప్పు డేయుద్యోగమును కోరి వచ్చెనో ఆ యుద్యోగసంబంధమగు నేర్పరితనమును వెల్లడించుకొనినాడు. ఆతనికి వచ్చిన విద్య లివ్వి.

గాయామి నృత్యా మ్యథవాదయామి
భద్రోస్మి నృత్యే కుశలోస్మిగీతే.

గానము, నృత్యము, వాద్యము అను మూడును నాకు వచ్చిన విద్యలు. ఆ మూడింటియందును నృత్యము, గానము నను రెండును నాకు ముఖ్యములు కాగా ఆ రెంటిని నేర్పుటకు నేను కుశలుడనని నిర్ణయించినాడు. అట్టివిద్యల నేర్చుకొనువా రెవ రిక్కడ ? అను ప్రశ్నకు సమాధానముగ విరటుని కూతురని పేర్కొని ఉత్తర కీ విద్యల నేర్పింపుడని కోరినాడు.

త్వముత్తరాయై ప్రవిశస్వ మాం స్వయం
భవామి దేవ్యా నరదేవ నర్తకః.

మరి నీవంటివాని కిట్టి వేషము ఎట్లు వచ్చెనని ప్రశ్నించిన రాజు ప్రశ్నకు సమాధాన మివ్వవలెనుగదా ! లేకున్న అనుమానమునకు తావు వచ్చును. ఇచ్చినాడు.

'ఇదంతు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనం
బృహన్నలాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాంవా పితృ మాతృ వర్జితాం'

నా కీరూపము వచ్చుటకు కారణము నేమని చెప్పను ? దానిని ఇప్పుడు దలచుట దుఃఖకారణము. తల్లిదండ్రులుగాని, బిడ్డలుగాని లేని

బృహన్నలనుగా గుర్తెరిగిన చాలును. అని తేల్చివైచినాడు. ఆ ఘట్టమున తిక్కనగారు శాపముచే వచ్చినదని అర్జునుని సమాధానముగా వ్రాసినారు.

ఉ. ... ... ..., నపుంసక జన్మ మవశ్య భోగ్యమై
వాడిమిగల్గు శాపమున వచ్చె పురాకృత కర్మ భావ్యమె
వ్వాడును నేర్చునే తొలగ వైవగనోర్వక పోవచ్చునే.

పురాకృతకర్మ నెవ్వడు తప్పుకొనగలడు. అది ఊరుకొనక, ఓరిమితో దానిననుభవించుట బుద్ధిమంతుల లక్షణమన్న సూక్తి మన జీవితమునకు చాల అవసరమయినది. ఈ ఘట్టమున తిక్కనామాత్యులు నృత్యవాయిద్యములగురించియు, తన యుద్యోగమును అడుగుటయందును కొన్ని మాటలను పెంచినారు. తిక్కన కవితాప్రవాహము విరాటమున పెరుగుటయు, ఉద్యోగమున కుదించుటయు జరిగినది. 'దండలాసక విధము' (కోలాటము) 'గుండలియు' (నృత్యము) కుండపై నృత్యము గూడ చెప్పి, నైపథ్యము (నటకులకు చేయు అలంకరణము) ను గూడ చేయుట చెప్పినారు.

'నిపుణ నైపథ్యవిధులకు నేర్తు నధిప'

తరువాత ముఖ్యమగు విషయ మొకటి ఆంధ్రమున లేదు. బృహన్నలకు అంతఃపుర ప్రవేశమిచ్చు విషయమున మంత్రులతోటి ఆలోచన చేయుట మూలమునందున్నది. వారితో ఆలోచించుటకాదు. ఇతడు బృహన్నల యౌనా ? కాదా ? యని స్త్రీలవలన తెలిసికొనిగాని అర్జునకు అంతఃపుర ప్రవేశ మివ్వలేదు.

శ్లో॥ సమ్మంత్ర్యరాజా వివిధై స్వమంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభిరాశులై
అపుంస్త్వ మప్యస్య నిశమ్యచస్థిరం
తతః కుమారీ పుర ముత్ససర్జ తం.

ఇది చాలా ముఖ్యమగు విషయము. పరీక్షింపక రాజాంతఃపురముల తావివ్వగూడదు. తరువాత ఉత్తరను వప్పజెప్పినారు. ఇక్కడ ఉత్తరను వప్పగించుటలోగూడ కొంత సంభాషణ ఆంధ్రమున పెరిగినది. ఇక్కన వలె పోతనగూడ ప్రహ్లాదచరిత్రయందు పెంచినారు.

తరువాతవాడు నకులుడు. పై వారివలె గౌరవింపబడియే అతడు గుర్రాల కొట్టమున కధికారి యయ్యెను.

నకులుడు గుర్రములనుగూర్చి చెప్పునప్పుడు తన ప్రతిభ నిట్లు చెప్పినాడు.

శ్లో॥ అశ్వానాం ప్రకృతిం వేద్మి వినయం చాపి సర్వశః
దుష్టానాం ప్రతిపత్తిం చ కృత్స్నంచైవ చికిత్సితం.

గుర్రముల జాతులను, గుర్రముల కివ్వదగు శిక్షాక్రమము. దుష్టాశ్వములకున్న దోషములనుఁ దొలగించుట గుర్రములకు వచ్చు వ్యాధుల నివారణోపాయమగు వైద్యముకూడ నాకు పరిపూర్ణముగ తెలుసునని చెప్పినాడు.

ఆంధ్రభారతమున

సీ॥ అవయవలక్షణం బాయుః ప్రమాణంబు
గర్భంబు లింగితాకారములును
మాత్రాంతరము వయోమానంబు దేశకా
లోచితాహార ప్రయోగభంగి
జాత్యనురూపశిక్షా విధి క్రమగతి
వ్యాయామ సాత్మ్య ప్రవర్తనంబు
ప్రమద విషాదాది బహువిధచిత్త ధ
ర్మము పోషణ ప్రకారము చికిత్స

ఆ. పరిచితములు ధరణిపాల నీముందట
రూపరేఖ మరయజూనేకార్థ ... ...

భారతీయశాస్త్రములయం దేవిషయము కొరతబడినది? నేటివారికి భారతీయ విజ్ఞానముపైన బుద్ధి కొరతబడినది. మఱియొక చిత్రమును గమనింపుడు.

అర్గురును ఒక్కచోటనే మారువేషములతో ప్రవేశించుట జరిగినది. విరాట సుధేష్ణ లెవ్వరికి వారినే అనుమానించియు వారు చెప్పినట్లే చేసినారు. పాండవుల యాకృతులను గుర్తెఱిగిన విరటుని మరపించిన దెవరు? దీని నేమనవలెను? విరాటుడు గ్రుడ్డినమ్మకమున ప్రవేశ పెట్టెనా? కాదు.

జీవుల బుద్ధివృత్తిని నడుపు నొక శక్తియున్నది. అశక్తి మానవుని యూహచే యూహించునదికాదు. మానవు డాశక్తిని విమానయాత్రలచే సాధింపజాలడు.

'యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా'

ఏ చైతన్యరూపిణి బుద్ధిరూపమున సర్వభూతములయందున్నదో ఆమె యిచ్చిన వరమే విరాట సుధేష్ణల నొప్పించిన దేవత.

విరాటుని యాస్థానమున ప్రవేశించుటలో ఆంధ్రమూన పంచపాండవులును వరుసగా వచ్చి చేరిరి. ద్రౌపది చివరకు చేరినది. మూలమున ధర్మజుడును, భీముడును, ద్రౌపదియు, సహదేవుడు చివరకు నకులుడును ప్రవేశించినారు. ఇట్లు ప్రవేశించుటకు రెండు విషయము లున్నవి. ఒకటి విరటునకు అనుమానమును కల్పింపకుండుట. రెండు ద్రౌపదిని ఒంటరిదానిగాపించి వారంద రెట్లు ప్రవేశించెదరు? కావున ద్రౌపది మధ్యయందు రాగా వయస్సుయొక్క వ్యత్యాసమును మరుగు పరిచి అన్నదమ్ములు ప్రవేశించినారు.

ఇక వారి నిత్యజీవితము లెట్లు గడుచుచున్నవనగా —

ధర్మజుడు విరాటనగరమందలి ద్యూతప్రియులగు బ్రాహ్మణులతో వేరొక జూదగృహమున జూదమాడుచు వారినుండి గెలుచుకొన్న ధనమును విరాటు డెరుగకుండ తమ్ముల కిచ్చుచుండును.

భీముడు వంటకములలో మిగిలిన మాంసాదికములుగాని, వాటి విక్రయ ధనమునుగాని ధర్మజున కందించుచుండును.

అర్జునుడు అంతఃపురమున వారికి కాని చీరలనమ్మి ఆ ధనమును పాండవుల నలుగురకును పంచుచుండును.

సహదేవుడు పెరుగుపాల నమ్మిన ధనమును అన్నల కందించును.

నకులుడును అంతే.

సైరంధ్రి మాత్రము భర్తల యాపత్కార్యముల చూచి ఖేదమున కుళ్ళికుళ్ళి క్రుంగిపోవుచుండును. ఇది వారి నిత్యజీవితము. కాని వా రా విరాటనగరమునం దెట్లుండిరో వ్యాసులు చెప్పినారు. 'పునఃగర్భ ధృతా ఇవ' మరల మాతృగర్భమున ప్రవేశించినట్లుండిరట. తల్లి గర్భమునందున్న శిశువును తల్లియే యెరుగదు. ఇందు వారనుభవించు చున్న కష్టమును విరాటుడు గుర్తెఱుగలేకపోవుటగూడ చూపబడినది.

అట్లు నాలుగుమాసములు గడువగా విరాటనగరమున బ్రహ్మోత్సవ మొచ్చినది. ప్రతి రాష్ట్రమునందు ఆ యా రాష్ట్రముల యాచారముల ననుసరించి దేవోత్సవములు గావించుటయు, ఆ యుత్సవకాలముల కళా కోవిదులు వారి విద్యల ప్రదర్శించగా రాజులు వారిని పోషించుటయు సనాతనాచారమే. విరాటనగరమున బ్రహ్మోత్సవ మారంభమైనది. ఆ యుత్సవమున మల్లవిద్యాప్రదర్శనకూడ ఒకటి.

జీమూతు డనువాడు నాటి మల్లులలో నగ్రగణ్యుడు. మల్లుల కతడు నాయకుడు. వానిపేరు చెప్పినచో ఎంతటి బలవంతుడైనను కుంగిపోవును. నాతో పట్టుబట్టు మగవా డీరంగస్థలమున లేడనువాడి బింకము నెదుర్కొనుటకై భీముని నియోగించినాడు విరటుడు.

క్రీడారంగము సిద్ధమైనది. భీముడు ప్రస్తుతమున భీముడుకాడు. విరాటుని కొలువుకూటమున వంటలవాడు. క్రీడామల్లుడు. అతడు విరాట రాజును సంతోషపెట్టవలెను. భీముడు తన నిజరూపమును తలచుకొన్నచో కథ తారుమారగుట సత్యము. విరటుని సంతోషపరచుటకై భీముడు క్రీడారంగమున జట్టితో తలపడినాడు. భీముని యాట జీమూతునకు సంకటమైనది. కొంతసేపు మల్లయుద్ధము సాగగా జీమూతుడు శవమువలె నిశ్చేష్టుడై రంగస్థలమునబడెను. జీమూతుడు చచ్చినాడు. విరాటుడు చాల సంతసించి భీమునకు చాల ధన మిచ్చినాడు. జీమూతు నొక్కనినే కాదు, అట్టి బలవంతులను కొందరను చంపినాడు.

ఇది యుద్ధరంగము కాదుగదా ! ఇది ఏమి సమంజసము ? అనుకొనకుడు. ఇట్టి బలవంతులు దుర్మార్గులగుటచే అట్టివారిని సమయానుకూలముగ పరిమార్చుట చాల ముఖ్యము. వారు భీమునివంటి వాని చేతియందే చత్తురుగాని సామాన్యులచేత చచ్చువారు కాదు. రాబోవు భారత రణరంగమునం దిట్టి దుండగుల సాయము వచ్చునేమో యనియే కొందరు దుర్మార్గులను ముందుగనే పరిమార్చినట్లు శ్రీకృష్ణులు కర్ణపర్వమున ఘటోత్కచుని వధసమయమున అర్జునునకు చెప్పినారు. తరువాత అబోతులతోను, ఏనుగులతోనుగూడ క్రీడల సలుపగా నాటి ఉత్సవము ముగిసినది. ఆ దృశ్యము ద్రౌపది భరింపరాని ఘట్టము. అయ్యును అది బహిర్గతము కారాదుకదా ! ఆ ట్లామహానీయులగు పాండవులు కాలమును గడపుచుండగా పదిమాసములు గడచినవి.

# కీచకవధ

మహాశయులారా !

మన విరాటపర్వ ప్రవచనమున కిది మూడవరోజు. పాండవుల యజ్ఞాతవాస వత్సరమున పదిమాసములు గడచినవని చెప్పితినిగదా !

విరాటుడు ధర్మమూర్తియేగాని విరాటుని రాజ్యమునం దత్యంత బలశాలియైన దుర్మార్గు డొకడుండెను. అతనికి కీచకుడనియు సింహబలుడనియుగూడ పేర్లు. కీచకు డనునది వ్యవహారనామము. సింహబలు డనునది అతని బలమునకు తగినపేరు. అతడు విరాటుని బావమరది. అనగా సుధేష్ణకు తమ్ముడు. కాని రాజవంశములకు చెందనవాడు కాదు. అతని వృత్తి మద్యముల తయారుచేయుట. అత డత్యంత బలిష్ఠు డగుటచే విరాటునికి సేనానాయకు డగుట జరిగినది. సుధేష్ణకు సోదరుడగుట తండ్రినుండియేగాని రాణీవాసమున జనించుట వలన గాదు. అయ్యును సుధేష్ణకు సోదరు డగుటచే అతనికి రాజాంతఃపుర ప్రవేశమున కడ్డులేదు.

యథార్థమున కీ కీచకుడును హిడింబ, బకాసుర, కిమ్మీరాసురుల కోవకు చెందియు, వా రరణ్యమున వసించగా ఇతడు నగర నివాసు డయ్యెను. పాండవులు విరాటనగరమున కాలిడుట కీచకుని యంత్య కాలము సమీపించుటచేతనే యనుట సత్యదూరముకాదు. రావణ సంహారమునకు సీత నిమిత్తము. కీచకునివంటి దుర్మార్గుల నాశము గావించుటకే ద్రౌపది యావిర్భావముకూడ.

భగవానుని పట్టమహిషియగు మాయాదేవియొక్క యపార సౌందర్యములోని కళాభాగములను నారీమండలమునందు ఉంచగా జీవుల

కది మోహపాశమై సంసారపరిభ్రమణమును చేయించుచున్నది. అయ్యును భారతీయ విజ్ఞానము కామ వనుదాని కొక హద్దును తీర్చి దిద్దినది. అదియే భారతీయ గార్హస్థ్య జీవితము. దాని నతిక్రమించిన కామము రాక్షసభావమునకు స్థానమై మహామృత్యువునకు పురుష జీవితమును బలి యిచ్చుచున్నది. ఈ సిద్ధాన్తమే కీచక వధా ఘట్టము.

అంతఃపురము నందలి యొకనాటి ఘట్టము—

కీచకు డొకనాడు సుధేష్ణను చూచుటకై వచ్చినాడు. అంతఃపురమున సైరంధ్రీ జీవనమున తిరుగాడు ద్రౌపది కీచకుని కంటబడినది. దేవ వనితవలె మెరసిపోవు నామె మైదీగె కీచకుని విభ్రాంతి గావింపగా కామబాణ ప్రపీడితుడైన కీచకుడు సుధేష్ణదగ్గర కేగినాడు. సైరంధ్రీ విషయమున తిరుగాడు ఈ వనిత మన యంతఃపురమునం దెన్నడును కనబడలేదే! ఈమె ఎవ్వతె? ఈ కామిని సౌందర్యము నన్ను నిలువనిచ్చుటలేదు. సురాగంధమువలె మత్తతను కల్పించుచున్నది.

'చిత్తం హి నిర్మథ్య కరోతి మాం వశే
న చాన్యదత్రౌషధ మస్తి మే మతం'

ఈమెను గురించిన నా మానసికవ్యాధిని నివారించుటకు వేరొక యౌషధము లేదు. అక్కా! నిజమున కీమె యెవ్వతెయో చెప్పుమని సుధేష్ణను నిగ్గదీసినాడు.

సుధేష్ణ కీచకుని విభ్రాంతిని అర్థము చేసికొన్నది. అతని మాటల నంతగా పట్టించుకొనక ఉపేక్షాభావమును వహించినట్లు పరిచారిక యని మాత్రము వచించినది. సుధేష్ణ సమాధానము నాతడు నమ్మలేదు. ఆశ్చర్యమును ప్రకటించినాడు.

అహో! తవేయం పరిచారికా శుభా
ప్రత్యగ్రరూపా ప్రతిభాతి మామియం

అయుక్తరూపం హి కరోతి కర్మ తే
ప్రశాస్తు మాం యచ్చ మమాస్తి కించన.

ఇట్టి వనితామణి పరిచారికయా ? ఈమె రూపసౌభాగ్యమున కర్హమగునది పరిచారికా యుద్యోగముకాదు. నా సంపదనంతనూ సమర్పించగా నర్హలగల దీ రమణీమణి. ఇవి కీచకుని ప్రలాపములు.

ఇట్టి ప్రలాపములకు సుధేష్ణ సమాధాన మేమిచ్చును ? ఏమిచ్చెడిదో ? కీచకుడు సుధేష్ణ సమాధానమునకై వేచియుండలేదు. సైరంధ్రిని సమీపించినాడు. సైరంధ్రిదగ్గఱకు కాదు వచ్చినది. అదు సింగమును సమీపించు నక్కవలె ద్రౌపదపద్దకు వచ్చినాడని వ్యాసులు వర్ణించినారు.

'మృగేంద్రకన్యామివ జంబుకో వనే'

యథార్థమున కాతడు ద్రౌపదితో పలికిన పలుకులు నక్కకూత లనుట కెట్టిసందేహమును లేదు. కామార్తులగువారి మాటలను ప్రలాపము లనుటకంటె వేరుమాటలేదు. ప్రలాపమనగా అర్థములేనిమాట. కీచకుని మాటల కర్థమేమున్నది ? ద్రౌపది సౌందర్య మంతయు తనను వరించిననే సార్థకమగునట. తనకు అనుభవమునకు రానిచో ద్రౌపది సౌందర్య మంతయు ఎవ్వరికిని భోగ్యముకాక యున్న పూలమాల వంటిదట.

అధార్యమాణా స్రగివోత్తమా శుభా
న శోభసే సుందరిశోభనా సతీ.

అంతటితో నాగలేదు. పెండ్లి చేసుకొన్నవారి నందరను వదలివేసి ఈమెకు దాసుడై యుండుటకుకూడా అతడు సన్నద్ధుడయ్యెను.

'అహం చ తే సుందరి దాసవత్ స్థితః'

ఇట్టి సమయమున ద్రౌపది సంభాషణ ఎట్లు నడచినది ?—

ఆమె హృదయమున క్రోధాగ్ని జనించకపోలేదు. కాని ఆ అగ్నిజ్వాలల వేడిమి రవ్వంతయైననూ బహిర్గతము కాకుండ సామవచనముల కీచకునకు సమాధానమిచ్చుట, ఆమెలోని ప్రత్యేకత యనక తప్పదు. కామక్రోధాది గుణసముదాయ మొక్కొక్క సన్నివేశమున తన్నుదాను మరచునట్లు చేయుటలో పట్టుముగట్టుకొన్న శత్రు సమూహము. ఈ ఘట్టమునందు తమ్ము తాము మరచుట ఒక్క క్షణకాలము జరుగుచో అజ్ఞాతవాస వత్సరమంతయు భగ్నమగుట యథార్థము. కావుననే ద్రౌపది తన పరాభవాగ్ని వెల్గును బహిర్గతము గావింపక సామవచనములతోడనే కీచకునకు ధర్మోపదేశము గావించి మరలింప జూచినది. ఆమె కేవలము ధర్మపన్నముల నేకరువు పెట్టుటతో ప్రారంభించలేదు. ప్రథమమున సామాన్యముగనే బోధించినది. కాని ఆమె క్రోధము కీచకుని సంబోధించుటలో దాగియుండకపోలేదు. అది వారి యజ్ఞాతవాసమువలెనే యున్నది.

'అప్రార్థనీయామిహ మాం సూతపుత్రాభిమన్యసే'

సూతపుత్ర ! అని సంబోధించినది. అతని మూఢత్వమును ప్రదర్శించినదే ఆ సంబోధనము. 'అప్రార్థనీయాం' కోరదగని వస్తువును కోరుచున్నావని పలికినది. కారణమును ప్రతిపాదించుటలో తన నీచత్వమును ప్రకటించుచు నీయంతవాడు నన్ను కోరుటేమిటని కీచకుని దృష్టికి తెచ్చినది.

'నిహీనవర్ణాం సైరంధ్రీం బీభత్సాం కేశకారిణీం'

నేను జడలువేయుచు జీవించు నీచజాతికిచేరి బ్రతుకుచుంటినని తన హీనత్వమును ప్రకటించి చూపినది. అటులైన దాసీస్త్రీలకు చెందినదానవుగదా ? నాదాస్యమున కొప్పుకొమ్మని పలుకుటకు తావివ్వక -

'పరదారాస్మి భద్రం తే న యుక్తం తవ సాంప్రతం'

నేను భర్తలుగలదాననని చెప్పి, పరదారలను కోరుకొనుట నీకు తగినపని కాదని ధర్మోపదేశము గావించినది.

'దయితాః ప్రాణినాం దారా ధర్మం సమనుచింతయ'

ఆలోచించుకొమ్మని సావకాశ మిచ్చినదికూడ — 'ధర్మం సమనుచింతయ' అని. ఆ తరువాత సత్పురుషుల నుదహరించి బోధించినది.

'విసర్జనం హ్యకార్యాణాం ఏతత్సుపురుషవ్రతమ్'

ఇందయు సామరూపముగా చేసిన ప్రబోధమే. పనికిరాలేదు. అతడు వదలలేని మూర్ఖతను మృదుభాషల మాన్పుట సాధ్యముకాదని నిర్ణయించుకొన్నది. దానభేదతంత్రముల కిక్కడ తావులేదు. దండమే శరణ్యము. నీ ప్రాణములను దక్కించుకొమ్మని యొక్కమారు ఘాటుగా చెప్పినది.

'మా సూతపుత్ర ముహ్యస్వ మాఽద్యత్యక్ష్యస్వ జీవితం'

రే ! సూతపుత్ర ! మోహమున మునిగి నీ జీవితమును కోల్పోవద్దని నివారించి తన కైదుగురు గంధర్వులు భర్తలైయున్నటుల చెప్పినది. వారు నిన్ను తప్పక వధింతురని గట్టిగ చెప్పినది.

'తే త్వాం నిహన్యుః కుపితాః'

అంతమాత్రముగ చెప్పి యూరుకొనలేదు. సోదాహరణముగ కీచకుని మూఢత్వము నిరూపించినది.

'యథా నిశ్చేతనో బాలః కూలస్థః కూలముత్తరం
తర్తుమిచ్ఛతి మందాత్మా తథా త్వం కర్తుమిచ్ఛసి'

మూఢశిశువు నదీప్రవాహమును దాటుటకై అవ్వల ఒడ్డుకు దూక యత్నించుటవంటిది - నీవు నన్ను కోరుట - యన్నది. అనగా నేను నీకు లభించుదానను కానన్నది. అంతతో ఆమె వాగ్ఝరి ఆగలేదు.

నీ వీ భూమండలముగాక పాతాళమునగాని, గగనమండలమున గాని దాగియు నాభర్తలకు దొరకకపోవుట యనునది లేదన్నది. వారు గంధర్వులని సూటిగ చెప్పినది. అక్కడకును వాడి ముఖమున భీతిగాని, సిగ్గుగాని కనబడలేదు. నన్నెవ్వరని తలంచుచుంటివో ? నన్ను నీవు కోరుట ఆతురుడగువాడు కాళరాత్రిని కోరుటవంటిదని ఘాటుగ పల్కినది.

త్వం కాళరాత్రీమివ కశ్చిదాతురః
కిం మాం దృఢం ప్రార్థయసేఽద్య కీచక

తిక్కనామాత్యులు ఈ ఘట్టముననే దీర్ఘసమాస ఘటితమగు పద్యమును వ్రాసినారు. అది శార్దూల విక్రీడితము. యథార్థముగ పులి మీదికురికి వచ్చుచున్నట్లే యున్నదికూడ.

శా॥ దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా.

సైరంధ్రి లొంగలేదు. తరువాత కీచకుడు ఆ సైరంధ్రి నెట్లైన యొప్పించుటకు అక్కనే వేడుకొందమని సుధేష్ణదగ్గఱ కేగినాడు. ఆమె నిట్లు ప్రార్థించినాడు.

'యథా కైకేయి సైరంధ్రీ సమేయాత్తద్విధీయతాం
యేనోపాయేన సైరంధ్రీ భజేన్మాం గజగామినీ
తం సుధేష్ణే పరీప్సస్వ ప్రాణాన్మోహాత్ ప్రహావిషం'

అక్కా ! ఏ యుపాయముచే సైరంధ్రి నన్ననుసరించునో అట్టి యుపాయమును సుదీర్ఘముగ నాలోచించి నాప్రాణములను నిలుపుమని కోరినాడు. సైరంధ్రి తనకు వశముగానిచో ఆ మోహముచేతనే నేను ప్రాణములను కోల్పోవుట నిశ్చయమనికూడ తెల్పినాడు.

పై శ్లోకములోని భావమును పరిశీలింపుడు. సైరంధ్రి ఏ యుపాయముచేత నన్ను సమీపించునో నీ వూహించి తగు నుపాయమును వన్నవలసినదని సుధేష్ణను కోరినాడు. అనగా సామాన్యముగ నాలోచించుటకాదు. బాగుగా ఆలోచించి ఉపాయమును వెదుకవలసినదని కోరినాడు. అట్లుకాకున్న జరుగునదేమి ? ప్రాణములను వదలుటే నా కర్తవ్యమని స్పష్టపరచినాడు. అట్లు ప్రాణములను కోల్పోవకుండ రక్షించమనికూడ యాచించినాడు.

ఈ సందర్భమున సుధేష్ణ ఏమైనా ఆలోచించినదా ? లేదా ? అనునది మనకు తేలవలెను. కీచకుడు తన బాధను తెలిపిన వెంటనే ఆంధ్రమున వీడు మూర్ఖుడు. కాదన్నను వదలడు. ఏమిచేయుదునా యని చింతించి 'మాయ దైవమ యేనేమి సేయుదాన' అని వానికి కొన్ని నీతుల నుపదేశించినది. నీచజాతి సైరంధ్రితోటి పొత్తు నీకేల యన్నది. నీ కెందరో సుందరాంగన లుండిరని చెప్పినది. పరసతీ సంగమమున కలుగు ధర్మహానిని వర్ణించినది.

అంతకంటెకూడా పరస్త్రీ సంగమమున యథార్థమగు కామ సుఖము ననుభవించుట సంభవించదన్నది. ఆమె భర్తలు గంధర్వులని భయపెట్టినది. కాని కీచకుడు వినలేదుసరికదా, గంధర్వులవలన భయము తనకు లేదని ధృవపరచినాడు. సుధేష్ణ ప్రబోధము లచ్చట ఫలించలేదు. అప్పుడు సుధేష్ణ ఏమని నిశ్చయించినది ? కాముని బాణములచేతనైనను వీని చావు నిక్కమని నిశ్చయించినది. ఈ విషయము నిర్ణయమగు

లోపల తిక్కనామాత్యులు చాలా గ్రంథమును పెంచినారు. మూలమున వ్యాసులు ఒకే ఒక్క శ్లోకమున తేల్చినారు. సుధేష్ణ ప్రత్యేక బోధల నేమియు వర్ణించలేదు.

> తస్య సా బహుశః శ్రుత్వా వాచం విలపత స్తదా
> విరాటమహిషీ దేవీ కృపాం చక్రే మనస్వినీ

కీచకుని విషయమున ఆమె బోధించవలసినదేమియు లేదు. ఆతడు చెప్పినప్పుడే నా ప్రాణములు పోవుట నిశ్చయమని చెప్పినాడు. ఇట్లు విశ్చయించుకొన్న మూర్ఖునకు బోధించెడి దేమున్నది? ఆతడు ప్రాణములు కోల్పోవుదునన్న మాట మాత్రము ఆమెకు బాధను కల్పించినది. ఈ మూర్ఖునకు బోధింపవలసినది లేదనుటకే సుధేష్ణకు 'విరాటమహిషీ దేవీ' అని రెండు విశేషణములను మునీంద్రులు వాడినారు. కావున మునీంద్రుల గ్రంథమునందు బోధపెరగలేదు. కాని వాని చావునుగూర్చి ఆమెకు దయకలిగినది. 'కృపాం చక్రే మనస్వినీ' మాతృసంబంధము లేకున్ననూ పితృసంబంధముచేత సోదరుడగుటచే యామె జాలి నొందినది. వ్యాసుని 'మనస్వినీ' అను విశేషణము ఆమె నెరవేర్పబోవు కార్యమును సూచించుచున్నది. తరువాత జరిగినదేమి? కల్లు తెచ్చుటకై నీయింటికి పంపుదును. నీ యాసక్తితీర ననుభవింతువు గాక; యని కీచకునకు చెప్పి పంపినట్లు ఆంధ్రభారతమునందు ఉన్నది. సుధేష్ణ మనస్వినియై ఆలోచించిన దేమియు ఆంధ్రమున తేలలేదు.

కం॥ ఆసవమున కవి నీదు ని
వాసమునకు దివములో నవశ్యంబును నే
నా సుదతిం బుత్తెంతు ని
జాసక్తి ఫలింప నొరలు మఱిమత కేళిన్.

ఇక మూలమును పరికింపుడు. కీచకునియందు దుదయించిన దయకు తానేమి చేయవలెనో ఆలోచించినది. ఆ యాలోచనకు తగిన హేతు వొకటి ఆమెకు స్ఫురించినది. ఆ స్ఫురణము నాధారముగా గొని సైరంధ్రిని కల్లుదేర నీయింటికి పంపుదునని చెప్పి అందుకు తగినట్లు నేను పర్వకాలమున ప్రత్యేకముగు సురలనేగాక భక్ష్యభోజ్యములనుగూడ సైరంధ్రికొరకు తయారుచేయదలచితినని ప్రకటించి ఇంటి కేగుమని తమ్మునకు చెప్పినది.

'స్వమంత్రమభిసంధాయ తస్యార్థమనుచింత్య చ
ఉద్వేగం చైవ కృష్ణాయాః సుధేష్ణా సూతమబ్రవీత్
పర్వణీ త్వం సముద్దిశ్య సురామన్నం చ కారయ
తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం తవాన్తికం

ఈ శ్లోకములలో సుధేష్ణ ఆలోచించెనని ఎక్కడున్నది? 'స్వమంత్ర మభిసందాయ' తానేదియో ఆలోచించినది. తన యాలోచనకును సైరంధ్రిని కల్లుదేర పంపుటకును ఒక సంబంధమును ఆమె నిశ్చయించుకొన్నది. తరువాతి పదములో 'తస్యార్థమను-చింత్యచ, ఉద్వేగం చైవ కృష్ణాయాః' అని యున్నది చూడుడు. తానొక నిశ్చయమునకు వచ్చియే సూతునకు సమాధానము చెప్పినది. రెండవ శ్లోకమున 'సముద్దిశ్య' అన్న పదము తాను చేయబోవు కార్యమునకు ప్రాతిపదిక యెట్లు వేసినదో సుధేష్ణ హృదయమును వెల్లడించినది. నీలకంఠులు సముద్దిశ్య అన్న పదమున కిట్లు వ్యాఖ్యానించినారు.

'అహ్యాహం సుధేష్ణార్థమన్నాదికం కారయామీతి ఖ్యాపయిత్వా'

అట్లు చెప్పించుట దేనికి? తాను సైరంధ్రిని పంపునప్పుడు సైరంధ్రి అడ్డుచెప్పకుండుటకే. అంతతో సుధేష్ణ ఊరుకొనలేదు.

తరువా తేమి చెప్పినది? తరువాత కీచకు డాచరించవలసిన విధానము కూడా చక్కగా బోధించి పంపినది. ఏమని?

తత్ర సంప్రేషితామేనాం విజనే నిరవగ్రహే
సాంత్వయేథా యథాకామం సాంత్వ్యమానా రమేద్యది.

సైరంధ్రిని నేను నీదగ్గఱకు పంపుదును. కాని నీవు సైరంధ్రిని ఏకాంతమున మెత్తనిమాటల ననుసరించి సైరంధ్రిని నొప్పింపకయే - అనగా ప్రతిబంధకమును కల్పింపకయే, సైరంధ్రి యొప్పుకొన్న పక్షముననే - ఆమెవలని కోర్కెను తీర్చుకొమ్మని చెప్పినది. ఆ అర్థము నకై రెండవపాదమును చూడుడు. 'సాంత్వ్యమానా రమేద్యది' ఇట్లు చెప్పుటకు కారణ మేమి? అసలు సైరంధ్రిని మంచిమాటలతోడనే ఒప్పించుటకు ప్రయత్నము చేయుమని చెప్పిన సుధేష్ణ మాటకు తా వెక్కడ? సైరంధ్రి యొప్పుకొనునేమో అనునట్టి యనుమానము సైరంధ్రియందు ఎందులకు ఉదయించినది? ఈ ప్రశ్నలకు సమాధానము ఆంధ్రభారతమున తేలదు సైరంధ్రికి ఐదుగురు భర్త లుండిరనియు, వారు గంధర్వులనియు, రహస్యముగ వారు సైరంధ్రిని రక్షించుచుందు రనియు సైరంధ్రివల్లనే ఆమె విన్నది. కాని సైరంధ్రి తన యంతఃపురమున చరించుటయం దొక సన్నివేశ మామెకు సైరంధ్రిని గూర్చి యనుమానము సృష్టించినది. ఏమది?

వలలుడును, సైరంధ్రియు అప్పుడప్పుడు మాటలాడుకొను విధానమును, వలలుడు గావించు క్రీడావిశేషముల నామె అత్యం తాసక్తితో చూచుటయు వారి కనుసైగలను, సుధేష్ణ గమనించకపోలేదు. వలలునకును, సైరంధ్రికిని తగు సంబంధ మేదియో యున్నదని ఆమె యూహించినదేగాని నిశ్చయించలేదు. కావున సైరంధ్రిని సైరంధ్రీ జాతి యవగుణము కలదానినిగా కొంత భావించినది. కావుననే ఆమె

సామముచే ఏకాంతమున వశకరించి చూడమని తమ్మునకు చెప్పినది. సైరంధ్రిని బలవంతపెట్టవద్దన్నది. కారణమేమి? నిజముగ గంధర్వులుండిన ప్రాణమునకు ముప్పు కలుగుననియే ఆమె భావము. సైరంధ్రిని గురించి సుధేష్ణకు కొంత అనుమానముకూడ కలదని మీ రెట్లు నిర్ణయింతురు అందురో? — మన గ్రంథములోని విషయములను చర్చించునప్పుడు ముందువెనుకల పరిశీలించినగాని విషయ నిర్ణయము చేయరాదు. సుధేష్ణకు సైరంధ్రినిగూర్చియున్న అనుమానము, కీచకుడు ద్రౌపదిని పరాభవింపగా ద్రౌపది వంటయింటియందు పరున్న భీముని వద్దకు వచ్చి మాటలాడునపుడు అంతఃపుర స్త్రీలును, సుధేష్ణయు, నీకును, నాకును కామసంబంధము కలదని శంకించిరని చెప్పినది. అందుకు కారణము బ్రహ్మోత్సవ సందర్భమున నీవు మల్లులతోడను, ఆబోతుల తోడను క్రీడించగా నా మనసున కలిగిన విన్నదనమును వారు దయగా భావించిరనియు, అంతేకాక వంటయింటిలో మనము సంభాషణల గావించుకొనుట అప్పుడప్పుడు వారు చూచుచు మన కిద్దరకునుగల సంబంధమునుగూర్చి ముచ్చటించుకొనిరని చెప్పినది. దానిని కలుపుకొన్నచో సుధేష్ణ సైరంధ్రిని అనుమానించుటకుగల హేతువు నిర్ణయమగును. కావుననే వ్యాసులు 'స్వమంత్ర మభిసంధాయ' అని వాడినారు, సుధేష్ణదగ్గర. కీచకుడు చావకుండుటకై తన ప్రయత్నమును తాను చేసినది. కామముచే చావకుండుటకు సైరంధ్రిని పంపినది. గంధర్వులచే చావకుండుటకు బలవంతపెట్టవద్దని జాగరూకతను బోధించినది, ఆంధ్రభారతమును మాత్రమే మీరు చదువుచో సుధేష్ణ పాత్రయందలి అనౌచిత్యమే గోచరించునుగాని ఆమె కార్యగౌరవమును మీరు గుర్తెరుగలేరు. (సామాన్యమున ఆమె తారుపుకత్తెవలె మీకు గోచరించును.)

కథకు వక్తము —.

ఆనాడు సుధేష్ణకొరకు ప్రత్యేకముగ సురాన్నములను తయారు చేయుదునని కీచకుడు ప్రకటించినరోజు. సుధేష్ణ సైరంధ్రిని కీచకు నింటికి పంపవలెను. సైరంధ్రికిని, కీచకునకును జరిగిన సంభాషణ సుధేష్ణకు తెలియకపోలేదు. అయ్యును సుధేష్ణ సైరంధ్రిని పిలిచి తన కీనాడు కీచకుడు తయారుచేయు ప్రత్యేక మద్యమును పానముచేసి యానందింపవలెనన్న కుతూహల మున్నదనియు, ఆ కార్యము నీచలననే నెరవేరవలయుననియు సైరంధ్రిని సుధేష్ణ కోరినది.

ఈనాడు ద్రౌపది కొక పరీక్షాఘట్టము. మహనీయులలోని మహాత్వమును బయటపడవేయుటకే ఇట్టి ఘట్టములు వారికి వచ్చుచుండును. అగరుధూపము తనలోని సౌగంధ్యము నొరుల కందించ వలెనన్న తాను దగ్ధము కావలయును. మంచిగంధపు చెక్కయు తన సుగంధమును పరుల కివ్వదలచినచో తాను సానపై తనకు వచ్చు రాపిడిని సహించవలెను.

పాండవుల జననమును, ద్రౌపది యగ్నికుండమునుండి యావిర్భవించుటయు కీచకునివంటి దుర్మార్గుల దుర్మార్గములకు వా రెదురై నిలిచి తమపైకివచ్చు నా క్రూరహృదయుల ఘోరతాపములకు తా మోర్చి నా దుష్టులను శిక్షించుటకేనని మహాభారతములోని కథకు లక్ష్యము. రామాయణ భాగవతోక్త రామకృష్ణాద్యవతారములును అట్టివే. నేడు ద్రౌపది ఘట్టము కీచకుని అంత్యము గావించుటకే వచ్చినది. సుధేష్ణ తనను కీచకు నింటికి పొమ్మని చెప్పగా ఇప్పుడు ద్రౌపది కర్తవ్య మేమి ? సుధేష్ణకు కీచకుని దురభిప్రాయము తెలిసియే తన్ను పంపదలచి నందులకు ద్రౌపది సూటిగ సమాధాన మిచ్చినది.

'న గచ్ఛేయమహం తస్య రాజపుత్రి నివేశనం
త్వమేవ రాజ్ఞ జానాసి యదా స నిరపత్రపః'

తాను సైరంధ్రిగనే మాట్లాడినది. రాణివాసమున కివ్వవలసిన గౌరవమర్యాదలను లోపింప చేయలేదు.

సుధేష్ణను హే రాజపుత్రి! ఓరాణి! అనియే సంబోధించినది. నే నా దుర్మార్గు నింటికి వెళ్ళనన్నది. నే వెళ్ళకిపోవుటకు కారణము నీ వెరుగుదు వన్నది. కీచకుని పేరును వాడక సర్వనామమును వాడినది. సుధేష్ణ కేమైన కోపము వచ్చునేమోయని భయపడలేదు. కీచకునకు 'నిరపత్రపః' సిగ్గులేనివాడని గట్టిగ చెప్పినది. చూచితిరా! ద్రౌపది సమాధానములోని గడుసుదనమును. అంతేకాదు తాను సుధేష్ణదగ్గర ప్రవేశించునప్పుడు చెప్పిన తన నియమములనుకూడ జ్ఞాపకము చేసినది. ఎందరో దాసీజనులు నీవద్ద యుండిరని వారికిని తనకునుగల తారతమ్యమును సూచించినది. అంతేకాదు 'సహి మా మవ మంస్యతి' అతడు తప్పక నన్నవమానించునని చెప్పి దీనురాలైనది. కాని సామాన్యముగ రాజవనితల హృదయము లంతమాత్రముననే మెత్త పడునా? సైరంధ్రీ! నే నాతని భద్రపరచియే నిన్ను పంపుచుంటినని చెప్పి పానపాత్రను చేతి కిచ్చినది. అప్పుడు సుధేష్ణ హృదయ మేమి?

ఆమె హృదయమున కీచకుని గురించి 'నీవు బలవంత పెట్టవ'ద్దని చెప్పితినిగదా యని భావించినది. సైరంధ్రి విషయమున వలలుని సంబంధ మీమె కుండియు ఇట్లు మాట్లాడుచున్నదని నిశ్చయించుకున్నది. కావుననే ని వ్వాత దేమియు బాధింపదని చెప్పినది.

ద్రౌప దిప్పు డేమి చేయవలెను?

భారతనారీమణుల కిదియొక లెక్కగాదు. భారతస్త్రీలయందు దొక

పాతివ్రత్య ప్రభావమను ఆణుశక్తి తరతమభేదములచే యొప్పారు చున్న దనుట నిర్వివాదము.

ఒక్కమారు ద్రౌపది తన చిత్తవృత్తిని కేంద్రీకరించినది. ఆత్మవైపుకు మరలించినది. ఒక శపథమును గావించినది. ఏమని ?

'యదాహమన్యం భర్తృభ్యో నాభిజానామి కంచన
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యాత్ కీచకోవశే'

నేను నాభర్తలకంటె అన్యమగు పురుషుని భోగభాగ్యముల ననుభవింప సంకల్పమాత్రముగనైననూ స్మరింపకుందునేని నన్ను కీచకునికి వశము చేయకుందువుగాక ! యని దైవమును శరణుపొందినది. దైవ మన ఆత్మశక్తియే. ఆధ్యాత్మికమగుచో దైవమను పేర సాక్షాత్కరించును. ఇది భారతీయ సిద్ధాన్తము. భారతీయ ఆచారములు దైవాంశములు. ఆ యాచారముల ననుసరించుటకై ఆత్మశక్తిని కేంద్రీకరించగా ఆ కేంద్రీకరణమే తపస్సను పేరునందినది.

భారతీయ సిద్ధాన్తములు దైవమును ఆత్మయు ఒక్కచోటనే యుందురనియు లేక అవి రెండును ఒక్కటే యనియుకూడా చెప్పును. దైవత్వము నారోపించుకొనుటకన్న ఆలంబనములలో తాను పుత్ర భావము నొందినప్పుడు మాతాపితరులను తాను భార్యాభావము నొంది నప్పుడు ఆ స్త్రీకి భర్తయు ఆలంబనములై ఆత్మశక్తిని పెంచుకొనుట కవకాశము కల్పించినవి. అదియే ద్రౌపది చేసిన శపథము. ఆవిధముగ శపథము గావించి తరువాత యేమి చేసినది ?

ఆమె సూర్యమండలమును తిలకించినది. భారతీయ సిద్ధాంతమున సూర్యమండలము కేవల భౌతికగోళముకాదు. అది భగవానునియొక్క దివ్యశరీరము. తమ చూపును లోపలకు త్రిప్పలేనివారి కందరకును

దర్శనమిచ్చుటకై భగవాను డీ మండలరూపమున వెలుగొందుచుండెనని వేదమాత చెప్పుచున్నది.

'ఉత్తైనం గోపా అదృశన్నదృశ న్నుదహార్యః'

ఒక్క ముహూర్తమాత్ర మామె సూర్యమండలాంతర్గతుడగు శ్రీమన్నారాయణుని ధ్యానించినది.

'ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్తమబలా తతః'

తన పాతివ్రత్యప్రభావకవచ మున్నదిగదా ? మరల సూర్యు డెందుకు ? ఆ సూర్యతేజముగూడ ఆమె ఆత్మశక్తిలోనిదేగాని వేరుగాదు. ఇక సుదేష్ణ తనచేతి కిచ్చిన సువర్ణమయమగు పానపాత్రను చేత నిడుకొని కీచకు నింటికి బయలుదేరినది. ఆమె వెనుకభాగమున శూలము చేత నిడుకొని ఒక రాక్షసుడుకూడ బయలుదేరినాడు. అతడు సూర్యుడు పంపిన బంటు. ఆ బంటును ద్రౌపది చూడలేదు. ఎట్టి క్లిష్టపరిస్థితి యందును ఆమెను రక్షించవలసిన రక్షకభటుడే ఆ రాక్షసుడు.

'అంతర్హితం తత స్తస్యాః రక్షో రక్షార్థమాదిశత్
తచ్చైనాం నాజహా త్తత్ర సర్వావస్థాస్వనిందితాం'

అది కీచకుని గృహము. సైరంధ్రీవేషమున చషకమును చేత నుంచుకొని ద్రౌపదియు, శూలమును చేతనిడుకొని ద్రౌపదిని రక్షింప వెంటనంటి వచ్చిన రాక్షసుడునుగూడ కీచకుని గృహమున ప్రవేశించుట జరిగినది. కీచకుని కంటపడినది ద్రౌపది మాత్రమే. సైరంధ్రి తన విరహ సముద్రమునుండి దాటింపవచ్చిన నావ యని కీచకుడు తలచినాడు. అంతతో తాను ఒడ్డుకు చేరితిననియే కీచకుని భావము.

ఉదతిష్ఠన్ముదా సూతో నావ లబ్ధ్వేవ పారగః

కావుననే యాతడు సైరంధ్రికి స్వాగత మిచ్చి తన శయన మందిరమున ఆమెతో మధుపానమును జేయుచు ఆనందించవలెనన్న

కుతూహలమును ద్రౌపదికి తెలిపినాడు. అతని స్వాగతవచనము లిట్లు నడచినవి.

సుందరాంగీ, ఇదియే నా స్వాగతము. ఈ రాత్రిని నేను నా పుణ్యపుంజమనియె భావించుచుంటిని. నీవు నా కధీశ్వరివై నాకు ప్రియమును చేకూర్చుటకు సందేహింపకుము. అదిగో దివ్యభోగానుభవమున కర్హమగు శయనమందిరము. అవియే రత్నమాలలు. శంఖవలయములు. అచ్చోటనున్న పట్టుచీరెలును, మెత్తని రత్నకంబళ్లను గూడ నీ యనుభవమునకే. ఇక మనకు కావలసిన దేమున్నది? మాధవీ మద్యమును మనసార గ్రోలి ఈ శయ్యాతలమున విహరింతము. సైరంధ్రీ, నా ప్రియమును సఫలము గావింతువుగాక, అని కోరినాడు.

స్వాగతం తే సుకేశాంతే సువ్యుష్టా రజనీ మమ
స్వామినీత్వమనుప్రాప్తా ప్రకురుష్వ మమ ప్రియం
సువర్ణమాలాః కంబూశ్చ కుండలే పరిహాటకే
నానాపత్తనజే శుభ్రే మణిరత్నం చ శోభనం
ఆహరంతు చ వస్త్రాణి కౌశికాన్యజనానిచ
ఏహి తత్ర మయా సార్ధం పిబస్వ మధుమాధవీం.

ఇదియే రాక్షసజాతి నిర్ణయించుకొన్న బ్రహ్మానందానుభవము. ఈ ఘట్టమున రావణుడు సీతను గురించి పలికిన పలుకులుకూడ మీకు వివిపించుట ముఖ్యము కాకపోదు.

పిబ విహర రమస్వ భుంక్ష్వ భోగాన్
ధననిచయం ప్రదిశామి మేదినీం చ
మయి లలనే యథా సుఖం త్వం
త్వయి చ సమేత్య లలంతు బాంధవాస్తే. (సుం॥కాం॥)

సీతా ! ఇదిగో మద్యము దీనిని సేవించి విహరింపుము. అట్టి విహారముల రమించుటకంటెను భోగామళపములకంటెను ఇంకేమున్నది? విహరించుటకాక, నేనును నా యైశ్వర్యమునుగూడ నీ స్వాధీనమని చెప్పి సీతయొక్క బంధువులనుగూడా తానే భరించునట.

వింటిరా ! రావణుని ప్రలాపములు !

భారతీయ పాతివ్రత్యప్రభావ సంపన్నులగు భారత నారీమణుల నీ యాపదలు తరుముకొని వచ్చుట ఒక కాలములోని భాగముకాదు. అన్నికాలముల యందును దుష్టరాక్షస వృత్తులు సృష్టిచక్రమున తిరుగక పోవుటలేదు. దుష్టశక్తులకును పవిత్రతేజములకును ఘర్షణమనునది సృష్టి ఖండమున వింతకాదు. రామాయణకాలము వేరు భారతకాలము వేరై ద్రౌపది పలుకులకు క్రొత్తదనమును, సీతమాటలకు పాతదనమును లేదు. భారతీయసిద్ధాంతములం దన్ని కాలములందును ఒక్కటే పలుకు పలుకుటయే భౌతిక సాహిత్యమునకంటె వైలక్షణ్యము. గీతాశాస్త్రమున పదియారవ అధ్యాయము దైవాసుర సంపత్తు లెవ్వియో విడదీసి చూపినది. ఆ శాస్త్రము త్రికాలసత్యమును చెప్పినదిగాని ఒక కాలమందలి చరిత్రను వెల్లడించినదికాదు.

ప్రకృతము ననుసరింతము –

కీచకుని యా యున్మత్త ప్రలాపములకు ద్రౌపదీ మహాసాధ్వి సమాధాన మేమియు చెప్పలేదు.

రాజపుత్రిక సురాపానముకై వేచియున్నదని మాత్రము సుర నందింప తొందరపెట్టినది.

అప్రైషీద్రాజపుత్రీ మాం సురాహారీం తవాంతికం
పానమాహార మే క్షిప్రం. పిపాసా మేతి చాబ్రవీత్.

కీచకుని మనస్సంతయు మన్మథుని కైవశమైయున్నది. అతడు సైరంధ్రిని గురించి సోదరి చెప్పిన మాటలను మరచినాడు. సోదరి సైరంధ్రిని బలవంతపెట్టవద్దని బోధించిన బోధ యాతని హృదయమున నాటలేదు. సైరంధ్రి తన యైశ్వర్యమునకు ముగ్ధయై తన్ను వరించి సుఖభోగముల నందించునని మధురవాక్కులతో మొదల యామెకు స్వాగతమును పలికినాడు. ఆమె చూపు లెట్లున్నవో పరికించి పలకరింపదగు స్వాస్థ్యము కీచకున కెక్కడిది ? రాక్షసత్వమున నదియే.

సుధేష్ణకు మద్యమునందింప వేరొకరిని వియోగింతునని చెప్పుచు ద్రౌపదిని చేతముట్టినాడు.

ఇంతవర కా మహాసాధ్వికి కీచకుని పలకరింపులే బాధను కల్పించగా ఇప్పు డా హతకుని పాణిస్పర్శయు తగిలినది. అత డిప్పు డనుభవింపదలచిన కాపము రాక్షసము. ద్రౌపది క్రోధాగ్నిజ్వాలలు ఆ రాక్షసాధముని శాపదగ్ధము గావింప దగినవిగాని సామాన్యమున మరలిపోవునట్టివి గావు. గావున చురచురమని చూచు నా సాధ్వీమణి చూపులే యా హతకుని మారణాగ్నిని వెలిగించుటకై ప్రయత్నించు చుండగా ఆమె వాగ్వజ్రముగూడ వాడియై మెఱసినది.

యథైవాహం నాభిచరే కదాచిత్
పతీన్ మదాద్వై మనసాపి జాతు
తేనైవ సత్వేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పాపం పరికృష్యమాణం

నేను భర్తలపై కేంద్రీకరించిన పవిత్రభావము మదమాత్సర్యములకు లోనై వ్యభిచరించకపోవుచో, నీవు నా క్రోధాగ్నికి వశుడవుగాక తప్పదని శాపరూపమున పలికి వెనుకకు వేగముగ మరలిపోవ నుంకించు నా విశాలాక్షి చీరచెరగును కీచకుడు చేతచిక్కించుకొనినాడు.

సతామభిప్రేక్ష్య విశాలనేత్రాం
జిఘృక్షమాణః పరిభర్త్సయంతీం
జగ్రాహ తాముత్తరవస్త్రదేశే
స కీచక స్తాం సహసా క్షిపంతీం.

అంత మాత్రమున కీచకుని చేతికి చిక్కుట కామె కేవల మబల కాదు. ఆమె రాజపుత్రి. ఇట్లు నీచహృదయులై మేము బలవంతులమని విఱ్ఱవీగు బలాఢ్యుల పరిమార్చి, పుణ్యస్త్రీల నెందరినో కాపాడుటకై వచ్చిన వీరలక్ష్మి. అట్లామె చీరకొంగును పట్టుకొన్న కీచకు నొక్క విదిలింపు విదిలించగా కీచకుడు క్రిందపడినాడట ఇది వ్యాసభగవానులు వర్ణించిన వర్ణనము.

ప్రగృహ్యమాణా తు మహాజలేన
ముహుర్వివిశ్వస్య చ రాజపుత్రీ
తయా సమాక్షిప్తతనుస్సపాపః
పపాత శాఖీవ నికృత్తమూలః.

ఈ శ్లోకమున వ్యాసులు ద్రౌపదని రాజపుత్రి యని వాడినారు. కీచకుడు పడినపాటును వర్ణించుచు – ఆ పాపాత్ముడు ద్రౌపది విసురుకు విరుచుకుపడినాడు చెట్టుకొమ్మవలె.

ఇక్కడ మీరు గమనింపవలసిన విషయ మేమనగా, ద్రౌపది తన స్వీయబలముచేతనే కీచకుని తొలగించుకొన్నదిగాని, సూర్యుడు పంపిన రాక్షసుని సాయమునకాదు. ఆమెను వెంటనంటిన రాక్షసుని సాయ మింతవర కామెకు అవసరము రాలేదు. కీచకుని విసరివైచి రివ్వునపోవు నామె వేగమే కీచకుని క్రిందపడవైచినది. కీచకుడు చేయిని ముట్టగా ఆమె పలికిన పలుకును తరువాత ద్రౌపది నిట్టూర్పువాయువుల విగడించుచు కీచకుని విదిలించి తప్పించుకొని పోవునప్పుడు కీచకుడు

పడినపాటు, ఆంధ్రమున వర్ణితము కాలేదు సరిగదా ; ఆ సమయమున సూర్యునివలన వచ్చిన రాక్షసుడు ద్రౌపదిపై నావహించెననికూడ చెప్పబడినది. మూలమునం దట్లు లేదు. రాక్షసు డామెకు సాయము చేయుటయే గ్రహించుచో ద్రౌపదికిగల సహజతేజమును బలమునుకూడ కుంటుబడునుగదా ! కావున మూలమే యిప్పట్టున గ్రాహ్యము. తరువా తేమి జరిగినది ?

ద్రౌప దిట్లు కీచకుని కూలద్రోసి, అతడు మరల నెక్కడ వచ్చునోయను భీతిచే వణకుచు, విరాటుని సభాస్థలివైపుకు పరుగెత్తినది. ధర్మనందను డక్కడనే యుండెను.

> సా గృహీతా విధున్వానా భూమావాక్షిప్య కీచకం
> సభాం శరణమాగచ్ఛద్యత్ర రాజా యుధిష్ఠిరః.

ఆ సందర్భమున పడిన కీచకుడు లేచి పరుగెత్తుకొని వచ్చి ద్రౌపది కేశపాశమును బట్టుకొని ద్రౌపదిని క్రిందపడవైచి కాల దన్నినాడు. అప్పుడు రాక్షసుడు కీచకుని కూలద్రోయుట జరిగినది. కీచకుడు క్రింద కూలుటలో వాయువుచే కూలిపోవు మహావృక్షమువలె పడినాడని మూలమునం దున్నది. అంతేకాదు కీచకుడు చేష్టలనుకూడ యుడిగి పడిపోయినాడు.

> విఘూర్ణమానో విశ్చేష్టశ్ఛిన్నమూల ఇవ ద్రుమః

గాలి తనరూపమును చూపకయే బలముచేత చెట్లను కూల ద్రోయును. రాక్షసుడుకూడా అట్లే చేసినాడు. కావుననే ఆ ఉపమానమును వ్యాసులు వాడినారు. ఆ సన్నివేశమంతయు విరటుని ఎదుటనే జరిగినది. ఈ సమయమున విరాటుడు కీచకుని మందలించలేదు. కీచకుడు విరాటుని కంటె బలాఢ్యు డగుటయే దీనికి కారణము. అంతకంటె మరేమియులేదు.

దీని తరువాతి రంగమును పరికింతము ——

అప్పు డామె పరాభవమును కన్నులార చూచిన దెవరు ? ధర్మజ, భీమసేను లిద్దరును ఆ సమయమున విరాటుని సభయందే యుండుటచే వా రిద్దరును, విరాటుడుగూడ ఆ దృశ్యమును కన్నులార గాంచినారు. ధర్మజున కాదృశ్యము బాధను కల్పించకపోలేదు. కాని అత డొక మహా సముద్రము. బడబాగ్ని ధరించిన సముద్ర ముప్పొంగుచో వచ్చు బడబాగ్నికీలలను ఆపు వా రెవరు ? ప్రళయకాలముననే బడబాగ్ని బయటకు వచ్చును.

భీముని క్రోధజ్వాలలు మాత్రము బహిర్గతములైనవి. కన్ను లగ్నికణములై పొగ లెగజిమ్మట కారంభమైనవి. కనుబొమలమధ్య రౌద్రరస ముప్పొంగినది. చేతితో మరియొకచేయి కలసి రాపిడి నొందు చుండగా దంతములను నొకదాని కొకటి నొరుసుకొనుచున్నవి. నుదట గ్రమ్మిన చెమటల చేతనద్దుచు, సింహబలునిపై చూపుల బరపినాడు. కాని భీమునిచేతి కొక పెద్దచెట్టు కాపలెను. అదియు సమీపమునందే యున్నది. భీమునిచూపు చెట్టుపైకి ప్రసరించినది. ధర్మజుని చూ పెక్కడున్నది ? భీమునిపైనున్నది. భీము డెప్పు డుదగ్రుడై, క్రోధ వేగమున ఎటు మరలునోయన్న జాగరూకతయందే ధర్మజు డుండును. కావుననే ధర్మజు డా సమయమున భీముని చూచి అతని క్రోధజ్వాలలు చల్లార్చినాడు. ఎట్లు ? భీముడు తనవైపు చూడగా తనకాలి బొటనవ్రేలిని రాచినాడు. అంతతో భీముని వేగ మాగినది. వారి గుర్తుకు స్వరూప మేమి ? అది వారికే తెలియును.

'ఆచారాదేవం జ్ఞేయం' అని వ్యాఖ్యాత వ్రాసినారు. తరువాత ధర్మజు డిట్లు మాట్లాడినాడు.

'ఆలోకయసి కిం వృక్షం సూత దారుకృతేన వై
యది తే దారుభిః కృత్యం బహిర్వృక్షాం విగృహ్యతాం'

వలయుడా ! నీకు వంటకట్టియలు కావలెనన్న ఊరికి వెలుపల వృక్షసమూహము ఉండగా ఊరిలోని చెట్టును చూచుచుంటివేమి ? అని. అంతియే, ధర్మజ వాయునందనుల సంభాషణాఘట్ట మంతతో ముగిసినది. వా రిట్లు మాట్లాడుకొనుచుండగనే కన్నీరుధారల కార్చుచు ద్రౌపది సభాద్వారమునకు రానేవచ్చినది. ఇప్పు డామె చేయవలసిన దేమి ? విరాటునకు చెప్పుకొనవలెను.

'దుర్బలస్య బలం రాజా' ఇట్లామె విరాటునకే చెప్పినది.

'సా సభాద్వారమాసాద్య రుదతీ మత్స్యమబ్రవీత్'

ఇంతియేనా ! ఇచ్చటి కథానుబంధము ? కాదు కాదు ; వ్యాసు లీ ఘట్టమున ద్రౌపదీ మహాసాధ్విని మనకంటియెదుట నిలిపినారు. అప్పు డామె చిత్తరువిట్లున్నది. ఆమె యంతఃకరణమున భగ్గుమని మండిన పరాభవాగ్ని జ్వాలలచే దైన్య మొక విధముగ నామె చూపులనుండి రాగా, ఆ చూపులు భర్తలపై ప్రసరించుచున్నవి. కాని యామె చూపులలో దైన్యమొక్కటే నిలిచిలేదు. ఆ సాధ్వీమణి కంటికొనలనుండి కన్నీరు మున్నీరుగా వచ్చుచున్నను ఆమె చూపులలోని తీక్ష్ణత మాత్రము చూపకులపైబడి వారలను కాల్చివేయుచున్నదా ! యన్నట్లున్నది. అయ్యును ఆమె శోకముగాని, క్రోధముగాని నేనజ్ఞాతవాసమునం దుంటినను మాటను మరపించలేదు. మైమరచుట యనునది వారి జీవితమున కవ్వల యెద్దుననే యుండునుగాని వారి దరిజేరి యుండదు. ఇదిగో వ్యాసుని వర్ణనము —

'అవేక్షమాణా సుశ్రోణీ పతీం స్తాన్ దీనచేతసః
ఆకార మభిరక్షంతీ ప్రతిజ్ఞా ధర్మసంహితా
దహ్యమానేవ రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా'

ద్రుపదుని అగ్నికుండమునుంచి యావిర్భవించిన ఆ దుర్గా మహాదేవి క్రీగంటి ప్రసారములలోని తీక్ష్ణత లోకద్రోహులపై బడగా ఆమె దీనత్వపు చూపులు తాను రక్షించదగు ప్రజలకై ప్రసరించు చుండును. ఈ భావము చెప్పుటకే వ్యాసులు 'ద్రుపదాత్మజా' అనినారు. తరువా తేమి. జరిగినదో గమనింపుడు —

ఆసభాద్వారమునుండియే యెలుగెత్తి భర్తలను తలచి దుఃఖించినది. తన భర్త లెట్టివారో వర్ణించి వా రిప్పు డేల నన్ను రక్షించరు ? అని శోకించినది.

ఆమె తన భర్తలను గురించి వర్ణించుకొనునట్టి మాటలు భారతీయ చక్రవర్తుల జీవితలక్ష్యములను చాటినవి. మొట్టమొదట పాండవుల వీరత్వమును ప్రకటించినది. ఎవ్వరికి శత్రువైనవాడు దేశపంచకమును దాటివెళ్ళినను, అతడు నిద్ర చెందదో, బ్రతుక నేరడో అట్టి వీర శిఖామణులకు పత్నినై యుండగా నీ సూతుడు నన్ను కాలదన్నినాడు. ఆహా ! ఎంతటి అదృష్టము !

యేషాం వైరీ న స్వపితి షష్ఠేపి విషయేదసన్
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్.

ఈ శ్లోకమున మరొక్క భావముకూడ స్ఫురింపవచ్చును. అయిదు ప్రదేశములను దాటి ఆరవదేశమనగా, అయిదు అను సంఖ్యచేత జ్ఞానేంద్రియములను గ్రహించి, ఆరవది మనస్సుగా గ్రహించుచో జాగ్రత్తు బాహ్యేంద్రియములతో కూడియున్నది. ఆ జాగ్రత్తును దాటి మానసిక వ్యాపారమాత్రమగు స్వప్నమునందుండిగూడ చావును తప్పించుకొన సాధ్యముగాని వీరత్వము నా భర్తలదనికూడా గ్రహించ వచ్చును. అనగా నిద్రయందుకూడ భయముచే ప్రాణముల కోల్పోవు నని భావము.

[ షష్ఠే విషయే దేశపంచకవ్యవధానేపి న స్వపితి యద్వా బాహ్యేంద్రియగ్రాహ్యప్రపంచవిషయాపేక్షయా షష్ఠే మనోమాత్రగ్రాహ్యే స్వప్నమనోరథాది న స్వపితి భయార్థితస్సన్ కిముతలోకే న స్వపితి]

వీరత్వ మిట్లుండ ఇచ్చువారేగాని యాచించువారు గారట.

'యే దద్యుర్నచ యాచేయుః' మరొక్క విశేషమేమన: బ్రహ్మవిదులును సత్యవాదులుకూడ. 'బ్రహ్మణా స్సత్యవాదినః' ఏ మహనీయుల చేతియందలి జ్యాఘోషము దుందుభిధ్వానమువలె నిరంతరము మ్రోగుచుండునో, ఎవ్వరి క్రోధాగ్నిజ్వాలలు లోకమునంతను దగ్ధము కావింపదగు శక్తివంతమైకూడ ఎవ్వరు ధర్మపాశముల బంధింపబడి స్వేచ్ఛా విహారముల సలపరో, ఎవ్వరిని శరణుపొందిన శరణార్థులకు భయమనునది లేదో, ఎవ్వ రీలోకమున రహస్యజీవితము గడపుచు మహారథులయ్యును నేలపై చరింపకుండిరో ; అట్టివారికి భార్యనై ఈ సూతహతకునిచే పాదమున ముట్టబడితినని యెలుగెత్తి ఏడ్చుచు వధ్యురాలనగు నన్నేల వారు రక్షింపరు ? తేజోబలవీర్యముల వారధికులయ్యును భార్య నిట్లొక దుర్మార్గుడు పరాభవించుచుండగా వారూరకుండిరి. అనురోదనమును వినుచున్నను కాలమునకు కట్టుబడియున్న పాండవు లెక్కడికి వత్తురు ? విరాటుడు మౌనమును ధరించెను. ప్రస్తుత మా సభ నాక్రమించి కూరుచున్న సభ్యులను, రాజపీఠము నలంకరించిన రాజును కీచకుని శిక్షింపలేకపోవుట కామె సహించలేకపోయినది. రాజుయొక్క దుర్బలత్వము నామె సూటిగ జంకులేని పలుకులతో చాటిచెప్పదలచినది.— అమె కేమి భయము ? సభ్యులను అందు కలిపినది.

విరాటా ! నీ ధర్మము దొంగజీవితమువలె సభ కలంకారము కాలేదు.

దస్యూనామివ ధర్మస్తే న హి సంసది శోభతే
సభాసదోప్యధర్మజ్ఞాః య ఏనం పర్యుపాసతే.

ఈరాజును కొలుచుచున్నవారు ధర్మదూషకులై యూరకుండిరని మత్స్యరాజును, కీచకుని, సభ్యులనుకూడ తిరస్కరించి పలుకు నామె పలుకులకు సమాధాన మెవ్వ రివ్వవలెను ? విరటుడు సమాధాన మిట్లు చెప్పినాడు.

పరోక్షం నాభిజానామి విగ్రహం యువయోరహం
అర్థతత్త్వమవిజ్ఞాయ కిం ను స్యాత్కౌశలం మమ.

తమ బాధ్యతను తప్పించుకొని తమ దోషములను కప్పిపుచ్చ వలసినప్పుడు ప్రభువుల కొక పరిభాష యున్నది. మీ రిద్దరును మా చాటునం దేమి తగవాడిరో మాకు తెలియదు. ఇప్పుడు నీ ప్రత్యక్ష సంభాషణల ననుసరించి మే మెట్లు తీర్పు చెప్పగలము ? అనునదే వారికి బ్రహ్మాస్త్రము. ఆ సమాధానమునే విరాటు డిచ్చినాడు సైరంధ్రికి. అంతతో ద్రౌపది సభాద్వారమును వదలినదా ? అంతమాత్రముననే కదలిపోవునా ? రావలసినవారిముఖముగ సమాధాన మింకను రాలేదు. సభ్యులు మాత్రము ద్రౌపదిలోని నామాన్య ప్రతిభను కొనియాడుచు ఈమె దేవవనిత యని మాటలాడుకొనుచుండిరి. ఆ సందర్భమున యుధిష్ఠిరు డేమైన మాట్లాడెనా ? అతడుకూడ కొలువుకూటమున సభ్యుడై యుండెనుగదా ! అతడు మాట్లాడకుండునా ! ద్రౌపదికి తగు సమాదానముల నిచ్చి పంపినాడు. ద్రౌపదియు ధర్మరాజునకు సమాధాన మిచ్చి వెడలినది. కాని వారి సంభాషణ మతినిగూఢము. సభ్యుల కర్థము కాకూడదు. విరటున కనుమానమును కలుగకూడదు. జరుగదగిన కార్యమును మాత్రము వారు నిర్ణయించుకొనవలెను. ఇది యొక వాగ్వైభవము. ఇట్టి వాగ్వైభవమును భారతకథయందు అక్కడక్కడ

చూపుచునే యున్నాను. ఉదాహరణమునకు ఆదిపర్వమున పాండవులను లాక్షాగృహమునందుంచి దగ్ధులను గావించుటకై వారణావతమునకు పంపునప్పుడు విదురుడు ధర్మనందనకు చెప్పిన లాక్షాగృహదహన కథంతయు వారిద్దరికే అర్థమగునట్టి సంజ్ఞాపదములతోడనే నడచినది. సంస్కృత వాఙ్మయమున కిది యొక యమూల్యాలంకారము. ప్రస్తుతమున ద్రౌపదిని పరాభవించు కీచకునిపైకి దుముకుటకై యత్నించుచు వృక్షమును చూచుచున్న భీమునకు నీకు వంటకట్టియలకై వృక్షము కావలసినచో వెలుపలనున్న చెట్టును కొట్టి తెమ్మని చెప్పినాడు. దానిలోని గూఢార్థ మేమి? కీచకుని శిక్షింపవలసిన దిట్లుకాదు. రహస్యముగ పట్టణమున కవ్వలగ ఆతనిని నిర్మూలించవలెనని చెప్పినాడు. అంతతో భీముడు మరలినాడు. ద్రౌపదికి ఇప్పు డా విషయమును స్పష్ట పరచవలెను. స్పష్టపరచినాడు.

కథాంశమును పరికింపుడు ___

ద్రౌపది విరాటుని కొలువుకూటమున కేగిన సమయము; విరాటుడును, ధర్మరాజును విలాసమునకై ద్యూతక్రీడ నాడుకొను సమయము. ఆ సమయముననే ద్రౌపది కీచకుడు తన్నవమానించుటను ఎఱ్ఱబారిన ముఖముతో కన్నీళ్ళుగార్చుచు పెద్దగొంతుతో చెప్పుచు విరటుని సైతము లెక్కసేయక మాటలాడ బొచ్చినది ఆ రెండు విషయములనే ధర్మజు డాధారముగా గొని విరటునకును, సభ్యులకును సామాన్యముగ సైరంధ్రిని మందలించుచుండెనని మాత్రమే అర్థమగునట్లును ద్రౌపదికి మాత్రము ఆమె కర్తవ్య మర్థమగునట్లును చెప్పినాడు. వారి సంభాషణము మూలమునందు క్లుప్తమైయుండ తిక్కనామాత్యులాసందర్భమునుబట్టి అందలి భావములను కొంత విస్తరించినారు. కాని ఆ విస్తరణము సామాన్యభావమున ద్రౌపది తన భర్తలను స్త్రీ

స్వభావముచే ఎత్తిపొడిచి నట్లుండును. అది వారి నిగూఢసంభాషణము మాత్రమేయని చదువరులు గ్రహించవలెను. ధర్మజుని సమాధాన మిది:

'అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి
విఘ్నంకరోషి మత్స్యానాం దీవ్యతాం రాజసంసది.'

ధర్మజుని పలుకులను గమనింపుడు —

ఇప్పుడు ధర్మజుని ప్రథమ కర్తవ్య మేమి? రహస్య రక్షణము. కావుననే ముందు 'అకాలజ్ఞాసి సైరంధ్రి' అని - అనగా సైరంధ్రీ! నీవు కాలమును గుర్తెరిగినదానివి కావని పలికినాడు. దానితో ద్రౌపదికి ఒక సమాధాన మందినది. ఏమది? కీచకుని విషయ మాలోచించు సమయ మిది కాదని, రహస్యముగ రాత్రికాలమునం దాలోచించవలసియుండగా నీ విక్కడ మాటలాడుట యవసరములేని పనియని.

కాని విరటునకు యర్థము స్ఫురింపకూడదు. కావున మాత్స్యులు వినోదమునకై ద్యూతఫలకము దగ్గరుండగా నీ విట్లు మాట్లాడుట వారి యాటకు విఘ్నము కలుగుచున్నదను జ్ఞానమైన లేకుండ మాటలాడు చుంటివని. 'అకాలజ్ఞాసి' అను మాటకు వ్యాఖ్యానము చేసినాడు. అంతే కాక మన కింకను అజ్ఞాతవాస వత్సరము పూర్తికాలేదను మాటనుకూడ గుర్తుచేసినాడు. తరువాతది 'శైలూషఇవరోదిషి' అనుమాట. అది చాల ఘాటుగ పలికినట్లున్నది. నటకురాలివలె లజ్జను విడిచి మాట్లాడుచుంటివన్న పలుకు. నీ శోకమున కిదికాదు స్థానము. భీముని మందిరము. ఇచ్చట శోకము నటకురాలి శోకమువలె ఫలవంతము కానిదిగదా? అన్న భావమును స్ఫురింపజేసి సభాదులకును, రాజునకును, సైరంధ్రిని గట్టిగ మాటాడి సభాస్తారు డవ్వలికి పంపినా డను భావ ముదయింపజేసినాడు. అంతతో ధర్మజు డూరకొనలేదు.

'గచ్ఛ సైరంధ్రి గంధర్వాః కరిష్యంతి తవ ప్రియం
వ్యపనేష్యంతి తే దుఃఖం యేన తే విప్రియం కృతం'

సైరంధ్రీ! నేనింత గట్టిగ మాట్లాడితినని బాధపడవద్దని యోదార్చినట్లు నీ భర్తలగు గంధర్వులు ఎవరు నీ కప్రియమాచరించిరో వారిని తప్పక సంహరింపగలరని నిర్ణయించి పంపినాడు. అనగా కీచకుడు తప్పక చావగలడని చెప్పినాడు. కాని యీ మాటను బహిరంగముగ చెప్పు టెట్లు? 'తవప్రియం కరిష్యంతి' అన్న మాటతో చెప్పినాడు. ఆమెకు ప్రియమేమి? కీచకుడు చచ్చుటే. దానినే ధర్మజుడు గంభీరముగ చెప్పినాడు. అంతేకాదు 'తే దుఃఖం గంధర్వాః వ్యపనేష్యంతి' నీ దుఃఖమును గంధర్వులు పోగొట్టగలరు.— అన్న మాటకూడ శ్లోకమున కలదు. దుఃఖం అన్న పదమునకు నీలకంఠులు 'దుఃఖయితారం' నీ దుఃఖమును చేకూర్చినవానిని 'వ్యపనేష్యంతి' చంపగలరు. అను నర్థము వచ్చునట్లు 'జీవితాత్ ఇతి శేషః' అని సమన్వయించినారు. దుఃఖయితారం జీవితాత్ వ్యపనేష్యంతీ త్యర్థః.—అని తాత్పర్యము. పర్యవసానమునం దీ శ్లోకము కీచకుని చావు నిక్కమని ద్రౌపదికి తెలియునట్లును విరాటునకును, సభాసదులకును ద్రౌపదిని యోదార్చినట్లును అర్థము వచ్చునట్లున్నది. తరువాతది ద్రౌపది సమాధానము ధర్మజుని సమాధానము తన కర్థమైనట్లు ఆతనికి తెలుపుట ద్రౌపది కర్తవ్యము. అట్లే తెలిపి సుధేష్ణ మందిరమున కేగినది. ఆమె సమాధాన మిది :

'అతీవ తేషాం ఘృణినామర్థేహం ధర్మచారిణీ
తస్య తస్యైవ తే వధ్యాః యేషాం జ్యేష్ఠోక్షదేవితా.'

అతి దయావంతులగు ఏ గంధర్వులకు నేను ధర్మపత్నినై యుంటినో ఆ నా భర్తలలో జ్యేష్ఠుడు జూదరి.

అయ్యును నా కప్రియ మెవ్వ డాచరించినను ఆ యప్రియ మాచరించినవారు గంధర్వులలో ప్రతిఒక్కరికిని వధ్యులుగాక తప్పదని చెప్పి వెళ్ళినది. దీని అంతరార్థ మేమి? ప్రతిఒక్కరిలోనివాడే భీముడు. ధర్మజా! నీవు చెప్పినట్లే ఏకాంతమున భీముని ప్రేరేపింతునని చెప్పి, అత డొక్కడే ఈ కార్యమును నెరవేర్చగల డనుటనుగూడ ధర్మజునకు తన హృదయమును తెలిపినది. ఈ శ్లోకమునందలి రెండవపాదము నందలి 'తస్య తస్యైవ' అనుచోట ఆ సర్వనామమునకు నీలకంఠులు 'సర్వస్యైవ' అని వ్యాఖ్యానించి, ఆ గంధర్వులలో ప్రతియొక్కరి చేతను నా కప్రియ మాచరించినవారు వధ్యులు కాగలరను భావమును పఠితల కందించినారు.

ఇక సుధేష్ణ మందిరమున కేగుదము —

సుధేష్ణ సైరంధ్రిని చూచినది. సైరంధ్రి గమనములోని వేగమును, ముడివీడిన కేశపాశముయొక్క ఉనికిని, కన్నుల ఎరుపుదనమును, గమనించినది. కీచకు డీమెను పరాభవించియుండునని యూహించినది. కాని ఎరుగనిదానివలె సైరంధ్రీ! నీ మొగ మిట్లుండుటకు కారణమేమి? అని ప్రశ్నించినది. సైరంధ్రి యథార్థముగ జాతి సైరంధ్రికాదుగదా! కాలవశమున ఆమె కాపేరు వచ్చినది. అదియు గూఢభావమున రాణియను నర్థమునే యిచ్చునుగదా! కావుననే సైరంధ్రి సమాధాన మిట్లిచ్చినది.

కీచకో మావధీత్తత్ర సురాహారీం గతాం తవ
సభాయాం పశ్యతో రాజ్ఞః యథైవ విజనే వనే.

నీవు నన్ను కల్లు దెచ్చుటకై పంపగా జను లెవ్వరును తిరుగాడని వనమధ్యమందువలె సభయందుండి రాజు చూచుచుండగనే కీచకుడు నన్ను కాలదన్ని పరాభవించినాడని స్పష్టముగ చెప్పినది. ద్రౌపది చెప్పు

సమాధానమున 'పశ్యతో రాజ్ఞః' షష్ఠీ విభక్తిని వాడినది. అనాదరే షష్ఠీ ; రాజును లక్ష్యము గావించకయే యిట్లు చేసినాడని చెప్పినది.

నీ వెరిగియు ఎరుగనియట్లు నన్నడుగుచుంటివా ? అని ప్రశ్నించక ఈ సమాధానమును మాత్రమే చెప్పినది. ఇదియే ద్రౌపది గడుసుదనము. ఎరుగని దానివలెనున్న సుధేష్ణను ఎరుగనిదానివలెనే యుంచి అడిగిన దానికి సమాధానము చెప్పినది. విరటుని రాజ్యమును అరణ్యముగా మార్చినది. అరణ్యమున బోవు దిక్కులేని వనితను దుర్మార్గులు చేసినట్లని యుపమించినది.

మూలమందలి శ్లోకము చాల గంభీరమై నడచినది. తరువాత నడిచిన సుధేష్ణ, సైరంధ్రీల సంభాషణమును చూడుడు —.

పాపము ; సైరంధ్రిని సుధేష్ణ యోదార్చబోయినది. ఏమని ? సైరంధ్రీ ; కీచకుని నేను దండింతునని. అట్లోదార్చబోయిన సుధేష్ణకి క్రిందివిధముగ సమాధాన మిచ్చినది.

'మన్యేచైవాద్య సువ్యక్తం యమలోకం గమిష్యతి'

ఓ రాజ్ఞీ ; నీవు దండించుదనుక కీచకు డుండునా ? కీచకు డీక్షణముననే యమలోకమున కేగినట్లు తలచుకొమ్మని సూటిగ చెప్పినది. తన భర్తలగు గంధర్వు లాదుర్మార్గుని బ్రతుకనివ్వరని నిర్ణయించిన దన్నమాట. అంతతో సైరంధ్రీ సుధేష్ణలు సంభాషణ ముగిసినది.

తరువాతి కథ —

అది యథార్థమునకు సైరంధ్రి వసించు నిత్యనివాసగృహము. కాని ఈనాడు ఆ మందిరమునందు ప్రవేశించబోవునది సైరంధ్రికాదు. సైరంధ్రివలె కన్పట్టునట్టి ఒకానొక రాజపత్ని. రాజపత్నియేకాదు, త న్నవమానించిన ద్రోణాచార్యుని పరిమార్చుటకై యజ్ఞకుండమునుండి

పుత్రుని యావిర్భవింపజేసిన ద్రుపదరాజపుత్రిక...అంతేకాదు, కంస మర్దనుని యనుంగుసోదరి కృష్ణ. తన్ను పరాభవించిన కీచకుని దీర్ఘ నిద్ర నొందించు టెట్లో యాలోచించుటకై తన నివాసగృహమున కేగినది. ముఖమును కడుగుకొన్నది. మాసినచీరెను వదలినది. కన్నీటి బిందువులు మాత్రమే ముఖమునుండి పూయముకాలేదు. కన్నులనుండి యశ్రుబిందువు లట్లే రాలుచున్నవి. నే నెక్కడికి పోవలెను ? ఏమి చేయవలెను ? న న్నవమానించిన హతకుని మారణహోమము నెక్కడ చేయవలెను ? ఇదియే ఆమె మననము.

ధర్మజుడు పెద్దమనిషి. అర్జునుడు ప్రస్తుతమున శాపగ్రస్తుడగు దైవహతకుడు. నకుల సహదేవులు పసివారు. కాక వారందరును శస్త్రాస్త్ర ఖడ్గయుద్ధముల గావింతురేగాని రహస్యముగ జేయు బాహు యుద్ధమునకు పనికిరారు.

కీచకుని పరిమార్చుటకు సమర్థుడు భీము డొక్కడే అతడు తన పిడికిటిపోటులతో కీచకుని పశుమారణము గావింపగలడని ఆమె మననమున తేలినది. అంతేకాదు. తనకు ప్రియమును చేయుటకు భీము డొక్కడే ముందుకు వచ్చును. 'నాన్యః కర్తా ఋతే భీమాన్మమాద్య మనసః ప్రియం' ఇక ఆమె భీముని మందిరమున కేగవలెను. పయన మైనది. ఆమె భీముని గృహమున కేగుటను వ్యాసు లిట్లు వర్ణించినారు.

'ప్రాద్రవన్నాథమిచ్ఛంతీ కృష్ణా నాథవతీ సతీ
భవనం భీమసేనస్య క్షిప్రమాయతలోచనా'

వ్యాసులు ద్రౌపది నిక్కడ 'ఆయతలోచనా' అని వర్ణించినారు. ఆమె కన్నులు పెద్దవట. అనగా దీర్ఘమగు ఆలోచనాశక్తి కలదని స్పష్టపరచినారు. ఎక్కువకాలము ఆలోచనలతోనే గడపక వెంటనే ఒక నిశ్చయమునకు వచ్చినదని 'క్షిప్రం' అనికూడ చెప్పినారు.

ఇక ద్రౌపది భీమునియొద్ద కేగినప్పటి ఘట్టమునకు రావలెను. అదియొక విచిత్రమైన ఘట్టము. భీముడుకూడా తనవలెనే ఈ సమయమునం దాలోచనా నిమగ్నుడై యుండవచ్చునని ద్రౌపది యూహ. పరుగు పరుగున భీమసేనుని శయనమందిరమున కేతెంచినది. ఆమె ఊహాంతయు తారుమారైనది. భీముడు గురకలువెట్టి నిద్రపోవుట నామె చూచినది. అతడు రాజపుత్రుడై ధర్మపత్నికి కలిగిన యవమానమును లెక్కచేయక అట్లు నిద్రించుచుండుట ఆమె హృదయము నొక్కమారు కాల్చివైచినది.

హా ! భీమసేనా ! నన్ను కాలుదన్నిన సూతహతకుడు జీవించి యుండగా నీవు నిద్రపోవుచుంటివా ? నీ కెట్లు నిద్ర పట్టినది ?

'తస్మిన్ జీవతి పాపిష్ఠే సేనావాహే మమ ద్విషి
తత్కర్మకృతవానద్య కథం నిద్రాం నిషేవసే'

అని ఆశ్చర్యమును ప్రకటించు చిత్తవృత్తితో స్తబ్ధయై మూర్ఛవోయినదానివలె నిలిచిపోయినది. అది మూర్ఛమాత్రము కాదు. మూర్ఛవంటి అవస్థా విశేషము. దీనినే దిగ్భ్రమ' యని వాడుదురు. కావుననే వ్యాసులు 'సంమూర్ఛితేవ' అని వాడినారు. తరువాత ద్రౌపది చిత్తమున క్రోధజ్వాలలు చెలరేగినవి. 'ప్రజజ్వాల చ చేతసా' ఇది భీముని మందిరమున ద్రౌపది ప్రవేశించినప్పటి దృశ్యము. అంతలో ఆమె భీముని శయనతలమును సమీపించినది. కాని ద్రౌపది కాలిసవ్వడికైనను అతడు మేల్కొనలేదు. భీముని నిద్రలేపవలెను. నిద్ర లేపినది. ఇక్కడ వ్యాసభగవానులు ద్రౌపది భీముని నిద్రలేపుటకై అతని సమీపించుటను నిద్రలేపుటనుగూడ ఒకవిధముగ వర్ణించినారు. ముందు భీమునివద్దకు ద్రౌపది వెళ్ళుటను వ్యాసు లెట్లు వర్ణించిరో చెప్పెదను.

'సర్వశ్వేతేవ మాహేయీ వనేజాతా త్రిహాయణీ
ఉపాతిష్ఠత పాంచాలీ వాసితేవ వరర్షభం'

మూడేడులు గడచిన ఆవుపెయ్య ఎదయై ఆబోతును సమీపించి నట్లును, బకము మదమున పతిని సమీపించినట్లును ద్రౌపది-భీమునియొద్ద కేగినదని వర్ణించినారు. పై రెం డుపమానములును ద్రౌపది కామాతురయై భీమునిదగ్గర కేగిన దనినట్లున్నవి. యథార్థమున కంతియేనా ? కాదు. ఆర్ష గ్రంథముల ధోరణి లట్లే యుండును. 'ఉపాతిష్ఠత' అనగా అతని సమీపమున కేగినదని యర్థము. అప్పు డామె కామాతుర యగుటకేమైన సంబంధ మున్నదా ? ఆమె కీచకుని మారణ మెప్పుడా యని నిరీక్షించు చుండ-ద్రౌపది కామవతియై భీమునిదగ్గర కేగినదని బుద్ధిమంతు లెవ్వరైన యూహింతురా ; మరి యేమనుకొనవలెను ? ద్వేషాతురయైనదనుటయే కుదురు. అప్పుడు పై యుపమానము లెందు కిచ్చిరి ? అది యేమి సభ్యత ? కొందరు వ్యాసభారతము సభ్యతను పాటించకయే ఇతిహాస ధోరణిని నడచినదని యందురు. ఆంధ్రభారత మట్లుగాక వ్యాసభారతము లోని యసభ్యతల సవరించి కావ్యవిధమున తీర్చిదిద్దబడిన దందురు. ఇతిహాసములను రచించుటకు సభ్యత అక్కరలేదని వారి యూహ కాబోలు ; ఆర్షగ్రంథములలో లేని సభ్యతను మనము దిద్దుదుమన్న అహంకార మొక్కటే వారికి మిగిలినది. ప్రకృతిలోని పరిపూర్ణ తత్త్వమును గ్రహించుచో వా రట్లు భ్రాంతి నొందరు. పశుజాతికి కామము ప్రకృతి ననుసరించి వచ్చును. ఆ కామమున వాటి కేకాగ్రత స్థిరమై ఆహార నిద్రల నొందక గర్భధారణయగునంతవరకును మగ జాతిని వదలవు. ద్రౌపది కిప్పుడు కలిగిన ద్వేషముయొక్క పూర్ణ స్వరూపమును చెప్పదలచిన మహర్షి కామమున వృషభమును సమీపించు ఆవుతో పోల్చినారు. తనను తాను మరచిన తత్పరత్వమొక్క కామము ననే కలుగును. చలించని ధ్యానమున కాలంబనము శృంగారము. రెండవ యుపమానము భీముని ఆబోతుకు పోల్చినారు. కీచకవధయందు ద్రౌపది

పాత్రతకున్న స్థానము భీమునకు లేదు. కావుననే భీముని ప్రేరేపించుటకై ద్రౌపది వచ్చినది. పెయ్య ఎదకాగా ఆఁబోతుదగ్గరకు పోవుట సహజము. ఆ ఘట్టమున ప్రధానస్థానము నాక్రమించినది ఆఁబోతుకాదు. కాని ఆబోతు దృష్టి ఎదయైన ఆవువైపు తిరుగగా అది ఆహారమునుకూడ గ్రహించకుండ దాని కోర్కెను సఫలము చేయును. కావున భీముని ఆబోతున కుపమించినారు. అంతేకాక కామాతురుడు చావునకుకూడ తెగించును. అట్లే ద్వేషాతురుడుకూడ తెగించును. ఈ భావమునే నీలకంఠులు (ప్రస్తుతః నకామాతురా కింతు ద్వేషాతురైవేతి భావః.) అని ద్రౌపది విషయమున తెలిపినారు.

ఇక భీముని నిద్రలేపిన విధమును చూడుడు —

సా లతేవ మహాశాలం ఫుల్లం గోమతితీరజం
పరిష్వజత పాంచాలీ మధ్యమం పాండునందనం
సింహం సుప్తం వనే దుర్గే మృగరాజవధూరివ
భీమసేనముపాశ్లిష్యద్ధస్తినీవ మహాగజం
వీణేవ మధురాలాపా గాంధారం సాధు మూర్ఛతీ
అభ్యభాషత పాంచాలీ భీమసేనమనిందితా
ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథామృతః
నామృతస్య హి పాపీయాన్ భార్యామాలభ్య జీవతి.

గోమతీతీరమునందలి మహాసాలమును తీగవలెను, పురుష సింహమును కౌగలించు ఆడుసింగము వలెను, గజరాజును మేల్కొల్పుటకై కౌగలించిన ఆడయేనుగువలెను ద్రౌపది భీముని కౌగలించి వీణను మీటునట్లు మధురస్వరమున ఆతని నిద్రలేపినదట. ఇది వ్యాసులు వర్ణించిన వర్ణనము. ఈ ఘట్టమునం దిట్టి వర్ణన మనుచితమని

కొందరకు తోచవచ్చును. ఆమె యనుభవించువిషాదఘట్టమున భీముని కౌగిలింతలోని స్పర్శసుఖమును కోరునా ? అని వారు ప్రశ్నింతురు. కావుననే ఆంధ్రభారతకర్తలు యీ అనౌచిత్యమును తొలగించి మంద మంద సంభాషణముల సంబోధించు పాంచాలి పాణిస్పర్శనంబున మేలుకొనిన భీముని, మన ముందటబెట్టి ఔచిత్యమును నిలబెట్టినారని వారి వాదము. ఇట్లార్ష గ్రంథములందున్న అనౌచిత్యముల దిద్దివలసి వచ్చుచో ఆ గ్రంథములనే మార్చి మాతన గ్రంథములను నిర్మింపవలసి వచ్చును. భారతచరిత్రయే మన బుద్ధుల కనౌచిత్యమైయుండ అట్టి అనౌచిత్య కథను వారేల తెనిగించి మోక్షమునొంద కాంక్షించిరి ? కావున తిక్కనామాత్యు లాయా ఘట్టముల తెనిగించునప్పుడు కథా సంగ్రహమును కావించుచు సామాన్యరూపమగు కథను మాత్రము పఠించువారలను దృష్టియందుంచుకొని, అట్లు వ్రాసినను వ్యాసభట్టారకుని వర్ణన లనుచితములని భావించలేదు. అనుచితములు కావు. పైన వర్ణించిన యుపమానములను పరికించుచో ఇట్టి అపోహాలు గలుగవు. ఎప్పుడైనను ఉపమానమునం దేకాంశమునే గ్రహించవలెను. ఇచ్చట ప్రదర్శింపబడిన దదియే. ద్రౌపది భీమసేనుల నేటి యుదాత్తసమాగమము ద్రౌపదిని కాంక్షించిన యా నీచమృగమును హతమార్పగలదని సూచించినారు. అది యట్లుండ చెట్టును చుట్టుకొను తీగెనుగ ద్రౌపదిని వర్ణించుటలో రాబోవు కీచకవధను సూచించును. ఇట్లే దుర్యోధన దుశ్శాసనుల సంహరించదగు అలంబనముగా గూడ భీమునికి చెప్పి ద్రౌపదికి కలుగబోవు సామ్రాజ్యప్రాప్తియను శుభసంపదనుకూడ వ్యాసులు ధ్వనించినారు.

తరువాత విషయమున కేగుదము —

తరువాత ద్రౌపది భీముని నిద్రలేపుట.___

ద్రౌపది భీముని నిద్రలేపుటగూడ ఆర్ష గ్రంథములలోని గూఢార్థముల గ్రహించలేని వారిని విభ్రాంతుల గావించును. ద్రౌపది భీము నిట్లు నిద్రలేపినది -

ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథామృతః
నామృతస్య హి పాపీయాన్ భార్యామాలభ్య జీవతి.

లెమ్ము ! లెమ్ము ! భీమసేనా ! చచ్చినవానివలె నిద్రించుచుంటి వేమి ? నీ భార్యను తాకి యవమానించిన శత్రువు బ్రతికియుండగా నీవు నిద్రించుచుంటివా ? అని నిద్రలేపినది.

ఇట్లు చచ్చినవానివలె నిద్రించుచుంటివేమి ? అనుట ద్రౌపది యంతటి సాధ్వికి తగునా ? అనుకొనవచ్చును. ద్రౌపది సాధ్వికనుకనే భార్యయను పరమపవిత్రద్రవ్యమును కాపాడుటయం దింత మాంద్యము కలిగి శక్తిహీనునివలె నిద్రించుచుంటివా ? పురుషవరేణ్య ! అని సంబోధించినది. ఇచ్చట మృతశబ్దము కర్తవ్యమును మరచి నిద్రించుటను సూచించినదిగాని ప్రాకృతస్త్రీ వచించు నిందావాక్యముకాదు. లలితా సహస్రమున 'పంచప్రేతాసనాసీనా' అని అమ్మవారిని వర్ణించినారు. ఆ పంచప్రేతలలోనివారే బ్రహ్మ విష్ణ్వాదులు. వారందరును చావగా వారి శవములపై కూర్చొన్నదని అర్థముకాదు. ఆ పరాభట్టారికయొక్క అనుగ్రహమునకు పాత్రులుగా యుందురని అర్థము. ఆమెకు వా రందఱును సేవకులని చెప్పుటకు ప్రేతపదమును వాడినారు. అట్లే ఇచ్చట కూడ కీచకుని దీర్ఘనిద్ర నొందించకయే నీవు నిద్రించుట మరణ సదృశమని తీవ్రప్రబోధము గావించుటకై ద్రౌపది అట్లు పల్కినది. ఇదెంతయో యుక్తము. యుక్తమేకాదు, యుత్తమముగూడ. కాక

తిక్కనాది కవులు చేసినది వ్యాఖ్యానముకాదు. పాఠకులకు సంగ్రహరూపమగు కథను కూర్చి హృదయాహ్లాదమగునట్లు కవిత్వశిల్పమును దిద్దినారు. అంతమాత్రముచే వారు వ్యాసుని అతిక్రమించిన పండితులని భావించుట భావించువారి లోపము.

కథాభాగము నందుకొందము — భీమసేనుని కన్నులు తెరువబడినవి. తన్ను నిద్రలేపి ఎదుట సాక్షాత్కరించిన ద్రుపదరాజనందనను పరికించినాడు. ద్రౌపది శరీరకాంతి పూర్వమువలెలేదు. ఒడలుచిక్కి ముఖము వెలవెలబోవగా ఆమె హృదయస్పందన మతివేగమై నడచుచున్న ట్లాతనికి గోచరించినది. అందుకు కారణ మా భీమసేను డెరుగనిదికాదు. ఎరుగును. అయ్యును ద్రౌపది ముఖముననే ఆమె వచ్చిన కార్యముయొక్క అద్యంతముల నెరుగుట యవసరమని ఆతడు తలచినాడు. కీచకునివలన కలిగిన పరాభవము మొదటినుండియు ఆత డెరుగడుగదా ! కావున ప్రియురాలగు నా ద్రౌపదిని ఈ రాత్రికాలమున నీ రాకకు కారణ మేమని సరాసరిగ ప్రశ్నించినాడు. ద్రౌపది ముఖము మరింత చిన్నదైనది.

భీముని మనసు చాల మెత్తనిది. ద్రౌపది హృదయవేదన మాతని కర్థమైనది. నాకు కీచకునివలన జరిగిన యవమానము నీతడు కన్నులార గాంచియు, ఇంతలోనే మరచి నానోటిగుండ చెప్పించుట కీతడు సాహసించెనా ? అను భావము ద్రౌపదికి కలుగుట నాతడు గమనించినాడు. తన భావమును విప్పిచెప్పినాడు.

ద్రౌపదీ ! నీవు వచ్చినపనిని ఎక్కువ కాలయాపనసేయక, తక్కువమాటలతో చెప్పెదవేని నీ కోర్కెను సంపూర్ణముగ నెరవేర్చుట కుపాయ మాలోచింతునని ప్రతిన బూనినట్లు చెప్పినాడు.

'యదావ త్సర్వ మాచక్ష్వ శ్రుత్వా జ్ఞాస్యామి యత్పరం'

ఆమె చెప్పునప్పుడు తన కుపాయము తోచునని భీముని యూహ. కేవలము వృత్తాంతమును తెలుసుకొనుటయే అతని హృదయముకాదు.

జ్ఞాస్యామి-అనగా 'ఉపాయం చింతయిష్యామి' అని అర్థము. 'యత్క్షమం' అనగా యోగ్యమగు ఉపాయమని అర్థము.

ఆ పలుకులు ద్రౌపది కొకవిధమగు ధైర్యము నివ్వగా తన బాధనంతను వెళ్ళబోసినది. ఈ ఘట్టమున ద్రౌపది యుపక్రమము మూలమునం దొకవిధముగ నడచినది.

ద్రౌపది వీరరసప్రధానమగు రాజవంశమునం దవతరించినది. అగ్నికుండ సముద్భూత. ద్రౌపది కనుకొలకునుండి జలజలరాలు కన్నీటిబిందువులలోగూడ వీరరస మొలుకుచుండును. కాని శాంతరస మామె జన్మకు కారణముకాదు. కావుననే ధర్మజుని సన్యాసధర్మ మామెకు నచ్చలేదు.

తన్ను పాదతలమున తాకిన కీచకు డాక్షణముననే అసువుల బాయక బ్రతికియుండుటకు కారణము ధర్మజుని యాదేశమేకదా!

కావున యామె కర్తవ్య మిప్పుడు భీముని మేలుకొలుపుట. మేల్కొల్పుటకాదు; భీముని క్రోధాగ్నిని రగల్కొలుపుట. అప్పుడుగాని భీముడు తన బాహుద్వంద్వము నప్పగించి కీచకుడు చచ్చెనని నిర్ణయించుకొమ్మని పలకడు. అట్లాతనితో మాట్లాడినది. ఇది యామె మొదటిమాట.

'అశోచ్యత్వం కుతస్తస్యా యస్యా భర్తా యుధిష్ఠిరః'

ఏ స్త్రీకి యుధిష్ఠిరుడు భర్తయైయుండెనో ఆ స్త్రీకి శోక మంత మగుట యుండునా? భీమసేనా! అని ఒక్కమాటతో మీయన్న పలుకులకు కట్టుబడితివని హెచ్చరించి, ఇప్పుడైననూ మీయన్న నతిక్రమించక నాకోరిక నెరవేర్తువని ధ్వనించినది. ఇంతేకాదు.

ఈ శ్లోకమునం దొక చమత్కారమగు ధర్మబోధ యున్నది. ద్రౌపదిని సామాన్యముగ జీవస్థానమునం దుంచుచో ఎవ్వనికి ధర్మము భర్తయో, వానికి లోకదృష్టి ననుసరించిన బాధలు తప్పవనికూడా మనము గ్రహించ వచ్చును. అనగా భౌతిక సుఖము లాతని జీవితలక్ష్యములుగాక పరమార్థమే అతని దృక్పథమునం దుండుట అవసరమని భావము. అది యట్లుండ తానుగనుక జీవించియున్నదిగాని వేరొక రాచబిడ్డయగుచో ఈవిధముగ కన్నుల కగపడుట దుర్లభమని తన ఓరిమిని వివరించినది.

'పార్థివస్య సుతా నామ కాను జీవతి మాదృశీ
అనుభూయేదృశం దుఃఖమన్యత్ర ద్రౌపదీం ప్రభో'

నా జీవితమును విడువలేక ఈవిధమగు బ్రతుకు బ్రతుకుచుంటి నన్న ద్రౌపది పలుకులు భీముని కరగించకుండునా? అతడు ద్రవీభూత చిత్తుడు. ఆమె భీముని చిత్తమునం దొక్కమారు వనవాసమున జరిగిన సైంధవుని పట్టమునుకూడ పునర్ముద్రణ గావించినది.

ఆ తరువాత కీచకుని దుష్టత్వమును సంగ్రహముగ చెప్పి కీచకుని క్షమించుటకు తన హృదయము దహించుకొనిపోవుచున్నదని విలపించినది. ఆ విలాపములోని అంతరార్థ మేమి? ధర్మజుని యుపేక్ష భావమును కొలిచిచూపినది. అయ్యును నాటి ధర్మజుని సహనమును వాచ్యముగ పలుకక తృప్తిసందినది. ధర్మజుని సాక్షాత్తుగ విమర్శించినది. అఖండ సామ్రాజ్యలక్ష్మి నంతను జ్ఞాతులచేత బెట్టి ద్యూతమంటపమున విరాటునితో క్రీడ నాచరించు సన్యాసు లెవ్వరుందురని గట్టిగ మాట్లాడినది.

'కో హి రాజ్యం పరిత్యజ్య సర్వస్వం చాత్మనా సహ
ప్రవ్రజ్యాయైవ దీవ్యేత వినా దుర్ద్యూతదేవినం'

శ్రోతలారా : ఇప్పుడు ద్రౌపది సంభాషణమును ఒక ఇసుక పాతర యని వర్ణించుట యుక్తము. రాజసూయము నాటి యైశ్వర్య మంతయు తన హృదయమున నాటుకొనియుండగా దాని నంతను తుడిచి వేయు టెట్లు ? పోయిన పేలపిండి రామార్పణమను వేదాంతము ద్రౌపదికి నచ్చదు. ద్రౌపదికి భారతీయ ధర్మశాస్త్రమంతయు కరతలామలకము. రాజనీతి యుగ్గునపెట్టిన విద్య. పాండవుల యపూర్వ సంపదనంతను వర్ణించి వర్ణించి తా నిట్లు బ్రదుకుట కొక కారణమును ప్రతిపాదించినది. ఇప్పుడు ద్రౌపది విదుషీమణి ; దుఃఖభాగినికాదు. భారతీయశాస్త్రములు మానవజీవితమునందువచ్చు సుఖదుఃఖములు కాలాధీనములై వచ్చు చుండునని నిర్ణయించినది. ఆ సిద్ధాంతమునే ద్రౌపది భీమునకు చెప్పి తాను బ్రతుకుట కాధార మా సిద్ధాంత మేనని చక్కని సందేశమందించినది రాబోవుతరములవారికి. కాని, కాలాధీనమై దుఃఖములురాగా వాటిని భరించుటేనా ? ఆ దుఃఖములను తప్పించుకొను నీతి విశారదత్వమున్నదా? అను ప్రశ్నయొకటి కలదు. ఆ ప్రశ్ననుకూడ ఆమె వదలలేదు. మానవ జీవితమున వచ్చు విపత్తుల నెదుర్కొనుటకు ఆ యాపత్తుల ననుభవింపక తప్పించుకొను నుపాయము లేదని నిర్ణయించినది. కాని కర్తయొక్క దుష్కర్మవిపాక మెట్లు కాలమును నిమిత్తముగాగొని దుఃఖము నిచ్చునదో కర్తచేయు పుణ్యకర్మ పరిపాకమునుగూడ నిమిత్తముగా గొని సుఖసంపదలకూడ నట్లే యందించగల యవకాశమున్నదని చక్కని తర్కమును ప్రతిపాదించినది.

"దైవేన కిల యస్యార్థః సునీతోపి విపద్యతే
దైవస్యచాగమే యత్నః తేన కార్యో విజానతా'

తా॥ ఎంత నీతివిశారదుడైననూ కాల మందించిన విపత్తుల నెట్లు దాటజాలడో సంపత్తుల నట్లే పుణ్యకర్మలచే సంపాదింపవచ్చునని భావించు చుంటినన్నది. ఆ భావనయే నా బ్రతుకుటకు కారణమని చెప్పినది.

రాబోవు శుభోదయమును తలపకున్నచో మానవుడు బ్రతుక జాలడు. ఆ శుభోదయమును ఉదయింపజేయునవే భారతీయశాస్త్రములు. కర్మసిద్ధాంతమును తొలగించినవారికి ప్రపంచ భిన్నత్వమును సమర్థించుటకు సాధనమేమున్నది? వారిని వదలుదము. బ్రహ్మాది స్తంబ పర్యంతమగు జీవరాశి అధికార భేదము కలిగియుండుటకు కర్మయే కారణమని భర్తృహరి మొదలగు సుకవుల సూక్తిసుధలు మనకు రూపొందియున్నవి.

> 'బ్రహ్మా యేన కులాల వన్నియమితో బ్రహ్మాండ భాండోదరే
> విష్ణుర్యేన దశావతార గహనే క్షిప్తో మహాసంకటే
> రుద్రో యేన కపాలపాణి పుటకే భిక్షాటనం కారితః
> సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మైనమః కర్మణే'

కర్మనాధారముగా గొనియే త్రిమూర్తులును సూర్యుడునుగూడ నడచుచుండిరని సిద్ధాంతము. బ్రహ్మ కుమ్మరివానివలె సృష్టిచేయుట, శ్రీమహావిష్ణువు అవతారము లెత్తుట, రుద్రుడు భిక్షమెత్తుట, సూర్యుడు శెలవదివసములు లేకయే తన యుద్యోగమును సాగించవలసి వచ్చుట - అను వాటిని చూడగా కర్మయే కారణమని తేల్చి కర్మకు నమస్కరించి నాడు భర్తృహరి. కర్మసిద్ధాంతముతప్పు అనువారి సంగతి మనకు వద్దు. వారు గ్రుడ్లగూబలవలె దివాంధులు. వ్యాసభారతిలోని యిట్టి సిద్ధాంత విషయముల మీకందించుటే నా ఆశయము. కథకు ప్రత్యేకస్థానముకాదు. అయ్యును కథకు పోదము.

తరువాత ద్రౌపది భీమునితో అంతఃపురములోని తన కష్టముల నన్నిటిని తలపోసినది. ఆ కష్టములలో కష్టాతికష్టమగు విషయము నొక దానిని కన్నులకు గట్టినట్లు భీమునకు తెలిపినది. తెలుపుటకాదు ; కన్నుల యెదుట పెట్టినది. ఆమె చేయునది సైరంధ్రీవృత్తిగదా ! చందనగంధము లచే రాచవనితలకు నలుగు రాయవలెను. రాజకొమారులకును, మహారాజు నకుగూడ చందనగంధముల కలిపి మేన నలదుకొనుటకు యోగ్యముగ నందించవలెను.

అట్లందించి, అందించి నలుగును నూరినూరి ఆ సుకుమారగాత్రి పాణితలములు కాయలు గాచినవి. ఒక్కమారు తన కోమల మృదు హస్తములను భీముని కన్నుల యెదుట బెట్టి –

'మున్నటు లున్న పాణితలముల్ బలుగాయలు గాచె చూచితే'

అని కన్నీరు కార్చినది. కాని ఒక్క సందేహము. ద్రౌపది కెప్పుడైన తన యంతఃపురమున నలుగు బెట్టుట యలవాటు కలదా ?

లేకేమి ? కుంతీదేవికి ద్రౌపదియే స్వయముగ సేవచేయుటగలదు. ప్రత్యక్షదైవములగు మాతాపితరులకును, అత్తమామలకును, గురువర్యు లగు భర్తలకును స్త్రీపురుషు లెవ్వరైన స్వయముగ సేవచేయవలెనుగాని సేవకుల నియోగించరాదు. ఈ విషయమును ద్రౌపది మాటలాడుటయందే స్పష్టమగును.

'యా న జాతు స్వయంపిషే గాత్రోద్వర్తనమాత్మనః
అన్యత్ర కుంత్యా భద్రం తే సా పినష్మ్యద్య చందనం'

ఏ నేను స్వయముగా నలుగుపెట్టుకొననో ; ఆ నేను సుధేష్ణాది వనితలకు నలుగుల పెట్టుచుంటినని చెప్పి, కుంతికి మాత్రము నేనే స్వయముగ నలుగు పెట్టుదునని వర్ణించినది.

భారతీయులారా! ఈ ఘట్టమున మీరేమేమి విషయముల్ల గ్రహింతురు? భారతీయకళలలో అంగోద్వర్తన మనునది యొక చికిత్సా విధానము. మహారాజుల శరీరములు చందనగంధముల నలదుకొనుట కెంత సుకుమారములో యుద్ధములందు కరుకుములుకుల గ్రుచ్చుకొన్నను భరించుట కంత కఠినములు.

సామాన్యులకు గూడ భారతీయ వైద్యశాస్త్రము అభ్యంగనమును స్వస్థవృత్తమునందు చెప్పినది. (అనగా నిత్యమును తైలమర్దనము గావించుకొని పెసరపిండితో నలుగుపెట్టుకొనుటచే గలుగు ఆరోగ్యమును వైద్యశాస్త్రము చెప్పినది. మన మిప్పుడు సబ్బునురుగులో పడినాము)

కథకు రండు ——

ద్రౌపది తన మృదుహస్తములను భీముని యెదుటబెట్టి వెక్కివెక్కి ఏడ్చుటచే ఎఱ్ఱబారిన ముఖమండలము నాతని విశాలపక్షమున మోపినది.

ఇప్పుడు భీము డేమయ్యెనో తెలుసునా? ద్రౌపది యవస్థ నాత డనుభవించెను. అతని చిత్తము స్వాస్థ్యము నొందక అలసట బొందగా ఆమె హస్తములను తన ముఖమండలమునం దుంచుకొని వెక్కివెక్కి ఏడ్చినాడు.

'దురోద పరవీరహా' ఇప్పుడు భీముని హృదయము మీ కర్థమైనదా? కనుకనే భీముని యొద్ద కేతెంచినది.

తరువాత అత డెట్టకేలకు ధైర్యము నొంది ద్రౌపది నోదార్చినాడు. ఓదార్చుటకాదు, నీ పాణితలము లిట్లు కందగా నా బాహుబలమును, అర్జునుని గాండీవమును వ్యర్థములై యున్నవని బాధపడినాడు.

భీముడు ద్రౌపది నోదార్చుటలో మొదటి మాటేమియో తెలియునా?

ద్రౌపది మొదటిమాటలకే అతడు సమాధానము నిచ్చినాడు. ద్రౌపది మనసున గ్రుచ్చుకొన్న ముల్లు, ధర్మరాజు కీచకుని పరిమార్చ

కుంట నివారించుట. ఆ ముల్లును భీముడు చక్కగా నూడబెరికి, తరువాత ఆమెను వేరొక విధముగ ఓదార్చినాడు. ద్రౌపదీ: నాడు ధర్మజుడే నన్ను నివారించకున్నచో నేను కీచకుని చంపుట తప్పదు. సేనాని చంప రాజు యుద్ధమున కియ్యకొనును. మత్స్యరాజ్యమున యుద్ధము ప్రవర్తించగా జరుగబోవున దేమి? మన అజ్ఞాతవాస భంగమగుట. కావున నాడు ధర్మజుడు గావించిన శాసనము మహత్తరమని విడదీసి చెప్పినాడు. ఈ ఘట్టమున తిక్కన పద్యరత్న మిది.

ఉ. కీచకు డట్లు మీదు పరికింపక విన్నబరాభవింపగా
జూచి మహోగ్ర కోపవివశుండగు నన్నును జూచి ధైర్య హే
మాచలుడైన ధర్మసుతు డమ్మెయి వారణ సేయకున్న నే
సీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గుపేసినన్.

అంతేకాదు. పూర్వరాజుల చరిత్రలలో పట్టమహిషులకు వచ్చిన యిక్కట్లను వర్ణించినాడు. సీత, సావిత్రి, దమయంతిం నుదహరించినాడు.

ఇట్లోదార్చిన భీమునకు ద్రౌపది యేమి సమాధాన మిచ్చినది?

ధర్మజుని నిందించుటలో తన అజ్ఞానము కారణము కాదన్నది. పట్టరాని దుఃఖమున పలికిన పలుకన్నది.

'అపారయంత్యా దుఃఖాని న రాజాన ముపాలభే'

ఇక్కడికి ధర్మజుని గూర్చిన మీమాంసను సున్నితముగా సర్దినది. ఆ సర్దుటలో —

సీ. చనునె వేరొకని కజాతశత్రుం డను
పేర దిగ్విజయంబు పెంపుదాల్ప.

అనునట్టి యథార్థ గౌరవముల నుగ్గడించుచు, ట్టివానికి వచ్చిన యాపదల తలచి అట్లంటి నన్నది. అంతేగాక భీమ, నకుల, సహదేవుల ప్రభావముల వర్ణించి, వారికొరకై కొంత దైన్యము నొందినది.

ఇంతతో ద్రౌపది సంభాషణ ముగిసినదా ? లేదు. ముఖ్యమగు విషయము లక్లే మిగిలియున్నవి. ఏమవి ? కీచకు డెప్పుడు చావవలెను ? చంపదగు కాల మిదియేనా ? అతని సంహరించుటలోని ముఖ్యావసర మేమి ? తనను అవమానించిన నేరమునకేనా ? అతని నిప్పుడు సంహరించినచో గుట్టు బట్టబయలుకాగా అజ్ఞాతవాస వత్సరమంతయు భ్రష్టమగును. గావున రహస్యరక్షణము ముఖ్యమా ? సంహరించుట ముఖ్యమా ? అను విషయములు చర్చనీయాంశములు.

ద్రౌపది పై విషయముల నన్నిటిని పరిష్కరించి కీచకుని చావును నిర్ణయించి చంపదగు నుపాయముగూడ నిర్ణయముకాగా భీముని శయనమందిరమునుండి కదలినది.

మొదటి అంశము కీచకు డెప్పుడు చావవలెను ? చంపదగు కాల మిదియేనా ? అనునది.

భీముని సంభాషణలో కీచకు నిప్పుడు చంపితిమేని మన గుట్టు బయటపడును గావున; ఇది కాలముగాదను మాట స్ఫురించినది. అదియే ధర్మజుడు తన్ను వివారించుటలోని యంతరార్థమని ధర్మనందనుని మాటను భీముడు సమర్థించుటలో తేలినది. ద్రౌపది దానికి ముందు సమాధాన మిచ్చినది.

> కిము త్వేన వ్యతీతేన భీమసేన మహాబల
> ప్రత్యుపస్థితకాలస్య కార్యస్యానంతరో భవ.

మన యజ్ఞాతవాస వత్సరమునందే కీచకుడు చావవలెను. మన కాల మత్యంత సామీప్యమునకు వచ్చినది. కావున అతని చావును గురించిన యుపాయమునకై దీర్ఘకాలముగ అలోచించవలసిన పనిలేదని నిర్ణయించి సన్నద్ధుడవు కమ్మన్నది. (అనంతరోభవ)

రెండవ విషయము కేవలము తన్నవమానించినందులకై క్రోధావేశమున అతని చావును కోరుటలేదని నిర్ణయించినది.

ఆ దుర్మార్గు డెందరినో స్త్రీలను అవమానించుట జరుగుచున్నదని చెప్పి అట్టి దుర్మార్గుని సంహరించి, లోకకళ్యాణమును కూర్చునదే క్షాత్రధర్మమని ప్రబోధించుటకై కీచకుని వృత్తాంతమును మరల నెత్తికొని అతని దౌష్ట్యము నిట్లు వర్ణించినది.

> 'శూరోఽభిమానీ పాపాత్మా సర్వార్థేషు చ ముగ్ధవాన్
> దారామర్శీ మహాభాగ లభతేర్థాన్ బహూనపి
> అహరేదపి విత్తాని పరేషాం క్రోశతామపి
> న తిష్ఠతేస్మ సన్మార్గే న చ ధర్మం బుభూషతి'

అతడు దురభిమానియై పరదారల పరామర్శించు క్రూరుడు. ఎందరి ద్రవ్యములనో హింసాపూరితముగ నపహరించిన హాతకుడు. అతనిని సంహరించుట అత్యవసరమని తెల్పినది.

అ ట్టైన కాలాంతరమునం దాతని పరిమార్చకూడదా–అందురేమో! నన్నైనను చూపుమేరలో నాతడు బ్రతుకనిచ్చుట దుర్లభమన్నది. ఒక విధముగ అతడు నన్ను బలాత్కరించగా నా ప్రాణములు పోకుండు టెట్లు? నేను చత్తును. భార్యనగు నేను రక్షింపబడకున్న మీ వీరధర్మ మంతయు బుగ్గిపాలగునని ఘాటుగ చెప్పినది.

'తద్ధర్మే యతమానానాం మహాన్ ధర్మోన శిష్యతి'

భార్యా రక్షణ మంత ముఖ్యమైనదా? అందురేమో! భార్యా రక్షణమునగాని సంతతి రక్షింపబడదు. ఆత్మయే సంతతియని శాస్త్రములు చెప్పుచున్నవని రక్షణముయొక్క ఆవశ్యకము నుద్ఘాటించినది.

'దర్శనే దర్శనే జహ్యాత్ యది జహ్యాం చ జీవితం'

భార్యారక్షణమే మహాధర్మమన్నది. ఈ విషయమును ప్రతిపాదించుటతో నన్నవమానించుటయన క్షత్రధర్మము నవమానించుటయని శత్రువును పరిమార్చుట యను ధర్మపరిపాలనమునే నేను బోధించుచుంటినని చెప్పినట్లయినది. అంతేకాక సమయరక్షణముకంటె దారరక్షణ మవసరమని సిద్ధాంతీకరించి, ప్రకృతమున సింహబలుని పగ దీర్చుటయే ముఖ్యమని నిరూపించినది. తరువాతది, ఒకవేళ రహస్యము బయల్పడుచో దాని కేమి యుపాయము ? అనుచో దానికి చక్కని సమాధానము నందించినది.

'తమేవం కామసంమత్తం భింది కుంభమివాశ్మని'

వాని చంపుట ఎట్లో చెప్పినది. కామముచేత మత్తిల్లిన ఆ కామాంధుని కుండను రాతిపై విడిచి బ్రద్దలుకొట్టినట్లు చంపమన్నది. అనగా కుండను చేత నిడికొని, భుజపై కెత్తి రాతిమీద విడుచునట్లు, వానిని ఏకాంతమునకు రప్పించి, ఆ హతకుని రహస్యస్థలమున రూపుమాపగా, ఆ మరణమును ఒరులు గుర్తెరుగరని చెప్పినది. కుండ బ్రద్దలు కాగా పెంకు లెట్లు చెదిరి దాని స్వరూపము మాయునో వీని నట్లు చేయుమన్నది.

చూచితిరా ! ప్రకృతియొక్క ప్రభావమును ! ఇట్టి దుష్టరాక్షస వృత్తికలవారి కొరకే ప్రకృతి అవతరించును. ఆమె సత్పురుషులకు మాతృమూర్తి. దుష్టులకు కాళికాదేవి. ద్రౌపది భీమునితో గావించిన ఈ చర్చనంతను ఒక్కమారు సింహావలోకనముగా వించి ముందుకథకు పోదము.

ప్రప్రథమముగ కీచకుడు తన్నవమానించగా ధర్మజుని యుపేక్షను భీముని నివారించుటను ఆమె సహించక ఆతనిని విమర్శించినది. భీముడు దానికి సమాధాన మందించుచు అప్పుడాతడే నన్ను నివారించక

పోయిన మన నిగూఢచర్యకు భంగము కలిగెడిదని అతవి నివారణను సమర్థించినాడు. ఆ ధర్మజుని నిందించుట యుక్తము కాదనినాడు.

ద్రౌపది ఆ విషయమునంతను నేర్పుకూర్పులతో కూడిన మృదు మధురవాక్య సరళితో భీముని ముగ్ధునిగావించినది. నేను ధర్మజుని నిందించుటగాదన్నది. మీరు గావించు క్షాత్రధర్మమునకు ప్రధానలక్ష్యము భార్యారక్షణమన్నది. ఆత్మదారల రక్షించుకొనుటకే వీరత్వమన్నది. దారసంరక్షణకుగాని వీరధర్మము వ్యర్థమన్నది. మీ అజ్ఞాతవాసవ్రత దీక్షకంటె నా రక్షణము ముఖ్యమన్నది. నాకొరకై మీరు సింహబలుని పరిమార్చుట కాదన్నది. సింహబలుడు విరాటుని అండనుగొని, ఎందరో స్త్రీలను బలాత్కారముగ అనుభవించుటను భీమునకెరింగించినది. అత డెట్టి దుండగుడై ఆ నగరమున చరించుచుండెనో వివరించి, అతని చంపుట కర్తవ్యమన్నది. ఉత్తమక్షత్రియుని కర్తవ్యమన్నది. ధర్మజుని యపారధర్మతేజమును నేనెరుగనిదానను కానన్నది. తరువాత, మానవు నకు దుఃఖఫలము లెట్లు కర్మవిపాకములో ; సుఖఫలములును అట్లే కర్మ విపాకములు గావున మానవుడు ప్రబలములగు దుఃఖకర్మవిపాకముల ననుభవించుచు ఓరిమితో వాటినిసహించి, సుకృత కర్మఫలవిపాక కాల నిరీక్షణగావించుచు జీవించియుండవలెనేగాని దుఃఖభాక్త్వమును సహించ లేక దేహత్యాగమును చేయరాదని తనను ఆదర్శమిచ్చినది. చివరలో ఆ సూతహతకుని రహస్యముగా చంపమని సలహానిచ్చినది. ఇది భీమసేన ద్రౌపదీ సంవాదములోని సారము.

తరువాత కథ

వారట్లు సంభాషించుకొని, ద్రౌపది భీముని ఎదపైవ్రాలి దుఃఖిం చగా వెక్కివెక్కిఏడ్చు నామె ఏడుపును భీముడు ఓదార్చినాడు. పూర్వ

చరిత్రల కొన్నిటిని ఆమె స్మృతికి తెచ్చినాడు. సుకన్య, సీత, మొదలగు వారల కష్టపరంపరల వర్ణించి, వారివలెనే నీవును శుభమునందగలవని కన్నీటికాల్వలు తనచేత తుడిచి ద్రౌపదిని పంపినాడు.

సీ. చ్యవనుని వాంఛకు సంయాతినందన
యిడుమల గుడువదె యడవిలోన
రాఘవుతోడ నరణ్యవాసముసేసి
సంతాపమందదె జనకతనయ
కుంభ సంభవునకై ఘోర దుర్గముల లో
పాముద్ర యలజడిపాలు గాదె
నలుని పిరుంద గానలకేగి దమయంతి
మనుజులు వడని యుమ్మలిక వడదె
తే. వారు సైరణసేసి దుర్వారమైన
నిరతిశయ దుఃఖభారం బునిస్తరించి
సౌఖ్యమొందరె నీవు నా చందమునన
యాపదలకోర్చి సంపదలననుభవింపు.

ఇంతతో ఈనాటి యుపన్యాసము సమాప్తము.

స్వస్తి ప్రజాభ్యాం

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఆర్యమహాశయులారా !

నేటి యుపన్యాసము మహాభారతామ్నాయమందలి విరాటపర్వ కథాంతర్భాగము. విరాటపర్వ సంగ్రహోపన్యాసముల కిది నాల్గవరోజు. నిన్నటిరోజున జరిగిన చరిత్రాంశము కీచకవధకు సంబంధించిన కథా విశేషము. ఆ కథాభాగమున భీమసేన ద్రౌపదీ సమాలోచనము ముగిసినది. ఇక కీచక హతకు డీలోకమును వదలవలెను. కీచకు డీలోకమును వదలుట యనగా భారతీయ ధర్మము ననుసరించి కులకాంతల చెరబట్టు కామాంధు లీలోకమును వదలుట యని అర్థము.

అది ప్రాతఃకాలము సూర్యభగవాను డుదయాద్రి నధిరోహించి నాడు. కొన్నిగడియల కాలము గడువగా సుధేష్ణ మందిరమునకేతెంచుట జరిగినది. ద్రౌపది పూర్వరాత్రియంతయు నిద్రలేకున్నను తన కార్య క్రమముల నిర్వర్తించుటకై సైరంధ్రీవృత్తమును నడుపుకొనుచున్నది. ద్రౌపదికి వెళ్ళినరాత్రి కాళరాత్రికాగా కీచకునకీరాత్రి కాళరాత్రిగా నున్నది. ద్రౌపది కీచకునివంక చూడకున్నను సైరంధ్రి ననుభవింప వలెనన్న భావమాతని హృదయమునుండి తొలగలేదు. తాను ద్రౌపదిని కాలదన్నినను ద్రౌపదిని రక్షించినవారెవ్వరునూ లేకపోవుట కాతడు విర్రవీగుచు ద్రౌపది నమీపమునకేతెంచి నేడు మరల సైరంధ్రీ ! అని సంబోధించినాడు. సైరంధ్రి యాతనివంక చూడలేదు. మౌనమును పాటించిన ద్రౌపది నాతడు పలకరింపవలెను. ఆతని పలకరింపునకు మొదలెక్కడ ?

ఈ విరాటరాజ్యమునకు రాజగు విరాటుడు నామమాత్రము. నేనే ఈ రాజ్యమున కధిపతినని ప్రారంభించినాడు.

శ్లో॥ ప్రవాదేనేహ మత్స్యానాం రాజానామాఽయముచ్యతే
అహమేవ హి మత్స్యానాం రాజా వై వాహినీపతిః

కావున నా అధికారమును, ఐశ్వర్యమును నీ వనుభవింపదగుదువని ద్రౌపదిని ప్రలోభింపచేయుటకు మరల ప్రారంభించినాడు.

శ్లో॥ 'కామార్తా హి ప్రకృతి కృపణాః'

కామార్తుడీ ప్రకృతిని అర్థము చేసుకొనుటకు వానికి జ్ఞాననేత్ర మెక్కడిది ?

ద్రౌపది తన మౌనమును వీడి కీచకుని కోర్కెకు తగు నుపాయమును చెప్పినది.

ఇచ్చట పరోక్ష విషయమును చెప్పెదను. పూజ్యపాదులగు శంకరులు ఒకమాట అనినారు.

'ఇతః కోన్వస్తి మూఢాత్మాయస్తు స్వార్థే ప్రమాద్యతి'

ఆత్మజ్ఞానమువైపుకు తిరుగనివారుకూడ మూఢులే ననినారు. ఎంత పండితులైనను తన్ను తాను గుర్తించుటకై ప్రయత్నింపనివాడు మహనీయుల దృష్టిలో ఆతడు మూఢుడే కాగలడు. కీచకునిది సామాన్యమగు లోకదృష్టియందలి దోషముకాగా, ఉపనిషత్సిద్ధాంతము ననుసరించి ఆత్మజ్ఞానము లేకపోవుట మూఢత్వము కాగలదు.
కథకురండు.

కీచకునకు పగలంతయు గడచి రాత్రిభాగముకూడ కొంత గడవవలెను. కీచక ! నీ నా సంగమమున కొక్క నియమమున్నది. నీ సోదరులుగాని, నీ స్నేహితులుగాని మనల నెరిగిరేని నా భర్తలగు గంధర్వులకు తెలియును. ఇట్టి రహస్య రక్షణమును గావించుచో నేను వశమయ్యెదనని చెప్పినది.

ఈ ఘట్టమున మీకొక్క విషయము చెప్పవలసియున్నది. కీచకునితోటి ఈ విషయము ప్రస్తావించునప్పుడు, ద్రౌపది యాతని ముఖముపైకి తన చూపునైనను ప్రసరింపజేసి మాట్లాడినట్లు వ్యాస మునీంద్రులు వర్ణించలేదు.

కీచకుడు మాట్లాడిన మాటలకు ద్రౌపది సమాధానమే వర్ణించ బడినదిగాని తాను మెత్తబడిన ట్లాతనికి తోచుటకై ప్రయత్నించినట్లు లేదు. యథార్థమునకు ద్రౌపది శ్రీమహావిష్ణువు మోహినీ అవతారమున రాక్షసులను మోహింపజేసినట్లు ప్రకృతమున కీచకుని తన చూపులతో నమ్మించదగు నవసరములేదు. ఆతనిని నర్తనాగారమునకు వంటరి తనముగ రప్పించుటే ద్రౌపది కర్తవ్యము. కావున మన రహస్య సమాగమము నా భర్తలకు తెలియకుండ రమ్మని చెప్పినది. కీచకు డెప్పుడో మోహితుడై యుండుట అట్లుండ ప్రకృతమున మాట్లాడు చుండగా ద్రౌపది ఇప్పుడు ప్రయత్నించవలసిన అవసర మేమున్నది?

ఆంధ్రభారతమున, 'పలుకు లేర్పడ విని మెత్తబడినయట్లు సుభగ మెయివడి చూపుగాజూచి తనదు హృదయ మెరిగించు తెరగున నిట్టులనియె' అని ఉన్నది.

కీచకుడు ద్రౌపది కట్టుబాటునకు లొంగినాడు. ఒప్పుదలను ప్రకటించినాడు. రహస్యస్థల మెక్కడ? అనుదానిని ద్రౌపదియే నిర్ణయించినది.

శ్లో॥ తమిస్రే తత్రగచ్ఛేథా గంధర్వాస్త న్నజానతే
తత్ర దోషః పరిహృతో భవిష్యతి నసంశయః.

చీకటికాలమునం దక్కడి విషయము గంధర్వులకు తెలియదు. అదియే ఈ దోషమును పరిహరింపదగు స్థలమని చెప్పినది. కానున్న

విషయమునుకూడ స్పష్టపరచినది. అనగా నీవు చేయు దోషమునకు అదియే శిక్షార్హమగు స్థలమని ద్రౌపది భావము.

'తత్రదోషః పరిహృతః భవిష్యతి' అన్నమాటచేతకాని కీచకునకు, ఈ భాష యర్థమగునా! వ్యాసభగవానులు కీచకుని స్థితిని చక్కగ వర్ణించినారు.

'సైరంధ్రీరూపిణం మూఢో మృత్యుం తం నావబుద్ధవాన్' అతడు మూఢుడు. మూఢుడు మృత్యువును గుర్తించలేదు. కీచకునివంటి వాడెవ్వడును గుర్తించలేడని వ్యాసుని హృదయము. కీచకున కది మానసమవధి యనునట్లున్నది.

ద్రౌపది మరల వంటయింటికి వెళ్ళినది. భీమునకు వార్త నందించినది. వార్త నందించుటకాదు. మరల ఒక్కమాటు భీముని గట్టిపరచినది. ఏమని?

శ్లో॥ అశ్రుదుఃఖాభిభూతాయా మమ మార్జస్వ భారత
ఆత్మనశ్చైవ భద్రం తే కురు మానం కులస్య చ.

కీచకుని చంపి నా కన్నీటిని తుడవమన్నది. అదియే ప్రధానము కాదన్నది. మీ పౌరుషమును దక్కించుకొమ్మని చెప్పినది. ఆ పౌరుషము వ్యక్తిగతము కాదన్నది. క్షత్రియ జాతికిని, అందు భరతవంశమునకును సంబంధించినదని చెప్పినది.

ఇక్కడ భీమసేను దేమని సమాధానమిచ్చెనో తెలియునా? నీకోర్కె తప్పక నెరవేర్తునని తన సోదరులపై ఒట్టుపెట్టి చెప్పినాడు. అంతతో పోలేదు. ఒకవేళ అతని చంపుటచే వచ్చు ప్రతిబంధకములలో మత్స్యరాజ్యమున యుద్ధము ప్రసక్తమైనను మన రహస్యము బయట పడునవికూడ భయపడనని చెప్పినాడు. ఇదియే భీముని తత్త్వము. వాయుతత్త్వ మిట్లే యుండును. వాయువును జాగరూకులమై వాడుకొన

వలయును. ద్రౌపది ఈ విషయమును గమనించినది. భీమును ఎట్లు వాడుకొనవలయునో ఆమెకు తెలియును. వెంటనే సమాధాన మిచ్చినది.

నా విషయమైన కీచకవధను చేయుటమాత్రము తప్పక చేయ వలసినదే. కాని మన రహస్యరక్షణమునకు ప్రతిబంధకము లేకుండ చేయవలెనని గట్టిగ చెప్పినది.

'నిగూఢ స్త్వం తథా పార్థ కీచకం తం నిషూదయ'

ఇక్కడ తిక్కనామాత్యు లొక ఉత్పలమాలను మన కందించినారు.

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనికిన్
నెవ్వగ బొంద భూజనులు నిందయొనర్పగ నే నొనర్చు నీ
చివ్వకు నీవు నల్కమెయి జేసిన యాపని గూఢవృత్తికిన్
దవ్వగునేది నీయభిమతంబొదగూడియు నిష్ఫలంబగున్.

భీము డిప్పుడు రహస్యరక్షణకు భంగము రాకుండునట్లే చంపవలెను. భీముడును ద్రౌపదిమాటకు ఒడంబడినాడు.

'ఏవమే తత్కరిష్యామి'

అట్లొడంబరచి భీముని వేగమును భద్రపరచి ద్రౌపది వెళ్ళినది.

అది నిశీథము. సాయంకాల మగునప్పటికే రాచకన్నియ లందరును తమ తమ అంతఃపురముల కేగగా అర్ధరాత్రియందా నాట్యశాలయం దెవ్వరుండుటు? ఈనాడు భీముని రూపమున కీచకుని మ్రింగదలచిన మృత్యువు మాత్ర మా శాలాంతర్భాగమున ప్రవేశించినది ద్రౌపదియు ఆ సన్నిహిత ప్రదేశములనందుండియే యుండును. భీము డా శాలయందు ప్రవేశించు టెవ్వ రెరుగుదురు?

మసకచీకటియందే భీము డుగ్రరూపు డయ్యును తన గమన వేగ మెవ్వరును పరికించుట కవకాశ మివ్వక నర్తనాగారమువైపునకు నడచి,

ఆ గృహాంతర్భాగమునం దొక శయ్యాతలమున పరుండినాడు. భీము డను మృగరాజు కీచకుడను మృగమును వేటాడుటకై ఎదురు చూచు చున్నది.

కీచకు డైశ్వర్యమద మోహితుడు, కామమోహితుడుగూడ. అతడు తా నలంకరించుకొన్న యాభరణములను చూచి మురిసిపోవుట ఆతని స్వభావము. సైరంధ్రికిగూడ కొన్ని వినూత్నాభరణములను సంగ్రహించుకొని, సైరంధ్రితో తా ననుభవించదలచుకొన్న శృంగార క్రీడావిశేషముల మననము గావించుకొనుచు నర్తనాగారమున ప్రవేశించినాడు. అంధకారబంధురమగు నా శాలాంతర్భాగమున సైరంధ్రి యొక్కతియే యున్నదనిగదా ! అతని భావము.

సైరంధ్రికి తాను సంపాదించిన ధనమంతయు ధారపోయుటకు నిశ్చయించుకొనినాడు. తన సంభాషణములకు సైరంధ్రి తన్ను మోహించినదన్న సంతోషతరంగము లాతని నాక్రమించగా ఆ కటిక చీకటియందే సైరంధ్రీ ! ఇవిగో నా సర్వస్వమగు సంపదల నీకే అందించుచుంటినని పలుకుచు, ఆ కులుకుపలుకులలో తన కొర కెందరో సుందరాంగనలు తన భూషణాంబరములకు మురిసి తన స్పర్శ సుఖము ననుభవింపవలెనని వచ్చుచుందురట. రతిమందిరమునం దనుభవించదగు రతి సౌఖ్యమును నీ నిమిత్తముగ వదలుకొని సైరంధ్రీ ! ఈ చీకటి గృహమున కేతెంచుట జరిగినది. నాకొరకై సురతసుఖమును కాంక్షించు స్త్రీలు రాగా నేను నీకొర కిక్కడి కేతెంచితినని ఆత్మ ప్రశంసలతో శయనతలమును సమీపించినాడు.

ఇక్కడ కీచక భీమసేనుల సంభాషణయం దొక చిత్రమును మీకు చూపుదును.

కీచకుని పై సంభాషణ లట్లుండగా అతడు తనయందొక ప్రత్యేకత కలదని పలికినాడు.

శ్లో॥ ఆకస్మాన్మాం ప్రశంసంతి సదా గృహగతాస్త్రియః
సువాసా దర్శనీయశ్చ నాన్యోఽస్తి సదృశః పుమాన్.

తనయింటి కేతెంచి రతిసుఖము ననుభవించిన స్త్రీ లెందరో నీవంటి చూపరులై చీని చీనాంబరముల ధరించిన మగవా రెవ్వరును లేరని తనను ప్రశంసించునట. ఆ ప్రశంసాపత్రమును చూపుటకు చీకటి యగుటచే నోటిమాటల చెప్పినాడు.

ఇంతవరకు తన ప్రశంసల గావించుకొనుటేగాని సైరంధ్రి పలుకుల కాతడు తావివ్వలేదు.

శయనతలమున నిప్పులు గ్రక్కుచు ఒక్క ఆలింగనముననే మర్దించివైవ నుంకించు మాయాసైరంధ్రి ( భీమసేనుడు ) శయన తలమునుండియే కీచకున కీక్రింది సమాధాన మిచ్చుచున్నది.

కామధర్మముల గుర్తెరిగిన కీచకా ! నీవింతవర కెందరో స్త్రీలను రమించియుందువు కాని, నావంటి స్త్రీస్పర్శ నెప్పుడును పొందియుండవు. నన్ను తాకి స్పర్శసుఖము ననుభవించిన పురుషు డెవ్వడును మరియొక యువతిని ముట్ట కుతూహలము నొందడు — పురుషులలో నీకు నీవు సాటి గాగా, స్త్రీలయందు నాకు నేనే సాటియని ప్రతి సమాధానము నిచ్చుచు, ఇదిగో ! నా యాలింగనమని, కీచక హతకుడు తన బాహుద్వంద్వమునం దిరుకుటకు దొరకినందుకుగల యుత్సాహ ముబ్బగా, ఒక్క నవ్వు నవ్వి, కీచకుని గాఢాలింగనమున భీముడు బంధించినాడు. అంతియె; ఒకరి రొమ్ము మరియొకరి రొమ్ముకు హత్తుకొనగా ఇరువురి వక్షస్థలములును ఒక్కటై యుండుటచే కీచకుని శృంగారిము వీరమునకు దారితీసి భీభత్సమైనది. నీచ శృంగారమున కిదియే రూపము. వారిద్దరకును ద్వంద్వయుద్ధము సాగినది.

మూలమునం దీ ద్వంద్వయుద్ధమంతయు వర్ణింపబడి, వారి యుద్ధము వాలిసుగ్రీవుల బోలియున్నదనియు, వారి పిరాలాపములు బాహాటముగనే సాగి రణరంగమున ప్రతిధ్వనించునట్లే వారు గర్జిల్లిరనియు, వారి ముష్టియుద్ధమునకు ఆ భవనము కంపించినదనియు, వ్యాసులు వర్ణించినారు. వ్యాసభారతమున రహస్యస్థలము నిర్దేశింపబడిన చందమున యుద్ధముగూడ నిశ్శబ్దముగ నడచినదని చెప్పబడియుండలేదు.

వ్యాసభగవానులు తా నేమి వ్రాయుచుంటినో ఇంతకు పూర్వ మేమి వ్రాసితినో యను స్మృతి లేకయే ఇట్లు వర్ణించియుండునా ? ఇంత చిన్న విషయముననే మందమతియై వర్తిల్లిన వ్యాసభారతమును తెనిగించిన యాంధ్రకవులు కవిబ్రహ్మ లెట్లైరి ?

భారతము కవివృషభులకు మహాకావ్యమని నన్నయభట్టారకు లెట్లు పలికిరి ? ఆనాటి సంఘమునం దీనాటి లౌకిక జ్ఞానము లేకయే అట్లు వర్ణించెనా ?

ద్రోణాచార్యుని యుద్ధరచనా కౌశలము నంతను కన్నులకు కట్టినట్లు చూప సమర్థులైన వ్యాసభట్టారకులను గురించి ఇట్లు వ్రాసి నందుకు మన మేమనుకోవలెను ?

వ్యాసుడు ఛాందసు డనవలెను : లేక పొరబడినా డనవలెను : లేక ఎవ్వరో ఆ శ్లోకముల నిరికించి రనవలెను. ఏమనవలెనో నాకునూ తోచుట లేదు.

శ్రోతలారా !

కవి కాలము గ్రహణముపలె అల్పాయుష్కుల మందబుద్ధుల నావరించగా వ్యాసున కానాటికి సభ్యత్వము తెలియదనవచ్చునేమో !

ఆర్షగ్రంథము లందలి యనల్ప తేజోవిరాజితములగు విషయముల చర్చించుటకు అల్పతరాయువు లుగ్రరోగసంకలితు లద్దాలు

గారు. కొంచెము భక్తి, శ్రద్ధా, విశ్వాసములు అను బలవర్ధ కౌషధముల సేవించుచో వారి విజ్ఞానమును మన మర్థము చేసుకొనవచ్చును.

పాండవుల యజ్ఞాతవాసమునకు బలము లౌకికశక్తికాదు. 'అజ్ఞాత వాసమును నేను దిగ్విజయము గావింతు'నని దుర్గామహాదేవియు ధర్మదేవతయు వరము లిచ్చినారు. ఆ మహాశక్తి ఏ రూపమున నాయముచేయును ? సర్వభూతముల యందును ఆ మహాశక్తి బుద్ధిరూపమునగూడ వెల్గొందును.

'యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా
యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా'

కాని ఆమె ఏకాలములందు రక్షించును ? అన్నికాలముల యందును. అయ్యును జీవుడు తన్ను తాను మరచినపుడు ఆమె రక్షణ మవసరము. యుద్ధమట్టిదే. మైమరచి యుద్ధము చేయుదురు. యుద్ధము చేయునప్పుడు తాను గ్రుద్దుట ఎవరైన విందురేమో నను భయముతో చేయుట సహజముగాదు. అందును సింహబలునికంటె బలాఢ్యునితో యుద్ధము చేయునప్పు డెవ్వ రెక్కడ నిద్ర లేతురోనని భయకంపితుడై భీముడు భీమయుద్ధమును చేయునా ? అట్టి ఘట్టములయందు రక్షించుటకే దైవశక్తి. దైవోపహతులగువారలు సామాన్య నిద్రయందుండిగూడ దొంగలు దోచుకొనునప్పు డేదియో చప్పుడనుకొని నిద్రించుట మీ రెరుగనిదికాదు. కావున భీమబలులగు భీమకీచకుల యుద్ధము ఘోరముగా సాగినను నిద్రారూపమున చరించు ఆ మహాశక్తియే ప్రజలను నిద్ర పుచ్చునదని వ్యాసుని హృదయము. ఇందు సందేహమేమియులేదు. ద్రౌపది అలనాటి ఆపత్కాలమున ద్వారకానాథుని పిలువగా ద్వారకానాథుడు పిలుపు నందుకొన్నట్లే ఈనాటి భీముని ఘోర యుద్ధమున కెవ్వరును నిద్ర మేల్కాంచలేదు.

దైవమును మేము నమ్మము. ప్రకృతి-సహజమునకు విరుద్ధ ముండుట మాకు సమ్మతము లేదనువారు భారతకథకే స్థానము నివ్వకూడదు. మానవ స్వభావమున కతీతమయినదే దైవశక్తి.

కథకు పోదము.

ముష్టియుద్ధమున సింహబలుని భీముడు పరిమార్చినాడు ; యజ్ఞ పశువువలె. అదియొక వింతచావు. శరీరముయొక్క పై భాగమును అధోభాగమగు కాలుసేతులను మధ్యభాగమునం దణచివేయబడుటచే కీచకుని శరీరమంతయు ఒక మాంసపుముద్దయైనది. అట్లు పిండీకృతమై యున్న కీచకుని దేహమును కాలదన్నగా భీముని క్రోధాగ్ని చల్లారినది. ఇక ద్రౌపదిక్రోధ ముపశమించవలెను. ఆ గాఢాంధకారమున కొరివి నొకదానిని ప్రజ్వలింపజేసి కీచకుని మృతకళేబరమును కన్నులార గాంచినది. ఆ సమయముననే భీముడు నిన్ను కామించిన వా రిట్లగుదురని ప్రతినవలె పలికి ద్రౌపదికి సంతసమును గూర్చినాడు. మహాభార తేతిహాసమున ద్రౌపది దుర్గాదేవి యవతారము. వారి కర్తవ్యములు దేశ సౌభాగ్యసంపత్సమన్వితములు.

ద్రౌపది అంతతో ఆగినదా ! లేదు. అందున్న కావలివారిని నిద్ర లేపినది. రండు రండు ! పరస్త్రీలను కామించువారందరు రండు. ఇదిగో ! కీచకుని చంపినారని యెలుగెత్తి చాటినది. ఆమె కేమి భయము ? అది యొక యుపదేశము.

శ్లో॥ పరస్త్రీ కామ సంమత్త స్త్వాగచ్ఛత పశ్యత

ద్వారపాలకులు నిద్రలేచినారు. అందు అనేకవేలమంది రక్షక భటులుందురు. వారందరు నిద్రలేచి కొరవుల చేతనిడుకొని వచ్చి చూచినారు.

కీచకుని మారణమును గురించి వా రిట్లు నిర్ణయించినారు. ఇది మనుజులు చంపుపద్ధతికాదు. దేవత లిట్లే చంపుదురని, శిరమును బాహువులనుకూడ దృశ్యములు కాకుండ చంపుట గంధర్వుల కృత్యములు కాబోలు!

తాబేలును భూమిపైనుంచగా దాని అవయవములన్నియు దేహాంతర్భాగములోనే అంతర్భూతమై యుండును. అట్లున్న కీచకుని చూచి బంధువు లెల్లరు నా యర్ధరాత్రముననే దుఃఖించగా కొందరు కీచకునకు చేయదగు ప్రేతసంస్కారమునకై బాహ్యప్రదేశమున కాతని తీసుకుపోవ నిశ్చయించినారు.

ఆ సందర్భమున ద్రౌపది ఎక్కడున్నది? అచ్చటనే బాహ్య ప్రదేశమునం దున్నది.

కీచక సంతతివా రందరకును ఉపకీచకులని పేరు. వారందరును ద్రౌపదియే సూతుని మరణమునకు కారకురాలు; గావున ఈమెను కేవలము చంపుటకాదు; కీచకునకు ప్రియ మొనర్చుటకై ఈమెనుకూడ దహనము చేయుట యుక్తమని సలహా నిచ్చినారు.

వెంటనే వా రాపని కియ్యకొనిరా! లేదు. రాజాజ్ఞకై విరటుని మందిరమునకేగి, కీచకుని వృత్తాంతమును చెప్పి ఆమె నట్లు చేయుటకు విరటునివద్దనుండి ఆజ్ఞను తెచ్చినారు. సూతులు బలవంతులు. విరటు డేమి చేయును? వారికే వదలుటచే వా రాపనికి పూనుకొని బంధించినారు.

ఇప్పుడు భీము డెక్కడుండెను! వంటయింట నిశ్చింతుడై పరుండెను. 'ఆమంత్ర్య ద్రౌపదీం కృష్ణాం క్షిప్రమాయాన్మహానసం' ద్రౌపది యార్తయై తన భర్తలను జయంతాది సంజ్ఞానామములతో బిగ్గరగ శరణాగతి నొందుచు మొలగెత్తి యఱచినది. ఆ నాదము భీముని చెవిన పడినది. అంతియే. దిగ్గున లేచినాడు. అక్కడనుండియే సైరంధ్రీ!

నేను వచ్చుచుంటినని సమాధాన మిచ్చి సరాసరి స్మశానవాటి కేగగా, అక్కడనే ఆతని కొక మహావృక్షము కనబడినది. అది కొమ్మలు, రెమ్మలుగల ఫలవృక్షముగాదు. దాని నూడబెరికి చేతనిడుకొని, రివ్వున వచ్చు భీముని వేగమునకు భయపడి కీచకులందరు పలాయనమును చిత్తగించగా ద్రౌపదిని వదలించి, ఆమెను నగరమున కేగమని తాను వేరొకమార్గమున వత్తునని చెప్పి, పారిపోవు కీచకు లందరి నొక్కచో చేర్చి వారందరను హతమార్చినాడు. మృతులైన కీచకులు నూట అయిదుగురు. ఇంతతో కీచకవధ ముగిసినది. తరువాతి వృత్తాంత మేమి?

సర్వాంగసుందరియగు సైరంధ్రిని తరిమివేయకున్నచో ఆమె నిమిత్తముగ పురమునం దెక్కడను పురుషపుంగవులు బ్రతుక రనుట నిర్వివాదము. కావుననే మిగిలిన వారందరును ఆ ప్రయత్నమును చేయుటకు విరాటునివద్ద కేగినారు. విరాటునకు ఆ భయము కలిగినది. విరాటుడు సుధేష్ణకు సైరంధ్రిని పంపివేయమని ఆజ్ఞ నిచ్చినాడు.

తెల్లవారినది. సైరంధ్రి కీచకునిచేత విముక్తయై ముఖప్రక్షాళన గావించుకొని రాచబాటనుండి అంతఃపురమున కేగవలెను. బయలుదేరినది. పురుషు లెవ్వరైన ఆమెను కన్నెత్తి చూడగలరా? కొంద రామెను చూచి కండ్లు మూసుకొనుచుండిరి. కొందరు గంధర్వుల తలచి భీతిల్లుచు నడచుచుండిరి. ఆమె వెడలు మార్గమధ్యముననే భీముని పాకశాల. అత దాద్వారదేశమున మదపుటేనుగవలె నుంచొనగా ద్రౌపది చూచినది. మందహాసముఖముగ 'గంధర్వరాజాయనమః' అను పలుకుతో భీమునకు స్వాగతము నొసంగి కొంతదూర మేగినది.

తరువాతది నర్తనశాల. బృహన్నలయు, రాజకన్యకలును ఆ శాల యందేగదా యుందురు? ద్రౌపదిని చూచుట కా రాచకన్యలు పరుగు

లెత్తుకురాగా బృహన్నలయు సైరంధ్రిని పలకరింప వచ్చినాడు. సైరంధ్రికి స్వాగతవచనముల వినిపించుట కన్నియల హృదయము. నేడు సుదినమని కీచకుని చావునకు కన్యకలందరును హర్షమును వెలిబుచ్చినారు. వారు స్వేచ్ఛగ బాహ్యప్రదేశముల చరించుట కీనాడు సైరంధ్రి అవకాశమును కల్పించినది. బృహన్న లేమనెను?

సైరంధ్రీ! నీవెట్లు విముక్తురాలవైతివని పలుకరించినాడు. సైరంధ్రి ఏమి చెప్పును? బృహన్నలకు సైరంధ్రి సంగతి దేవికవి ప్రశ్నించి పోవచూచినది.

సైరంధ్రీ! మనమందర మొకచో వసించువారముకాగా సైరంధ్రికి వచ్చిన యాపదకు బృహన్నల మాత్రము దుఃఖించదా? అని సమాధాన మిచ్చినాడు.

ఇంతవరకు రాచబాటనుంచి అంతఃపురమునకుబోవు సైరంధ్రి సమాచారము. ఇక అంతిపురమున కేగుదము.

అది సుధేష్ణ మందిరము. సైరంధ్రి సరాసరి రాజపత్నియగు సుధేష్ణదగ్గరకే వెళ్ళినది. సుధేష్ణ సైరంధ్రి నేమని పలుకరించును? విరాటుడు తనకు చెప్పిన మాటను సైరంధ్రి కెరింగించినది. అప్పటికి పాండవుల అజ్ఞాతవాసకాలము పదమూడురోజులు మాత్రమే మిగిలినది.

సైరంధ్రి వినయపూర్వకముగ సుధేష్ణకు తన గడువుకాలమును విన్నవించుకొని, నాథులగు గంధర్వులు వారి ప్రతిబంధకకాలముగు పదమూడు దివసములు గడపగా వచ్చి మీకు తప్పక ప్రియమాచరింతురని సౌహార్దముతో పలుకగా సుధేష్ణయు మెత్తపడినది. కీచక ఘట్ట మింతతో ముగిసినది.

# ఉత్తర గోగ్రహణము

శ్రోతలారా!

మన మిప్పుడెక్కడుంటిమి? విరాటనగరమున పాండవులతో కలసి వారి కథాక్రమమున వాళ్లోని యుంటిమి. కావుననే మనకు హస్తినాపురములోని వార్తలు తెలియవు. ఒక్కమారు హస్తినాపురమున కేగుదము.

హస్తినాపురమున దుర్యోధనుల వేగుల వాండ్రందరును పాండవు లెచ్చట వసించి అజ్ఞాతవాస వత్సరమును గడుపుచుండిరో తెలిసికొనుటకై దేశదేశముల గ్రుమ్మరి, వనసీమల వెదకి, వెదకి హస్తినాపురమున కేతెంచినారు. వా రిచ్చిన సలహా లిట్లున్నవి.

పాండవు లీభూరేఖపై మాకు కనబడలేదు. మేము వెదుకులాడిన ప్రదేశములు అపరిమితములు. ద్వారకాపురమునందుగూడ గూఢచారుల మయ్యే పరికించితిమి. దుర్యోధనమహారాజా! మా యభిప్రాయమున వారు నష్టమై యుందురుగాని జీవించియుండరు.

'సర్వథా విప్రనష్టాస్తే' ఇది గూఢచారులవలన దుర్యోధనున కందిన సమాచారము. దుర్యోధనున కొక్క ముహూర్తకాల మేమియు తోచలేదు. అజ్ఞాతవాసర వత్సరమంతమగుచుండగా పాండవుల జాడ తెలియలేదు. ఇప్పు డేమి చేయవలెను?

భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాచార్య, దుశ్శాసనుల నొక్కచో చేర్చి ఆలోచనలు సాగించినాడు. కర్ణు డాతనికి మొదటి సలహాదారుడు. కర్ణుని యభిప్రాయమును దుర్యోధనుడు ప్రత్యేకముగ కోరనక్కరలేదు

అయ్యును దుర్యోధను డందర నుద్దేశించి తన కర్తవ్యమును చెప్పవలసి నదిగా కోరినాడు. కాని కేవలము దుర్యోధనుడు తన కర్తవ్యమును మాత్రమే చెప్పమనలేదు. పాండవులను వర్ణించి పాండవులు తిరిగి రాజ్యమున ప్రవేశించకుండ నిస్సపత్నమగు రాజ్యము తన కెట్లు దక్కునో చెప్పమని వారల నందర నడగినాడు. యడుగుట తడవుగా కర్ణుడు ప్రకృతమున వెదకి వచ్చినవారికి స్థాన మివ్వక సమర్థులగు గూఢచారులను మరల పంపి వెతకించుట అవసరమని చెప్పినాడు. అనగా వారు నష్టము కాలేదని కర్ణుని నిర్ణయము. కర్ణుడు చెప్పినట్లు దుశ్శాసనుడు వేరొక గూఢచారి బృందమును పంపుట కంగీకరించినను, పాండవు లెక్కడో ప్రాణములనుకూడ కోల్పోయి యుందురని తన యభిప్రాయ మును తెలిపినాడు. ఒకవేళ వారు చావకున్నను ఎక్కడనో విగూఢ ప్రదేశములందు దాగి యుందురేగాని హస్తినాపురమునకు రారని దుశ్శాసనుడు తన యభిప్రాయమును చెప్పినాడు.

శ్లో॥ అత్యంతం వా నిగూఢాస్తేఽపారంచోర్మిమతో గతాః
వ్యాళైశ్చాపి మహారణ్యే భక్షితాశ్శూరమానినః.

సముద్రములను దాటికూడ పోయియుండవచ్చునట. లేక కొండచిలువలవంటి పేవో వారిని మ్రింగియుండవచ్చునట. ఏది ఏమైనను దుర్యోధనుని 'నీవు నిశ్చింతగ యుండవచ్చు'నని తెలిపినాడు.

చ. వలదు రోయ బాండవుల వా రొక యూరట లేని త్రిమ్మటన్
బల మఱి వన్యసత్వములపాల్పడి చచ్చినచోట బూరియు
న్మొలవదె యిలత కిం కిట మనోముద మస్ఖలితంబు గాగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిదగుచందమునం గొనియాడు మున్నతిన్.

ద్రోణాచార్యులు దుశ్శాసను డిచ్చిన సలహాను గట్టిగా ఖండించినారు.

'నతాదృశా వినశ్యంతి నప్రయాంతి పరాభవం'

పాండవులు మీ రనుకొనునట్లు నశించువారు కారని చెప్పి, వారి వంటి వారి కెవ్వరికిని వినాశపరాభవములు కలగవని నొక్కి వక్కాణించి నారు. అంతతో ఆగలేదు. పాండవుల గుణవర్ణనగూడ చేసినారు. మూలమునందలిశ్లోకములకే తిక్కనగారి యనువాదముగూడ. తిక్కనగారి పద్య రత్నమునే మీ కందించుచున్నాను.

ఉ॥ క్షాత్ర సమగ్రు లార్యనుత గౌరవదీప్తులు వర్ధనీయ సౌ
భ్రాత్రు లుదాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లా పృథా
పుత్రులు వారి నాపదలు వొందునే యోపిన నింకనైన నీ
ధాత్రిగడంగి యారయువిధంబులు సెప్పుదు నేర్పు పేర్పడన్.

పాండవుల గుణగణ మంతయు ఒక ఉత్పలమాలయై తిక్కనగారి కందినది. భీష్ము లేమనిరి ?

ఆతడు ద్రోణుని బలపరచుచు పాండవుల గుణసంపదను మరల యనువదించి తన ప్రత్యేకమగు యభిప్రాయము నొసంగినారు. భీష్ముని దృక్పథమున దుర్యోధమునకు సునీతిని తెలుపుట వ్యర్థమని యున్నను తా నా సభయం దున్నందుకు చెప్పక తప్పదను భావమున చెప్పినారు. ఆ మాటను భీష్ముడు స్వయముగ పలికినారు.

'న త్వియం మాదృశైర్నీతి స్తస్య వాచ్యా కథంచన
సా త్వియం సాధు వక్తవ్యా న త్వనీతిః కథంచన'

మావంటివారు చెప్పదగు నీతి నిచ్చట చెప్పుట యుక్తముకాదు. అయ్యును చెప్పవలసివచ్చినప్పు డవినీతిని చెప్పుట ధర్మముకాదు. గనుక నీకు సలహా నిచ్చుచుంటినని గట్టిగ చెప్పి, నామాటలు పాండవుల యందలి పక్షపాతబుద్ధితో వచించు మాటలని మాత్రము భావించవద్దని

దుర్యోధనునకు హితమును బోధించి పాండవులను గురించి వివరించినాడు.

దుర్యోధనా ! నీవు పంపిన గూఢచారులు వారిని కనుగొనజాలరు. వారి నామరూపములతో వారిని వెదకుట తప్పు. వారున్న ప్రదేశములందుండు గుణసంపద ననుసరించి – వారీ ప్రదేశమున ఉండి యుందురని ఊహించవలెను.

ధర్మదేవతాస్వరూపమునకు ప్రతిబింబమయిన ధర్మనందనుడుండు ప్రదేశమున ధర్మఫలరూపములగు మహాలక్ష్మి విలాసములు బహుముఖములై ప్రదర్శింపబడుచుండును.

మొదటిది, వారున్న రాష్ట్రము నందలి ప్రజలు మద, మాత్సర్య ఆసూయాది గుణముల వదలి శాంతజీవనముల గడపుచు దేవబ్రాహ్మణ భక్తిగలవారై చరింతురు. బ్రాహ్మణుల ముఖమునుండి వెలువడు వేద ఘోషలచే దిక్కులు పవిత్రములు కాగా తమ పాదవిన్యాసముచే భూదేవికి పవిత్రతను కల్పించు గోసంపదంతయు ఆ రాష్ట్రమున సుసంపన్నమై యుండగలదు. భూమి సస్యశ్యామలయై మానవాభ్యుదయమును కల్పించగా కాలమునందు కురియు వానలు లేవచ్చికబయళ్ళను సుసంపన్నములు గావించి భూమిపై తిరుగాడు పశుసంపదకంతకు నాతిథ్యము సందించుచుండును. చోరాగ్ని బాధలు వారుండు రాష్ట్రమునందుండవు. సర్పదష్టులై మనుజులెవ్వరును చావరు. పశునష్టముకలుగదు. ప్రజలు రోగార్తులై బాధనొందరు. ఇవన్నియు ధర్మనందనుడుండు దేశమును గుర్తెరుగు చిహ్నములు. చిహ్నములచే గుర్తెరుగదగు ధర్మదేవతను కన్నులతో చూచుట దుర్లభమని భీష్ములు నిర్వచించినారు.

కొందరు బుద్ధిమంతులు దేవుని చూపమందురు. కన్నులతో చూడదగు ఆకృతిని చెవికి చూపమన్నచో ఆ రూపసంపద చెవికి

కనబడునా? మనస్సునందు ధ్యానము కావింపగా కనబడదగు భగవద్రూపమును బాహ్యేంద్రియములగు నేత్రము లెట్లు చూచును! సామాన్యముగ నీటియందుండు సూక్ష్మ జీవకణములే కన్నులకు కనబడకపోవుటచే వాటిని చూడదగు యంత్రముల నపేక్షింపగా ఆ జంతువులయందుగూడ అంతర్వ్యాప్తమై యుండు దైవతేజమును మన మాంసపుకన్నులు చూడగలవా? అదియే భ్రమ. దుర్యోధనున కీవిషయమునే భీష్ముడు చెప్పినాడు. తరువాత కృపాచార్యులు మాట్లాడినారు.

దుర్యోధనుని భావము పాండవులకు రాజ్యము దక్కకుండ తనకు సుస్థిరము కావలెననిగదా!

దుర్యోధనుని మాటను పురస్కరించుకొనియే సలహాదారులందరును సలహా నిచ్చినారు. పై వారి యభిప్రాయముల నొక్కమారు సంగ్రహించి కృపాచార్యుల మాటలు చెప్పెదను.

పై వారియందు గూఢచారి బృందము పాండవు లీ ప్రాంతములందే లేరు గావున రాజ్యము తమదేనని దుర్యోధనునకు వంతపాడినారు.

కర్ణుడు ప్రస్తుతమున వెళ్ళిన గూఢచారులు సమర్థులుకారని చెప్పి వేరొక బృందమును నియమించుచో వారు పాండవులను కనుగొనగా నీ సంకల్పము నెరవేరుననని సలహా నిచ్చినాడు.

దుశ్శాసనుడు మరల వేరొక గూఢచారి బృందము ప్రయత్నించుటను కాదనక పాండవులు బ్రతికియుండుచో సముద్రముల కవ్వలకు పారిపోయియుండుటగాని లేక చచ్చియుండుటగాని జరిగియుండవచ్చును గనుక నిశ్చింతుడవై నిస్సపత్నమగు రాజ్యమును కొనసాగించుకొమ్మని అన్నగారికి నొక్కిచెప్పినాడు. పాపము! దుర్యోధనుని చింతనే తొలగించినాడు.

ద్రోణాచార్యులు వారందరును పడిన శ్రమను తొలగించి, పాండవుల బల, వీర్య, తేజస్సులను వర్ణించి, వారు చచ్చిరవిగాని, వారిక రాజ్యమునకు రారనిగాని, అనుకొనుట కుదరదు. వారు బ్రతికియే యుండిరని నిర్ణయించి, కర్ణుడు చెప్పినట్లు సమర్థులగువారల నియోగించుచో: అందు ధర్మజాదులను గుర్తించగల సమర్థమగు బ్రాహ్మణ బృందమును నియోగించుట మంచిదని సలహా నిచ్చినారు.

భీష్ముడు ఎంత సమర్థులైనను పాండవులను సరాసరి కనుగొన జాలరని చెప్పి, వారిని కనుగొనుటకు కొన్ని లక్షణములను గుర్తించ వలసియున్నదని ధర్మలక్షణములను బోధించి వారి నాశమును గురించి నీవెంత ప్రయత్నించినను అది సాధ్యమగునది కాదని నిరూపించినారు.

ఇక కృపాచార్యులు వారియందరిపై మరియొక మార్గమును సూచించినారు. ప్రస్తుతమున దుర్యోధను డెంత దక్షులైన గూఢచారుల నియోగించినను ప్రయోజనములేదు. పాండవుల యజ్ఞాతవాస సత్సరము సమాప్తము గావచ్చినది. అయినదనే అనవచ్చును. మీరు వెతకి వారివి కనుగొనునాటికి పూర్తికాక తప్పదు. వారు బలవంతులు, నీతివిశారదులు. తాముపడ్డ పాట్లకు వారు ప్రతీకార మొనర్పక మానరు. ఒకవేళ వారు ఉదారహృదయులై సంధికి వచ్చుటయు కలదు. లేక యుద్ధమునకు కూడ సిద్ధము కావచ్చును. కాని దుర్యోధనుడు మాత్రము శత్రుబలము నుపేక్షించుట తగదు. తన బలమును భద్రపరచుకొని మిత్రబలమును కూడ సమకూర్చుకొనుట అత్యవసరము. ఇదియే నాహృదయమని కృపాచార్యులు వివరించినారు. అనగా సామాన్య శత్రువులనే ఉపేక్షింప రాదని నీతిశాస్త్రము చెప్పగా పాండవులవంటి బలవంతుల నుపేక్షించుట తగదని వీరి యభిప్రాయము. ఇది దుశ్శాసనుని మాటకు సమాధానము. ఈఘట్టమున కృపాచార్యుని సంభాషణమును తిక్కనగారి ఛందోబద్ధ వాక్యములుగగూడ వినిపింతును.

తిక్కనగారి పద్యములు:-

ఉ॥ వారలు పూనినట్ల వనవాసము సల్పిరి పీరు వేచి త
మ్మారయగా బయల్పడనియట్లుగ నుండెదు వత్సరంబునుం
జేరువచేరువల్ గడచె జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కిన్నృపాలునెడ వీరికి నూరక యుక్కు గర్జమే.

కం॥ అలు చైనను బగతునిదెస
దలపు గలుగ వలయు ననిన దర్పోజ్జ్వలదో
ర్బలు లగు కౌంతేయుల మన
మెలమికలిమి నచ్చి యిట్టులేమరనగునే.

ఇక్కడికి పాండవులను గూర్చిన ఆలోచనలు సమాప్తమైనవి. వీరి యాలోచనలలో చివరి సలహాదారుడు కృపాచార్యుడు. ఆయన సలహా ననుసరించుచో దుర్యోధనునకు యుద్ధసన్నాహమే ప్రధానము. పాండవుల నన్వేషింప నవసరములేదు. మరి దుర్యోధను డేమి నిశ్చయించెను ?

వ్యాసభారతి ననుసరించి కృపాచార్యుని యనంతరము దుర్యోధను డేమియు మాటాడలేదు. అత డేమియు నిర్ణయించలేదు. కృపాచార్యుడు విరమించగనే ఎవ్వరికిని ఎడమీయక మాటాడినవాడు సుశర్మ. అతడు త్రిగర్తదేశమునకు రాజు. అతడును దుర్యోధనున కాప్తమిత్రుడే.

శ్లో॥ అథ రాజా త్రిగర్తానాం సుశర్మా రథయూథపః
ప్రాప్తకాలమిదం వాక్యం ఉవాచ త్వరితో బలీ.

ఈ శ్లోకము ననుసరించి సుశర్మ దుర్యోధనుని మాట కెడమీయ కయే మాటాడినట్లు స్పష్టమైనది. అంతేగాక అత డేదియో యొక అవసరమగు కాలమునుగూడ దృష్టియం దుంచుకొని మాట్లాడుటకూడ జరిగినట్లు తెలియుచున్నది.

సుశర్మ కింకొక స్వార్థమున్నది. మాత్స్య లెన్నియోసారులు సుశర్మపైకి యుద్ధమున కేగి ఆతని నోడించినారు. వైశంపాయనులు జనమేజయునకు చెప్పుటలో చాలాసారులుగా విరటుడు త్రిగర్తుని పరాభవించినట్లు చెప్పినారు. దానికి కారణము కీచకుడు విరటునకు సేనానాయకు డగుటయే.

శ్లో॥ అసకృన్నికృతాః పూర్వం మత్స్యశాల్వేయకైః ప్రభో ;
సూతేనైవ చ మత్స్యస్య కీచకేన పునః పునః.

ఆ ఘట్టమును దృష్టియందుంచుకొన్న సుశర్మ, కౌరవ సామ్రాజ్య లక్ష్మికై పోరాటము నాగించుటకైనను సిద్ధపడుచున్న దుర్యోధను నాధారముగా గొని విరాటునిమీదికి యుద్ధమున కేగదలచినాడు.

భీష్మ, ద్రోణ, కృపాచార్యుల సంభాషణమున పాండవులు తప్పక యుద్ధమునకు దిగుదురని సుశర్మ కర్థమైనది. దుర్యోధనుడు పాండవులకు రాజ్య మీయడనునది నిర్దిష్టమగు విషయము. కావున దుర్యోధనుని యుద్ధోన్ముఖుని జేయుట సుశర్మకు చాల అవసరము. కావుననే దుర్యోధనునకు ఆలోచన కెడమీయక తానే సంభాషించుట మొదలు పెట్టినాడు.

సంస్కృత భారతమున దుర్యోధనుడు విరటునిపై యుద్ధమునకు సంకల్పించలేదు. విరాటునిపైకి దాడిచేసి ఆతని ధనసంచయమును కొల్లగొట్టి తెచ్చుచో, మన యుద్ధనిధికి పనికివచ్చునని సుశర్మ దుర్యోధనుని ప్రేరేపించినాడు, యుద్ధనిధితోపాటు సైనికబలముగూడ మన స్వాధీనమగునని సుశర్మ దుర్యోధనునకు ఆశగొలిపినాడు. ఈ విషయమునంతను కర్ణునిపై చూపునిలిపి దుర్యోధనునితో మాట్లాడి నట్లు వ్యాసులు వర్ణించినారు.

సుశర్మ కింకొక స్వార్థమున్నది. మాత్స్య లెన్నియోసారులు సుశర్మపైకి యుద్ధమున కేగి అతని నోడించినారు. వైశంపాయనులు జనమేజయునకు చెప్పుటలో చాలాసారులుగా విరటుడు త్రిగర్తుని పరాభవించినట్లు చెప్పినారు. దానికి కారణము కీచకుడు విరటునకు సేనానాయకు డగుటయే.

శ్లో॥ అసకృన్నికృతాః పూర్వం మత్స్యశాల్వేయకైః ప్రభో ।
సూతేనైవ చ మత్స్యస్య కీచకేన పునః పునః.

ఆ ఘట్టమును దృష్టియందుంచుకొన్న సుశర్మ, కౌరవ సామ్రాజ్య లక్ష్మికై పోరాటము సాగించుటకైనను సిద్ధపడుచున్న దుర్యోధను నాధారముగా గొని విరాటునిమీదికి యుద్ధమున కేగదలచినాడు.

భీష్మ, ద్రోణ, కృపాచార్యుల సంభాషణమున పాండవులు తప్పక యుద్ధమునకు దిగుదురని సుశర్మ కర్థమైనది. దుర్యోధనుడు పాండవులకు రాజ్య మీయుదననది నిర్దిష్టమగు విషయము. కావున దుర్యోధనుని యుద్ధోన్ముఖుని జేయుట సుశర్మకు చాల అవసరము. కావుననే దుర్యోధనునకు ఆలోచన కెడమీయక తానే సంభాషించుట మొదలు పెట్టినాడు.

సంస్కృత భారతమున దుర్యోధనుడు విరటునిపై యుద్ధమునకు సంకల్పించలేదు. విరాటునిపైకి దాడిచేసి అతని ధనసంచయమును కొల్లగొట్టి తెచ్చుచో, మన యుద్ధనిధికి పనికివచ్చునని సుశర్మ దుర్యోధనుని ప్రేరేపించినాడు, యుద్ధనిధితోపాటు సైనికబలముగూడ మన స్వాధీనమగునని సుశర్మ దుర్యోధనునకు ఆశగొలిపినాడు. ఈ విషయమునంతను కర్ణునిపై చూపునిలిపి దుర్యోధనునితో మాట్లాడి నట్లు వ్యాసులు వర్ణించినారు.

శ్లో॥ ... ... ... ... ...

'సకర్ణ మభ్యుదీక్ష్యాఽథ దుర్యోధనమభాషత'

కర్ణుని చూచుచు దుర్యోధనునకు చెప్పుటలోని అంతరార్థ మేమి? కర్ణుడు యుద్ధోన్మాది. అతనినిగూడ ఒడంబరచినగాని దుర్యోధను డుద్యుక్తుడు కాడు. భీష్మద్రోణుల కలపినచో తాను తలచిన యుద్ధోద్యోగము కుదరదు. కావున కర్ణుని చూచుచు దుర్యోధనునితో మత్స్యదేశము నాక్రమింతమని చెప్పి, దానివలన కలుగు ప్రయోజనము లనుగూడ చెప్పినాడు. ఆ ప్రయోజనముల తెలుపుటలో మత్స్యదేశము భాగ్యవంతమగు దేశమని చెప్పి, ఆ భాగ్యము నపహరింతమని ఆశ పెట్టినాడు చూడుడు –

శ్లో॥ రాష్ట్రం తస్యాభియాస్యామో బహుధాన్యసమాకులం
ఆదదామోఽస్యరత్నాని వివిధాని వసూనిచ
'గ్రామాన్ రాష్ట్రాణి వా తస్య హరిష్యామో విభాగశః
అథవా గోసహస్రాణి వా తస్య హరిష్యామి విభాగశః
వివిధాని హరిష్యామః ప్రతిపీడ్య పురం బలాత్
కౌరవైస్సహ సంగమ్య త్రిగర్తైశ్చ విశాంపతే
గాస్తస్యాపహరామోద్య సర్వైశ్చైవ సుసంహతాః
భవతాం బలవృద్ధిశ్చ భవిష్యతి నసంశయః'

సుశర్మ చెప్పినది బాగున్నదని కర్ణుడు దుర్యోధనునకు చెప్పి, నీవుకూడ అంగీకరించుచో వృద్ధులగు ద్రోణ, భీష్ముల యాజ్ఞానుసారముగ యుద్ధయాత్రను నిర్ణంచమనినాడు. తరువాత సుశర్మ సైన్యమును రెండు భాగములుగ విభజించినాడు.

'సంవిభాగేన కృత్వా తు విబధ్నీ యోస్య పౌరుషమ్.'

ఇది సుశర్మ వాక్యము. ఆంధ్రభారతమునం దయితే, భీష్ముడు చెప్పిన లక్షణములు విరాటనగరమునం దుండుటను బాయిలవలన విని సింహాబలుని చంపినవాడు భీముడని దుర్యోధనుడే యూహించి, పాండవుల కొరకు గోగ్రహణముపేర మత్స్యదేశముపైకి పోదమన్నట్లున్నది. నేను మీకందించినది సంస్కృత భారతములోనిది. యథార్థమునకు విరాట సుశర్మల కొకి సంబంధముండుటచే విరాటుని బలాబలములను ఐశ్వర్యమునుకూడ సుశర్మకు తెలియుట కవకాశమున్నదిగాని దుర్యోధనునకు తెలియుట కవకాశములేదు. సుశర్మయు, కర్ణుడును మాట్లాడిన తరువాత దుర్యోధనుడు యుద్ధసన్నాహము గావింపుమని కర్ణదుశ్శాసనుల కనుజ్ఞ యిచ్చి గోగ్రహణమునకు పయనమును సాగించినాడు.

వారు గోగ్రహణమునకై వెళ్ళినది కృష్ణపక్షము. సప్తమిరోజున సుశర్మ దక్షిణదిశకేగగా అష్టమిరోజున కౌరవులందరును ఉత్తరదిశ కేగినారు.

'ఆదాతుం గాః సుశర్మాఽథ కృష్ణపక్షస్య సప్తమీం
అపరే దివసే సర్వే రాజన్ సంభూయ కౌరవాః
అష్టమ్యాం తే న్యగృహ్ణన్త గోకులాని సహస్రశః'

ఇక విరాటనగమున కేగుదము. కపటవేషముల కాలము గడుపుచున్న పాండవులకు పదమూడవ సంవత్సర మంతమైనది. అయ్యును వారు మాత్రము విరాటనగరమున మారువేషములతోనే యుండిరిగాని తమ స్వ స్వరూపముల ధరించలేదు. కీచకుని అస్తమయము విరటున కొకవిధముగ ధైర్యమును కూలద్రోయదగియున్నను, తన యాస్థానము నందున్న కంకుభట్టువలన తనకేదో యొక దిగ్విజయము చేకూరగలదను నాశ పొడముచుండుటచే విరటుడును ధైర్యకవచమును ధరించి 'అతని యొక్క విశ్వ సామ్రాజ్యజీవితమును నడుపుచుండెను. కీచకునివలెనే

తన కితడుకూడ జయకర్త కాగలడని విరటు డూహించుచుండెను. వ్యాస భట్టారకు లిట్లు పలికినారు.

శ్లో॥ కీచకే తు హతే రాజా విరాటః పరవీరహా
పరాం సంభావనాం చక్రే కుంతీపుత్రే యుధిష్ఠిరే.

విరటుని యూహ త్రికాల సత్యము. రానున్న శుభోదయముల సూచించునవే మహనీయుల రాకలు. పాండవు లా పురమున ప్రవేశించు నప్పుడే విరాటుని విజయలక్ష్మి వరించినది. ప్రకృతమునకు వత్తము—

త్రిగర్తాధీశుడగు సుశర్మ చతురంగబలములతో మత్స్యరాజ్యము నాక్రమించుటకై నగర బాహ్యప్రదేశమున సేనాసన్నాహము గావించినాడు. ఆ దిశయందున్న గోధనము నాత డాక్రమించపలెను. ఘట్టము ప్రారంభమయినది. గోపాలకుల నడ్డగించిన సుశర్మ సైన్యమును వారింప యత్నించియు విఫలురై గోపాలకు లందరును విరటునకు విన్నవింప నేగినారు.

విరటుని యాస్థానమంటపము మంత్రిపురోహిత సామంతులతో కూడియుండగా పశుపాలకు లందరును యుద్ధవార్తను విన్నవించినారు.

శతానీకుడు విరటుని తమ్ముడు. మదిరాక్షుడు శతానీకుని తరువాతి వాడు. విరటుని మూడవతమ్ముడు సూర్యదత్తుడు. శంఖుడనువాడు విరటుని జేష్ఠపుత్రుడు. విరటునియాజ్ఞకు బద్ధులైయుండు నీ ముగ్గురుసోదరులును, శంఖుడునుగూడ కాలాయస వజ్రాయసములై యొప్పు నభేద్యకవచముల ధరించి సేనావ్యూహములతో త్రిగర్తు నెదుర్కొనుటకై విరటుని యాజ్ఞచే యుద్ధయాత్రను ప్రకటించినారు. గజతురగపదాతులు త్రిగర్తుల కెదురై నిలుచుటకు యాత్రసాగించినవి. విరటుని యూహ ప్రపంచ మంతతో ఆగలేదు. తన యాస్థానమున ప్రవేశించునప్పుడే ధర్మజ భీమార్జున, నకులసహదేవుల నూహించునప్పుడు దేవతాశేషముల యొప్ప

మహీమండలము నేలగల రాజచిహ్నములుగలవారని యూహించెనుగదా! ఇప్పు డా యూహ సమయమునకు మొలకెత్తకుండునా? ధర్మజుని భీమ, నకుల, సహదేవులనుగూడ యుద్ధవీరులుగా గ్రహించి శతానీకుని మన సభాస్తారునకును, వలలునకును, ధామగ్రంధి, తంతిపాలురకుగూడ అభేద్యకవచముల నొసంగమని అజ్ఞాపించినాడు. శతానీకు డట్లే చేయగా వారును యుద్ధోన్ముఖులై శస్త్రాస్త్రధారణములతో రథాధిరోహణము గావించినారు.

ఇక్కడ ఆంధ్ర భారతకథ మారినది

విరాటుడును, అతని తమ్ములును రథ, గజ, తురగ, పదాతులతో యుద్ధమునకు బయలుదేరగా కంకుభట్టు కొంతదూరమున కేగి సేనల యాజ్ఞాపించు విరటునితో తానును వచ్చెదననియు, తనతో వలలుడును, మిగిలినవారునుగూడ యుద్ధముచేయ సమర్థులనియు, అట్టి యుద్ధసామగ్రి తన కొక ఋషివలన ప్రాప్తించినదనియు చెప్పగా శతానీకునివలన వారికి రథము లిప్పించినట్లున్నది. ఏది యుక్తము అందురా? యుక్తాయుక్తముల నిర్ణయించుటకు నే నెవరిని? మూలగ్రంథము నాధారముగా గొన్న ఆంధ్రమును, మూలమును మీ ఎదుట బెట్టుట నావని.

కాక తన యాస్థానప్రవేశకాలముననే రాజ్యము నేలగలవారలని యూహించిన విరటుడు యుద్ధము రాగా వారు వచ్చి మేమును నీతోటి వచ్చుట కనుమతి నీయుమని అడుగుదాక విరటు డూహింపలేకపోవుట ఉచిత మెట్లగును? వలలుని వీరత్వము మల్లుల పోరాటమున అత డెరుగును. కావుననే వ్యాసులు విరాటునకు యుధిష్ఠురుని చూచి కీచకుని వంటి జయకర్తయై నన్ను రక్షించగలడను నభిప్రాయము కలిగినట్లు వర్ణించినారు. ఆమాట నాధారముగా గొనియే ఈ కథ నడచినది.

పాండవుల యజ్ఞాతవత్సరకాలము గడవగా పరాశక్తియు విరటుని ప్రేరేపించి ధర్మజాదుల రథారూఢుల గావించినది. ముందుకు పోదము.

యుద్ధము ప్రారంభమైనది. రథ, గజ, తురగ, పదాతు లిరుపైపుల నుండి తమ తమ శక్తుల విజృంభింపచేయగా రణరంగము రౌద్రాకారమునంది, బీభత్సాద్భుతాది రసముల కాటపట్టయి నిలచినది. విరాటుని సైన్యము త్రిగర్తుల పారదోలుట కేగునప్పటికి మధ్యాహ్న కాలమయినది. 'సూర్యే పరిణతేసతి' అని యున్నది. అనగా మధ్యాహ్నమున నాల్గవభాగమున యుద్ధము ప్రారంభమయినది.

విరటుని సైన్యము తక్కువదికాదు. ఎనిమిదివేల రథములు కదలినవి. పదివేల ఏనుగులును, అరువదివేల గుఱ్ఱములును దానికి తగిన పదాతిబలమును గలిగి సోదరులతోగూడ తాను స్వయముగ యుద్ధవీరుడై త్రిగర్తులతో పోరాడినను విరాటుని సుశర్మ జయించి తన రథముపై నిడుకొనిపోవుట జరిగినది. అతివేగముగా పోవు నారథమును, రాజును చూచిన రక్షభటులు పలాయనము కాకుందురా ? విరటుని సైన్యమంతయు చెదరి పారిపోవ నారంభించినవి. ధర్మనందనుని చూపులు విరటునిపై ప్రసరించినవి. ఇక విరటున కెక్కడ పరాజయము ? విరటుని విడిపింప భీముని యాజ్ఞాపించినాడు. ధర్మజుని యాజ్ఞ లేక భీము డింతవర కూరకుండెనుగాని లేకున్న భీముని వేగము విజృంభించకుండునా ?

అన్నగారి యాజ్ఞయైనది. భీముని వేగము సుశర్మ రథమువైపుకు మరలినది. భీముని చూపు శత్రువులపైకి ప్రసరించగా అతనికి కావలసిన ఆయుధములు, శస్త్రాస్త్రములు గావు. ప్రళయకాల ప్రభంజనములచే నేలగూలు మహోన్నత వృక్షరాజము లాతని యాయుధములు. భీముని చూపులు ధర్మజుని యాజ్ఞ అగుటయే తడవుగా మహోన్నతవృక్షములపై బడినవి.

'మా భీమ సాహసం కార్షీ స్తిష్ఠత్వేష వనస్పతిః'

ధర్మజు డాతని నట్లు పోనిచ్చునా ! సామాన్యమగు ఆయుధ విశేషములతోడనే యుద్ధము గావింపుమని యుధిష్ఠిరుడు చెప్పగా ధర్మజుని ఆజ్ఞకు బద్ధుడై భీముడు మదిరాక్షుని చక్రరక్షకునిగా గ్రహించి సుశర్మ మీదకి దుముకగా సుశర్మ రథముపై పట్టుబడియున్న విరటున కదియే తప్పించుకొనదగిన సమయము. విరటు డదే సమయమున సుశర్మ రథమునందున్న గద నొకదానిని చేతబట్టుకొని రథమునుండి క్రిందకు దుమికి సుశర్మతో మరల గదాయుద్ధమున కుపక్రమించినాడు.

విరాట సుశర్మలకు కొంతసేపటి యుద్ధము నడచినది. విరటుడు వృద్ధుడేయైనను తరుణుడయ్యే సుశర్మను ఓడించుట జరిగినది. సుశర్మ కిప్పుడు తన ప్రాణమును రక్షించుకొనుట ముఖ్యమైనది. దాని కుపాయము వేరొకటిలేదు ; పారిపోవుటయే ! ఆ యుపాయమునే యవలంబించి, సుశర్మ పారిపోప నారంభించినాడు. భీము డాతనిని వెళ్ళనిచ్చునా ! రాజపుత్రుడవై యుండి అట్లు పోవుట యుక్తము కాదని హెచ్చరించుచున్న భీముని పలుకులు సుశర్మకు ములుకులవలె గ్రుచ్చుకొనగా మరల భీమునిమీదకు యుద్ధమునకు మరలినాడు. అతడు భీముడని సుశర్మ కేమి తెలియును ? అతడును విరటుని రక్షకభటు డనియే సుశర్మ భావము. ఒకరి నొకరు జయించవలెనన్న యారాటము వారిద్దరికిని పెరిగినది. భీమసింగము సుశర్మ రథముపైకి దుమికినది. సుశర్మ శిరోజములు భీమసేనునకు చిక్కినవి. అంతతో సుశర్మ చేయదగు యుద్ధము ముగిసినది. ఇక కర్తవ్యమంతయు భీమసేనునదే. భీముడు సుశర్మను రథమునుండి క్రిందకు లాగినాడు. యుద్ధపరాజితులగు వారలను చంపకయే చంపుట యను పద్ధతిని యవలంబించిన భీముడు మోకాళ్ళను మోచేతులను పిడిగెటి పోటులతోపాటుగా సుశర్మను

వివశుని గావించి మరల రథముపై కెక్కించి రంగమధ్యమునకు గొంపోయినాడు. అప్పటికి ధర్మజుడు వేయిమందిని సంహరించగా, భీముడు ఏడువేల సైన్యమును హతమార్చగా, నకులు డేడువందల పదాతులను, సహదేవుడు మూడువందల సైన్యమును నాశము గావించుట జరిగినది.

సుశర్మ తన సైనికబలమును కోల్పోవుటేగాక తాను శత్రువు చేత జిక్కి బంధింపబడినాడు. ఆ రణరంగమున ధర్మజుడు లేకున్న సుశర్మ బ్రతుకునా ? అంతలో ధర్మజుడువచ్చి, సుశర్మను మందలించి ఇట్లు సుశర్మ యుద్ధమునకు వచ్చుట అధమకార్యమని తెలుపుచు, 'ముచ్య తాం వై నరాధమః' నరాధముడగు త్రిగర్తుని చంపక వదలుమని భీమునికి చెప్పి ప్రాణభిక్ష నందించినాడు. త్రిగర్తు డట్లు బ్రతికిపోవుట భీమున కిష్టములేదు. భీముడు త్రిగర్తుని-నీవు రాజసభలందు యుద్ధమునం దోడిన దాసుడనని చెప్పికొనుచు బ్రతుకుమని-విడిచినాడు. 'దాసోఽస్మీతి త్వయా వాచ్యః' త్రిగర్తు డట్లా దాసుడై పోవుటకు ధర్మజు డొప్పలేదు.

దాసభావం గతో హ్యేష విరాటస్య మహీపతేః
అదాసోగచ్ఛ ముక్తోసి మైవం కార్షీః కదాచన.

త్రిగర్తుని దాసభావమును తాత్కాలికము గావించి విరటునకు మాత్ర మిప్పుడు దాసుడగుటను ఒప్పి మరెప్పుడును ఇట్టి తప్పు నాచరించవద్దని సుశర్మకు బుద్ధిచెప్పి, నీవు దాసుడవు కావని వదలినాడు. ఇదియే ధర్మజుని గొప్పదనము. తప్పుచేసినవాని నంతతో దండించుట కాక పశ్చాత్తాపపడుట కవకాశము నిచ్చి వాని జీవితమును కాలాంతరమున బాగుచేయుట ధర్మజుని ఆశయము. దుర్యోధన సైంధవులకును ఇట్లే చెప్పినాడు.

సుశర్మ సిగ్గుగొని తలవంచి, రాజునకు వందన మాచరించి వెళ్ళినాడు. అంతతో యుద్ధము ముగిసినది. ఆ రాత్రి విరటుని సైన్య మక్కడనే యున్నది. పట్టణమునకు వెళ్ళలేదు. తరువాత విరటుడు పాండవులకు తగు సత్కారముల గావించినాడు. అవి కేవలము యుద్ధముల కందించు సత్కారములా ? కావు. నా రాజ్యమునే మీచేత బెట్టెద నని విరటుడు జీని చీనాంబరాది రత్నరాజముల నందించగా ధర్మజుడు, సోదరులకూడ మీరు విజయమునొందుటే మా కానుక యని వారించుచు సామాన్యములగు సత్కారముల నందినారు. పట్టణమున జయఘోషము గావింపుమనికూడ విరటునకు చెప్పి విరమించినాడు ధర్మజుడు. ఆంధ్ర భారతమున కథ కొంచెము మారినది.

సంస్కృత మూలమున సుశర్మ ధర్మజుని ముఖముననే బంధ విముక్తుడై పోయిన తరువాత సైనిక సత్కారము లయినవి. ఆంధ్ర భారతమున సత్కారముల నందించునప్పుడు సుశర్మను బంధవిముక్తుని చేయుటకు ధర్మజుడు విరటుని అనుమతి వడసినట్లున్నది.

విరాటుడు రాజైయుండ అతని అనుమతి లేకయే కంకుభట్టు సుశర్మను విడిపించెనని వ్యాసభారతము చెప్పుట యుక్తమా ? అని మీరు సంశయింతురు. అతనిని బంధించిన దెవరు? విరటుడు బంధింపమనెనా? బంధించినవాడు వలలుడు. ఎవరిదగ్గరకు సుశర్మను తెచ్చెను ? ధర్మజుని వద్దకు. బద్ధుడైన విరటుని విడిపింపమన్న దెవరో అతడే ఇక్కడ సేవకుని రూపమునందున్న రాజు. అదికాక, విరటుని అనుమతి మాటి మాటికిని అక్కరలేదు. సమర్థులగు సేవకులకు కొన్ని స్వాతంత్ర్యము లుండుటలో నిషేధములేదు. అది యట్లుండ విరటుని ముందటనే ధర్మజు డీస్వతంత్రతను గ్రహించుటకు కారణము విరటుడు పాండవుల

ప్రవేశకాలముననే సభాస్తారున కొక ప్రత్యేకమగు అనుమతి నిచ్చుటను మనము కలుపుకొన్నచో త్రిగర్తుని బంధించి ఉంచుటయా? లేక పంపుటయా? అను విషయమును విరటునితో ఆలోచించకయే తాను స్వతంత్రించుట తగనిపని కాదని ధర్మజుడు సుశర్మను దాస్యవిముక్తుని చేసెను. కాని ఆంధ్రానువాదకర్త సరథ గజాశ్వంబుగ విడిచిపుచ్చెనని చెప్పుటవలన విరటుని అనుమతిని పొందియుండుటను న్యాయమను భావముచే విరటుని అనుమతిని ఊహించియుండవచ్చును. కథకు వీోదము. తెల్లవారగనే విరాటుని దూతలు విరాటుని రాజ్యమున విరాటుని జయమును వెల్లడించినారు. నగరమున జయఘోషము ప్రతిధ్వనించినది. ఇంతవరకు దక్షిణగోగ్రహణమను కథను మీరు గ్రహించినారు. రాబోవునది ఉత్తరగోగ్రహణము. అది రేపు.

స్వస్తి ప్రజాభ్యాం

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

మహాశయులారా !

హస్తినాపురము నందలి కౌరవసామ్రాజ్యలక్ష్మి విరాటుని రాజ్య సంపదనుగూడ తనలో కలుపుగొన్నచో తన కొక పూర్ణరూపము రాగలదన్న పేరాసతో రెండుభాగములుగ చీలి, విరాటుని రాజ్యము నాక్రమించుటకు దక్షిణోత్తర దిశలయందున్న విరాటుని గోధనమును స్వాధీనపరచుకొన నిశ్చయించి, దక్షిణదిశకు త్రిగర్తదేశాధీశుడైన సుశర్మను పంపినది. సుశర్మయు మత్స్యదేశ దురాక్రమణను సాగించుటకై విరటుని గోధనమును స్వాధీనము గావించుకొన, చతురంగ బలములతో వచ్చియు విరాటు నెదుర్కొని పరాజితుడై వెనుకకు మరలినాడు. ఇది నిన్నటి యుపన్యాసమున మీరు వినిన కథ. ఇంతతో దక్షిణగోగ్రహణమను కథ ముగిసినది.

నేటి యుపన్యాస ముత్తరగోగ్రహణము. మన విరాటపర్వ కథాంతర్భాగము నందలి యుపన్యాసముల కిది యైదవరోజు. నేటి కథాంశమున గ్రహించదగినది కేవల యుద్ధయాత్రా విశేషమేననుట కంటె భగవంతుని దివ్యలీలావైభవమే ఈ రణరంగమున వర్ణించబడిన దనుట యుక్తము. భగవంతుని వీరరసరూప విభూతికి అర్జును డాలంబన మయ్యెను. ఈనాటి కథాప్రపంచము వీరరసప్రధానము. ఇదియొక అపూర్వచరితము. ప్రపంచ చరిత్రలయం దేకైకవీరుడై వన్నెకెక్కిన యర్జును డొక్కడే ఇందు ముఖ్యపాత్రయై విలసిల్లుట నేటి కథాంశము లోని విశేషము.

రామాయణ మహాకావ్యమున కధినాయకుడైన శ్రీరామచంద్రుని పూర్ణరూపమగు వీరరసమంతయు జనస్థానమునందలి చతుర్దశ సహస్ర

రాక్షస యుద్ధమున సాక్షాత్కరించగా ; అర్జునుని నిర్వక్రపరాక్రమ విజృంభణమంతయు ఉత్తరగోగ్రహణముననే రూపొందినది. అటులైన అర్జునుని కురుక్షేత్ర సంగ్రామరంగమున కొత ప్రత్యేకత లేదందురా ? ఉండవచ్చును. రామరావణ యుద్ధమును అట్టిదే. అయ్యును రావణునిపై దండెత్తిన యుద్ధయాత్రయందు రామునకు కపివరు లెందరో సాయము గాగా అర్జునుడు సాగించిన కురుక్షేత్ర సంగ్రామరంగమునం దెందరో అతిరథమహారథులు సాయపడినారు. అంతేకాదు. కురుక్షేత్ర సంగ్రామ రంగమునం దర్జునునకు శ్రీకృష్ణసారథ్యముతోడై ముందుకు నడిపినది. ఉత్తరగోగ్రహణమునం దెవ్వరి సాయమును లేకయే రణరంగము కొనసాగినది. ఉత్తరగోగ్రహణమను పేర నడచిన కౌరవ పాండవ సంగ్రామరంగ మెట్లు నడచినదో చూతుడు.

ఉత్తరగోగ్రహణమునకు దుర్యోధనుడు అధినాయకుడై రాజై పిలవగా భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, కర్ణాది వీరవరులందరును ఆతని ననుసరించినారు. వారందరును అతిరథమహారథు లను బిరుదములు గలిగిన వీరశిఖామణు లనుటలో సందియములేదు. అట్టివారంద రొక్కచో గూడి విరటుని గోధనము నంతను తమ స్వాధీనము గావించుకొన నిశ్చయించినారు. ఆనాడు బహుళఅష్టమి. విరాటుని చతురంగబలములును సప్తమి తిథియందు దక్షిణదిశ నాక్రమించిన సుశర్మ రణరంగమునందే యుండి యున్నవని మీ రెరుగుదురుగదా ! నేడు విరాటనగరమునం దొక్క సైనికుడైనను లేడు. ఆనా డుత్తరుడు మాత్రము సుశర్మపైకి వెడలినవారిలో లేడు. ఆత డొక్కడే యింటనున్న గృహాయుజమాని.

ఉత్తరదిశయం దున్న విరాటుని ఆవులమంద అరువదివేల సంఖ్య కలది. ఆ సంఖ్య ననుసరించియే ఆ యావులను కాపాడి రక్షించు గోపాలురును ఉందురు. కాని వారు సైనికులు కారు. గోరక్షకులు.

సామ్రాజ్యములు సామ్రాజ్యము లెత్తివచ్చి ఆ గోగణము నపహరింప దలచినచో వారేమి రక్షించగలరు? నేడు విరాటుని కట్టి యాపదియే సంభవించినది. భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామాది కురువీరు లందరును ఉత్తరదిశ యందలి విరాటుని గోగణము నాక్రమించినారు. గోపాలకులు వారిబారినుండి గోవులను రక్షింప సమర్థులు కాలేదు. అందొక వృద్ధ గోపకుడు రాజాంతఃపురమున కేతెంచినాడు. వృద్ధగోపకునిరథ మతివేగమై వచ్చినది. అంతఃపురమునం దధిష్ఠితుడై యున్నవా డుత్తరు డొక్కడే. అతడును ఒక్కొక్కప్పుడు యుద్ధయాత్రల సాగించనివాడు కాడు. సారథ్యమునం దుత్తరుని మించినవాడు లేడను ప్రతీతియు నాటి రాజ మండలమునం దున్నది. కావుననే నే డాతని సేనాసమూహము లేకున్నను సేనానాయకుడై కౌరవ వీరుల నెదుర్కొన వచ్చుటకు వృద్ధగోపకు డాహ్వానించవచ్చినాడు. ఆ వృద్ధగోపకుని వినతిపత్రమును ఉత్తరుడే యుందుకొనవలసి వచ్చినది.

అది కన్యాంతఃపురము. ఉత్తరు డామువారి మధ్యమునందుండి క్రీడావినోదముల యానందించు సమయము. ఆ సమయమునందే గోప కుని వినతిపత్ర మందినది. ఆ వినతిపత్రమం దిట్లున్నది. 'రాజకుమారా! నీవు మహావీరుడవు. మీ తండ్రియగు విరాటు డందరు రాజకుమారుల మధ్యయుందును నీ వీరత్వము నుగ్గడించుట మే మెరుగుదుము. ఉత్తర కుమారా! నీ వీక్షణమున రథాధిరోహణమున కౌరవవీరుల నెదుర్కొని మన గోగణమునంతను రక్షింపకున్నచో మా కిక రక్షకులెవ్వరును లేరు' అని. అంతతో ఆ వృద్ధగోపకు డూరకొనలేదు. 'ఓ రాజకుమారా! మా విన్నపముల నందుకొని వేగముగ బయలుదేరు'మని జయ జయ ధ్వానములతో గోపవృద్ధుడు ఉత్తరుని వేడికొనినాడు.

కౌరవబల ముత్తరు డెరుగనిదికాదు. అయ్యును గోపవృద్ధుని స్తోత్రపాఠము ఉత్తరుని పొంగించినది. స్తోత్రపాఠముల కుబ్బొంగక తమ ఆత్మబలమును లెక్కించువా రెందరుందురు ? వారరుదుగ నుందురనుట జగమెరిగిన సత్యము. ఒకవిధముగ దేవతలైనను కడుంగడు వర్ణనీయములగు ఆత్మప్రశంసలకు పొంగుదురు. పొంగకున్నచో వరములెట్లిత్తురు ? అందును ఉత్తరు డాడువారి సమీపమునందుండుట జరిగినది. పెద్దపెద్దసభలలో విరటుడు ఉత్తరునిగూర్చి చేయు ప్రశంసలన్నియు గోపకుడు ఉత్తరునకు జ్ఞాపకమునకు తెచ్చెను. భీష్మద్రోణ కృపాచార్యాది వీరవ్రాతమునంతను జయించి గోవ్రాతమును మరలించుటకు నీ వర్హుడవని ధారావాహికముగ బలుకు గోపాలకుని మన్ననలను కాదని ఉత్తరుడు తన బలహీనతను తెలుపనిశ్చయించలేదు. అది తన రాచరికమునకు భంగమని అతనియూహ. అదిగాక గోపాధ్యక్షుడు లే లెమ్ము ! రాజపుత్ర ! రాజపుత్ర ! రథాధిరోహణము గావింపుమని చేయు నుత్సాహవాక్యము లుత్తరకుమారుని ప్రోత్సహించి యుండవచ్చును. తన బాణపాతమున కౌరవవీరులనందరను జయించి, గోధనమునంతను తన స్వాధీనము చేసికొంటిననియే భావించినాడు. కౌరవసైన్యము తనకొక లెక్కలేదనినాడు. ఆవులమందను మరలించుటకెంతయో సమయమక్కరలేదనినాడు. ఒక్కముహూర్తమాత్రముననే కౌరవవ్రాతమును జయించి, గోవ్రాతమును మరలింతునని ధాటిగ పలికినాడు. కాని ఒక్కలోపమే సమయమునందుకలుగుట కాతడు తన విచారమును తెలిపినాడు. తానొకప్పుడు మహోన్నత సంగ్రామరంగమున పాల్గొనవలసిరాగా, ఆ యుద్ధము యిరువదియెనిమిదిరోజు లేకగ్రీవముగ నాగగా ఆ మహాసంగ్రామరంగమున నా సారథి అస్తమించినాడు. నేనిప్పుడు సారథిలేని రథికుడను. కావున మీ కోరికను తీర్చలేక పోవలసివచ్చినదని తన విచారమును వ్యక్తముగావించినాడు.

'అష్టావింశతి రాత్రం వా మాసం వా నూనమంతతః
యత్తదాసీన్మహద్యుద్ధం తత్ర మే సారథి ర్హతః'

అంతతో ఆగలేదు. ఆ సమయమునందు లోకైకవీరుడగు అర్జునుడు స్మృతికి వచ్చినాడు. నేనిప్పుడు సారథియున్నచో అర్జునుడే సాక్షాత్తుగ యుద్ధ మొనరించుచుండెనని కౌరవులు భావించునట్లు రణరంగమున చరింతుననిగూడ వీరాలాపముల బలికినాడు.

'కిం ను పార్థోఽర్జునస్సాక్షాదయ మస్మాన్ ప్రబాధతే'

ఇట్లుత్తరుడు సంభాషించుకాలమునం దక్కడెవ్వరుండిరో తెలియునా ? అది కాంతాజనమధ్య మగుటచే బృహన్నలారూపమున దాగియున్న అర్జును డచ్చటనే యుండెను. ద్రౌపదియు అచ్చటనే గలదు. ఈనాటి ఉత్తరగోగ్రహణ ఘట్టము తమకొరకే వచ్చినదని ఇద్దరును ఊహించి నారు. అర్జునుని యూహాప్రపంచమున రాబోవు విజయసూచనలు దర్శన మివ్వగా ద్రౌపదియు రాబోవుఘట్టమును తన అంతఃకరణమున దర్శించి నది. అర్జునుడు తమ అజ్ఞాతవాసవత్సరమును లెక్కించినాడు. అది గడచి కూడ కొన్నిదినములైనది. తానిప్పుడు కౌరవులతోటి యుద్ధమున కెట్లేగ వలెను ? జరుగదగు కార్యక్రమమంతయు అర్జుననకు సాక్షాత్కరించినది. తాను సారథియై ఉత్తరుని రథమధిరోహించి, నగరమును దాటవలెను. కౌరవులకు మాత్రము తా నర్జునుడై కపికేతనముతో సాక్షాత్కరించ వలెను. విజయయాత్రానంతరముగూడ తాను బృహన్నలయయ్యే నగరమున ప్రవేశించవలెను. ఇది అర్జునుని అంతరంగిక నిర్ణయము. దీని కుపాయ మాలోచించినాడు. ద్రౌపదిచేతనే ఈ కార్యమును సాధింప బూనినాడు. ఆ ద్రుపదరాజనందన నొక్కమారు రహస్యప్రదేశమున కాహ్వానించినాడు. మీ రెవ్వరైన తగు సారథిని కూర్చుచో నేను యుద్ధమున కేగుదునన్న ఉత్తరుని వాక్యము నాధారముగా గొని తాను

ఒకప్పుడు అర్జునునకు సారథినై యుంటినని ఉత్తరున కెరిగించి, నేను సారథి యగునట్లు చేయుమని తన ప్రియురాలగు ద్రౌపది కెరిగించి, కాలహరణము గాకుండ అతివేగమున ఉత్తరునియొద్దనుండి తన కాహ్వానము వచ్చునట్లు చేయుమని చెప్పి, నాట్యశాల కేగినాడు. ఆజ్ఞాపింపబడిన ద్రౌపది ఆ క్షణముననే ఉత్తరునిపద్ద కేగినది. అర్జునుడు ఖాండవవనమును దహించుట యను చరిత్రము జగత్ప్రసిద్ధము. ఆ చరిత్రనే ఉత్తరునకు జ్ఞాపకముజేసి ఆ యాఖండదలునితో అర్జునుడు యుద్ధము చేసినప్పుడు మన అంతఃపురమునందలి బృహన్నల సారథిగా నుండి రథమును నడిపినట్లు నే నెరుగుదునని చెప్పినది. ప్రస్తుతమునందా బృహన్నల సారధియగుచో తప్పక నీవు గోధనమును మళ్ళింతువని ఉత్తరు నుత్సహింపజేసినది.

'న హి యంతాస్తి తాదృశః'

అట్టి సారథి మరియొకడు లేడని గట్టిపరచినది. ఉత్తరు డిప్పుడేమి చేయవలెను ? సారథియగుటకు బృహన్నల నర్థించవలెను. తాను రాజపుత్రుడు : బృహన్నలను సారథ్యమున కర్థించుటయా ? ఉత్తరుడు తాను స్వయముగ బృహన్నలపద్ద కేగదలచలేదు. ఉత్తరున కా కార్యము చిన్నతనముగ తోచినది. సైరంధ్రికి సమాధాన మట్లే చెప్పినాడు.

'అహం న శక్నోమి బృహన్నలాం శుభే
వక్తుం స్వయం యచ్ఛ హయాన్ మమేతిపై'

సైరంధ్రీ! నే నా బృహన్నలతో స్వయముగ మాటలాడదలచలేదని తన రాజరికమును ప్రదర్శించినాడు. ద్రుపదరాజనందన, వెంటనే ఉత్తరకుమారా ! నీ సోదరిని బృహన్నలదగ్గరకు పంపుచో మన కార్యము గట్టెక్కగలదని సలహా నివ్వగా ఉత్తరు డట్లే తన సోదరి యగు నుత్తరను బృహన్నలవద్దకు పంపినాడు. ఈ ఘట్టమున

తిక్కనార్యులు ఉత్తరుని ఆత్మశ్లాఘనమును విస్తరించి నాటకీయతను ప్రదర్శించినారు.

చ. కురుబల మేగుదెంచెనట గోవులబట్టుకపట్ట దానిపై
బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁబూని యే
నరిగెదసత్తి తేరికి బృహన్నలసారథియైన దీని న
వ్వరె పురిలోన వింతకఱపా రథచోదకు లింతయేటికిన్.

ద్రౌపది సమాధాన మిది.

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినం
దేరు బృహన్నలావశగతిం జరియించినగెల్పవచ్చు ద
ద్వీరగుణంబుసొంపు పృథివీనరనందన ము న్నెఱుంగుదుం
గారణజన్మమై తనువికారము వచ్చిన బెంపు దప్పునే.

ఈ పద్యమున అర్జునుని పరాక్రమము వర్ణింపబడినది.

ఉత్తరుడు తన సోదరిని పంపినాడు. సోదరుని ఆజ్ఞానుసారము సుందరాంగి యగు ఉత్తర బృహన్నలవద్ద కేగినది. ఉత్తరకు బృహన్నలవద్ద చాల స్వాతంత్ర్యమున్నది. అది గురుశిష్య వాత్సల్య సంబంధము. ఉత్తర రాకకు బృహన్నల కారణ మడిగినాడు. ఉత్తర తాను వచ్చిన కారణమును విశదపరచినది. నీవు తప్పక మా ఉత్తరునకు సారథ్యము చేయవలె నన్నది. ఉత్తరుడే నన్ను పంపగా వచ్చితినని విన్నవించినది. సైరంధ్రిచే వింటిమని బృహన్నల తప్పుకొనుటకు వీలులేకుండ మాట్లాడినది. ఉత్తర మాటలాడు మృదుమధుర వచో లావణ్యములను చక్కగ వినుచున్న బృహన్నల ఉత్తరవింకను గట్టిగ మాటాడింప దలచినాడు. నేను సారథ్యము చేయుటయా? అని ఆశ్చర్యముగ పలికి, నివేమైన పేరొక నృత్యమును చెప్పుమన్న చెప్పెదు వాడనేగాని, నేనేమి సారథిని? అని చమత్కరించినాడు. కాకున్న

మరియొక పాట పాడుదునవినాడు. ఆ పలుకులకు పరియేసనక ఉత్తర చక్కని సమాధాన మిచ్చినది.

శ్లో॥ బృహన్నలే గాయనో వా నర్తనో వా పునర్నృప
క్షిప్రం మే రథమాస్థాయ నిగృహ్ణీష్వ హయోత్తమాన్.

అవన్నియు నాకు తెలియదు. ముందు గుఱ్ఱముల బూన్చి, రథము నాయత్తము చేయమన్నది. అనగా అవుల దూరమున కేగక మునుపే లెమ్ము, ఈ మాటలకేమి ! అని స్ఫురింపజేసినది. ముద్దును గూర్చు ఆ ముద్దియ మాటలకు ముసిముసి నగవులనగుచు, తనలోని కోర్కె ఫలించినందుల కుత్సహించుచు అర్జును డియ్యకొనినాడు. అది కన్యకాంతఃపురము. వారి నందరను ఒక్కమాఱుగ నవ్వించదలచినాడు అర్జునుడు. సారధికి కావలసిన కవచమును ఉత్తరుడు పంపగా దానిని తన కేమియు తెలియనట్లు తిరుగవేసి తొడుగుకొనినాడు. కన్యకలందరును నవ్వగా ఉత్తరుడు స్వయముగ వచ్చి, బృహన్నలా ! అట్లు కాదని తానే తొడిగినాడు. ఉత్తరున కున్న అమాయకత్వ మెట్టిదో అర్జునుడు చక్కగ ప్రదర్శింపజేసినాడు. కవచమును తొడుగుకొననేరనివాడు ఖాండవ వనదహనమున అర్జునకు సారథ్య మెట్లు చేసెను ? అను ఊహకూడ ఉత్తరునకు కలుగలేదు.

రథమాయత్తమైనది. ధనుర్బాణములును రథమునందుంచబడినవి. ఇక రథము బయలుదేరవలెను. యుద్ధయాత్రల కేగునప్పుడుగాని, లేక ఏ ఇతర కార్యములకైన వెళ్ళునప్పుడుగాని, ఆ కార్యమును గురించి కొందరు మాటలాడు మాటలు రాబోవు జయాపజయములను సూచించు చుండును. ఉత్తరుని రథము బృహన్నలా సారథ్యమున బయలుదేరు చుండగా ఉత్తర రాచరికమునకు తగు కోరిక నొకదానిని కోరినది. బృహన్నలా ! మీరు బోవు యుద్ధయాత్రయందు మీరు కురువీరులను

జయింతురుగదా ! ఆ కురువీరులు ధరించిన తలపాగలలోని రంగురంగుల గుడ్డలను మేము మాదుకొను బొమ్మపొత్తిళ్ళకు తెమ్మని కోరినది. అర్జునుని దృష్టికి రాబోవు విజయయాత్రాఫలము సాక్షాత్కరించినది. తప్పక తెత్తుమనినాడు. అది ఉత్తర కిచ్చిన సమాధానమే కాదు. కౌరవుల జయింతునన్న అతని ప్రతిజ్ఞయు ఆ సమాధానమునం దిమిడియున్నది. కావుననే అర్జును డుత్తర కిచ్చిన సమాధానమును వ్యాసులు చక్కగ వర్ణించినారు.

'ప్రత్యువాచ హసన్ పార్థో మేఘ దుందుభి నిస్వనః'

కురువీరుల తలపాగలు దెచ్చుట ఒక లెక్కయా ? అనునట్లు అర్జునుని ముఖమున చిరునవ్వు మొలకెత్తినది. ప్రతిజ్ఞకు తగునట్లే మేఘము గర్జించినట్లు సమాధాన మిచ్చినాడు. అతడు చివరి సమయమున ప్రయోగింపదగు మోహనాస్త్ర మిచ్చుటనే అర్జునునకు స్ఫురించినది కాబోలు. ఆ భావముల నన్నిటిని వ్యాసులు ప్రదర్శింపజేసినారు.

బృహన్నల సారథికాగా ఉత్తరుడు రథికుడై రథము నధిరోహించినారు. రథము కదలినది. రథికుడు సారథిని రథమును తొందరగా సాగింపుమని తొందరించినాడు. బ్రాహ్మణుల యాశీర్వాదములతో, ముత్తైదువులచే ముంజేతుల వెదజల్లు సువర్ణాక్షతలతో రథమునకు ముందుగనే నడకల సాగించు విప్రోత్తముల స్వస్తివచనములతో రథము కదలినది. అర్జునుడు ఖాండవదహనమున కేగి దేవేంద్రుని జయించినట్లే కురుబలము నీ బృహన్నల జయించుగాక యను కన్యకల మంగళవాక్యములు విజయుని విజయయాత్రను చాటి చెప్పినవి.

ఉత్తరుడు తన్ను దానెరుగని పరాక్రమోత్సాహములతో సారథిని తొందరపెట్టగా రథము కొంతదూర మేగినది.

విరాటనగరమున కుత్తరముగనున్న స్మశానమునందే పాండవుల ధనుర్బాణము లున్నది. కురుబల మేగుదెంచి, విరటుని గోవ్రాతము నాక్రమించినది ఆ ప్రదేశముననే. కావుననే ఆ ఘట్టము ఉత్తర గోగ్రహణమను పేరు వడసినది. ఉత్తరుని రథము కౌరవబలమును కనుచూపుమేరలో చూడదగినంత దూర మేగినది.

ఉత్తరుడు కౌరవబలమును కన్నులార గాంచినాడు. యథార్థముగ నది కౌరవసైన్యమే యైనను చూపరుల దృష్టి కది యొక మహాసైన్య మనియేగాక, భూఖండమునం దుండదగు మహారణ్యసీమ యంతయు భూమ్యాకాశములమధ్య వ్రేలాడుచున్నదా? అనునట్లున్నది. రథ, గజ, తురగ పదాతుల సంచారముచే పైకిలేచి, ఆకాశమును కమ్ముకొన్న దుమారమంతయు చూచువారల కట్టి భ్రమను కలుగచేయుచున్నదని యుత్ప్రేక్షించినారు. అంతేకాదు; అది యొక సముద్రమువలె నున్నదట.

'తదనీకం మహత్తేషాం విబభౌ సాగరోపమం
సర్పమాణమివాకాశే వనం బహుళపాదపం'

అట్లు మహారణ్యమువలె కన్పట్టు సైన్యమున కభిముఖమయ్యే ఉత్తరుని రథము నడచినది. కాని ఆ సైన్యము నుత్తరు డెప్పుడైన యుద్ధరంగముల తిలకించెనా? అవిధములగు సైన్యములతో గూడిన యుద్ధరంగముల నాత డేమెరుగును? ఉత్తరుడుకాదు; యథార్థమున కెవ్వ రెరుగుదురు? కౌరవవాహిని లోకోత్తరము.

భీష్మ-ద్రోణ-కృపాశ్వత్థామ-కర్ణాది వీరవరులను తిమితిమింగిలము లతోగూడిన యా లోకోత్తర మహాసైన్యసాగరము దాటి, వీరపతాకము నెగురవేతునన్న ఉత్తరుని యూహాగాన మీ ఘట్టమున హాస్యరసమున కువికిపట్టుగాగా వీరాతివీరుడై యుద్ధరంగము నొక నాటకరంగముగా

మార్చి, నటింపవచ్చిన పార్థుని ప్రతాపము వీరరస నిలయమైనది. కారణమేమి ?

అర్జునుని చూపునం దీ కౌరవసైన్యమంతయు ఒక గుప్పెట కిమిడి యుండగా ఉత్తరునకీ సైన్యమొక మహాసాగరమై కన్పట్టినది. అర్జునున కా కౌరవసైన్యమందలి ధ్వజపతాకాది చిహ్నము లన్నియు వీరచిహ్నములు కాక రథ, గజ, తురగ, పదాతుల కలంకారములకై కట్టుకొన్న పతాకములు కాగా, ఉత్తరున కా చిహ్నము లన్నియు భయకారణములైనవి. అంతేకాదు. అర్జునునకీ కౌరవవీరులును, వారి శస్త్రాస్త్రములనుగూడ తన శరవహ్నియం దాహుతి కాదగిన ఎండు కట్టెలుగాగా ఉత్తరుని దృష్టియం దా కౌరవవీరుల సమూహమంతయు గ్రీష్మాదిత్యవత్ప్రతాపవిసరాకీర్ణమైనది. కావుననే హాస్యవీరములు రెండును మనకీ ఘట్టమున కన్నులకు కట్టినట్లున్నవి.

శ్రోతలారా !

ప్రస్తుత ఘట్టమున మనము చవిచూడదగిన మొదటిపాత్ర ఏదందురు ? ఉత్తరుని పాత్రయే !

ఆ కౌరవసైన్యమును చూచిన ఉత్తరునిగుండె దడదడలాడినది. ఒడలు వణకినది. తానిక ఇంటికిదారిపట్ట నిశ్చయించుకొనినాడు. ఉత్తరునకు బ్రతుకుపైననే ఆశ కలిగినది. క్షాత్రమనునది పేరుకైనను లేకుండ పోయినది. బృహన్నలను పిలిచినాడు. రథమును వెనుకకు తోలుమని ఆజ్ఞాపించినాడు. ఆజ్ఞకాదు. బ్రతిమాలినాడు. బృహన్నల రథమును సాగించుచుండెనేగాని నిలపలేదు. ఉత్తరునకు చలిపెరిగినది. బృహన్నల ధైర్యమును పురిగొలిపినాడు. ఉత్తరుని వణకు తగ్గలేదు. ఉత్తర కుమారా ! నీ వా సైన్యమును చూచి పిరికితనమున భయపడుచుంటివేగాని వారు చేయున దేమియు లేదని మరల మరల చెప్పినాడు. ఉత్తరునికి

ధైర్యము రాలేదు. రథము పోవుచునే యున్నది. మరల బృహన్నలతో రథమును వెనుకకు మళ్ళింపుమని దీనుడై పలికినాడు. అర్జునుడు సైరంధ్రి నవ్వునని సమాధాన మిచ్చినాడు. సైరంధ్రి నవ్విన నాకు తరుగునదేమి యని ఉత్తరుడు ధైర్యముగ చెప్పినాడు. నాకు సిగ్గగునని అర్జునుడు సమాధాన మిచ్చినాడు. రథము మాత్రము నిలవలేదు. చివరకు అర్జును డుత్తరునకు ఏది ఏమైనను రథమును వెనుకకు త్రిప్పను. పశువులను మరల్చుటే జరుగవలెనని ఉత్తరునకు గట్టిగ చెప్పినాడు. ఉత్తరున కిక జీవితముపై ఆశ తొలగినది. భయభ్రాంతమగు నుత్తరుని చిత్తమున అర్జునుడు నాటిన సాహసబీజములు మొలకెత్తలేదు. ప్రాణములపై తీపి వదలలేదు. చివరకు.—

శ్లో॥ కామం హరంతు మత్స్యానాం భూయాంసః కురవో ధనం
ప్రహసంతు చ మాం నార్యః నరా వాఽపి బృహన్నలే.

మా ఆవులమంద లేమైనను, అంతఃపురకాంతలు నవ్వినను నాకు లెక్కలేదు. రథము త్రిప్పుమని తన ప్రాణభీతిని బయటపెట్టినాడు. వారి సంభాషణ మట్లు జరుగుచుండగా రథము కౌరవసైన్యమునకు దగ్గర యగుచున్నది. ఉత్తరు డేమి చేయవలెను? ఒకవిధముగ సాహసించినాడు. ఆ రథముపైనుండి ఒక్కదుముకు నేలపైకి దుమికినాడు. రథికుడై చేతధరించిన ధనుర్బాణములతోడనే దూకినాడా? లేదు. లేదు. ఆ ధను ర్బాణముల రథమునందే విడిచి, ఒంటరిగనే దూకినాడు. ఇక రథ మెట్లు పోవును? రథ మాగినది. ఉత్తరుడు దూకి నిలబడలేదు. పిక్కబలమును చూపినాడు. ఉత్తరుని పాత్ర రసకందాయమున బడినది. అతని వెంటనే అర్జునుడు దూకినాడు. ముం దుత్తరుడు, వెనుక అర్జునుడు. వారిద్దరి దృశ్యమును కౌరవుల కంటబడినది. సైనికుల కాదృశ్యము నవ్వులాట యైనది. భీష్మాదుల కా యిద్దరి దృశ్యమును గణనీయమైనది.

ఆ రథ మెవ్వరిది ? ఆ రథమునుండి దూకి పరుగెత్తు వాడెవడు ? ఆ పరుగెత్తువానిని వెంటనంటు వేషధారి యెవ్వడు ? అను ప్రశ్నలు నాయకులయం దుదయించినవి. ఆ ప్రశ్నలకు సమాధానములును వారికి ఒకవిధముగ అందుచున్నవి. వా రిట్లూహించినారు.

ఆ వచ్చిన రథము విరాటునిది. పరుగెత్తువా డుత్తరుడు. విరటుడు దక్షిణదిశకు యుద్ధమున కేగగా ఉత్తరు డీ రథముతోడ మన మీదికి యుద్ధమునకు వచ్చియుండును. సైన్యమును చూచి భయభ్రాంతుడై పరుగెత్తుచుండెను. ఆ వెంటపడువా డర్జునుడు కావచ్చును. ఉత్తరుని పట్టి తెచ్చి, మనతో యుద్ధమును సాగించి పసుల గ్రమ్మరించుటకై అర్జునుడు ప్రయత్నించుచుండి యుండవచ్చును. కాకున్న వేరొకడు కౌరవులతోటి యుద్ధమున కేతెంచునా ? ఆ యపాకృతమూర్తి అర్జునునిదే. అని కొందరు రథికవరులు పరుగిడువాని వెంటదగులుచున్న వ్యక్తిలోని తేజమును పరిశీలించుచు, అర్జునుడే యని ఒకవిధముగ నిర్ణయించగా, మరికొంద రాతని ఉదాత్తగమనమును గుర్తించి, అర్జునుడు కావచ్చునని భావించినారు. వేరొకరు ఆ పోవువాని బాహువుల యునికి అర్జుననిదేనని ప్రక్కవారికి చెప్పి నిర్ణయించుచుండగా చివరకు వారందరును ఆ వచ్చు రథముపైనున్న వికృతవేషధారి అర్జునుడేనని మూడువంతులకుపైననే నిర్ణయించినారు. ఇది కురుసైన్యములోని గుడగుడలు. ఇక ఉత్తరుని వైపుకు మరలుదము.

ఉత్తరుని పరుగుతో అర్జునుని పరుగు నూరడుగుల దూరమున కలసినది. ఉత్తరుని జుట్టుముడి అర్జునుని చేతికి చిక్కినది. జుట్టు చేతికి చిక్కగా ఇక ఉత్తరు డెక్కడికిపోవును ? ఒకరిజుట్టు మరియొకరి చేతికి చిక్కగా ఎవరును కదలలేరు. అర్జును డుత్తరుని రథ మెక్కమనినాడు. నేను రథ మెక్కుటగాదు బృహన్నలా ! నీవు నన్ను వదలుచో నీకు

చీనిచీనాంబరముల నిత్తును. మణిసువర్ణముల నిత్తును. అదియు చాలవిచో పది మదపుటేనుగులనైనను ఇత్తును నన్ను వదలుము. అని ప్రతిమాలి నాడు. అర్జునుడు వదలలేదు. చివరకు ఉత్తరుని సారధిగా యుండుమని చెప్పి, నేను రథికుడనై అవ్వుల మరలింతునని అభయహస్తము విచ్చినాడు అర్జునుడు. దానికిని ఉత్తరు డుత్సహింపలేదు. ఉత్తరు డొప్పనను ఒప్పకున్నను అర్జును డాతని వదలదలచలేదు. వారిద్దరి సంభాషణమును ఒక్క ముహూర్తకాలము నడచినది. చివరకు పార్థుడు ఉత్తరుని బలవంతముగ పట్టితెచ్చి, రథము నెక్కించినాడు.

'తత ఏనం విచేష్టంతమకామం భయపీడితం
రథమారోపయామాస ప్రార్థః ప్రహరతాం వరః'

ఉత్తరుడు సారథికాగా అర్జునుడు రథికు డగుట జరిగినది. రథము కదలినది. అది సైన్యమువైపుకు తిరుగలేదు. స్మశానమందలి జమ్మిచెట్టు వైపుకు మరలినది. ఒక్కమారు కురుసైన్యమువైపుకు మరలుడు.

కౌరవసైన్యమున మహారథులై నిలిచిన భీష్మ, ద్రోణులతోగూడ వీరవరులగు వారి హృదయము లొక్కమారుగ భయకంపితములై వణకినవి. అర్జునుడు జమ్మిచెట్టుదగ్గరకు పోవు సమయమును భీష్మాదుల హృదయములకు కంపము కలుగు సమయమును ఒక్కటైనది.

'తం దృష్ట్వా క్లీబవేషేణ రథస్థం నరపుంగవం
శమీమభిముఖం యాంతం రథమారోప్య చోత్తరం
భీష్మద్రోణముఖా స్తత్ర కురవో రథిసత్తమాః
విత్రస్త మనస స్సర్వేధనంజయ కృతాద్భయాత్.

అట్లు మనస్సులకు భయము కలుగుట అపజయ సూచకమని యుద్ధశాస్త్రము చెప్పును. కావున ద్రోణాచార్యులు కౌరవుల అపజయ

సూచకములగు శకునములను వర్ణించినారు. ఆ యపశకునములు కేవలము సైనికుల మనస్సులు భయకంపితములగుటే కాదు ; వియత్తల భూతలములందుగూడ అట్టి సూచనలు ప్రదర్శింపబడినవి. సూర్యమండల మందొక విధమగు మాలిన్యము వచ్చినది. నక్కలు కూసినవి. యుద్ధ వాయిద్యములు తమంతతామై మ్రోగి, అపశ్రుతులను పలికినవి. యుద్ధాశ్వములు కంటివెంట నీరుగార్చినవి. మదపుటేనుగలు మెత్తనై తలలు వాల్చినవి. ఆయుధములనుండి మంటలు లేచినవి.

ద్రోణాచార్యులు సైనికులకు జాగరూకతను హెచ్చరించినారు. అంతేకాదు. భీష్మునివైపుకు తిరిగి, వచ్చువా డర్జునుడని తన నిశ్చయమును అర్థాంతరములనిచ్చు పదముల సంపుటితో అర్జునుని పేరు వచ్చునట్లు గూఢముగ వర్ణించి, ఆ వచ్చు పార్థుడూరక పోవడుగాన రాజును రక్షించుట అవసరమని తన యూహను భీష్మునకు ప్రత్యేకముగ తెలిపినాడు. ఈ ఘట్టమున అర్జునుని తెలిపిన శ్లోకమిది.

శ్లో॥ నదీజ లంకేశవనారికేతుః
నగాహ్వయో నామ నగారిసూనుః
ఏషోఽంగనా వేషధరః కిరీటీ
జిత్వాఽవయం నేష్యతి చాంద్యగావః

అర్జునుని వానరధ్వజమును వానరధ్వజ మనక 'లంకేశ వనారికేతు' వనినాడు. రావణుని యశోకవనమునకు శత్రువగువాని జండాగలవాడని అర్థము. అర్జునునిపేరు నుచ్చరింపక ఒకచెట్టుపేరు నుదహరించినాడు. — ఆ చెట్టు అర్జునవృక్షము. — ఆ అర్జునుడనువాడు దేవేంద్రుని పుత్రుడని చెప్పుటకు 'నగారిసూనుః' అని వాడినాడు. పర్వతములకు శత్రువగు దేవేంద్రుని పుత్రుడను అర్థమున వాడినాడు. ఈ

శ్లోకమున దుర్యోధనుని రక్షణమవసరమని తేల్చినాడు. ఆ తరువాత ద్రోణునకు భీష్ముడేమియు సమాధానమిచ్చినట్లులేదు. భీష్ముని మౌనమే తనమాట నిజమని యొప్పినట్లు ద్రోణుడు భావించి, తరువాత అర్జునుని పేరును స్పష్టముగ చెప్పినాడు. మొదట భీష్మునకు చెప్పినప్పుడు పార్థునకు అజ్ఞాతవత్సరము గడువలేదను అభిప్రాయమున్నది. భీష్ముని మౌనముతో తీరినదని స్పష్టమైనది. ఇక తాను అర్జునుని గురించి స్పష్టముగ తన భావములను ప్రకటించవచ్చును. ప్రకటించినాడు. ఏమని ప్రకటించినాడు ? ఏమని ప్రకటించినారని చెప్పను :

ద్రోణాచార్యులకు అర్జునునిపై గల అభిమానమేగాక అతడు తన యొద్దనుండి వెళ్ళినతరువాత ఎంత యుద్ధభటుడయ్యెనో ఎరిగినవాడగుటచే ఆ సంతోషమునంతను వెలిబుచ్చినాడు.

> 'స ఏష పార్థో విక్రాంతస్సవ్యసాచీ పరంతపః
> నాయుద్ధేన నివర్తేత సర్వైరపి సురాసురైః
> క్లేశితశ్చ వనే శూరః వాసవేనాపి శిక్షితః
> నేహాస్య ప్రతియోద్ధారమహం పశ్యామి కౌరవాః
> మహాదేవోపి పార్థేన శ్రూయతే యుధి తోషితః.

ద్రోణాచార్యులు చెప్పిన శ్లోకములలోని సారాంశ మిది. అర్జునుడు కౌరవులతోటి యుద్ధమును సాగించకుండ పోవువాడుగాదని స్పష్టపరచినాడు. దానికి కారణము వనవాసక్లేశమని నిర్ణయించినాడు. ఇది మొదటిమాట. అతనిని మనము జయించలేమా ? అను ప్రశ్నకు అతనిని జయించు మగవాడు మన సేనయందు లేడని తన శౌర్యముకూడ అతనికంటె తీసిపోవుననీ స్పష్టపరచినాడు. అందుకుకూడ తగు కారణములను చెప్పినాడు. మహాదేవుని సంతపింపజేసిన అతని అమేయపరాక్రమము నుగ్గడించినాడు. ఈ ఘట్టమున తిక్కనామాత్యుల ఆంధ్ర పద్యరత్నము లివ్వి —

శా॥ సింగం బాకటితో గుహాంతరమునం జేట్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీడె వ
చ్చెంగుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్

ఉ॥ ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగువారలస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ సంశయ మెల్ల భంగి గో
వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతుని జేసె నా వినమె పెం పెసలారెడుబాహుసంపదన్.

అంతతో కౌరవ సైన్యమునం దొక వివాదము చెలరేగినది. అర్జునుని ప్రశంసను కర్ణుడు సహించడు. వెంటనే ద్రోణాచార్యులపై తిరుగబడినాడు. తానును తన స్నేహితుడును చూపు పరాక్రమమునం దర్జునుని పరాక్రమము పదియారవవంతులేదని ద్రోణునకు సమాధాన మిచ్చి, ఒకవేళ అర్జునుడేవచ్చుచో నేనొక్కడనే అతని కీయుద్ధరంగమున సమాధానమిత్తునని ఉద్ఘాటించినాడు. ఈ సమయమున అర్జునుని వలన దుర్యోధనునకు యుద్ధభయమనునదే లేదు. అజ్ఞాతవాసవత్సరము గడప కుండగనే అర్జునుడు బయటపడినాడని దుర్యోధనుని ఊహ. ఆ మాటనే దుర్యోధనుడు చెప్పి ఇతరుడగుచో నా కసలు లెక్క లేదని సవాలుచేసినాడు.

ఇంతవరకు వచ్చువా డర్జునుడా ? అర్జునుడే. అను వారి వాదమున కును కావచ్చును, కాకపోవచ్చును అను వారి వాదమునకును అయినను కాకపోయినను మాకు భయములేదను వారి సమాధానములు నడచినవి కౌరవసైన్యమున.

మనమొక్కమారు జమ్మిచెట్టువద్దకు పోవుదము.

పార్థుడు బృహన్నలవేషముతోడనే శమీవృక్షముకడ రథమును దిగినాడు. ఇక పార్థుడు పార్థుడై కౌరవులపైకి దుముకవలెను. అతని

గాండీవము చేతికి రానిదే అత డర్జును డెట్లగును ? ఉత్తరునిచే ఆ చెట్టుపై నున్న ఆయుధములను దింపించవలెను. ఉత్తరుని సంబోధించి, ఆ వృక్షాగ్రముపైనున్న పాండవుల ఆయుధములను దింపుమనినాడు.

ఉత్తరుని ముఖము వెలవెలబారినది. తాను రాజపుత్రుడు. చెట్టుపై వ్రేలాడునది శవము. ఆ శవమునంటుకొను టెట్లు ? భూమింజయుడు ధైర్యముచేసి బృహన్నల నడిగినాడు. నావంటి రాజపుత్రులకా యిట్టి పనులు చెప్పుటయని. బృహన్నల నవ్వి నీకు తగనిపనిని చెప్పుదునా ? ఆ వ్రేలాడునది శవముగాదు. ధర్మజ, భీమార్జున, నకుల, సహదేవుల యాయుధ విశేషములని చెప్పినాడు. బృహన్నల మాటయందలి విశ్వాసముచే ఉత్తరుడు శమీవృక్షము నధిరోహించినాడు. ఆయుధముల పైన బంధింపబడిన చర్మమును విప్పినాడు. అంతియే ఉత్తరుని కన్నులు చెదరినవి; శరీరము వణకినది; భయభ్రాంతుడై ఒక్క క్షణకాల మాతడు స్తబ్ధత నొందినాడు.

అర్జునుని గాండీవ మాతనికి మొదట దర్శనమిచ్చినది. ఆ గాండీవము ననుసరించియే భీముని గదాదండమును ధర్మజాదుల ఆయుధ విశేషములునుగూడ నున్నవి. వాటి దివ్యకాంతులు రవ్యాదిగ్రహముల యుదయకాలములవలె చూచువారలకు విస్మయమును కల్పించగా ఉత్తరు డాయాయుధ విశేషముల యాకృతులను పరికించుచు అందు తాను ప్రథమమునే దర్శించిన ఒక ఆయుధమును వర్ణించి ఈ ఆయుధ మెవ్వరిదని బృహన్నలను ప్రశ్నించినాడు.

అది గాండీవము. దానిని అర్జునుడు ధరించును. దానిని ధరించియే అర్జును డుత్తర కురుభూములను కలిపి ఉత్తరదిగ్విజయము గావించినాడు. అంతేకాదు. అత డాగాండీవమును చేత ధరించగా దేవదానవుల నొక్క సారిగా జయించగలడు. అది ఈనాటిదికాదు. దాని నొకప్పుడు బ్రహ్మగాధ

వేయి సంవత్సరములు ధరించగా ప్రజాపతి అయిదువందల మూడు సంవత్సరములు ధరించినాడు. దేవేంద్రు డీ గాండీవమునే ఎనుబదియైదు సంవత్సరములును, చంద్రుడు అయిదువందల సంవత్సరములును, వరుణుడు వందసంవత్సరములను ధరించగా పార్థుడు అరువదియైదు సంవత్సరములనుండి దీనిని ధరించినాడు. అని ఆ దివ్యధనస్సును గురించి బృహన్నల ఉత్తరునకు తెలిపినాడు. అర్జునుని అరువదియైదు సంవత్సరముల లెక్క ఎట్లనగా, తీర్థయాత్ర పండ్రెండు సంవత్సరములు. వనవాసము పదమూడు సంవత్సరములు. రాజసూయము ఏడున్నర. ముప్పదిరెండు సంవత్సరములను ఆరుమాసముల కొక సంవత్సరమని లెక్కించవలెను. ప్రజాపతుల సంవత్సరములు మాత్రము దేవమానమున చూడవలెను. మన కొక సౌరసంవత్సరము దేవతల కొకరోజగును.

కథకువత్తము.

ఉత్తరునకు ఆయుధములను గురించి తెలిసినది. (ప్రతి ఆయుధమును గురించిన వర్ణనము అనవసరము) మరి పాండవు లెక్కడుండిరి ? ఉత్తరుడు ప్రశ్నించినాడు. జూదమున పరాజితులైరని పాండవులను గురించి ఉత్తరుడు వినెనుగాని వీరే వారని అత డేమెరుగును ? అర్జునుడు యథార్థము చెప్పినాడు. ఉత్తరున కిది నమ్మలేని నిజమైనది. అందుకని అర్జునునకు పదిపేరు లున్నవనియు అతని కానామములు సార్థకములనియు ఉత్తరు డెరుగును. బృహన్నల నా పది పేరులకును నిర్వచనముల నడుగుచో నిజము తేలునని ఉత్తరు డూహించినాడు. ఆ విషయమునే బృహన్నల నడుగగా తనకు వచ్చిన బిరుద నామములకు నిర్వచనలను చెప్పినాడు. అర్జునుని పదినామము లివ్వి.

"అర్జునః ఫాల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః
బీభత్సు ర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః.

1) చతుస్సముద్రము లందలి మధ్యభాగములంగల భూఖండమునం దెక్కడను నా శరీరవర్ణము దుర్లభమగుటచే నాకు అర్జునుదని పేరు వచ్చినది. అంతేకాక నేను పుణ్యకర్మనే చేయుదునుగాని పాపకర్మను చేయను. అందువల్లకూడ అర్జునుదని పేరు.

2) పూర్వోత్తర ఫల్గునీనక్షత్ర మధ్యగతుడై చంద్రు డుండగా నా జననమైనది. కావున ఫాల్గునుడను.

3) దేవదానవ సంఘాతము నంతను నేను శాసింపగలను. కావున నా పేరు జిష్ణుడు.

4) నేను కాలకేయాది రాక్షసుల సంహరించినప్పుడు నా తండ్రియగు దేవేంద్రుడు నాకు దివ్యతేజోవిరాజితమగు కిరీటము నిచ్చినాడు కావున నేను కిరీటినైతిని.

5) నా గుఱ్ఱములు శ్వేతవర్ణమున విరాజిల్లుటచే నాకు శ్వేతవాహనుడను పేరు వచ్చినది.

6) నేను యుద్ధరంగమునందెప్పుడును దైన్యమునొందక తప్పుదోవల చరింపక సుఖస్వరూపముననే యుద్ధమొనర్తునుగాన బీభత్సుడనని నాకు పేరు.

శ్లో॥ నకుర్యాం కర్మబీభత్సం యుధ్యమానః కథం చన
(భది కళ్యాణే అను ధాతువువల్ల వచ్చిన శబ్దము)

7) నేను యుద్ధరంగమునకేగుచో ఎట్టి శత్రువులనైన జయింతునేగాని ఎట్టి పోరాటమున నాకు అపజయమనునది లేదు. కావున నన్ను విజయుడందురు.

8) నా వర్ణము చూడముచ్చటై యుండుటచే నా తండ్రి కృష్ణుడని పిలిచినాడు. కావున కృష్ణుడను.

9) నేను కుడి ఎడమల తారతమ్యము లేక రెండుచేతులతో యుద్ధమొనర్తునుగాన సవ్యసాచినైతిని.

10) నేను రాష్ట్రముల నన్నిటిని జయించి ధనము నార్జించి ధనుంజయుడ నైతిని - అని తన పది నామములకును గల నిర్వచనములను వివరించినాడు. అంతియే.

ఆ క్షణముననే ఉత్తరుని దృష్టియందు బృహన్నల మాయమై పార్థుడు సాక్షాత్కరించినాడు. కావుననే తన గోత్రనామములతో అర్జునుని కలివాదముగావించి, తన కర్జునుని దర్శింపజేసిన దైవమును స్తుతించి, అర్జునునకు గావించిన పూర్వాపరాధములకు క్షమాపణమును చెప్పినాడు. అంతేకాదు ; తన మనసునందలి భయముతీరగా తన హృదయమునం దుప్పొంగిన ఆనందమును ప్రకటించుచు తన సారధ్యమున యుద్ధము సాగించుట కియ్యకొనినాడు.

అర్జునకు కావలసిన దదియే. అర్జునుడును తన సంతోషమును ఉత్తరునకు దెలిపి కౌరవసైన్యమునంతను తానెట్లు చించి చెండాడ దలచెనో వర్ణించి, ఉత్తరుని మనస్సునందెక్కడైన భయలేశము లంటియున్నచో ఆ లేశములనుగూడ తుడిచి రథము నాయత్తము గావింపుమనినాడు. ఉత్తరుడు ఇక చెట్టునుండి దిగి రథము నెక్కవలెను. ఉత్తరుడు అర్జునుని గాండీవము చేతనిడుకొని మిగిలిన ఆయుధముల నా చెట్టుపైనబెట్టి క్రిందకు వచ్చినాడు. మరల అర్జును డొక్కమాటు యుద్ధఘట్టమును వర్ణించుచు ఉత్సాహము రెట్టింపుకాగా 'ఉత్తరకుమారా ! జడవకుము' అని ఉత్తరునకుం దగిన నిర్భయత్వమును జ్ఞాపకము చేసినాడు

యథార్థమున ఉత్తరునకు యుద్ధమును గురించి భయములేదు. కాని ఒక సందేహము కలిగినది. మహనీయుడగు అర్జునునకి పేడితన మెట్లు వచ్చినదని అర్జునునే అడిగినాడు. అర్జునుని సమాధాన మిది.—

ఉత్తరా! నేను యథార్థముగ నపుంసకుడను గాను. ధర్మజుని యాజ్ఞకు బద్ధుడనై క్లీబవేషమున చరించుచు బ్రహ్మచర్య నిష్ఠుడనై తిననియు ఆ వ్రత మిప్పుడు సమాప్తమైనదనియు చెప్పినాడు.

ఉత్తరునకు సంవత్సరమునుండియు ఇట్టి యాకృతిగల వా డెట్లు బృహన్నల యగునను సందేహము లేకపోలేదు. అతని తర్క మొక విధముగ సత్యమని ఉత్తరునకు తేలినది. అంతతో తన కర్తవ్యమును నిర్దేశింపుమని అర్జును నడిగి ఉత్తరుడు తనకు సారథ్యమునం దెంత సామర్థ్యమున్నదో నిరాఘాటముగ చెప్పినాడు. అది యహంకారముగాదు. తాను రథమునకు బూన్చి తెచ్చిన గుఱ్ఱములుగూడ ఎట్టివో పర్ణించి దేవేంద్రుని సారథియగు మాతలి కెనయైన తాను సారథ్య మొనరింతునని నొక్కి వక్కాణించి యుద్ధనిర్ణయమును జేసినాడు.

ఇక అర్జునునకు బృహన్నల వేషము తొలగవలెను. అర్జునుని అమానుషరూపము రావలెను. శుచియై అర్జును డొక్కచో గూర్చొని, చేతికి బృహన్నల వేషమునం దుంచుకొన్న వలయముల నూడబెరికి, జడను విప్పి, తెల్లనిగుడ్డను తలకుచుట్టి కేశపాశముల బంధించినాడు. అంతతో ఆతని బాహ్యరూపము తొలగినది. ఇక అస్త్రదేవతలు తనకు సాక్షాత్కరించవలెను.

అర్జునుడు రథము నధిరోహించినాడు. అస్త్రదేవతల నాహ్వానించి నాడు. ఆ యస్త్రాధిష్ఠానదేవతలు పార్థునకు సేవకులు. దోసిలులొగ్గి అర్జునుని ఎదుట అస్త్రదేవతలు నిలుచొనుట జరిగినది. ఇదియే అర్జునుని ప్రత్యేకత. అస్త్రదేవతల మనసా గ్రహించి, ఆనందాతిరేకమున యుద్ధో

త్సాహము రెట్టింపగా గాండీవమును చేతబూని నారిని సారించినాడు. అతని జ్యావల్లీ వినాదము ఒకవీరుడు తనచేతనున్న విల్లును సారించగా అల్లెత్రాడు మ్రోగినట్లు లేదు. ఒక మహోన్నత పర్వతరాజమును వేరొక పర్వతము డీకొనగా వచ్చు భయంకరశబ్దమిది యని విన్నవార లూహించినట్లున్నది. కౌరవులకు మాత్రము తోకచుక్క రాలినదని భ్రాంతి కలిగినది.

ఉత్తరకుమారుని హృదయకుహరమున భీరుత్వమింకను వదల లేదు. అర్జునుడొక్కడే ఇంతసైన్యము నెట్లెదుర్కొనునని అతనికి సందేహము కలిగినది. ఈతనినమ్మి వెళ్ళుచో నేనేమగుదునో యని అతని భయము. అర్జుననే ప్రశ్నించినాడు.

'ఏకస్త్వం పాండవశ్రేష్ఠ బహూనేతాన్ మహారథాన్
కథం జేష్యసి సంగ్రామే సర్వశస్త్రాస్త్రపారగాన్

నీవొక్కడవే వీరినందర నెట్లు జయింతువు ? అని. అర్జునుని ముఖమున చిరునవ్వు మొలకెత్తినది. ఉత్తరకుమారుని మనసున నాటి యున్న పిరికితనము నూడబెరుకుటకై, ఖాండవదహనమును, ద్రౌపదీ స్వయంవరమును, ఈశ్వరునితోటి యుద్ధమును ఉత్తరునకు చెప్పి, ఆ రంగస్థలములన్నియు నా ఒక్కనిచేతనే నడచినవిగదా ! యని అతనికి ధైర్యమును పురిగొలిపినాడు.

ఇక రథము కౌరవుల కభిముఖమై నడవసాగెను. అర్జునుడు రథము తోలుట కనుజ్ఞనివ్వగా ఉత్తరుడు గుఱ్ఱముల నదలించినాడు. రథము శమీవృక్షమునకు ప్రదక్షిణముగా నడచి, సేన కభిముఖమైనది. ఇంతవరకు రథముపైనున్నది సింహధ్వజము. రథము కౌరవులపైపునకు సాగగా సింహధ్వజము కపిధ్వజముగా మారి ; రథచిహ్నమైనది. ఆకసమునుండి యూడిపడిన కపిధ్వజముతో అభేద్యకవచము తన నలంక

రించగా దేవదత్తమగు శంఖమును చేతనిడుకొని విజయుడు తాను వచ్చుచుంటినని శంఖారావమును గావించినాడు. కౌరవసైన్యమున వీర వరులందరకును వెంట్రుకలు నిక్కబొడిచినవి. వారి రోమాంచ మటుండ తానెక్క వేగముగ రథమును తోలుటకియ్యకొనిన ఉత్తరుడు భయ కంపితుడై చేతనున్న పగ్గములను వదలి ముందుకు వరిగినాడు. గుఱ్ఱము లును తమ మోకాళ్ళను భూమిపై నానించినవి. ఆ రథమునకు బూన్చిన గుఱ్ఱములుగాని, రథసారథిగాని ఇట్టి శంఖారావముల నే యుద్ధరంగముల వినిరి ?

అర్జునుడు ఉత్తరుని కౌగలించుకొనెను. వీపు చరచెను. భయమును దీర్చెను. పగ్గములను ఉత్తరుని చేతికందించి, రథమును నాగింపుమనెను.

ఉత్తరుడాశ్చర్యచకితుడై, నేనెన్నడిట్టి శంఖారావమును విని యెరుగననియు, వానరధ్వజము నందలి కాంతిపుంజము తనను విభ్రాం తుని గావించినదనియు చెప్పి రథమును తోలుట మొదలుపెట్టినాడు. ఒక్క రెండుఘడియలకాలము గడచినది. అర్జునుడు మరల నొక్కమారు శంఖమును పూరించదలచినాడు. రెండవసారి పూరించునపుడు గుఱ్ఱముల నొద్దికగాపట్టి, ధైర్యమున కూర్చుండుమని ఉత్తరునకు చెప్పి పూరించినాడు.

అర్జునుని దేవదత్తము మ్రోగినది. దానితోగూడ రథఘోషము సహకరించినది. ఆ రెంటితో గాండీవ జ్యాఘోషము కలసినది. ఈ మూడుశబ్దములొక్కటై దిక్కుల పిక్కటిల్లజేయగా ఉత్తరుడు మరల భయపడినాడు. అర్జునుడు మరల ఉత్తరుని భయమును తీర్చగా, రథము సాగినది. అర్జునుని రథఘోష జ్యాఘోష శంఖారావములు కౌరవసైన్య హృదంతరాళముల వ్యాపించి, సైనికులకు భయోత్పాతములు కలిగించగా సైన్యమునం దావిర్భవించిన భయకంపములును, అదే సమయమ్మున

భూమ్యాకాశములందు తోచిన ఉత్పాతములను రాబోవు కార్యక్రమము నంతను ద్రోణాచార్యులకు విశదముగావించగా, ద్రోణాచార్యులు ఆ వచ్చువాడు విస్సవచ్చుడేయని నిశ్చయించి, మరొక్కమారు శకునదోషముల నుపన్యసించి అర్జునునిచే రాబోవు యుద్ధమున క్షత్రియ జాతికి నాశము తప్పదని ఘంటాపథముగ బలికినారు.

'ధ్రువం వినాశో యుద్ధేన క్షత్రియాణాం ప్రదృశ్యతే'—ద్రోణుని యుపన్యాసమునకు దుర్యోధనుని హృదయము కలక బారినది. అతడు ఇట్లాలోచించినాడు:—

అర్జునుడే మన కెదురగుచో యుద్ధావసరము లేకయే అజ్ఞాతవాస వత్సర గణనమున ఆ సంవత్సరము పూర్తికాలేదను మిషతో పార్థుని వెనుకకు మరలింపవచ్చును. ఒకవేళ అర్జునుడేకాక విరాటుడుగాని, ఉత్తరుడుగాని యుద్ధమున కేతెంచుచో మన బలమును వారు జయించుటకు సమర్థులుకారు. ఇక మనకిక్కడ క్షత్రమండల మంతరించుటకు కారణ మెక్కడున్నది? ద్రోణుని పలుకులు పాండవపక్షపాతమున పలుకు పిరికిమాటలు. కాక, భీష్మద్రోణులు పాండవపక్షపాతులుగదా! వారి మాటల కీ కాలమున స్థానమిచ్చుచో మన కభిముఖముగానున్న రాజ్యలక్ష్మిని కోల్పోవుదుము. ఒకవేళ యుద్ధమే అర్జునుని వలన వచ్చుచో కర్ణుని ప్రభావమున అర్జునుని ఎదుర్కొనుట అసాధ్యముకాదు. అర్జును డొక్కడే ఈ కౌరవ సైన్యసాగరము నీదునా? ఇది అసంభవము. కావున మన మిప్పుడు ప్రథమమున పాండవుల యజ్ఞాతకాలమును భీష్ముని ముఖముననే నిర్ణయించి, ఆ సంవత్సర వ్రతము పూర్ణము కాలేదని భీష్ముని నోటినుండియే పలికించి, అర్జునుని పారద్రోలి, గోధనముతో హస్తినాపురమున కేగుట మన కర్తవ్యము—అను విషయ మాతనికి నిశ్చయమైనది.

దుర్యోధనుని ఆలోచనా తరంగములు పెల్లుబికినవి. ఆతని కాచార్యుడన్న భయములేదు. తాతగారగు భీష్ముడును ద్రోణునితో పాటువాడే. వేయేల? తన కాప్తమిత్రులై తన కభ్యుదయము కాంక్షించువాడు కర్ణు డొక్కడే యనునది దుర్యోధనునకు వచ్చి ఆత్మప్రబోధము.

శ్రోతలారా!

దుర్యోధనుడు తన ఆత్మప్రబోధనమునకే తావిచ్చినాడు. శాస్త్రాచార్యుల నావలకు నెట్టినాడు. శకునశాస్త్రములు, ద్రోణాచార్యులవంటి ఛాందసులకుగాని తనవంటి అభ్యుదయవాదులకు కాదని నిర్ణయించు కొనినాడు. ఛాందసవాదములకు తావిచ్చుచో మనల నావాదము పాతాళమున కూలద్రోయునేగాని మిన్నుపై కెగసిపోనీయదని దుర్యోధనుడు సిద్ధాంతీకరించుకొనినాడు. మాటిమాటికిని పంచాంగముల జూచి, యుద్ధయాత్రల సాగించు ద్రోణకృపాచార్యుల ఆచార్యత్వ మాతనికి నచ్చలేదు.

మానవుని ముందుకు నడిపించునవి ధైర్యసాహసములే యను తర్కబుద్ధియే దుర్యోధనుని ముందు నిలవగా భీష్మునివంక డిరిగి, కర్ణుని కలుపుగొని-ద్రోణకృపాచార్యుల నుద్దేశించుచు ఆచార్యుల నిద్దర నపేక్షించుచు ఇట్లు పలికినాడు ——

'ఉక్తోయమర్థ ఆచార్యో మయా కర్ణేన చాసకృత్
పునరేవ ప్రవక్ష్యామి న హి తృప్యామి తం బ్రువన్'

తాతగారు! నేనును, కర్ణుడునుగూడ అనేకమారులుగ మా యభిప్రాయములను వెలిబుచ్చినను ఈ యాచార్యులు వారి శ్రోవనే వారు మాట్లాడుచుండిరిగాని మమ్ముల నర్థము గావించుకొనలేదు. మరల

చెప్పుచున్నాను. అవి ముందుగా పాండవులు అజ్ఞాతవాస సంవత్సరమును దాటించకయే వచ్చియుండెనను తన అభిప్రాయమును వెల్లడించుచు; ఒకవేళ నేనేమైన పొరబడితినేమో యను ఉదారవాక్యమున భీష్మునికి తన విసయమును సూచించుచు, పాండవులు రాజ్యలుబ్ధులై వచ్చుటగూడ ఇందు కలదని కలిపి మాటాడి, పాండవుల అజ్ఞాతవాసకాల నిర్ణయమును గావించుట భీష్మునిపై బెట్టినాడు.

'లోభాద్వా తే నజానీయుః అస్మాన్ వా మోహ ఆవిశత్
హీనాతిరిక్తమేతేషాం భీష్మో వేదితు మర్హతి'

అంతతో దుర్యోధను డాగలేదు. అతిరథ మహారథవరులచే నిండియున్న మన సైన్యము నెదుర్కొను వాడీ జగమున లేడని భీష్మునకుగూడ తన యుద్ధనిశ్చయమును తెలుపుచు-అర్జును డెత్తివచ్చినను ఇంద్రు డడ్డగించినను-మనకు యుద్ధము తప్పదని నూటిగ చెప్పినాడు. అంతేకాదు, మన మిక్కడి కేతెంచినది యుద్ధమును నిశ్చయించియేగదా! అని- ప్రస్తుత యుద్ధయాత్రానిర్వహణబాధ్యత భీష్మద్రోణాదులపైనను కూడ కలదని నిరూపించినాడు. మనము వచ్చునప్పు డెవ్వ రెదురైనను యుద్ధము గావించి, గోధనమును దెత్తుమని వచ్చి: ఇప్పుడు యుద్ధమును విరమింప ప్రయత్నించుట తగదని భీష్మద్రోణాదులకు మొదటిమాటను గుర్తుజేసి-మాటదప్పుట పాడిగాదని నిరూపించినాడు. ఇదిగో దుర్యోధనుని పలుకులకు మూలము.—

'సర్వైర్యోద్ధవ్యమస్మాభిః ఇతి నస్సమయః కృతః'

దుర్యోధను డిట్లు సమాధానమీయగా అతని స్నేహితుడీ క్రింది సలహానిచ్చినాడు. తానొక్కడే అర్జునుని గెలువగలనని గర్జించి,

దుర్యోధనా!

'ఆచార్యం పృష్ఠతః కృత్వాతథా నీతిర్విధీయతాం'

ముందు ద్రోణాచార్యుని వెనుకకునెట్టి యుద్ధమునుగురించి మాట్లాడవలెనుగాని, ద్రోణుని సలహాపైన మనము నడవగూడదనినాడు. కారణమేమన ఆచార్యు డర్జున పక్షపాతి. మనల భయపెట్టుట ఈ మహానీయుని లక్ష్యము. గుఱ్ఱముల సకిలింతల వినియే జయాపజయముల నిర్ణయించుట ఈయన పాండిత్యము. ఉరుములు మెరుపులు అనునవి ప్రకృతిసిద్ధములై రాగా ఇట్టి ఛాందసులు వాటిని శకునములని వర్ణింతురు. కాక బ్రాహ్మణులు దయాసముద్రులు. నెత్తురుచుక్కల్ని చూడజాలని ఈ గురువృద్ధుల తొలగించక మనము బాగుపడము. దేశమొక్కమారు ముందుకు పోదగుసమయమున వీరి మాటల పాటించుట అనర్థకము. ఇటువంటి పండితప్రకాండుల కివ్వదగు స్థానము భోజనశాల. లేక కవితావైభవ ప్రదర్శనలగావించు సభాస్థలులు. లేక సంభావనలందించు దాతల గృహమండపములు. కాక ఆలమందల దానమిచ్చుటకై సంకల్పించిన దాతల సన్నిధానములు. అంతియెగాని యుద్ధభూములు వీరికి ప్రవేశార్హములుగాదని స్పష్టపరచినాడు. మరొక్కమాటకూడ మాటాడినాడు. ఒకవేళ వీరు ధనురాచార్యులుగదా! అందుమో; వీరు జనబాహుళ్యము మెచ్చుకొనదగు సభామండపములయందు అస్త్రవిద్యల ప్రదర్శించుటకే వీరి విద్యాభ్యాసములుగాని కదనరంగముల నిలచి పోరాడుటకు వీరి ధనుర్వేదాభ్యాసములు గావని నొక్కి వక్కాణించినాడు.

కర్ణు డిట్లు మాట్లాడియుండునని అధునాతను లెరుగరు. వారు భారతమును చదువలేదు. ఆనాటి కింత తెలివిగలవారు ఉండిఉండరని మనవారి ఊహ. తరువాతేమి జరిగినది? కృపాచార్యులు కర్ణునకు తగుసమాధాన మిచ్చినారు.

'భారం హి రథకారస్య న వ్యవస్యంతి పండితాః'

రథమును తయారుచేసిన రథకారుడు నా రథము నెక్కువాడు దేవతలనైనను గెలువవచ్చునని చెప్పగా అతని మాటలపైననే ఆధారపడి దేశకాలములను గుర్తెరుగకుండ పండితులగువారు నిజముగ దేవతలపైకి యుద్ధమునకు బయలుదేరరు. దేశకాలములతో సమన్వయించుకున్ననే ఆ రథకారుని రథనిర్మాణమునుగూర్చిన పలుకునకు విలువవచ్చును. అట్లే బలముల లెక్కించుకొనకయే పండితులు యుద్ధములకు ఏ వలె కాలు దువ్వరని సమాధాన మిచ్చినాడు.

తానొక్కడై ఖాండవవనదహనమును గావించిన అర్జునుడు - తానొక్కడే స్వయంవరమంటపమున రాజన్యుల జయించి ద్రౌపదిని తెచ్చిన అర్జునుడు - ఈశ్వరునిసైతము తన పిడికిటిపోటుల తృప్తి నొందించి పాశుపతాస్త్రము నందుకొన్న యర్జునుడు - నేడొక్కడై ఆవుల మరల్ప వచ్చుచుండగా నీవు ఒక్కడవై అర్జునుని జయింతువా ? 'కర్ణా ! నీ మాటలపస నట్లుంచి అందరి సాయమున యుద్ధమును సాగింపుమని బుద్ధిచెప్పినాడు. ఏ వొక్కడవుకాదు ; మనమారుగురము కలసినను అర్జునుని జయించుట కష్టమే.

'షడ్రథాః ప్రతియుధ్యేమ తిష్ఠేమ యదిసంహతాః.'

అయ్యును మనమిప్పుడు దేవేంద్రునిపైకి యుద్ధమునకేగు దానవుల వలె అర్జునుని మీదకు సిద్ధమగుదమని నిర్ణయించినాడు.

'యుద్ధ్యామహేఽర్జునం సంఖ్యే దానవా ఇవ వాసవం'

అంతలో అశ్వత్థామ కృపాచార్యుని సంభాషణ నాపి కర్ణునివైపుకు తిరిగి 'కర్ణా ! ఏమి మాట్లాడుచుంటివి ? ఆలమందలు హస్తినాపురమునకు చేరలేదు సరిగదా ; నగరమునుగూడ దాటలేదు. కార్యశూరులగు వారు వాక్శూరులు గారు. ద్రోణాచార్యులు పార్థుని ప్రశంసించుట నీవు దుర్యోధనుని స్తుతించుటవంటిదిగాదు.'

'శత్రోరపి గుణా గ్రాహ్యా దోషావాచ్యా గురోరపి
సర్వథా సర్వయత్నేన పుత్రే శిష్యే హితం వదేత్.'

శత్రువువల్లనైనను గుణమును గ్రహించవలెను. గురువునకైనను దోషమును తెలుపవలెను. ఏవిధముగనైనను పుత్రునకు, శిష్యునకును హితమును చెప్పవలెను. సమర్థుడగు శిష్యుడు పుత్రునకంటెగూడ ప్రియతముడగుటచే ప్రేమపూర్వకములును వాత్సల్యపూర్వకములునగు వాక్కులచే నాతండ్రి అర్జునుని ప్రశంసించుట యుక్తము. యుక్తతమము గూడనని, ద్రోణులు అర్జునుని ప్రశంసించుటలోని సహజమును చక్కగ విమర్శించి చెప్పినాడు. అంతేకాదు ; దుర్యోధనునిగూడ పలుకరించి ద్యూతమండపమున రాజ్యమును సంపాదించి యిచ్చిన శకునితోడనే ఈ యుద్ధమునుగూడ సాగించుకొమ్మని తా నీయుద్ధమునుండి విరమించు చుంటినని తన మాటలను విరమించినాడు.

యథార్థమునకు యుద్ధమధ్యమునం దీ వివాదము చెలరేగినది. మహానాయకులగు ద్రోణ, కృపాచార్యుల నధిక్షేపించి పలికిన కర్ణ, దుర్యోధనుల మాటలకు ఫలమేమి ? యుద్ధమునుండి అశ్వత్థామ విరమించుకొనగా ద్రోణు డెట్లు నిలుచును ? ద్రోణునితోపాటు కృపాచార్యుడును యుద్ధమునుండి వైదొలగును.

భీష్ముడు దీర్ఘదర్శి. తా నిప్పుడు ద్రోణాచార్యునకు క్షమాపణ చెప్పుట యవసరమని నిర్ణయించుకొనినాడు. అశ్వత్థామ వాక్యానుసరణిని కొనియాడి, కృపాచార్యులు చెప్పిన దేశకాల పాత్రౌచిత్యమును సమర్థించి కర్ణుడు మాట్లాడినది కేవల క్షత్రధర్మమని ఒప్పుకొనుచు విజ్ఞానము కలవా రెవ్వరును ఆచార్యుల నిట్లు మాటాడరని, కర్ణదుర్యోధనులు మాటలాడుట తప్పని ఒప్పుకొనుచు, తన నిర్ణయముకూడ ద్రోణుని

వైపుకే మొగ్గినదని స్పష్టపరచినాడు. అనగా కర్ణదుర్యోధనుల మాటలు దేశకాలముల గుర్తెరుగవని నిర్ణయించినాడు.

> సాధు పశ్యతి వై ద్రోణః కృపః సాధ్వను పశ్యతి
> కర్ణస్తు క్షత్రధర్మేణ కేవలం యోద్ధుమిచ్ఛతి
> ఆచార్యో నాభివక్తవ్యః పురుషేణ విజానతా
> దేశకాలౌ తు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి మే మతిః.

దుర్యోధనుడుగూడ భీష్ముని యనుసరించి ద్రోణునకును అశ్వత్థామకును క్షమాపణ చెప్పికొని జరుగబోవు కర్తవ్యమును వారిపై బెట్టినాడు.

ద్రోణాచార్యులు దుర్యోధనుడు చెప్పుకున్న క్షమాపణను అంగీకరించక, భీష్ముని వాక్యమునకు మాత్రమే స్థానమునిచ్చి, తాను ప్రసన్నుడనైతినని చెప్పి, ముఖ్యముగ రాజు అర్జునుని చేతికి చిక్కకుండ కాపాడుట మన కర్తవ్యమనియు, సేనకూడ పరాజితులు కాకుండ కాపాడుకొనుట అవసరమనియు సలహా నిచ్చినాడు.

తరువాతిది పాండవులు పదమూడు సంవత్సరములను సంపూర్ణముగ గడిపిరా ? లేదా ? అను విషయము భీష్ముడు నిర్ణయింపవలెను.

పాండవులకు పదమూడు సంవత్సరములును గడచి, కొన్ని రోజులుకూడ పైనగడచినవని భీష్ముడు నిర్ణయించినాడు. దుర్యోధనుని మతమున పాండవులకింకను గడవలేదు. కారణమేమి ? దుర్యోధనుని హృదయ మిదియై యుండవచ్చును.

ద్యూతమునకు సమయము అశ్వయుజమాసము. ఆశ్వజమునుండి పదమూడవసంవత్సరం అశ్వయుజము రాకుండ పాండవులకు పదమూడు

సంవత్సరము లెట్లగును ? గోహరణము చైత్రమాసమున జరిగినదిగదా? అనునది దుర్యోధనుని మతము. మరి భీష్ముడెట్లు చెప్పెరి ?

భీష్ముడు సౌరమానమునకును చాంద్రమానమునకును మధ్య కాలము ఏర్పు వృద్ధిదివసముల లెక్కించగా (అధికమాసములను) పదమూడుసంవత్సరములును గడచి పైనకూడ కొద్దిరోజులైనవి. కావున పాండవులు ధర్మముగనే పదమూడు సంవత్సరములను గడిపిరని చెప్పినారు.

సామాన్యదృష్టిని ప్రసరించగా ఆనాటికి ఈనాడు లెక్కకు రావలెనని పించును. అట్లు లెక్కించుచో దుర్యోధనునిదే న్యాయమని కూడ కొందరు భావించవచ్చును. కాని అట్లు కాదు. వ్రతములకు చాంద్రమానమునే లెక్కించవలెను.

శ్లో॥ సర్వవ్రతే ప్రతిజ్ఞాయాం నాక్షత్రో మాస ఉచ్యతే

నక్షత్ర మానము ననుసరించి చైత్రశుద్ధ సప్తమికే పాండవులకు పదమూడు సంవత్సరములును పూర్తికాగా బహుళపక్షమున వారు బహిర్గత మగుట జరిగినది.

కావున భీష్ములు పాండవులు అన్యాయముచేయలేదని నిష్పక్షపాతముగ చెప్పినారు. ఇంతతో కాలనిర్ణయము ముగిసినది. ఇక యుద్ధమునంగతి భీష్ముడేమనెను ?

పాండవులకు అపజయమనునది లేదని గట్టిగచెప్పి యుద్ధమున రెండుపక్షములకును జయమెప్పుడును సంభవింపదు కావున పాండవులకు రాజ్యమిచ్చుటయే ధర్మమని నిర్ణయించి, అట్లుకానిచో వీరోచితమగు యుద్ధనీతిని అనుసరింపవలసియుండునని చెప్పినారు. అనగా తాను చెప్పదగు ధర్మమును చెప్పి కార్యనిర్ణయములను దుర్యోధనునికే వదలినారు.

తస్మాద్యుద్ధోచితం కర్మకర్మవా ధర్మసంహితం
క్రియతామాశు రాజేంద్ర సంప్రాప్తశ్చ ధనంజయః.

ఏది ఏమైనను, కార్యనిర్ణయమునకు కాలవిలంబనము తగదని చెప్పినారు. దుర్యోధను డిట్లు నిర్ణయించినారు—

'నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ
యుద్ధోపచారికం యత్తుతత్క్షిప్రం ప్రవిధీయతాం'

నేను రాజ్యమిచ్చుట జరుగదు. యుద్ధమునకే ప్రయత్నమును జరుపుటను నిశ్చయించితినని సమాధానమిచ్చినారు. అంతతో భీష్ములు సైనికబలమును విభాగించుట జరిగినది.

# యుద్ధము

మొత్తము సైన్యమును నాలుగు భాగములు గావించినారు. అందు నాల్గవభాగము రాజును రక్షించుటకును, ఆ బలముతో గూడి దుర్యోధనుడు హస్తినాపురమున కభిముఖమగుటకును నిర్ణయమైనది. మరియొకభాగము గోవులరక్షించి, ఆ గోవులను హస్తినాపురమునకు తోలుకొనిపోవుటకు ఏర్పాటు చేసినారు. ఇక మిగిలినది సగభాగము. ఆ సగభాగమును అర్జునునితో పోరాడుటకు సిద్ధముగావించినారు.

క్షిప్రం బలచతుర్భాగం గృహ్య గచ్ఛ పురం ప్రతి
తతో పరశ్చతుర్భాగో గాస్సమాదాయ గచ్ఛతు
వయం చార్ధేన సైన్యస్య ప్రతియోత్స్యామ పాండవం

ఇక్కడకు సైన్యవిభాగమయినది. తరువాతది వ్యూహరచనము భీష్ములు వ్యూహము నిట్లు పన్నినారు.

సైన్యమధ్యమున ద్రోణాచార్యులు, సైన్యమున కెడమభాగమున అశ్వత్థామ, కుడిప్రక్క కృపాచార్యులు. సైన్యమునకు ముందుభాగముననే

కర్ణుడుండుటకు నిర్ణయించి వీరందరిపైనను తాను రక్షకుడై యుండుటకు నిర్ణయించుకొనినారు.

అట్లు కురువ్యూహ మద్భుతమై, భూభాగమున కమూల్యాలంకారమై వీరరసప్రదానముకాగా ఆకాశమున దేవతలందరును తమ తమ విమానములతో ఈ మహాసైన్యము నర్జును డెట్లెదుర్కొనునో చూతమని నిలిచినారు. దేవతలే కాదు. పూర్వపు రాజర్షులందరునుకూడ యుద్ధదర్శనకాంక్షితులై నిలిచినారు. ఆ రాజర్షులలోనివాడే పాండుమహారాజు కూడ. ఆతడును దేవేంద్రునిప్రక్కననే నిలిచి, తన పుత్రుని యమోఘ పరాక్రమమును చూడవచ్చినాడు.

ఇక యీ కౌరవసైన్యసాగరము నీదుటకై వెడలివచ్చు పార్థుని పయనమును పరిశీలింతము.

పార్థునికిది యొక తుచ్ఛసైన్యము అయ్యును వీరి వ్యూహరచనా విధానములోని అంతరార్థము నాతడు గ్రహించినాడు. కాలకేయాది రాక్షససమూహముల వ్యూహముల భేదించిన అర్జునున కిదియొక లెక్కయా ? పార్థుని రథము కౌరవులవైపుకు తిరిగినది. పార్థు డొక్కమారు తలయెత్తి సైన్యమును పరికించినాడు. ఆతనికి భీష్ముని వ్యూహరచనావిధాన మర్థమయినది. వారి వ్యూహమున రాజెక్కడుండెను ? అనునది మనకు ముఖ్యమగు విషయమని అతడూహించినాడు. కురురాజును గోవులను వెడలు మార్గమాతనికి నిర్ణయమైనది. ఉత్తరుని సంబోధించి, ఉత్తరకుమారునకా సైన్యవిభాగక్రమమును బోధించినాడు. నిరామిషముగనున్న ఈ సైన్యముతోటి మనకేమి పని ? అదుగో రాజు పోవు త్రోవ. మన రథ మాతనిమీదికి పోనిమ్ము. రాజు చిక్కుచో అతని బలమంతయు చెదరగా మనము ఆవులమరల్చుట సుకరమని నిర్ణయించినాడు.

'నాస్తి యుద్ధం విరామిషం' ఇదియే అర్జునునిలోని ప్రతిభా విశేషము.

పార్థుని రథము భీష్మాది కురువీరులవైపుకు తిరుగలేదు. అగ్రభాగమున పయనించు దుర్యోధనమహారాజునకును అతనిని రక్షించు సైన్యమునకును మధ్యభాగమున ప్రవేశించుటకై రథపయనము సాగుచున్నది.

కురుసైన్యమెట్లున్నదో మీకు చెప్పితినిగదా ! సైన్యమధ్యమునం దధిష్ఠించియున్న ద్రోణాచార్యులు తన శిష్యరత్నముయొక్క రాకపై దృష్టినిలపగా అర్జునుని రథోపరిభాగమున దివ్యతేజోవిరాజితమగు వానరధ్వజ మా ఆచార్యునకు దర్శన మిచ్చినది. ద్రోణాచార్యుల హృదయమొక్కమారుగ ఉప్పొంగినది. అంతలో పార్థ నామాంకితములగు రెండుబాణములు ద్రోణాచార్యుని పాదములపైబడగా ఆ బాణపాతమే అర్జునుడు తన శిరమునువంచి గురువుల కభివాదనము గావించుట యని ద్రోణున కర్థమైనది. కృపాచార్యునకును, భీష్మునకుగూడ అర్జునుడట్లే నమస్కారబాణముల విడిచినాడు. వారు సంతోషించినారు. ద్రోణుని హృదయ క్షేత్రమునం దుప్పొంగిన సంతోషసముద్ర తరంగములు మాత్రము ఆ మహనీయుని హృదయక్షేత్రము నందుండక పొంగిపొరలి బహిర్గతములయినవి. అంతలో రెండుబాణములు మేము క్షేమముగనే అరణ్య అజ్ఞాతవాసముల గడిపి బయటపడితిమని తనకు విన్నవించుచందమున ద్రోణుని శ్రవణరంధ్రములకు తగిలినవి. ద్రోణుడా సమయమున ఊరకుండగలడా ? ఆ వచ్చు విచ్చువిని రాకను వర్ణించినాడు. ద్రోణాచార్యుని దృక్పథమునం దర్జునుని విగ్రహము రాజ్యలక్ష్మివైభవముల తులతూగుచున్నట్లు కనబడినది. అంతేకాదు. అతని రాకలోని ఆ వేగమును చూడగా అర్జునుడు, యజ్ఞకుండమునందు

ఉన్న అగ్ని, యజమానుని ఆజ్యధారలచే వృద్ధినొంది జ్వలించు జ్వలిత మూర్తివలె కానుపించినాడు.

'అతీవ జ్వలితో ఽ త్యర్థ్య పాండుపుత్రో ధనంజయః
రథీ శరీ చారుతలీ నిషంగి శంఖీ పతాకీ కవచీ నిషంగి
ఖడ్గీ చ ధన్వీ చ విభాతి పార్థః శిఖీ వృతస్స్రుగ్భిరివాజ్యసిక్తః'

ఈ పట్టుననే తిక్కనగారు అర్జునుని రాక పర్జన్యునివలె నున్నదని వర్ణించినారు. పార్థుడు పర్జన్యుడు. రథము మేఘము. కపిధ్వజ ధ్వని యురుము. గాండీవము మెరుపుతీగ. వ్యాసభారతి అర్జునుడు మండుచు వచ్చు అగ్నిహోత్రుడని చెప్పగా ఆంధ్ర సరస్వతి అర్జునుని పర్జన్యుని గావించినది. ఆ రెండు ఉపమానములను అర్జునుని విజయ యాత్రను సూచించునవే.

కథకు మరలుదము.—

అర్జునుని ఆజ్ఞానుసారము ఉత్తరుడు దుర్యోధనునిపైపుకే రథమును మళ్ళించినాడు. దుర్యోధనునిపైకి పోకుండ అర్జునుని అడ్డగింత మని విలచిన కురువృద్ధుల సైన్యము నక్కడనే నిలిపినాడు. ఇప్పుడు దుర్యోధనుడు అర్జునునిచేతికి తప్పక చిక్కును. కాని కృపాచార్యులు అర్జునుని భావమును గ్రహించినాడు. రాజును చేత జిక్కించుకొన్న అర్జునునితోటి పోరాటమునకు ప్రయోజన మేమున్నది ? కృపాచార్యుడు ముందుగనే జాగరూకుడై అర్జునునిపైపుకు తమ సైన్యమును మళ్ళించి నాడు. అంతకు పూర్వమే సహస్రాక్షుడై ఆక్రమించదగు దుర్యోధనుని సైన్యమును ఆక్రమించి, తన బాణజాలమున నిరోధించి, విజయ శంఖమును పూరించి, గోసహస్రములను మళ్ళించిన అర్జునుని కృపాచార్యుని ఊహాప్రపంచము అడ్డగించలేకపోయినది. అర్జునుని రథము దుర్యోధనుని సైన్యము నడ్డగించగా ఆవులను రక్షింపనుంచిన

సైన్యము చెదరిపోయినది. ఆ సైన్యము చెదరగా ఆవులమంద తోకపట్టుల నెత్తికొని పట్టణముపైపుకు తిరిగినవి. అర్జునుని రక్షణభారమును ఆధారముగా గొని గోపాలురును మరలినారు. అంతతో ప్రధానమగు కార్యము ముగిసినది. ఇక మిగిలినది తన నడ్డగించినవారిని తొలగించి, దుర్యోధనునకు బుద్ధిచెప్పవలెను. ఇక్కడ మీకొక అంతరార్థమును చెప్పెదను.

ఆధ్యాత్మికరంగమున ప్రవేశించు సాధకుడు దుష్టవాసనలకు స్వాధీనమై వాటి వెంటనంటి వెళ్ళు ఇంద్రియగణమును ముందు మళ్ళించి, తరువాత అహంకారాది శత్రువులతో పోరాడవలెను.

భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాశ్వత్థామలు మహానాయకులై దుర్యోధనుని కగ్రభాగమున నిలిచినారు. అందగ్రగణ్యుడు కర్ణుడు. తొలుదొల్తనే కర్ణార్జునులు కలిసినారు. కర్ణుడు అర్జునుని మొదటితాకిడికి నిలువలేదు. పారిపోయెను. రెండవవారు కృపాచార్యులు. అర్జునుని ధారావాహిక శరపరంపరల ముందు కృపాచార్యులును నిలువలేదు. ద్వంద్వయుద్ధమునం దొక్కొక్కరు అర్జును నెదుర్కొనుట కష్టమని వారు గ్రహించినారు. ఒక్కమారుగ సైన్యమంతయును అర్జునుని ముట్టడించినది. సవ్యాపసవ్యముల తన బాహువీర్యమును చూప నెంచిన అర్జునున కది యొక యాటయైనది. రణరంగ మొకవిధముగ ప్రకోపించినది. ఉత్తరు డెట్లుండెను? — అతడు అర్జునుని బాణపరంపరల ననుసరించి, రథమును నడపవలసిరాగా చకితుడై క్షణమున కొక్క మార్గమునబోవు నా యర్జునుని నారాచముల ననుసరించి అతడు రథము నడుపు టెట్లు? ఉత్తరున కేమియు తోచలేదు. రథాతిరథ మహారథుల రథచిహ్నము లేవియో అత డెరుగకపోవుటచే అర్జును నిట్లు ప్రశ్నించినాడు —

శ్లో॥ ఆస్థాం యద్రుచిరం జిష్ణో రథం సారథినా మయా
కతమం యాస్యసే నీకం ఉక్తోయాస్యామ్యహం త్వయా॥

నేను ఏయే రథికులవైపుకు రథములను మరలింపవలెనో తెలుపుచు, నీయుద్ధమును కొనసాగించమనినాడు. ఆ కురు సైన్యము నంతను ఊచకోత కోయుచు, మహావేగముగ బోవు నా యర్జునుడు మాటి మాటికిని ఉత్తరునకు రథికవరుల పేర్లను చెప్పుట సాధ్యముకానివని. అందుకై వారి వారి రథములపైనున్న ధ్వజచిహ్నములను ఉత్తరునకు తెలిపినాడు. ప్రప్రథమున కృపాచార్యుని రథము చూపబడినది. ఆ రథమున కలంకరింపబడినది నీలవర్ణపతాకము. తరువాత తన కత్యంత ప్రియతముడగు ద్రోణాచార్యుని దివ్యస్యందనము వర్ణించబడినది. ఆయన జండాయందుంచబడిన గురుతు సువర్ణవర్ణవిరచితము గల అగ్నివేదిక. అశ్వత్థామ తన బాల్యమిత్రుడు. అతని రథమునుగూడ ఉత్తరునకు చూపినాడు. అశ్వత్థామ రథాగ్రమునందలి ధ్వజమున బాణము గురుతై యున్నదని చెప్పినాడు. ఇట్లే రథికవరుల జండాలపై నున్న గురుతుల నన్నిటిని ఉత్తరునకు తెలియజేసినాడు. ఇందు దుర్యోధనుడు సర్పకేతనుడని చెప్పి, కర్ణుడు ఏనుగును కట్టివేయునట్టి శృంఖలము గురుతుగా గలిగియుండెనని చెప్పినాడు. భీష్ముని రథమున తాళవృక్షముయొక్క గురుతున్నట్లు నాదగ్గరయున్న మూలమున లేదు. ద్రోణాచార్యుని జండాను వర్ణించుట రెండువిధములుగ యున్నది. మొదట చెప్పునప్పుడు కమండలువున్న ధ్వజమని చెప్పినాడు.

ధ్వజే కమండలు ర్యస్య శాతకౌంభమయ శ్శుభః
ఆచార్య ఏష హి ద్రోణః సర్వశస్త్రభృతాం వరః.

యుద్ధమునం దాతనితో ప్రత్యేకముగ ఎదుర్కొనునప్పుడు వేదిక గురుతును వర్ణించినాడు.

యశ్చైషా కాంచనీ వేదీ ధ్వజే యస్య ప్రకాశతే
ఉచ్ఛ్రితా ప్రవరే దండే పతాకాభి రలంకృతా'

దీనినిబట్టి చిన్నచిన్న పతాకములతో కూడియున్న ప్రత్యేకమగు నొక్క దండము వేదిక చిహ్నముచే కూర్చబడి కమండలు చిహ్నము కూడ ఒక జండాకు కట్టబడి యుండవచ్చును. భీష్ముని ధ్వజచిహ్న మిట్లు వర్ణించబడినది.

యస్తు నీలానుసారేణ పంచతారేణ కేతునా
హస్తావాపీ బృహద్ధన్వా రథే తిష్ఠతి వీర్యవాన్
యస్య తారార్కచిత్రో௨సౌ ధ్వజో రథవరే స్థితః.

నీలపతాకమును ; ఆ పతాకమున సువర్ణమండలములను గలిగి యున్న ధ్వజము భీష్మునిదని యున్నది. 'తారాః' అను పదమునకు నీలకంఠులు 'సువర్ణమండలాని' అని వ్రాసినారు.

ఇట్లే కర్ణుని జండాపైన శంఖము గుర్తుగా యున్నదని ఆంధ్రమున వర్ణితమైనది. మూలమున ''నాగకక్షాకు రుచిరా ధ్వజాగ్రే యస్య తిష్ఠతి 'ఏష వైకర్తనః కర్ణః'' అని యున్నది.

'హస్త్యంకిత పతాకాంచలః' 'హస్తి శృంఖలేత్యన్యే' అని నీలకంఠులు వ్రాసినారు. ఏమైన కానిండు. అవి మనకు ముఖ్యముకాదు. శ్రోతలు ముఖ్యముగ ఇక్కడ గమనింపదగు విషయ మేమన — ద్రోణాచార్య కృపాచార్యులను, అశ్వత్థామను, కర్ణుని, భీష్ముని వర్ణించు నప్పుడు కేవలమగు ధ్వజచిహ్నములనేకాక, వారివద్ద యుద్ధకాలమున ప్రపర్తింపదగు విశేషములనుగూడ ఉత్తరునకు తెలిపినాడు.

ద్రోణాచార్యునివద్దకు తమ రథమును మళ్ళించునప్పుడు-ఆయనకు ప్రదక్షిణముగపోయి, ఆయనను గౌరవించదగు బాధ్యత నీకున్నదని చెప్పినాడు. అంతేకాదు; ద్రోణాచార్య, కృపాచార్యులు ముందుగ తనపై

బాణములను ప్రయోగించకుండ వారిపై తాను యుద్ధమును ప్రకటించ డట. గురువులపై అర్జునుని గౌరవభావ మెట్లున్నదో చూచితిరా ! వారు తనపై యుద్ధమును ప్రకటించి, బాణములను వేసిన తరువాత తాను వారితో యుద్ధము చేయుట క్షత్రియధర్మము. కావున అప్పుడు తన పరాక్రమమును చూపవలెనేగాని గౌరవమును చూపకూడదు. ఇదియే భారతీయత. ఎవరిని ఏ యే స్థలములం దెట్లు గౌరవించవలెనో తెలిసి గౌరవించుటకు సమానభావమని పేరు. అది యట్లుండ ద్రోణాచార్యుని గురించి ఉత్తరునకు చెప్పునప్పుడు ద్రోణునివద్ద రథమును దిగవలసినదిగా కూడ చెప్పినాడు. ఇది ఆయనదగ్గర చూపు కపటగౌరవము కాదు.

'ఏషధర్మస్సనాతనః'

ఇది సనాతన ధర్మమని చెప్పినాడు.

కర్ణదుర్యోధనులను గురించికూడ ఉత్తరునకు విస్తరించి చెప్పినాడు. ఇక యుద్ధ మెట్లు జరిగినదో మీకు చెప్పవలెను. అందొక్క సూక్ష్మధర్మమును చెప్పెదను. దుర్యోధనుని వర్ణించుచు 'ధృతరాష్ట్రాత్మజః' అని వాడినాడు. తండ్రి కొడుకు లిద్దరిని కలిపినాడు. అంతేకాదు ; దుర్యోధనుని పరాక్రమమునుగూడ వర్ణించినాడు.

'ఏష ద్రోణస్య శిష్యాణాం శీఘ్రాస్త్రే ప్రథమోమతః'

ఉత్తరున కెరిగించుటలో భీష్ముని గురించి చెప్పునప్పుడు భీష్ముని ధ్వజచిహ్నమును మాత్రమే చెప్పుటకాక అతడు ధరించిన తలపాగను, కవచమును, హస్తత్రాణమును వర్ణించి 'మా కురువంశ సామ్రాజ్యలక్ష్మి సర్వాంగ సుందరియై నిలుచుట కితడే యాధార'మని చెప్పినాడు : 'రాజశ్రియాభివృద్ధశ్చ'. కాని ఈనాడు నాపైకి యుద్ధమునకు వచ్చుట మాపై క్రోధమునకాదు ; దుర్యోధనుని వశమునం దుండుటే కారణము.

'సుయోధన వశానుగః' — ప్రకృతమును విచారించుచో భీష్ముని ప్రతిబంధకము మన కేమియులేదు. తరువాత భీష్మునిపైకి పోవచ్చును. అవి, కర్ణునకు తనపైగల స్పర్ధనుగూడ ప్రత్యేకముగ తెలిపి యుద్ధమున కున్ముఖుడయ్యెను.

శ్రోతలారా!

అదియొక మహారణరంగము. ఉపన్యాస ముఖమున నే నేమి చెప్పను? ఈనాటి యుద్ధరంగమున కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమే అర్జునుని పరాక్రమమునకు కొలతబద్దయైనది. దుర్యోధనునితోటి యుద్ధము పాండవమధ్యమునకు పత్సరాదిపండుగ కాగా, ద్రోణాచార్యుల వారితో ద్వంద్వయుద్ధము తాను ద్రోణునివద్ద అభ్యసించిన ధనుర్వేదము సంతను నాకు కంఠస్థమయ్యె యున్నదని ముఖాముఖి పరీక్ష నిచ్చుచు, 'గురువర్యా! తా మందించిన ధనుర్వేదమునకు విశేషవ్యాఖ్యానము గావించితి'నని గురువర్యులకు తన ప్రతిభావిశేషమును నివేదించు కొన్నట్లున్నది. కురువృద్ధుడగు భీష్మునితోటి అర్జునుడు సాగించిన ద్వంద్వయుద్ధము మన కురువంశము నందలి క్షాత్రతేజము పరంపరాయాతమై నాయందు పూర్ణరూపము నొంది మిమ్ముల నెదుర్కొనుచున్నదని భీష్ముని యానందింపజేయుచు తాతామనుమల వరుసన సాగినది. పితామహునితో అర్జునుని యుద్ధము కొంతసేపు నడచినది. అర్జునుడు తన యుపకర్త్వమును సార్థకము గావించుకొనగా పితామహుడు ద్వంద్వయుద్ధమునందు పరాజితుడయ్యెను. అట్లు కురువీరుల శస్త్రాస్త్ర జ్వాలలు చెలరేగగా దేవతలు చకితులై చూచినారు. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము చూపరులకు వీరరసప్రధానమై చూడముచ్చటకాగా ద్రోణాచార్యులతోటి అర్జునుడు సాగించిన యుద్ధ మొక గాయక

సభామండపమువలె సాలంకారమై గురుశిష్యుల జ్యావల్లీనినాదములు దేవతలకు శ్రోత్రానందము నొసంగినవి. సామాన్యముగ శ్రవణానందము నిచ్చుటకాదు; ద్రోణాచార్యులు శిష్యునిపై కురిక మాటిమాటికిని గావించు ధనుష్టంకారమును గురువర్యులపైకి మహోత్సాహమున దుముకుచు అర్జునుడు గావించు గాండీవజ్యావల్లీనినాదమును వారి ద్వంద్వయుద్ధమునందేకాకారమై ఓంకార నినాదమువలె విజృంభించగా దేవతలు వారి జ్యానాద నాదానందమున మునిగినారు. ద్రోణాచార్యులు ప్రక్కకు తప్పుకొనినారు. ద్వంద్వయుద్ధమునందర్జునుని జయించువాడీ సేనయందు లేడనునది ఋజువైనది. అందరొక్కచో గుమిగూడి అర్జునునిపైకి విజృంభించినారు. అది సంకుల సమరము. అర్జునునకు మరింత సావకాశ మొచ్చినది. అర్జునున కది ఆటస్థలమైనది. అర్జునుడు యుద్ధరంగమున చరించునప్పుడు సవ్యాపసవ్య మండలముల చరించుచు రెండుచేతులతో శత్రుమూకల చించిచెండాడుట యనునది అతనియందు ప్రత్యేకమగు కళ. ఆ కళ నిప్పుడు ప్రదర్శించుట కవకాశము వచ్చినది.

పార్థుని శరజాలము అతని అక్షయతూణీరమునుండి వచ్చుట, ఒకదాని తరువాత మరియొకటి వెడలుటకాదు; మార్తాండుని కిరణ సందోహమువలె ఒక్కమారు బాణసహస్రములు పుంఖానుపుంఖములై రంగస్థలమున వ్యాపించును. అర్జునుని బాణజాలము సంకులసమరమును గావించు కౌరవుల సంగ్రామరంగస్థలమునందట్లు వ్యాపించగా, అర్జునుని రథము నలుమూలల తిరుగుచున్నది. నలుమూలల కాదు ; మూలమూలల తిరుగుచున్నది. మధ్యమార్గమునందాతడు చరించి, శత్రుమూకల చండాడుచునే, ఉద్దండమండితుడై ఆ మూలల గుమిగూడిన పదాతుల నరకును. ఆ మూలల, తన బాణసహస్రములకు గురియైన శత్రుసమూ

హము మొందెముల్లైయుండగా మరుక్షణముననే అతడు మరల మరి యొకవైపునకు తిరుగును. ఒకదిక్కునుండి మరియొకదిక్కున కేగు చుండెనని సైన్యము ఆ దిక్కునకు పోపగా అతడు విదిక్కులను చరించును, విదిక్కులయందాతడు చూపు పరాక్రమమును వంచించుటకై మరల సైన్యము, వెనుకకు మరలగా, మరియొకదిక్కునందాతని విశ్వ రూపము సాక్షాత్కరించును.

కావుననే ఉత్తరుడా యుద్ధమధ్యము నందర్జునుని మొగమును గూడ చూడలేక ఒక్కక్షణమాత్రమైనను విరామములేకచేయు నీ యుద్ధ వేదికకు ఓర్వలేకుంటినని మొరపెట్టినాడు. ఉత్తరుడు తన సారథ్యము నకు రాజీనామా నిచ్చుటగూడ జరిగినది. భీభత్సాద్భుతరౌద్రరసము లుప్పొంగిన ఆ రణరంగమున రథికుడు సారథికి ధైర్యము నిచ్చుచు, వెరువకుమని వీపుతరచుచు తానొక్క దందర కన్నిరూపులై చరించి నాడు. ఇట్టి యుద్ధవీరు డే పాశ్చాత్యచరిత్రయం దుండెను? ధర్మవీరుడగు నాయకుడు వారి వాఙ్మయమున లేడు. పాశ్చాత్య సాహిత్యమునందలి రాజకీయరంగమంతయు విప్లవవిధానములనే నడచునుగాని ధర్మమున కక్కడ స్థానములేదు. ఇంతతో మన రణరంగవర్ణనమును ముగింతము.

ఏ యుద్ధరంగమునందును ఎప్పుడును ఎవ్వరును చేయని యద్భుత చిత్రము నొకదానిని అర్జును డీ యుద్ధమున చూపినాడు. దానిని చెప్పెదను.

సమ్మోహనాస్త్రమనునది అస్త్రవిద్యావిశేషము. అందొక మకుటాయ మానమగు అస్త్రము. దానిని కురుసైన్యమునందు ప్రయోగించినాడు. ఆ యస్త్రమునకు గురికానివా డీ కౌరవసైన్యమున భీష్ముడొక్కడే. ద్రోణాచార్యులుకూడ ఈ యస్త్రమునకు గురికాకతప్పదు. అట్లే జరిగినది. సైన్యమంతయు తమతమ చేతులయందలి ఆయుధములను వదలి, మైమరచి భూమిపైన వ్రాలినారు.

భారతీయులారా ! యుద్ధమునకు శత్రువునకీ సమయ మెట్టిది ? తాను జయించదలచిన శత్రువుల ఉత్తుకలు కోయుటకు తగినసమయము. అర్జును డట్లు చేసెనా ? అతడు భారతీయ ధర్మమూర్తి. అతని సిద్ధాంతమున శత్రువుల నాటినోర్చపలెనుగాని కృత్రిమమున శత్రువుల ఉత్తులకత్తిరించుట లేదు.

ఈ ఘట్టమునం దాతనికొక యవసరమున్నది. రణవీరుల తలపాగలయందలి చిత్రవిచిత్రవర్ణములుగల వస్త్రఖండములను ఉత్తర బొమ్మపొత్తిళ్ళకై తీసుకొనవలెను. అందుకే ఈ యస్త్రమును ప్రయోగించినాడు. వారా మోహనాస్త్ర ప్రభావమునుండి మేల్కొనునంతలో తానీ పనిని పూర్తిగావించుకొనవలెను. ఉత్తరుని పంపి, ద్రోణ-కృపా-శ్వత్థామ-కర్ణ-దుర్యోధనుల తలపాగలలోని పిలికలను కోయించి తెప్పించినాడు. భీష్మునిదగ్గరకు పోలేదు. అతడు మోహము నొందలేదు. అంతలో అర్జునుడు ఉత్తరకు చేసిన వాగ్దానము నెరవేరినది. తరువాత సంగతేమి ? అస్త్రప్రభావము మరలినది. దుర్యోధనుడు కన్నులు తెరచినాడు. అర్జునుని రథము యుద్ధభూమినుండి మరలిపోవుచున్నది. తానేమి చేయగలడు ? భీష్మునివద్దకేగి అర్జునుడట్లు పోవగా మీరూరకుంటిరేమని మందలించినాడు. భీష్ముడేమనును ? దుర్యోధనుని మందబుద్ధికి చింతించి మందహాసముతో ఇప్పటికైనను నీవు బుద్ధితెచ్చుకొనుట మంచిదని దుర్యోధనునకు చెప్పినాడు. దుర్యోధనుని కామాట నచ్చలేదు. అర్జునునితో మరల యుద్ధమును సాగింతమనినాడు. భీష్ము డొప్పలేదు. మరల అర్జునునితో యుద్ధమున కేగితిమేని మనలనందరను పూర్ణాహుతిగ వేల్చునని అర్జునుని ప్రతిభను చెప్పినాడు.

ఉ॥ మోహనబాణపాతమున ముందలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతో గడగి పార్థుని దాకెదుబుద్ధి గ్రమ్మఱన్

సాహసవృత్తిఁజేసి యవిచారత బోయితిమేని వాడు పూ
ర్ణాహుతి వేయడే మనలనందఱ నొక్కట మార్గణాగ్నికిన్.

అంతేకాదు: అర్జునుడు మన కుత్తుకలను కోయకుండ వదలినందుకాతనిని ప్రశంసించుకొనుట యుక్తమనినాడు. దుర్యోధను డూరుకొనలేదు. వెడలిపోవు అర్జునునిపై తిరుగబడినాడు. సైన్యము రాజును అనుసరించక తప్పలేదు. అర్జునుడు పోవుచు చూపిన అల్పపరాక్రమము తోడనే దుర్యోధనుని కిరీటమును క్రిందకూల్చి, రాబోవు యుద్ధమును కూడ ప్రకటించి, దేవదత్తమును పూరించినాడు.

దేవదత్త శంఖారావము దిశదిశల మ్రోగినది. అర్జునుని నేటి యుద్ధచరితము దేవతలకు గేయభాగమైనది. గగనమండలమందలి విమానములు స్వర్గసీమకేగినవి. అర్జునుడు కురువృద్ధులకు వందన సమర్పణగావించుచు తన యుద్ధయాత్రమును ముగించినాడు.

ఇక తరువాతకథ —

అర్జునుని రథము ఉత్తరుని సారథ్యముననే మరల జమ్మిచెట్టును చేరుకొన్నది. కపిధ్వజ మంతర్ధానమైనది. సింహధ్వజము రథముపై నిలిచినది. అర్జునుడు బృహన్నలయయ్యెను. గాండీవము మరల చెట్టుపై కట్టబడినది.

కౌరవులు హస్తినాపురమున కేగినారు. ఇక ఉత్తరుడు, బృహన్నలయు నగరమున ప్రవేశించవలెను. విరాటునకు ఆవుల మళ్ళించినవాడు అర్జునుడని ఇప్పుడే తెలియకూడదు. కావుననే అర్జునుడు తన సంగతి నెరిగింపవద్దని ఉత్తరునకు చెప్పెను.

విరాటుడు సుశర్మపైకి దండెత్తిన సైన్యముతో విజయమునొంది ఇంటికి తిరిగి వచ్చినాడు. ఇంట ఉత్తరుడేడీ ? అతడు కౌరవులతో యుద్ధమున కేగెనని అంతఃపుర స్త్రీలవలన విరటునకు తెలిసినది. అతడు

ఆసనమున చతికిలబడినాడు. విరాటున కుత్తరుని ప్రాణములతో చూతునన్న ఆశపోయినది. తా నిప్పు డేమి చేయవలెనో విరటునకు తోచలేదు. తన చతురంగబలములను ఉత్తరునకు సాయముంప నాయుత్తము గావించినాడు. ఉత్తరుడు ఏమయ్యెనో కనుగొని వచ్చుటకు కొందరు బాటులను పంపినాడు. అంతలో ఉత్తరుడు పంపిన గోపాలుడు వచ్చి -

చ॥ కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరు డిదె తాను సూతుడు సుదగ్రత వచ్చుచునున్నవాడు త
త్తురగరథధ్వజాలి నొకత్రుప్పుడు రాలదు మమ్ము నిల్చి వే
పురి నెరిగింపు డన్న నృపపుంగవ వచ్చితి మేము ! ...

అని చెప్పినారు.

విరటుని అంతరంగము సంతోషమున నిండి పొంగిపొరలినది. ఆనందాశ్రవులు కన్నులనుండి జలజలరాలగా ఒడలు పులకరించినది. గోపాలురను - ఏమేమి ! ఉత్తరుడు కౌరవుల జయించెనా ? అని సగర్వముగా పలుమారు పలకరించినాడు. ఉత్తరుని విజయఘోషమును నగరమున చాటింప ఆజ్ఞనిచ్చినాడు. పట్టణమంతయు పతాకములచే నలంకరింప సేవకుల బంపినాడు. నగరములోని వారాంగన లందరును అలంకృతులై ఉత్తరుని విజయయాత్రను గానము చేయవలెను. వందిమాగధులందరును ఉత్తరుడు వచ్చునప్పటికే స్తోత్రపాఠములు గావింప వేచియుండవలెను. ఇట్లందరికిని ఆజ్ఞ నిచ్చినాడు. అప్డే పట్టణ మంతయు ఉత్సాహసమన్వితమై యున్నది. అంతిపురమున ఉత్తర మొదలగు కన్యక లందరను ఉత్సాహసమన్వితలై పట్టుపుట్టములు కట్టి ఉత్తరునికి ఎదురేగ నుండిరి. ఇది అంతఃపుర కాంతల యుత్సాహము.

ఉత్తరుని రథమింకను గృహమునకు చేరలేదు. విరటుడు కంకుభట్టును ద్యూతమునకు ఆహ్వానించినాడు. అది తన పుత్రుని విజయవార్తను విన్న యుత్సాహకాలమగుటచే ద్యూతక్రీడా మహోత్సవముకై కంకుభట్టును పిలుచుట జరిగినది.

ధర్మజుడు కేవల ద్యూతప్రియుడుగాడు. ద్యూతమునందలి దోష మాత దెరుగనిదికాదు. అతనికి స్వానుభవము. విరటుడు పిలవగనే ద్యూతక్రీడ కాతడు తలనూపలేదు.

రాజా! జూదముచేతనే ధర్మజుడు రాజ్యమును, తమ్ములను, భార్యను కోల్పోయి అడవుల పాలయ్యెనని బోధించి, నీవంత ఇచ్ఛగించుచో వచ్చెద ననినాడు.

వారిద్దరును ఆటకు కూర్చొనిరి. విరాటుని యుత్సాహము ఆటపైననేదు. ఉత్తరుడు కురువీరుల జయించుటనే అతడు పలుమారు పలుకుచూ సంతోషపడుచుండెను.

కంకుడు — 'కురుపతి భీష్మ, కర్ణ, కృపకుంభజ ముఖ్య మహోగ్రయోధ విస్ఫురణమున కోర్చి' రణరంగమున ఉత్తరుడు జయించుట అసాధ్యమనినాడు. రాజపుత్రుని విజయము ననుమానించుటను విరటుడు సహించలేదు. కంకుభట్టును ఇక మాటాడవద్దని నివారించినాడు. 'ఇంత పట్టుసైరించితి నీవుగాన' అని హెచ్చరించినాడు. ఒకవిధముగా విరటుడు ఎఱ్ఱబడినకన్నులతోడనే జూదము నాడుచుండెను. ధర్మజుడు మరల ఉత్తరుని మాటనెత్తి బృహన్నల సాయమున ఉత్తరుడు జయించి యుండవచ్చునని నిర్ణయముగ జెప్పినాడు. విరాటుని ముఖమండలమున కోపము, మందహాసము ఆ రెంటితో కూడిన ఉల్లాసము ముప్పిరిగొనగా వికృతాననుడై ఇట్లనినాడు —

కంకుభట్టా! సారథులు యుద్ధమున జయింతురా! శస్త్రాస్త్రముల పోరు రథికు లనాథలా! నీ వికి మాటాడవద్దు. అయ్యేను నాపుత్రుని సంగతి నీకెందుకు? నీకు మాటాడువిధము తెలియదు. అని గట్టిగ మందలించినాడు.

ధర్మజుని ముఖమండలమున చిరునవ్వు మొలకెత్తినది. జరిగిన వృత్తాంతమిదియై యుండవచ్చునని తన యభిప్రాయమును మరల చెప్పినాడు ధర్మజుడు. కౌరవులు ఉత్తరదిశ యందలి గోవులను పట్టుటకై వచ్చియుండవచ్చును. ఉత్తరుని సారథిగా గొని బృహన్నలే యుద్ధమును సాగించి యుండవచ్చును. ఇది నిశ్చయము. అని గట్టిగ నొక్కి పక్కాణించినాడు.

విరటుని క్రోధరసము రౌద్రరసమై ఉప్పొంగగా జూదమాడు సారెబెట్టి ధర్మనందనుని ముఖమండలమున విసరికొట్టినాడు. సుకుమార గాత్రుడగు ధర్మజుని ముఖమండలము దెబ్బతినగా ముక్కులనుండి రక్తము గారినది. అతని రక్తబిందువులు భూమిపైన పడకూడదు. ఆ రాజ్యమున దుర్భిక్షము తాండవించును. కావున వెంటనే అతడు తన రెండుచేతులతో రక్తము కారుటనాపుకొని ప్రక్కనున్న సైరంధ్రివంక చూచినాడు. ద్రౌపదికి ధర్మజుని చూపు అర్థమైనది. ఆ క్షణముననే సువర్ణమయమగు పూర్ణజలపాత్ర నొకదానిని తెచ్చి ఆ నెత్తురు నొక్క బొట్టైనను క్రిందజారకుండ జేసినది.

'పాత్రం గృహీత్వాసౌవర్ణం జలపూర్ణ మనిందితా
తచ్ఛోణితం ప్రత్యగృహ్ణాత్ప్రసు స్రావ నస్తతః'

[ నస్తతః నాసికానాడీతః (నీ. కం.) ] ముఖమున గంటువడుటకాదు. ముక్కులనుండి కారినది. అంతలో ఉత్తరుని రథము రాజద్వారమున

కేతెంచినది. పౌరుల దృష్టులు గౌరవముతో అతనిపై బడగా స్త్రీల కరతలములనుండి జలజలరాలు పుష్పాక్షతలను అతని శిరముపై జడివాన వలె పడినవి. ఎందరో పల్లెప్రజలు ఆ రాకొమరునిచూచి ప్రీతిబొందగా పట్టణములోని సతీమతల్లులగు ముసలిముత్తైదువలు మంచిముత్యములతో కలసిన కుసుమసహస్రములు ఉత్తరునపైనను బృహన్నలపైనను వెదజల్లిరి. బ్రాహ్మణుల వైదికాశీస్సులు ఆ రథికునకును, సారథికిని అందినవి. రాకొమరితయగు ఉత్తర, ఉత్తరునకు అభిముఖయై నీరాజనముల నందించి, చందనగంధములపూసి పూలమాలలతో సత్కరించినది. జయభేరులును, మంగళవాయిద్యములును మారుమ్రోతలతో మ్రోగినవి.

ఇక ఉత్తరుడు సారథితో కలసి తండ్రి పాదములకు మ్రొక్కవలెను. విరాటుని ప్రతీహారుడు విరాటునివద్ద కేగి ఉత్తరకుమారుడు తమ యాజ్ఞకై వేచియుండెనని చెప్పినాడు. విరటుడు వెంటనే సారథితో సహా అతని ప్రవేశపెట్టుట కనుజ్ఞ యిడగా వా రిద్దరును విరటుని సమీపమునకు వచ్చుటయే మిగిలినది. కాని అది బృహన్నల ఉత్తరునితోగూడ రాదగుసమయము కాదు.

ధర్మజు డెందుకో బృహన్నల నిందు ప్రవేశపెట్టవద్దని ద్వారపాలకుని చెవిలో రహస్యముగ ఊదినాడు. అట్లే జరిగినది. కారణ మేమయ్యుండును? ధర్మజుని శరీరమం దెక్కడైనను రక్తసిక్తమగు భాగము నాతడు తిలకించుచో ధర్మజునికా హట్టమును కల్పించినవానిని అర్జునుడు మృత్యువున కందించును. యుద్ధసమయములందు తప్ప ధర్మజుని శరీరమునందు గాయమును అర్జునుడు చూడలేదు ; చూడడు. అదియే ధర్మజుని భయము. ఉత్తరుడొక్కడే తండ్రియొద్దకు వచ్చినాడు. తండ్రి పాదములకు వందనమాచరించగా ప్రక్కనఉన్న కంకుభట్టు

నాసికారంధ్రములనుండి కారు రక్తస్రావమును అతడు చూచినాడు. అతని ప్రక్కనున్న సైరంధ్రియు అతనికంట పడినది ఉత్తరునిగుండె బ్రద్దలైనది. తండ్రి నడిగినాడు. విరటుడు తనకును, కంకుభట్టునకును జరిగిన సంవాదమును చెప్పి తాను సారెపెట్టి కొట్టితిననికూడ చెప్పినాడు. ఉత్తరుడు తండ్రిచేసిన యకృత్యమునకు భీతిచెందుటయేగాక సహింపలేక పోవుటయు జరిగినది. సవినయముగా కంకుని పాదములపై ప్రణమిల్లి క్షమాపణ చెప్పుకొనుట యవసరమని తండ్రికి సలహా నిచ్చినాడు.

'అకార్యం తే కృతం రాజన్ క్షిప్రమేవ ప్రసాద్యతాం
మా త్వాం బ్రహ్మవిషం ఘోరం సమూలమిహ నిర్దహేత్'

తండ్రీ! బ్రాహ్మణ యవమానమను ఘోరవిషము నిన్ను దహించునని తండ్రికి ఘాటుగ చెప్పినాడు. విరటుడు కంకుని కాళ్ళపై బడి క్షమాపణ చెప్పికొనినాడు.

ధర్మజుడు శాంతమూర్తి.

'న దూషయామి తే రాజన్ యద్వై హన్యాదదూషకం।
బలవంతం ప్రభుం రాజన్ క్షిప్రం దారుణ మాప్నుయాత్॥

రాజా! నిర్దోషినగు నన్ను నీవు కొట్టినను నీపై నాకు ద్వేషము లేదు. బలగర్వమున రాజుకావించు ఏ కర్మయైనను దోషదూషితము కాగలదు. అని అతనికి ధర్మము నుపదేశించినాడు. ఇదియే! భారతీయ ఇతిహాసములలోని వైశిష్ట్యము. ప్రతి కథయందును సూక్ష్మధర్మము లంతర్భూతములై అడుగడుగునను మనలను మేల్కొలుపుచుండును. ఇచ్చట విరాటుడు తన పుత్రుని విజయోత్సాహమునకు భంగము కల్పించెననియే కదా! కంకుభట్టుపై సారె విసరినాడు! అది రాజు ఆచరింపదగు పనికాదు. ధర్మజుని వాణి అంతతో ఆగలేదు. విరాటా! ...

'యది హ్యేతత్ పతేద్భూమౌ రుధిరం మమ నస్తతః
స రాష్ట్రస్త్వం మహారాజ వినశ్యేథా న సంశయః'

నీవు కొట్టిన దెబ్బకు నా రక్తబిందువులు భూమిపై పడినచేని ఈ రాష్ట్రమంతయు నశించిపోవును. కావున నీవెన్నడును తొందరపడి ఇట్టి పనులు ఆచరింపకూడదని మందలించినాడుకూడ.

ధర్మజుని ముఖముందలి రక్తధారలు సమసిపోయినవి. బృహన్నలకూడ అచ్చటకు వచ్చినాడు. కంకునకును విరాటునకును బృహన్నల నమస్కరించినాడు.

విరాటుడు బిడ్డను దగ్గరకుతీసి కౌగలించుకొని వాత్సల్యదృష్టి ప్రసారముల నాతనిపై బరపి- కుమారా! భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థాములును, కర్ణుడును పశుబలమును పట్టుటకై రాగా నీవు వారి నెట్లు ఎదుర్కొంటివి? పుంఖానుపుంఖములై వారివారి బాహువినిర్ముక్తములగు నారాచములు నిన్ను ముంచగా, దుర్యోధనుడు వెంటాడగా నీవు వారి నెట్లెదుర్కొంటివి? నీ వెదుర్కొన్న సైనికులం దొక్కడు పరశురాముని గెలువగా మరియొక్కరు ధనుర్వేదమునకే ఆచార్యుడు. వారిని నీవెట్లు జయించితివో! అని తన ఆశ్చర్యమును ప్రకటించినాడు. ఈ ఘట్టమున తిక్కన పద్యరత్నమును మీ కందింతును.

ఉ॥ గోవుల నెట్టులాగితి వకుంఠితవిక్రముడైన రాజరా జే
విధి మానభంగమున క్రెల్లను నోర్చి పలాయనాను డై
నీవిజయంబు సైచి ఘననిందకు నియ్యకొనంగ జాలె బు
త్రా వెర గయ్యెడున్ రణవిధం బఖిలంబు నెరుంగ చెప్పుమా.

ఉత్తరు దేమని చెప్పును? బృహన్నల జయించెనని చెప్పకూడదు. అత డొక ఉపాయమును పన్నినాడు. తండ్రీ! ఆవులను నేను మళ్ళించ లేదు. శత్రువులను కూడ నేను జయించలేదు.

'న మయా నిర్జితా గావో న మయా నిర్జితాః పరే'

ఒకా నొక మహామాన్వితుడగు దేవదూత నాకు ప్రత్యక్షమై నన్ను బ్రతికించినాడు. అతడు తరువాత నీ దృష్టికి రాగలడు. అతడు యుద్ధమగుటతోడనే అంతర్ధానమయ్యెనని చెప్పినాడు. ఉత్తరుని కా మాటతో తృప్తికలుగలేదు. బృహన్నల సమీపమునందే ఆ దేవపుత్రుడు తన నెట్లు ఓదార్చి, ఆవుల మళ్ళించి కురువీరు నెట్లెదుర్కొనెనో గూడ చెప్పినాడు. నేను రణరంగమున కేగితిని. కౌరవసైన్యమునుండి చెలరేగిన పాదధూళి ఆకసమును గప్పగా ఆ సైన్యమును చూచి నేను గజగజలాడితిని. అప్పుడాతడు నాభయమును దీర్చినాడు. అయ్యును నేను రథముదూకి పరుగు పెట్టితిని. అతడు నా వెంటవచ్చి ఓడకు, ఓడకుమని నన్ను రథముపైన కూర్చొనపెట్టినాడు. నే నాతని యాజ్ఞకు బద్ధుడనైతిని. అంతలో కౌరవసేన మన ఆలమందలను తోలుకొనిపోవుట అతడు చూచి ఆ సైన్యమునందు రారాజును గానక ప్రక్కమార్గముగుండ మన రథమును తోలి ఆవుల మరల్పబోగా, కౌరవరాజుసైన్యము ఆ దేవదూతను అడ్డగించినది. కాని ఆ సైన్యము నాతడు లెక్కచేయక ఆ గుంపును తన బాణపరంపరలచే చెదరకొట్టి ఆవుల మరల్చినాడు. అంతతో రణరంగము పెచ్చు పెరిగినది.

అది యొక ఘోరరణరంగము; దేవపుత్రు డొక్కడే; అతని నెదుర్కొనినవారు వేనకువేలు. అయ్యును దుర్యోధనుని రథసహస్రములు పొడిపొడి అయ్యెను. గుఱ్ఱములు నుగ్గయ్యెను. ఏనుగులు కూలెను. భటసహస్రములు శాపగ్రస్తులైనట్లు కూలినవి. పేరుపేరు వరసను అందున్న వా రందరను ఒక్కొక్కరై త నెదిరించగా ప్రతిఒక్కరికిని తా నొక్కడై చేసిన యుద్ధము వర్ణింపనలవికానిది. అందు కర్ణు డొక

జట్టి. అతనితోడ దేవపుత్రుని యుద్ధ మొక చిత్రతాండవముకాగా కర్ణుని తమ్ముడు చచ్చినాడు. ద్రోణాచార్యులు ధనుర్వేదాచార్యులైనను అతని తోడి కయ్యము సలుపు నీ దేవపుత్రుని యుద్ధచాతుర్యము దేవతలకు చూడముచ్చటైనది. వేయేల! కౌరవ సైన్యమంతయు ఆ దేవపుత్రుడు ప్రయోగించిన యొక్క యస్త్రమున నిద్రను చెందగా నారథము తిరుగు ముఖము పట్టినది. ఇది యా దేవపుత్రుని ప్రతాపము.

ఉత్తరుడు చేసిన ఆ యుద్ధవర్ణనములు విని విరాటుడు ఆ దేవపుత్రుని చూడ చాల యుత్సాహపడినాడు. అతని కేవియో కొన్ని సత్కారములుకూడ జరుపదలచినాడు. కాని ఉత్తరుడు ఆ దేవపుత్రుడు అంతర్ధానమయ్యెనపియు అతడు రేపుకాని తరువాత రోజునకుగాని మనకు కానవచ్చుననియు చెప్పినాడు. అంతతో వారి సంభాషణ ముగిసినది. తరువాత విరాటుని ఆజ్ఞచే ఉత్తరుకు భీష్మాదికురువీరుల తలపాగలనుండి కత్తిరించి తెచ్చిన వస్త్రఖండములను బృహన్నల ఉత్తర కిచ్చినాడు. అక్కడి కానాడు గడచినది.

## అజ్ఞాతవాస సమాప్తము

అది ప్రాతఃకాలము. విరాటుని పేరోలగము మణిమయాద్యాసనములచే అలంకరింపబడి యున్నది. విరాటరాజు ఇంకను సభకు వచ్చి తన సింహాసనమును అధిష్ఠించలేదు. అంతకు ముందుగనే ధర్మజ, భీమార్జున, నకుల సహదేవులు ఇంతకు పూర్వములగు ఉద్యోగ చిహ్నములు వదలి రాజచిహ్నములచే విరాజిల్లుచు సభాస్థలియందలి రాజాసనముల నలంకరించినారు.

విరటుడు సభకేతెంచినాడు. కంకుభట్టు అతని యాసనమున లేడు. విరటుని యాసనమునందే కూర్చొనెను. తన రాజాసనమున కూర్చొని యున్న కంకుభట్టును చూచి విరటుడు విభ్రాంతుడయ్యెను. కంకుభట్టే కాదు. వంటలవాడగు వలలుడును మరియొక రాజాసనమున కూర్చొనెను. అట్లే బృహన్నలయొక యాసనమును, నకులసహదేవులు వేరువేరు యాసనములను అధిష్ఠింపగా విరటున కేమియు దిక్కుతోచలేదు. అట్లే నిశ్చేష్టుడై ఒక్క ముహూర్తమాత్రము మాటాడక నిలచిచూచెను. విరటునకు కోపమాగలేదు. కంకుని సభాస్తారుగనే చూచి పలుకరించెను. రాజాసనము నేల యధిష్ఠించితివని గద్దించి యడిగెను.

ధర్మజు డేమియు పలుకలేదు.

అర్జునుడు లేచినాడు — 'విరాటా ! ఈతడజాతశత్రుడు. ధర్మమూర్తి. దేవేంద్రుని యర్ధాసనమునైనను యధిష్ఠింపనర్హుడు. మహాకీర్తి కల్పుడగు రాజర్షి. దేవ–దానవ–కిన్నర–కింపురుష–గంధర్వపరు లందరి కంటె ఇతడు మేటియగు రాజరాజు. నీ ఈ చిన్నగద్దియను అధిష్ఠించుట కేల తగడు ?' అని చెప్పినాడు.

విరాటునికి మతిపోయినది — 'మిగిలిన నలుగురు తమ్ములేరి ? ద్రౌపది ఎక్కడుండెను ? పాండవులు జూదమున ఓడిరిగదా ! వారజ్ఞాతవాసమున దాగియుండలేదా ?' అని ప్రశ్నించెను.

నీ అంతర్గృహమున వంటచేయు బల్లవుడే భీముడు. నీ గుఱ్ఱములపై అధికారి నకులుడు. ఆలమందలపై యున్నవాడు సహదేవుడు. సైరంధ్రియే ద్రౌపది. ద్రౌపది నిమిత్తముగా గొనియే కీచకుడు హతమగుట జరిగినది. అర్జునుడను నేను. మా యజ్ఞాతవాసము నీ ఇంటనే

నడచినది. మాతృగర్భమునందుండు శిశువువలె నీకు తెలియకయే మే మిందుంటి' మని అర్జునుడు విరమించినాడు.

విరటుని అంతఃకరణ మొకస్థాయికి వచ్చినది. కాని భ్రాంతి తొలఁగలేదు.

ఇప్పుడుత్తరుడు ధర్మజుని చూపి అతని యద్భుత ఆకృతి విశేష మును వర్ణించుచూ ఇతడే ధర్మజుడనియు చెప్పి, భీమ–నకుల–సహదే వాదులనందరిని వారివారి ప్రత్యేక పరాక్రమముల చూపిన చరిత్రల నన్ని టిని చూపినాడు. మొన్న ఆవుల మళ్ళించిన వీరశిఖామణి ఈ అర్జునుడే యని చెప్పి, నే నీతనినే దేవకుమారుడని చెప్పితిననియు చెప్పినాడు.

విరటుని హృదయమున ఇంతవరకు పాండవులకు గావించిన అపరాధములకు క్షమాపణ నెట్లు చెప్పవలయును ? అను ప్రశ్న ఉదయించినది. అతని కొక అభిప్రాయము కలిగినది. ఉత్తరను అర్జును నకు ఇచ్చి వివాహము గావించుచో పాండవులతోడి ముఖ్యమగు బాంధవ్యము కలుగునని అత డూహించినాడు. తన హృదయమును ఉత్తరునకుచెప్పి నిశ్చయించవలెను. ఉత్తరునకు విప్పిచెప్పినాడు.

ఉత్తరు డేమనును ? — ఉత్తరునకు విరాటునికంటె పూర్వమే ఇత్యాదర గౌరవము లుండెనుగదా ! తండ్రితో 'తప్పక పాండవులను పూజించుట అవసర'మని చెప్పినాడు.

ఆర్యాః పూజ్యాశ్చ మాన్యాశ్చ ప్రాప్తకాలం చ మే మతం
పూజ్యం తాన్ పూజనార్హాశ్చ మహాభాగాశ్చ పాండవాః.

'తండ్రీ ! పాండవు లెంతయు మనకు పూజ్యులు ; గౌరవింప దగినవారుకూడ. ఇదియే వారిని పూజించతగు కాలము.

విరాటుడు తాను సుశర్మతోడి గావించు యుద్ధమునందు ధర్మజ, భీమ, నకులసహదేవులచేతనే జయము నొందితినని పలికి మన మందర మిట్లు క్షేమముగా నుండుటకు కారణము పాండవులే యని ఉత్సాహమున పలికినాడు. పలుకుటగాదు; మంత్రివర్గముతో గూడ కుంతీనందనునకు ప్రణమిల్లి నన్ననుగ్రహింపవలెనని వేడుకొనినాడు. మాటలతో వేడుట కాదు; తన రాజ్యమునంతను ధర్మజునకు సమర్పించి 'ధర్మజా! ఈ సామ్రాజ్య మంతయు మీదియే'నని పాండవుల కర్పించి, ధర్మజుని కౌగలించుకొనినాడు. భీమార్జున, నకులసహదేవులను శిరము మూర్కొని ప్రేమవాత్సల్యములతో మాటిమాటికిని వారిని దర్శించుచూ వారి దర్శనభాగ్యమునకు తృప్తినొందక ధర్మజునితో మా సామ్రాజ్యమునేకాక నా పుత్రికయగు ఉత్తరనుగూడ అర్జునుడు పాణిగ్రహణము గావించి నన్ను కృతార్థుడ గావింపుడని ప్రార్థించినాడు.

'ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః'

ధర్మజుని చూపులు అర్జునునిపై ప్రసరించినవి. ఉత్తరను అతడు పరిగ్రహించవలెనుగదా!

అర్జునుడు నేను ఉత్తరను పరిగ్రహింతును. కాని కోడలుగా పరిగ్రహింతును. అభిమన్యునికి ఉత్తర భార్య కాగలదు. మాత్స్యులకును, భారతులకును కలుగు సంబంధము నాకునూ ఇష్టమే! అనినాడు. విరటుడు నీవేల సందేహించుచుంటివని అర్జునుని ప్రశ్నించినాడు. అర్జునుని అభిప్రాయము ఇది —

అంతఃపురమున ఉత్తరకు అతడు గురువు. పుత్రికవలె చూచిన తానిప్పుడు ఉత్తరను ప్రేయసిగా పరిగ్రహించుటెట్లు? ఒకవేళ భావ

మును పూర్వకొని అతడు పరిగ్రహించినను; విరాటుడిచ్చినను లోకము శంకింపక మానదు. మహనీయులగువారు లోకాపవాదమునకు వెరతురు.

ఒక మహనీయుడు సత్పురుషుల స్వరూపమునిట్లు వర్ణించినాడు :

శ్లో॥ వాంఛాసజ్జనసంగతౌ పరగుణే ప్రీతిః గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితరతి ర్లోకాపవాదా ద్భయం
భక్తిశ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలైః
ఏతే యేషు వసంతి నిర్మలగుణాః తేభ్యో నమస్కుర్మహే.

సత్పురుషులతోటి సాంగత్యమును కోరుట, ఇతరులయొక్క ఉత్తమగుణసంపదకు సంతోషపడుట, గురువులయెడ వినమ్రభావము, చదువునందు వ్యసనము. ఏకపత్నీవ్రతము, లోకాపవాదమునకు భయము నొందుట, భగవంతునియందలి భక్తి, మనస్సును తన వశమునం దుంచుకొనుట, దుర్జనులతోటి సహవాసము లేకుండుట—ఇవి సత్పురుషులయం దుండెడి గుణములని నుడివి, ఆ మహనీయుడు, ఇట్టి గుణములు కలవారికి నమస్కరించినాడు.

వారే పాండవులు. అర్జునుడు లోకాపవాదమునకు వెరచి ఉత్తరను పరిగ్రహించలేదు. అయ్యును విరటుని కోరికను సఫలము చేసినాడు. ఉత్తర నభిమన్యున కిచ్చుటకు నిర్ణయమైనది. విరటునకు బాల సంతోషము కలిగినది. అర్జునుని మాటను ధర్మజుడు ఒప్పినాడు. ఇక ఉత్తరాభిమన్యుల వివాహము జరగవలెను.

పాండవులు విరాటనగరమునుండి ఆ నగర సమీపము నందలి మరియొక నగరమగు ఉపప్లావ్యమను పట్టణమున ప్రవేశించినారు.

*

# ఉత్తరాకళ్యాణము

ఉత్తరాభిమన్యుల కల్యాణము ఉపప్లావ్యముననే జరిగినది.

భారతీయుల వివాహము కేవలం కామానుభవమునకే కాదు. కామము భారతీయులకు పురుషార్థము. వివాహము ధర్మపురుషార్థ సాధనమున కొక అంగము. భారతీయుల వివాహమునకు సాక్షులు తేజోమయులగు దేవతలు. ఆ దేవతలయందు ముఖ్యుడగువాడు అగ్ని. అగ్ని దేవతలకు ముఖము. వివాహమునందు జరుగు లౌకికములగు మర్యాదలు దేశాచారముల ననుసరించును. కాని, వైదికములగు క్రియ లన్నియు సంస్కారము లగుటచే అవి మంత్రాధీనములయ్యే యుండును. భారతీయుల వివాహలక్ష్యము భాగ్యవంతులకైనను, పేదలకైనను ఒక్కటే. మిగిలిన మర్యాదలు వైభవానుసరణములు. వేదశాసనములను దేశ కాలములు బంధింపవు. వేదములు స్వతః ప్రమాణములు. భారతీయుల దృక్పథమున గార్హస్థ్య మొక ఆత్మసామ్రాజ్యము. కామరూపమగు బ్రహ్మరాక్షసి జీవులను మ్రింగకుండ దానిని శాసనబద్ధము గావించి ఆత్మసామ్రాజ్యమును ప్రతిష్ఠ గావించుటకొరకై భార్య నొక మంత్రిగా పరిగ్రహింప వేదములు కన్యక కుండదగు వయోరూప సౌశీల్యాది గుణములను వర్ణించినది. స్త్రీకే కాదు. పురుషునకును నిర్ణయించడగు అర్హతలను భారతీయశాసనములు వర్ణించినవి.

ప్రకృతమున అభిమన్యుని అర్హతల గమనింపుడు.—

మ॥ హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరు డాదారపవిత్రు డంచితకళాదక్షుం డుదారుండు గా
తరసంరక్షకు డార్యసమ్మతుడు విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించు గాక యభిమన్యుం డీసరోజాననన్.

ఈ పద్యము ఆంధ్రభారతమున విరాటునితో అర్జునుడు చెప్పిన మాట. ఈపద్యమునందు అభిమన్యునికిగల అర్హతలు వర్ణింపబడినవి. అభిమన్యుని ఉత్తర చూడలేదు. అభిమన్యుడును ఉత్తరను చూడలేదు. నాడు ఒకరి నొకరు చూచుకొనియే వివాహమును చేసుకొనవలెనన్న నిర్ణయములేదు. మధ్యస్థులగు మాతాపితరులుగాని, పెద్దలగువారుగాని కేవలము సౌందర్యములనేగాక మాతాపితృ వంశములను బట్టియు, శరీర లక్షణములను బట్టియు ఒకరికొకరు మైత్రి కలిగి సుహృద్భావమున గృహసామ్రాజ్యమును నెరవేర్చగలుగుటను నిర్ణయించెడివారు. కామ పురుషార్థమునకు యోగ్యములగు జాతులనుగూడ కామశాస్త్రము భారతీయులకు అందించినది. ఇట్టి అర్హతలనన్నిటిని శాస్త్రానుభవ లోకానుభవములు గల సుహృత్తులు నిర్ణయించుటకంటె ఉత్తమమార్గ మేమున్నది ? సౌందర్యమొక్కటే గార్హస్థ్యమునకు యోగ్యము కాదు. ప్రకృతమున ఉత్తరాభిమన్యుల వివాహము, ధర్మజాదులే అభిమన్యుని పరోక్షమున నిర్ణయించుట జరిగినది. అభిమన్యుని అర్హతలలో మొదటిది మాతృ వంశముగూడ గొప్పదగుట. కావున 'హరిమేనల్లుడు' అనుటతో పైన పద్యము ప్రారంభమైనది. భారతీయుల వివాహమున ప్రధానలక్ష్యము మాతాపితరుల వంశము నెరుంగుట. అభిమన్యుని మాతృవంశము యదువంశమని చెప్పబడినది. మిగిలిన అర్హత లన్నియు వరుని స్వీయములే.

పరాక్రమము, రూపసంపద, ఆచారసంపద, కళాదక్షత్వము, వైదుష్యము, ఔదార్యము, శరణాగతరక్షణము, పెద్దలచే మెప్పువడయుట ఈ మొదలగు గుణములన్నియు అభిమన్యున కుండెనని తిక్కనామాత్యులు చక్కగ వర్ణించినారు. అట్టి వరునకు తగిన పెండ్లికూతురు ఉత్తర. వారిద్దరి యర్హతల ననుసరించి వారికి పుత్రుడై జన్మించినవాడే పరీక్షన్మహారాజు. అతడు పరమ భాగవతోత్తముడు. రాబోవు సంతానము వధూవరుల ననుసరించియే యుండును. కావుననే జాతి వైశిష్ట్యము భారతీయుల లక్ష్యమైనది. కథకు రండు.

ధర్మనందనులు, విరాటుడు కూడ వారివారి బంధువర్గములనేకాక మిత్రబృందములనుకూడ వివాహమున కాహ్వానింప దూతల బంపినారు. శ్రీకృష్ణునితో అభిమన్యుడు వచ్చుట జరిగినది. ఉపపాండవులతో ద్రుపద మహారాజును, ధృష్టద్యుమ్నుడును వచ్చినారు. బలరాముడు, వసుదేవుడు మొదలగు ముఖ్యబంధువులేకాక ఎంతయో మిత్రరాజమండలమును అక్షౌహిణీసేనలతో చతురంగ బలములు కలిగి ఉపప్లావ్యమున కేతెంచినారు. విరాటుడునూ వారివారికి తగు విడిది గృహములను ఏర్పరచుట జరిగినది.

'తతో వివాహో విధివద్వవృధే మత్స్య పార్థయోః'

వివాహము విధివత్తుగా వృద్ధిపొందెనని వ్యాసులు వర్ణించినారు.

ఆ రాజవంశముల రెంటికిని తగినవైభవములతోడనే కల్యాణ మంటపనిర్మాణము జరిగినది. ఉత్తమ రాజకన్యా సహస్రములును, పుణ్యాంగనలగు ముసలి ముత్తైదువులును, వేదవేదాంగ పారగులగు బ్రాహ్మణులును ఆ మంటపమున నిండియుండగా మంగళవాద్యములతో

ముత్తైదువులు అందించు దీపసహస్రములతో వధూవరులనందు ప్రవేశ పెట్టినారు. వేదోక్తవిధుల నడవగా బంధుజనులు వధూవరుల కివ్వదలచిన పారితోషికము లెన్నియో సమర్పింపబడినవి. శ్రీకృష్ణుడు పదివేల ఏనుగులను, పదివేల గుఱ్ఱములను, అర్బుద సంఖ్యగల పదాతిసైన్యమును సమర్పించినాడు. ఎందరో స్త్రీలు రత్నరాజముల నిడగా - వేరువేరు మహారాజులును వారివారికి తగు పారిబర్హములను ఇచ్చుట జరిగినది. సుధేష్ణను ముందిడుకొని మాత్స్యుల స్త్రీలును, ద్రౌపదిని ముందిడుకొని భరతవంశపు రాచవనితలును గుమిగూడగా వారందరిలో ద్రౌపది దేహ కాంతి మిన్నయై వెలుగొందినది. అట్లు వివాహవేదిక వైభవోపేతమై వధూవరుల అక్షతారోపణలు కుసుమ సహస్రములతో మంచి ముత్యములతో కలసి ఒండొరుల శిరముల కలంకారములుకాగా అర్జునుడు ఉత్తరను కోడలుగా పరిగ్రహించుట జరిగినది. ధర్మనందనులును ఆ ఉత్తరను కోడలుగా పరిగ్రహించినారు. భగవదనుగ్రహపాత్రులగు పాండవులు కళ్యాణమంటపమున కళ్యాణమూర్తులై ప్రకాశించుట జరిగినది. విరటుడును అభిమన్యునకు తగు సత్కారముల నందించి అల్లుని గౌరవించినాడు. ఏడువందల ఉత్తమజాతి అశ్వములను, రెండు వందల ఏనుగులను, అనేక విధములగు ధనసంపదలను అందించగా పురోహితుడు ఆజ్యాహుతుల ప్రేల్చగా వివాహము పూర్తియైనది.

ధర్మనందనుడా పుట్టమున బ్రాహ్మణుల నందరను ధన సంపదల చేతను, భూషణాంబరములచేతను సత్కరించుటయేగాక అన్నపానాదులచే వారిని తృప్తినొందించినాడు. యది యట్లుండ రాజాన్నములు వేరువేరై మహారాజవర్గమునకును మర్యాదలందినవి. అంతేకాదు.

నగరవాసులందరను ఆ మహోత్సవమున తగు విధముల గౌరవింప బడినారు. అన్ని వర్ణములవారును ఆ కళ్యాణమంటపమున గౌరవింప బడిరి.

'నగరం మత్స్యరాజస్య శుశుభే భరతర్షభ'

విరాటరాజుయొక్క నగరము ఈలాగున శోభాయమానమై వెలుగొందినది. ఈ ఘట్టమున తిక్కనామాత్యులు నూతన వధూవరుల ప్రేమసౌభాగ్యము నిట్లు వర్ణించినారు.

చం॥ లలితతనూవిలాసముల లజ్జకతంబునజేసి మున్ను వి
చ్చలవిడి బట్టగా వెరవు సాలక యోరలువారు చూపులన్
లలి దలఁబ్రాలు వోయునెడలన్ దగవొందిన నూలుకొల్పి యి
మ్ముల బచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్.

ఈ పద్యము నూతన వధూవరుల తలఁబ్రాలు పోసుకొనునప్పటి శృంగారవర్ణనము. ఒకరు మరొకరిపై ప్రసరించుకొను ఓరచూపుల విలాస మిందు వర్ణించబడినది. తరువాత వారి పాణిగ్రహణముకూడ తిక్కన వర్ణించినారు.

తే॥ చిత్తమున గాఢరాగంబుజేతజూపు
తెరగు దోప గెంపారెడు తిగటోడి
మృదులపాణి గుమారుండు మెలపుమై గ్ర
హించె బల్లవాలంభి మత్తేభలీల.

ఈపద్యమున అభిమన్యుకుమారుడు ఉత్తర పాణిపల్లవమును మదపుటేనుగు తొండమువలె అందమైయున్న తన హస్తముతో ఉత్తర హస్తమును పట్టుకొనెనని వర్ణించబడినది. దీనికే పాణిగ్రహణమని పేరు.

మహాశయులారా !

ఉత్తర కల్యాణముతో విరాటము ముగిసినది.

విశ్వస్య కళ్యాణమస్తు.

రాబోవునది మహాభారతసారమగు ఉద్యోగపర్వము.

అది రేపు.

స్వస్తి ప్రజాభ్యాం

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.